శ్రీరస్తు.



# శ్రీమద్రామాయణ యక్షగానవిలాసము.

Ramayana Yaksha-gana Vilas

ఇది

నెల్లూరుమూలస్థానీశ్వరుని పేట నివాసులగు

Veragenti

వరగంటి, శేషగిరిదాసుగారిచే

Seshagiri Das

రచియింపఁబడి

వారిచే గ్రంథస్వాతంత్ర్యమునఁబొందిన



శింగీపురం రంగాచార్యులవారిచే

విబుధమనోహారిణీముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

చెన్నపురి

1878

శ్రీమద్రామాయణము.

[illegible]వ్యాంఘదాశాసనప్రముఖవిఖ్యాతద్విషత్కోటులర। సుమహాద్రి ర్యామెలర్ప రాముడగుచు నంశోభిల్లి జక్కాడిపెం। వసురంజాసకి నేల చందమువినంహర్షణంబుమాకవ్యేడిక॥

గీ॥ అనఘ శ్రీరామవిమలకథామృతంబు। సుమతులమలినభక్తిచేత మునిగ్రోలి। కలుషజలధినవలీలగడచిచనుదు। రింపుదళుకొత్తసది వివరింపుమికను॥

వ॥ అనియివ్విధంబున శ్రీమద్రామకథాశ్రవణతత్పరులై శౌనకాదిమునిశ్రేష్ఠులడిగినసూతుండత్యంతకుతూహలస్వాంతుండై మహాత్ములారా శ్రీశుకయోగీంద్రుండర్జునపౌత్రునకు శ్రీభాగవతార్థంబుపన్యసించునెడ నిక్ష్వాకువంశక్రమంబుచెప్పుచు భగవంతుండగు శ్రీమన్నారాయణదేవుండీయన్వయంబున దశరథకౌసల్యాకుమారుండై శ్రీరామరూపంబుననవతరించి సముద్రబంధనాదిపరాక్రమంబులొనరించి జగత్కంటకదశకంఠప్రముఖసురవిమతవితానచ్ఛేదనంబు గావించి మహర్షిప్రకాండంబులకు సుఖావహంబుగావించెనని పల్కెనని నరేంద్రుండిట్లనియె॥

కాంభోది-ఆదితాళము.

చెప్పవె। రఘునాథచరిత్రము చెప్పవె। శ్రీరాములచరితము॥ చెప్పవె॥ తప్పకమేకథ తెప్పగ విని రఘునాథుని లోనప్పుడు రాముద మొప్పతిల్లగదాని॥ చెప్పవె॥ సరసిజహితకులశరనిధిశశియగు నిరుపమ శ్రీరఘువరశుభచరితము॥ చెప్పవె॥ అతులితయోగిహృదబ్జగుడగు శ్రీపతి దశరథభూపతిసుతుడగుకథ॥ చెప్పవె॥ జలధినికేతనుడిలవష్టామర దనుజులమణచుటకై జలధిగట్టినకథ॥ చెప్పవె॥ రంగపురమున వెలుంగుచు రఘుకులపుంగవుడైన రథాంగపాణికథ॥ చెప్పవె॥

నీలాంబరి-ఆటతాళము.

వినుము శ్రీరామచరితమునిరతము। విని నదొలంగు దురితముా। అనఘషణ్ముఖలీలకథామృతధారలననురక్తి గ్రోలుచు తనివిజెందరు భువి॥ వినుము॥ లలితధరాంగనాతిలకమాయ ననూ। వెలయునయోధ్యపట్టాతలనాథధరను। వెలగితత్పురనాథుడలరు దశరథాఖ్యుడులీల

విభవసోబగులకీర్తి కలితుడై ॥వినుము॥ అఖండద్రవ్యమహాక్షితీశ్వ
లుక్రియను।సతతధర్మాసక్తమతిదనరగనూ। హితమంత్రిజనప్రార్థి
హితవందిమాగధ।తతిరంజిల్లగవసుమతినేలుచుండెనూ ॥వినుము॥
సుతులుగల్గనిఖేదమతిశయిల్లగను । నతరక్షకునిరంగపతిదలంచుచు
నూ।హితముగసూతచోదితుడగుచునుపేర్కొ। సుతకామమునబుష్య
శృంగుజేగోరెను॥వినుము॥

భైరవి- ఆదితాళము.

రామునిశుభచరితముకన్యముసరిరాదువినునృపాలా ॥ ఉపల్ల
వి॥రోమపాదపురమునతగవెలసినబుష్యశృంగునబలాన్వితుదశరథ
భూమిపాలుదాన్మీయపురమునకు। ప్రేమమీరగొని వచ్చెను ముద
మున ॥రామునిశు॥ అనుపమసరయూతటనీతీరమునసనువిభవముదన
రా।భూసురజనానిలింపులలరా॥ఘనవసిష్ఠబుష్యశృంగాంచిత।కరు
ణవలన।హయమేధమొనర్చెను।మొనసిపుత్రకామేష్టికిదొరకొనె
జనవరుండుజననాథసుతార్థము॥రాముని॥ సురగణములురావణ
ఘటకర్ణులుసారిదిసేయుబాధా। విధికర్తగనిదెలిపివేధా । కరుణా
బ్ధిపుమనివేడగవారలు। వెరపుదీర్చిహరినరుడుగవేడిన। వరదుడు
సంతుడుదశరథసుతుడై ।ధరణిగలుగచిత్తమునదలంచెను॥రాముని॥
అరుదుగసంతతదశరథకృతహోమాగ్నులసొంపమరా। వెలువ
డిపురుషుడొకడునృవరా।వినివిగనృపునకుపాయసమర్యాడవేడ్క
నొసగిగనుపడకతడరిగెను। నరవరేణ్యుడత్తఱరంగేశ్వరునెరిదలం
చితరుణులకీయగోరెను॥రాముని॥

ద్వి॥ జననాథుడప్పాయసంబుచేబూని । తనప్రాణదైవతల్లి
తరుణులజేరి'సగముకౌసల్యకసగములోసగము।తగనొసంగెనుసు
మిత్రాలతాంగికెని।తక్కినదానిలోతడయకయర్ధ।మొక్కటిదుకర్ణ
ణచేనిచ్చెకైకకును।మరలసుమిత్రసుమదినియూహించి।సిరివెలుంగ
గనవశిష్టంబొసంగె।అంతటనృపకాంతలత్యంతకాంతు।లెంతయు
వెలుగొందనిష్టమీడేర।సలలితగర్భాలక్షణములుదాల్చి।వెలసిరి
జనులవేడుకజెంద । నిర్భరపుణ్యయానైలతకౌసల్య। గర్భమున
నవ్యశ్రీకాంతుడంతటను। గరితలుసంపూర్ణగర్భలైమించె। కర

వృశంతోషకలితశైశవ్వ | జరిగణంబులకె ద్యోసత్వలితభితి | హరి [illegible]కథ్యాసవ్యాయసుఖమూ ||

క || నరనాథునియువతీమణు | లరుదారగగనిరి మోహనాంగులఘు నుం | గురుతేజోవిస్ఫూర్తుల | పరమానందమునభూమిపతిమతిరా జుగ ||

కాపిరాగము. అటతాళము.

రామచంద్రుడుదయమొందెను | రఘుకులాంబుధిని || రామ || భీమద నుజతమంబుబాయువిప్రామరోత్పలస్తోమములరగ || రామ || భాసుర చైత్రమునను | శుక్లపక్షము | వాసరమునపునర్వసువునను | కర్క టకమున | భాసమానుడగుచు లీలను | శ్రీమహావైకుంఠ | వాసుడీత డనుచుచాలను | మానులలరను | వాసవాదిసమస్తనాకనివాసకో ట్లనుగాసియణగగ | జేసిసలిలవిశాలనేత్రుడు | సుచరిత్రుడు || రా మచం || వనరుహాక్షికైకగాంచెను | భరతుని మురిపెమ ససుమిత్ర బ డసెనంతను | లక్ష్మణశత్రుఘ్నులనుకుమారులమంచివేళను | దేవ దుందుభులు | నినదమంబరస్థలమునను | చెన్నలరను || వనరుహాసన ముఖ్యాత్ములవాసుదేవహరేసమోయన | మొనసి వినుచు మహాను భావుడు | సువిలాసుడు || రామచంద్రుడు || పాడిరిగంధర్వనాథులు | [illegible]గానముగ | నాడిరిసురకిరవాణులు | వర్షించిరమరు | వీడుగా [illegible]లవానలు | కావేరిమధ్య | వీడుగన్గియశేషదాసులు | పాహి గననగ | వేడుకలరగ కానుదుండగు | విష్ణుడీశుడసంతుడాధ్యుడు | కా మకోటిసమానవేషుడా | సత్యభాషుడా || రామచంద్రుడుదయ మొందెనూ ||

క || అయ్యవసరంబున || గీ || సస్యఫలవృక్షలలితమై జగతిమెరసె | క వంబులపాలుపొందెజలదచయము | జలధులుప్పొంగెసంతోషజల ధులగుచు | సుర్వి శ్రీరఘురామచంద్రోదయమునా ||

గీ || వివిధకుసుమసుగంధిలపవనమడరె | ప్రవిమలాంబుప్రపూర్ణ శైవారెనదులు | మునిచకోరకములకబ్బెఘనసుఖంబు | భవ్యతరరా మచంద్రసంభవము వేళ ||

సూడమ్మ। యీబిడ్డనిత్యసుఖభానుడమ్మా॥ చెలులారచూడరమ్మ॥
యీబిడ్డశ్రీకరాకారుడమ్మా।నళినదళనేత్రుడమ్మా।యీబిడ్డనానా
వినోదుడమ్మ॥శరదిందువదనుడమ్మ। యీబిడ్డవరకుందరదనుడమ్మ।
సురబృందవినుతుడమ్మ।క్షణమైనజూడకెటులుందుమమ్మా॥ ఏమిము
నునోచితమ్మ।నీభాగ్యమేమివర్ణింతుమమ్మా।ఓమహీనాథుకొమ్మా।
శ్రీరంగధాముడెటుగంటివమ్మా॥లాలెనుచుయూచరమ్మా॥

వ॥ అనియివ్విధంబుననిందిరావల్లభుండరవిందసంభవ ప్రార్థి
తుండై శ్రీరామరూపంబున నవతరించితనినయ ప్రాకృతదివ్యమం
గళస్వరూపబాలభావవిశేషంబశేషపౌరజానపద ప్రకాండంబు
లకత్యంతమనః కౌతూహలంబుగావింపుచుబాల శశాంకుండునుం
బోలెవర్ధిల్లుచున్నసమయంబునా॥

శా॥ శ్రీమత్పుత్రచతుష్టయామలలసచ్ఛృంగారభాండబులం।
భూమీశుండతిమోహకౌతుకకృపాపూర్ణ ప్రచేతస్కుడై। క్షేమం
బొప్పగగాంచి యెత్తుకొనుచుం శ్రీరామునింవారిలో। ప్రేమఁపె
ద్దయొనచిఁముద్దు సలుపుఁ ప్రీతింపినోదంబునఁ॥

సీ॥ అకలంక మణిభూషణాద్యలంకృతజేసి హృష్టచిత్తమునన
యుంపుగాంచు। హితమొప్పసౌమిత్రిజతగూడియాడుచోయాక్రీడ
వీక్షింపనట్టినిలుచు। అసమానమకరందరసమొల్కుతల్లితొనల్లిబిల్లిగ
బల్కనాలకించు।ఆచందమామయందమామనోజ్ఞతమెచ్చిమొనసికా
వలజేచిణ [illegible] డు।యి [illegible] గోవేళనిట్టెనసగ।ఘనతరశ్యా
ము శ్రీరామకలితశోము।పొత్తుబాయకసంతోషపూరితాత్మ। పిత
వెషిణంపుచునుగారవింపుచుండు॥

వ॥ అంతట శ్రీరఘువరుండు భరతలక్ష్మణశత్రుఘ్నులంగూడిజగ
న్మోహనశైశవక్రీడాసక్తుండై యాకలి దప్పి యెఱుంగకక్రీడింపు
సమయంబున కౌసల్యయుతనగారాబుపట్టిమీదిమమత రట్టింపగా
పోరింగవంబుజేసిశిరంబు మూర్కొని చెక్కిలిముద్దుగొనిమచ్చిక
సేయుచుండెడంగువిధంబెట్లనినా॥

ఆనందభైరవి. ఆదితాళము.

ఎవ్వరిచ్చిరో ముద్దు। బంగారుకొండ। వెవ్వారిచ్చిరో ముద్దు। చి
[illegible]

న్నచిన్నవనుదవ్వులకరుగకనవ్వవ్వాయికబువ్వబెట్టుమని॥ఎవ్వ॥ చె
లియాపాదాబ్జములనూ।మంజుమంజీర।ఝళిఝళిరవములెసగనూ
కళలలరెడుమొగములచిరునగవులు। చెలువమమరచిలుకలపలుకుల
తో॥ఎవ్వ॥ కనకకింకిణిచయములు।మేఖలలగదల। ఘనరత్నహారవి
తతులు।గొనకొనియూగగననువడిజేరియు।జననిరో పాలింప్వనితగ
వేడుచు॥ఎవ్వ॥ అళినీలాలకరోచులు।ముఖనీరజాతములనొప్పకుండ
లములూ।వలనొప్పగచెక్కులనటియింపగ।నలరంగస్థలనిలయుడో
మరియిక॥ఎవ్వారెత్తురో ముద్దా॥

పున్నాగరాగము-ఆదితాళము.

ఏందెందుక్రీడలాడబోతివిరామ।నిండుచందురుబోలుసీమోమం
దుశ్రమజలమేమి॥ఏం॥ పరుగులాటకేమదిజొచ్చగా। ...చరణా
బ్జయుగముచాలనొచ్చగా । ధరణిపరాగమెల్లతనువున బూసుకొం
టి॥ఎందు॥ ఇందాక క్రీడలచరింతురా।తల్లులెంతైన సుతులజూడకుం
దురా।సొంపుజెందనిన్నెత్తుకయంతో సేపాయెరారతండ్రి॥ ఎం॥
కన్నుదామరలరుణమాయను।చెక్కులెన్నకనదోయి కాటుకాయ
ను।నన్నుగన్ననీచిన్నిబాజ్జనకనకలాడనాయ॥ఎందెందూ॥ రంగనా
ధుడననియంటివి।మంచిబంగారుముద్దుబెట్టెనంటివి। నీవురంగాతిమీ
రనట్లజేయకకల్లలాడి॥ఎందెందూ॥

సురటరాగము-అటతాళము.

రారానాచిన్నిముద్దులరాజకుమారా ॥ సారసాక్షకులభూషణ
క్రీడలదాటిమరిగి బతిమాలినజూడవు।చేరిదప్పియాకలియనిబల్కవ
దేరరామసరివారెటు జేతురె ॥రారా॥ పాటెగలక్ష్మణభరత ప్రము
ఖులుసాటిగనీతో నాటలుగోరిరి । మేటివగుచు నాట్లాడుదురమ్మొక
మాటచెప్పితాయమిత్తునొక్కటి॥రారా॥ చారునూపురములంఘల్లు
ఝళుఝళు।సారెకుమ్రోయలసద్వరమౌక్తిక। హారమణులుధగధగ
యనిమెరయగ।కోరితధిమిధిందిమిమనియాడుచు॥రారా॥ కోమలని
లదశ్యాముని శ్రీరఘురామునినినుమెన్నెన్నో।నోములు।నోమిగంటి
మితుఃగనాతో వలమేలరంగపురధామదయాకర॥రారా॥
ద్వి॥ వినుమిట్లుకౌసల్యవినుతసౌశీల్య।తనపుత్రసుచరిత్రధన్యు...

మదికి రాముఁ బంపలేను। నేనే। వెసవత్తుని వెంట రథకుంజరాశ్వాదివి
తతిలోను॥ముని॥ శ్రీయుతుఁ డగుముద్దు శ్రీరాముఁ డుత్తమ్మ ధ్యాయలేఁడు।
మంచిసాయకములు విలు చక్కఁగ సంధించి వేయలేఁడు॥ముని॥ పవ
మతి శ్రీరంగపతిని వ్యాజాలతపః పవిత్ర।పీడకడనము లెన్నఁడు జేసి యె
ఱుంగఁడు గాధిపుత్ర॥ముని॥ సజల॥

చ॥అనఘుఁడ కోపమ్మొందకు మహాత్ముఁడ కుశికాత్మజుండవో।
జనవర నీవు కోరినది చయ్యనఁ దీర్తు నటంచు బల్కి నన్। పనిబడి కోరి
తెంకమల బంధుకులాగ్రణి సంచు మాటద।ప్పనిగుణశాలి వంచు పిద
పన్ యిటు బల్కనేఱుంగనక్కటా॥

గీ॥రాము నంపింపవలయుఁ బో రాజవర్య। కుశలమున నుండు మిక బం
ధుకోట్లఁ గూడి।పోయి వచ్చెద నే సని బాసఁగ బల్కి।జగముకంపించె నా
వేళ జనవరేణ్య॥

వ॥అంత॥

ద్వి॥ఏని వశిష్ఠుండు ఘనవిభు మోముఁ జూచి।జననాథ యిటు సేయఁ జ
నునయ్య మిత్ర।కులపవిత్రుండవు గుణశాలి వకట। వలనొప్ప బల్కి
నవాక్యంబు దప్ప।యిల నీకుఁ బాడిగా దినసనిభ తేజ। నళినాక్షుఁ డగు రా
మున కభయంబెందు। జెందదించుక నైన సోమవిధించ్యాది।వందితుం డ
రిగణ వన పావకుండు।ఘనవిక్రముఁడు గానఁ గౌశికుని తో ని।మునివెం
ట బంపుము ముదము రెట్టింప।పదపడి దివ్యాస్త్ర పాండిత్యుఁ డగుచు।వ
దలక మేలొంది వచ్చునటన్న।సదమలాత్ముల రామచంద్ర లక్ష్మణుల।
మదిసంతసింపుచు మమత దీవించి।మునికి సమర్పింపఁ ముదమొప్ప వారి।
గొని తెచ్చెనమ్మౌని కోర్కె దీరంగ॥

మధ్యమావతి. ఆదితాళము.

రామలక్ష్మణులు నడచిరపుడు। కౌశికుని వెంట ॥రామలక్ష్మణులు॥
శ్యామలనీరద హేమమహోజ్జ్వల కోమలాంగములతో ఎసఁగి వెలు
గుచు॥రాము॥కరపద్మముల బెండ్లు మెరయ।ముఖములు కోటి। పతిపూ
ర్ణచంద్రకళలు వెలయ। కరమొప్పఁగ మునియాగము గావ మఖవరర్థం
గసలవాసులైన శ్రీరామలక్ష్మణులు నడచిరపుడు॥

వ॥అంత విశ్వామిత్రుండు రామలక్ష్మణులతోడం గూడి యాదినర్థ

ట్ల-నేసెశరాచజాలన్॥

సీ॥ఇట్లుతాటకిజచ్చుటీక్షించిత్రిదశేశ్వరాదులుసంతోషితాత్ములగుచు। రామచంద్రునినిందుస్తుతతోవినుతించిజనిరంతనాత్మీయసదనములకు। కౌశికుండానందకలితుడై రఘురాముకౌగిటగదియించికరుణవెలయ। శిరముమూర్ధ్నాడిదుర్భరశత్రు భీకరసర్వదివ్యాస్త్రసంచయములిచ్చె।ననఘవారంతవింధ్యకాననముదల్గి। శారికాకీరచారుమయూరనినద।సహితమగుసట్టిసిద్ధాశ్రమంబుచేర। బోవుసమయంబుననురఘుపుంగవుండు॥

మధ్యమావతి-ఆదితాళము.

ఈదివ్యాశ్రమము।యెవ్వరిదోనాకిపుడుదెలుపుమూ।సన్మునివర్యమెరుగదెలుపుమూ॥ఈ॥ మోదమై శుకపికనాదమగుచుసర్వవేదనిస్వనములవెలసిశోభిలుచున్నా॥ఈదివ్యా॥మృగములన్నియునూ।తమజాతివైరములనుమానియునూ। తగినభూరుహకుంజతతులనీడలనుండివగమీరమైత్రితో వర్తించెనదె చూడు॥ మీదివ్యా॥ వింతలలరినా।మీయాశ్రమమెంతదూరమునా।సంతతసుఖదమైచెలువొందునికమనమెంతసేపటికేగనెలమితోనలవియా॥ ఈదివ్యా॥ ఘనదశనమునసూ। భవదీయసవనఘాతకులనూ। మునివర్యారణవీధిమొనసినేనెప్పుడు।దునిమి శ్రీరంగేశుడసనుతికెక్కుడు॥ఈదివ్యాశ్రమమూ॥

క॥ అనవినివిశ్వామిత్రుం। డినకులనాయకునిజూచియిదెరాఘవనే। ననయముతపమొనరించెట। ఘనతరసిద్ధాశ్రమంబుగానెరుగుమదిన్॥

గీ॥అనఘయిదివామనునకుపూర్వాశ్రమంబు।యజ్ఞమేనిచ్చటనుసేయయత్నపడితి। ననుచుగాధేయుడెంగింపనంతపిదప। జొచ్చిరయ్యాశ్రమముమునుల్వచ్చిచూడ॥

వ॥అంతటవిశ్వామిత్రుండురామలక్ష్మణసమేతుండైనిజాశ్రమంబుప్రవేశించి యజ్ఞదీక్షవహించి మౌనంబుననున్నయెడ రామలక్ష్మణులుచాపంబులెక్కిడి జాగరూకులై షడహోరాత్రంబులుకాపాడునెడ నారవదినంబునవిశ్వామిత్రుండు విధ్యుక్తప్రకారంబునవేదమంత్రంబులుచ్చరించుచు యజ్ఞవేదియందగ్నిప్రజ్వలనంబుచేసిహోమంబుసేయుసమయంబున॥

## సౌరాష్ట్రరాగము- ఆదితాళము.

కనిరిరాకొమరులుగంగనూ। తీరజనితరసాలలవంగనూ। ఘనపార్వతీశజటాజూటసంగను।జనవర్గరచితదుస్సహాఘవభంగను॥ కనిరి॥సరసిజస్థితచారుభృంగనూ।శ్రీ।కరకలనాదవిహంగనూ।పరిమళశైత్యతురంగతురంగనుగురుతరంగసురంగపుర వరపదజను ॥ కనిరి రాకొమరులుగంగనూ॥

సీ॥ గంగామహాత్మ్యముప్పొంగుచువినగోరిరామచంద్రుడువేడ ప్రేమతోడ।సదమలసగరవంశక్రమంబునుభగీరథుతపోవిభవంబు రమ్యవిమల।గంగావతరణశ్రీకరచరిత్రంబునుగాధేయు దెరిగింప గాననేక। విధములనాభగీరథనరేంద్రు నుతించియానదిశ్రేష్ఠంబు పూనిదాటి।ఘనవిశాలపురీంద్రంబు గాంచిసుమతి।వలనపూజలుగొనిచనివరమునీంద్ర।శూన్యమగుయాశ్రమముజూచిసూర్యకులుడు। దానికథచెప్పుమనిబల్కెతపసిబల్కె॥

చ॥వినుమిదిగౌతమాశ్రమమువీరవరేణ్యయహల్యగూడిపా। వనచరితుండుగౌతముడవార్యతపంబతినిష్ఠసేయుచో। ననిమిషనాథురామునినిజాశ్రమమందుమసలేమిగాంచిపా।యనితమకంబునంముని ఘనాకృతిదాల్చియహల్యబొందియుఙ్॥

వ॥తత్తరంబునంబోవుచున్న గౌతమమునీంద్రుండు దివ్యజ్ఞానంబున నంతయుం దెలిసి దేవేంద్రున కడ్డంబై నీవు కపట రూపంబున పాపంబు జేసితివి గావుననీ యండంబులు తునిసి పడున ని శాపంబిచ్చి యహల్యకడకుంజని నీవనేకదివ్య వర్షంబులు శిలారూపంబున నెవ్వరికింగానరాక నివ్వనంబుననుండుము శ్రీరామ చంద్రుండీ వనంబున కరుదేరగలండు తదీయచరణరజః ప్రభావంబునం జేసిసహజరూపంబు దాల్చి ముదంబుననన్నుంగూడెదవని పల్కి తపంబునకరిగె దేవేంద్రుండు ముని శాపంబు వలన విఫలుండై క్రమ్మర నఖిలదేవమునిగణ ప్రభావంబునమేషాండుండయ్యెగావున॥

గీ॥ఈపురాతనయాశ్రమంబిపుడుజొచ్చి।యాయహల్యను రక్షింపుమనినరామ।చంద్రలక్ష్మణులవ్యెదజనవిహీన।యాశ్రమములోనిమునితోడనరిగిరపుడు॥ వ॥ఆసమయంబున॥

క॥ శ్రీరామచారుచరణాం। భోరుహపావనరజంబుఁబొందినశ్రీ
ఘ్ర। స్త్రీరూపముతో ముని। నారీమణివచ్చినిలిచినయవినయమునన్॥

సురటరాగము-అటతాళము.

ధన్యనైతినేను। శ్రీరామచంద్ర।మువ్వాటికిధన్యనైతినేను। ధ
న్యనైతిబుధమాన్యమునీంద్ర।శరణ్యమూర్ధన్య। రాజన్యకుమారక॥
ధన్యనైతినేను॥ఎంతవాడవయ్య।నీప్రభావమేమనందునయ్య।
సంతతనిచటపాషాణమైపడిన నత్యంతసత్కరుణచేనింతి చేసితివ
హాహా॥ధన్యనైతినయ్య॥ పాపవిత్తురాలా।నీదివ్యప్రతాపమెన్న
జాలా। పాపములెల్లనుబాపగన్గనిమి। శ్రీపాదపద్మముల్ పుణ్యస్థలి
గాంచి॥ధన్యనైతి॥నిన్నుజూడనాయ। నాభర్తను। నెమ్మిగూడనా
య।సన్నుతశ్రీరంగస్థలనాథనిన్ను।నాకన్నులసేవించికలుషములను
ద్రుంచి॥ధన్యనైతినేను॥

సౌరాష్ట్రరాగము-జంపెతాళము.

అంతటను శ్రీరామలక్ష్మణులాదరమునా। గౌతమ। కాంతచరణ
ములకును మ్రొక్కెడ సంతసమునా।యింతివారలకర్ఘ్యపాద్యము
లిచ్చిచాలాభాగ్య।మెంతయునునాకబ్బెననుచునితాంతభక్తిన్॥అం
తటను॥అతిథిపూజలొనర్చి వెలసెనహల్యయంతన్। వేగమె। హిత
మతినిగౌతముడువచ్చియనుతిరచించెన్॥అంతట॥తరుణిగూడుకము
దముతోడనుతపమొనర్చెన్। జనియును। వరదుడగు శ్రీరంగనాథుని
కరుణవలనన్॥అంతటను॥

క॥మునివరుడంతటదశరథ।జనపాలకసుతులతోడజనకక్ష్మాధీ॥
శునిపురసామీప్యమునకు।జనియీశాన్యమునగాంచెనవసస్థలమున్॥
వ॥ అంతటనానాదేశ రాజన్యముని గణసమేతంబైన యజ్ఞవా
టంబున కరుదెంచు సమయంబున జనకుండు శతానంద సమేతుం
డై యర్ఘ్యపాద్యంబు లిచ్చి దోడ్కొనివచ్చిసుఖాసీనుం జేసి కౌ
శికునిచేత దీవనలుబొంది యనేకవిధంబుల స్తోత్రంబుగావించి తద
నంతరంబున రామలక్ష్మణులంజూచి విశ్వామిత్రు నకిట్లనియె॥

కాపిరాగము-ఆదితాళము.

ఈరాజపుత్రులెవ్వారలు। వీరిటకేలవెంచేసినారలు। కారుణ్య

పౌత్రులుఘనహేమగాత్రులు।నీరజనేత్రులునిర్జరామిత్రులు॥
ఈ॥నామధేయములేమివీరికి।పేరేమిజెల్లునుజనకునికి।సోమసూర్యు
లరీతి సొంపొందు చున్నారు।ఓమునీశ్వరవీరికున్నతలంపేమి॥ఈ॥
సురతుల్యవిక్రములెంచనూ।సర్వసురులుజాలరుసన్నుతించనూ।విరి
విగమీవెంటవీరురాపనియేమి। గరిమనీసభకుశృంగారమై వెలసిన ॥
ఈ॥నిరుపమలావణ్యసారులు।వీరు।శరచాపతూణీరధారులు।గురు
కాకపక్షవిస్ఫురితులుసరసులు। వరయవ్వనులురంగ పురవాసులవ
బోలు॥యీరాజపుత్రులెవ్వా॥

ద్విపద॥వినవయ్యభూనాథవిశదంబుగాను।ఘనులుదాశరథులీక
ళ్యాణగాత్రు।లరుదారనేసేయునట్టియాగంబు। పరిపాలనముసే
యపనిబడిపోయి। ప్రేమతోదెచ్చితిప్రియముగావింప। రామలక్ష్మ
ణులుయీరాజన్యసుతులు।జనవరశ్రీరామచంద్రుడీతండు। మునిస
న్నుతుడుజగన్మోహనాంగుండు।అసమానకోదండుడై మించినాడు।
వెసతాటకినిగూల్చివిలసిల్లినాడు। మారీచుమదమడంచిమహితసుబా
హు।భూరిపావకశరంబునద్రుంచినాడు। సవనమత్యావలీలసాగిం
చికాచి।ఘవినహల్యనుకృపాపూర్ణుడై బ్రోచి। ధరణీశనీయింట
దాచంగబడిన।హరువిల్లుజూడంగసరుదెంచెననిన।వినిశతానందుం
డువేడ్కగాధిజుని।కనుగొని శ్రీరాముకరుణతోదెచ్చి।నాతల్లిశాపం
బునయమునబాపి। ఖ్యాతిగాపతితోడ కరుణగూర్చితివి। యేమనిక
ర్ణింతునెలమినీపుణ్య। మేమనివివరింతునింకనాభాగ్య। మనియిట్లు
కొనియాడనాశతానందు।గనిగాధిసూనుండు కరుణతోబలికె॥

క॥విమలాత్మయగుచురేణుక। జమదగ్నింగూడిసల్లుచయ్యనయా
గా।తమమునిసహల్యగూడెను।కమలాప్తకులాబ్ధిచంద్రఘనతరకరు
ణన్॥

వ॥అంతట శతానందుండ పరిమితానందుండై శ్రీరామచంద్రా
కళ్యాణ గుణసాంద్రా నీమహామహిమం జేసుని వర్ణించువాడమ
హాత్ముండగు విశ్వామిత్రుండు మిమ్ముదోడ్కొని వచ్చిన కతంబున
సమస్తముని గణంబులకు మంగళప్రదంబయ్యె యీవిశ్వామిత్రము
నీంద్రునిప్రభావంబనంతంబై యుండు నాకుందోచిన యంత మా
త్రంబు వివరించెద పూర్వంబున రాజేంద్రుండై సకలభూపాల

ణంబు సేయుచు సైన్యసమేతుండై వసిష్ఠాశ్రమంబున కరిగి యవ్వ
సిష్ఠుచేత నతిథిపూజలు వడసి అమ్మునీంద్రు పాలనున్న కామ ధేను
వు నడిగిన నమ్ముని యివ్వకుండిన బలాత్కారంబునం గొనిపోవ
యాధేనువు భటశతంబుల బడదన్ని తప్పించుకొని వసిష్ఠుకడకు వచ్చి వ
సిష్ఠానుమతంబున తనయంగంబుల ననేకవీర భటుల సృజియించి
విశ్వామిత్రు బలంబుల నాశనంబొనర్చె నంత విశ్వామిత్రుండీశ్వ
రుం గూర్చి తపం బొనర్చి సమస్తదివ్యాస్త్ర నిపుణుండై వసిష్ఠా
శ్రమంబు బాణాగ్నివలన దహింప జేసి నానా దివ్యాస్త్రంబులు
ప్రయోగించిన వసిష్ఠుండు బ్రహ్మదండంబున జక్కాడిన యనంతరం
బు విశ్వామిత్రుండు వెరగుపడి బ్రహ్మబలంబె బలంబు క్షత్ర బలం
బు గాల్పనేయని మనంబున యవ్వసిష్ఠుని బ్రహ్మతేజఃప్రభావంబుద
లంచి విస్మయంబంది తానును బ్రహ్మర్షిత్వంబు గోరి పరమేష్ఠి ను
ద్దేశించి వేల సంఖ్యలగు వత్సరంబులు మహాఘోర తపంబు గావిం
చుచు॥

సీ॥ కొమరొప్ప దివి త్రిశంకుస్వర్గ మొనరించి బ్రహ్మాది సురను
తిబడసినాడు। మొనసి యాగపశుత్వమునకివ్వ జనుశునశ్శేఫుని లీల ర
క్షించినాడు। వరతపశ్చయముకై సురపతిబనుపంగ వచ్చు రంభకు శా
పమిచ్చినాడు। అనిలాంబుదళ నిరాహారవ్రతంబున విమలోగ్రతపము
గావించినాడు। శ్రీకరంబుగ విధిచే వసిష్ఠుచేత। పరగ బ్రహ్మర్షిభా
వంబు బడసినాడు। కౌశికు మహాత్మ్యమెంతని గణన సేతు। రామ శ్రీరా
మ రఘురామ రామ రామా।

క॥ అని యివ్విధమున గౌతమ। తనయుడు దెలుపంగ గాధితనయుమ
హత్వం। బినకులనాధావనులు విని। మనమున హర్షించి రంత మరునా
టుతగ॥

గీ॥ గాధితనయుండు జనకు ముఖంబు జూచి। ధారుణీనాధ నీయింట
దాచబడిన। ధను వరంబిందు దెప్పింపుమనిన వేగ। మందసముతోడ దె
ప్పించె దండమలరా॥

వ॥ అంత విశ్వామిత్రుండు శ్రీరామచంద్రుంగనుంగొని॥

కళ్యాణిరాగము- అటతాళము.

శివచాపమిదియెక్కు-బెట్టుమి ॥శ్రీ॥ సీతావధూటిచేపట్టుమి। ప్రవిమలకీర్తి సంపద్వైభవుండవై నవ ఘనశ్యామ నేభువిధన్యతజెంద॥శివ॥జనకనృపాలుడుమెచ్చను।శత్రుజనపాలకులుచూచివిచ్చను। ఘనరంగధామభీకరవిక్రమమునయీధనువుసాధించి సీతనుగూడుమింపున॥శివచాపమిదియెక్కు-బెట్టుమి॥

వ॥అంతరఘువరుండుమందస్మితముఖారవిందుండై మందసంబున నున్నధనుశ్రేష్ఠంబవలీలకేలనెత్తినారియమర్చి॥

మధ్యమావతిరాగము-ఆదితాళము.

విల్లువిరచెనురామమూర్తి।కైలాసవాసుని॥విల్లువిరచె॥ విల్లెక్కిడిసీతనుగొనజాలని।యెల్లనృపాలురకుల్లమురుల్లన ॥విల్లు॥ పటుదోర్విక్రమము తేటపడగా।సీతమ్మకుపగుపెనిమిటియీతడనుచు సభికులనగా। కటకటపడిరిపులడలగపటపటచెటులధ్వనులుత్క-టముగవెడలగ॥విల్లు॥కులశైలములుపెల్లగిలగా।భూవలయము। ల్లలనాడజలధులెల్లకలగా।తలకుచుశశిసూర్యులుగతిదప్పగ। నిలనందరుకలవరపడఘెళఘెళ॥విల్లు॥ బాలగజేంద్రుడుపెంపారా।నిక్షుదండములీలద్రుంచినసొంపుమీర ।శ్రీలలరగరంగేశుడు సీతాలోలాక్షిని తగనేలుకొనంగను॥విల్లువిరచెనురామమూర్తి॥

వ॥అంతజనకుండుపరమాశ్చర్యసంతోషచిత్తుండై విశ్వామిత్రునింజూచి సకలగుణాభి రాముండగు శ్రీరామునకు కళ్యాణగుణసమేతయగు సీత నొసంగె దనని కృతనిశ్చ యుండయ్యె నట్టె యెడపురకాంతలరుదెంచి గుంపులుగొని మహనీయదివ్య సౌందర్య నిధియగు శ్రీరామునిందర్శించి యొకరికొకరుచెప్పుకొనువిధంబెట్లనినా॥

యరుకులకాంబోధి-ఆదితాళము.

అమ్మచల్లవీరుదశరథాత్మజులటె। వీరినెమ్మోములు పూర్ణచంద్రనిభములయ్యున్నావిగదనె ॥అమ్మ॥ యెంతమోహనియ్యులమ్మయెంతచక్క-నివారమ్మ।యెంతదోర్విక్రములమ్మయెంత సుకుమారులెవో॥యమ్మ॥కొమ్మరో శ్రీకరపల్లవమ్ములబోలినచరణమ్ములుకెందమ్ములేలునమ్మనయనమ్ములహా॥అమ్మ॥ కాకపక్షధరులుసర్వ

లోకాభిరాములైరి। భీకరకోదండధరులు శ్రీకరరంగపురీశులు। లక్ష్మణ
వ్లవీరుదశరథాత్మజులటె॥

మారువరాగము-అటతాళము.

వీడటెయీూశ్వరునివిల్లువిరచినవాడు। వీడటెతాటకనుద్వంచి। వే
ట్కతోయాగముగాచి। చెడియయహల్యబ్రోచి। సీతనుమోహించి
మించి॥వీ॥యెంతభాగ్యమాయనమ్మ। యెంతపుణ్యమబ్బెనమ్మ। యిం
తిదో వీనిసౌందర్యమెంతయుకన్నులగంటి॥వీడటె॥ రామరోమనసీ
తమ్మ। యేమినోమునోచెనమ్మ। ప్రేమతో రంగేశుడౌ శ్రీ। రాముని
పెండ్లాడనాయ॥వీడటెయీూశ్వ॥

గీ॥ జనకుడంతటగాథేయుడనుమతింప। దశరథాదులరప్పింపదల
చిసుభట। వరులబిలుపించిపత్రికవ్రాసియిచ్చె। యింపుదళుకొత్తన
య్యర్థమెట్టులనినా॥

జాబువయనము॥వచనము.

శ్రీమదిక్ష్వాకునిర్మలవంశపయఃపారావారసంపూర్ణశరత్కు
ముదభాంధవులయిన సమస్తకళ్యాణగుణప్రపూర్ణు లయిన శ్రీ
మన్మహారాజరాజేంద్రులగుదశరథనరేంద్ర సీపుణ్యా వర్త ను
లకు విదేహ విమలరాజన్యాన్వయ సంభూతుండగు జనకక్ష్మాపా
లుండుసంప్రీతిబుత్తెంచి నప్రయోజనమ్ములిచ్చట శ్రీనారాయణచ
రణారవింద సేవానంద కందళిత హృదయారవిందులమై యెల్లవా
రముసుఖంబుననున్నవారమచ్చట భగవత్కథా సుధారసాస్వాద
నాదివిశేషంబులంబ్రొద్దుపుచ్చుచు పరమసుఖ లాభం బున వతిలం
చుకుశల వృత్తాంతంబు మాటి మాటికి లిఖిత మూలంబునం బంపు
చుండవలయు నీసమయంబున యేనొనర్చువిన్న పంబెట్లన్న ముని
శ్రేష్ఠుండగు విశ్వామిత్రుండు దశరాత్ర సవనరక్షణార్థంబుగా
నీపాలికివచ్చి నీపుత్రులగు శ్రీరామలక్ష్మణులంగొని పోవ వారును
విశ్వామిత్రు ననుసరించి పోవునెడ శ్రీరామచంద్రుండు కౌశి కాను
మతంబున తాటకంద్రుంచి సిద్ధాశ్రమంబు చేరివాయవ్యాస్త్రం
బున మారీచునద్దింబడవైచి సుబాహుం బరిమార్చి యజ్ఞసంరక్ష
ణంబుగావించి గౌతమాశ్రమంబున కరుదెంచి పతిశాపంబు వలన

ష్ఠాష్ఠాణంబై పడియున్న యహల్యాదేవినిం బ్రోచి మదీయసవనం బు కడకరుదెంచి సురాసుర ప్రముఖనివహంబులకు కదలింపనలవి గాని పార్వతీశ్వరుని మహాచాపంబు విశ్వామిత్రానుమతంబున బాలకరీంద్రంబురసాల దండంబు ద్రుంచు చందంబున లీలం ద్రుంచివైచినయనంతరంబయేనశేషబంధుజనమిత్రవర్గంబులంగూడి శ్రీరాముని విక్రమంబునకుసంతసిల్లి సత్పురుషశ్రేష్ఠుండవగునీతోటి బాంధవంబుసేయంగోరి విశ్వామిత్రశతానందప్రముఖ మునిశ్రేష్ఠానుమతంబున నీపుత్రుండై సకలగుణాభిరాముండగుశ్రీరామునకుమత్పుత్రికయగు సీతాకన్యకామణినొసంగి సమస్తలోకకళ్యాణంబగు కళ్యాణంబు గావింప కృతనిశ్చయుండనైతిగావున యీపత్రికాభావంబు శీఘ్రంబునచిత్తగించి నావిన్నపంబున కనుకూలించి సకలపురంధ్రీజనబంధువర్గమంత్రిపురోహితసూత గాయకవందిమాగధ చతురంగబల సమేతుండవై వేంచేసి శుభమహోత్సవంబుగావింపుము పత్రికాభావం బరమర సేయక నవధరింపుము॥

చ॥ శ్రీరమణీయమైనరఘుశేఖరుపెండ్లికియివ్విధంబునం। భూరివివేకుడౌజనకభూపతిపత్రికవ్రాసియివ్వగా। వారలయోధ్యకేగిజనవల్లభుగాంచిరఘుప్రవీరశృం।గారగుణాభిరామశుభకారణపత్రికజూడుమింపునన్॥

వ॥ ఇట్లుబలికి పత్రికయొసంగిన నృపాలశేఖరుండపార కౌతూహల స్వాంతుండై వారల కనేకంబు లగు మణి భూషణ దివ్యాంబరాదులొసంగి గారవించియనంతరంబున సుముహూర్తంబున ప్రయాణనిశ్చయంబొనర్చెను॥

ముఖారిరాగము- అటతాళము.

సీతారాముల పెండ్లి కిదశరథభూతలపతివెడలెన్। సూతగాయకవందిమాగధబంధుసమేతుడగుచుధణంధణల భేరులు మ్రోయ॥ సీ॥ హితమంత్రిజనపురోహితులుమునీంద్రులాశ్రితులుసమ్మతిరాగ నూ॥ కుతుకముతోడుతభరతశత్రుఘ్నులంచితవైభవంబున తనవెంటనేలయుగ॥ సీతా॥ అందొళికలకౌసల్యాదినారీమణు। లందరుమెర

రాగను। సందడిగా బహురథకరిహయభట। బృందములు నడువగ భు
వనమంగళమగు॥ సీతా॥ మంగళపణవమృదంగశంఖరవములు నిండి పి
క్కటిల్లను। రంగవల్లభుని గీతములధింధిమియని రంగలరంగవారాం
గనలాడగ॥ సీతారాముల పెండ్లికి॥

ద్వి॥ హాతమొప్పసరసిజహితకులుండిట్లు। మితిలేని ముదమున మిథిల
కేతెంచు। ఉరుదారగ నిమిథిలాధ్యక్షుడంత। గురుతుగా నెదురేగి
కొని తెచ్చి తగిన। విడిదిలో విడియించి వేట్కనందరను। కడువేట్కకు
శలమరకరబూని యడిగి। మేలాయ దశరథ మేలాయనయ్య। చాలధ
న్యుడనైతి జగతి మీతోడ। చెలగి సంబంధంబు చేయ్యగాగలిగె। నిల
లోన నతిపుణ్యమెల మి నాకబ్బె। నని యిట్లు బలుకంగ సంతమీదటను। మ
నమున సంతోషమగ్నుడై యుండె॥

గీ॥ గాధిపుత్రుండు రామలక్ష్మణులతోడ। దశరథుని పాలికేతేరత
పసీ పాదములకు గురుభక్తి మ్రొక్కియో మునివరేణ్య। ఘనశుభంబు
లుగంటి నీకరుణవలన॥

వ॥ అనియివ్విధంబున సంబళ్కిన విశ్వామిత్రుండు దశరథుంజూ
చి సౌభాగ్యంబేమన వచ్చు కళ్యాణ గుణాకరుండగు శ్రీరామచం
ద్రుండు నీకుం గుమారుండయ్యె నీవు ధన్యుండవైతివి నీపుత్రకులు
నావెంట నరుదెంచి యజ్ఞసంరక్షణంబు చేసి మదీయహృదయంబు
న కానందంబు గల్పించి క్రమ్మర సుఖంబున వచ్చినారు వీరిం గైకొను
మని పల్కెనట్టియెడ రామలక్ష్మణులు మ్రొక్కిన నపారకౌతుహలం
బున దీవన లొసంగి కౌగిలించుకొనె॥

ఆనందభైరవి - అటతాళము.

అన్నలారా మీరు లెస్సయున్నారటరోయీ। మన్నగా మీరూ
వములు కన్నులగట్టినట్లున్నదెన్నరాని ముని సేవలన్నియు వేట్కసే
యుచు॥ యన్న॥ తప్పు లేమిలేక తపసి జెప్పినపనులు జేసి। మెప్పువడసిరి
పులక్రాంచితప్రకరం గేశులసగా॥ అన్నలార॥

వ॥ ఆవియివ్విధంబున పుత్రదర్శన సంజనితానందంబున వెల
యుచుండ మరునాడు మంత్రులవలన జనకుండు బిల్వబుత్తెంచిన
పుత్రమిత్ర వసిష్ఠాది సహితంబుగా దశరథుండు జనకసభకుంబో

యి యుచితాసనాసీనుండై యున్న సమయంబున వసిష్ఠుండు జనకనృపాలకుంజూచి దశరథవంశక్రమంబెల్ల వివరించి లోకాభిరాముండగు శ్రీరామునికి నీపుత్రికనొసంగి వివాహంబొనర్చి ధన్యుండవుగమ్మని పలికె నంతశతానందుండు దశరథుంగని జనకరాజన్యవంశక్రమంబెల వివరించి శ్రీమత్కల్యాణ గుణాభిరాముండగు రామునకు నిత్యమంగళ సమేతయగు సీతంబెండ్లిచేసి కీర్తి సంపద్వైభవంబులం జెందుమనినదశరథుండు సమ్మోదంబున వసిష్ఠవిశ్వామిత్రులంజూచి సౌమిత్రికి జనకపుత్రికయగు [illegible] జనకరాజసోదరుండగు కుశధ్వజునిపుత్రికలనిరువుర భరతశత్రుఘ్నులకొసంగి వివాహంబుగావించునట్లు జనకునకుం జెప్పవలయుననిన వారలవ్విధంబున జనకునడిగిన మీయభిమతప్రకారంబున గావింతుననిన విని దశరథుండు పరమానందుండై తనవిడిదికింజని రామలక్ష్మణభరతశత్రుఘ్నులనతివైభవంబున బెండ్లికుమారులంగావించి యభ్యుదయార్థంబుగ భూసురోత్తములకనేకంబులగ గోదానప్రముఖదానంబులొసగె నట్టియెడ జనకమందిరంబున॥

క ॥ తలలంటియుకుంకుమచే । వలనొప్పఁగనలుగుపెట్టి వారిజగంధుల్ । జలకములాడించిరిగుణ । కలితలసీతాదికన్యకారత్నములన్ ॥

శంకరాభరణము - ఆదితాళము.

శృంగారములు జేసిరి । సీతకప్పుడు । శృంగారములు జేసిరి । శృంగారవతులెల్ల రంగుగనై దేహికిచెంగావిపావడపైబంగారుచీరగట్టి ॥ శృం ॥ పరిమళచందనమలదిరి । కస్తూరిపునుగు । గరిమజవ్వాజిబూసిరి । కరమొప్పగొప్పకన్నులగురుతుగ కాటుకబెట్టిసరసమౌకళ్యాణపుబొట్టుమెరయగనెన్నుదుటబెట్టి ॥ శృంగార ॥ మొలనూలుచిరుగజ్జలందెలు । రత్నకంకణము । లెలమితో శ్రీచంద్రసూర్యులతళుకు కెంపుల గుంపు లలరు కమ్మలుసత్తు । చిలుక తాళియు ధళధళ వెలయుపతకములు వేసి ॥ శృంగారములు ॥ విరిమల్లియసరంబులూ । జాజి కేతకి । వరసౌగంధికాబ్జంబులు విరివిగకీల్జడనుజుట్టి నెరతీవిమించగ జేసిసరసుడౌ రంగేశుడుమెచ్చ శాలువమేల్ముసుకు వేసి ॥ శృంగారములు జేసిరి ॥

వ॥ ఇవ్విధంబున సీతాదికన్యకారత్నంబుల కలంకారంబు గావించి
నయనంతరంబ॥

గీ॥ విప్రవర్యులు జనకభూవిభుఁడు బంప। దశరథేశ్వరుకడ కేగి త
డయవలవ దిదె ముహూర్తంబు దగ్గర నేగుదేర। వలయునని పల్కె
సంతోషకలితుఁడగుచు॥

వ॥ అంత వసిష్ఠానుమతంబున రామలక్ష్మణభరతశత్రుఘ్నులక
త్యంత మోహనీయంబగు యలంకారంబులు గావించి సమస్తబంధు
మిత్రవర్గంబులుం దానును గంధమాల్యాంబరవిభూషణంబులు ధ
రియించి మంగళవాద్యంబులును జయజయ ధ్వానంబులును నింగి
ముట్ట వివాహోచితమంగళద్రవ్యదివ్యాభరణాంబరాది వస్తుజా
తంబు లనేకంబులు తగినజనులు గొనివచ్చుచుండ రథగజాశ్వభటబ
లంబులు బలసి కొలువ సుందరంబులగు యందళంబులం బురంధ్రీజన
బృందంబులొప్పవుండం బోవు సమయంబున॥

సీ॥ మేఘమండలరు క్రొమ్మెఱుగు గుజాట్పున మేన కనకాంబరము
సొంపుగా వెలుఁగ। తరళకుండలధగద్ధగితకాంతులు గండయుగభా
గములను క్రేళ్లురుకుచుండ। చెలువొందు మృగమదతిలకంబు ఘనశ
రచ్చంద్రు నేలిన ముఖస్థలిని మెరయ। కంకణకేయూరఘనరత్నమేఘ
లామణిహారనిచయముల్ మహిమ వెలయ। గరిమ నిద్దంపుతళుకు బంగ
రు కిరీటమెలమి శోభిల్ల భద్రగజేంద్రమెక్కె। రామచంద్రుండు లో
కాభిరాముఁడగుచు। కదలె వైవాహికోత్సవకార్యమునకు॥

సీ॥ భరతాదిసోదరుల్ వరగజంబుల నెక్కి కరమొప్పు తనవెంట నరు
గుదేర। జయజయ శ్రీరామ జయరాక్షసవిరామ జయవిభో యని
వందిజనము పొగడ। గొడుగువింజామరల్ కడు వేట్క రాజిల్ల చేరి
భూసురులు నాశీర్వదింప। తనసుందరాకృతి గని పురాంగన లెల్ల
మోహవిభ్రాంతలై ముచ్చటాడ। ఘనజగన్మోహనాకృతి గలిగి జన
క। కన్యకారూపవీక్షణకాంక్ష వెలయ। రామచంద్రుండు జగదభిరా
ముఁడగుచు। వెలగి సుముహూర్తమునకు వేంచేసె నపుడు॥

రేగుప్తిరాగము-ఆదితాళము,

సుముహూర్తమునకు వెడలెను। శ్రీవైవాహిక। సుముహూర్తమునకు వెడలెను। శ్రీరామమూర్తి॥సుముహూ॥సుముహూర్తమునకు వెడలె।సమితానందమున వేశ్యా। కమలగంధులుధింధిమిధిమియనియాడుచుండ॥సుము॥సకలవాద్యస్వనంబులు। బ్రహ్మాండమునిండ। నకలంకచంద్రముఖులు। ప్రకటకంకణకరపద్మములెత్తినవ్యవికచమల్లికలాజలాకవంకజల్లుచుండ॥సుముహూర్తమునకు॥సురకాంతలంబరమునసూ। మోహపశత।సరుదంఓసాక్షి చూడసూ।పరమేష్ఠిరుద్రశక్రామరులునింగిషేషులు। మరచిచూడగసాక్షాన్మన్మథమన్మథుడనగ॥సుము॥కనకపల్లేరములసూ।ముత్యాలముగ్గు। లనువొందవెలయుచుండసూ।కనకాంగులెల్లశ్రీమంగళహారతులిద్వాదేవవినుత శ్రీరంగపురమునవొప్పుదివ్యమూర్తి ॥ సుముహూర్తమునకు వెడలెను॥

వ॥ఇట్లుశతకోటిసురేంద్రవైభవంబుసంజని జనకరాజమందిరసమీపంబునం బెండ్లికొమారులుగజేంద్రంబులుడిగ్గి సకలాభరణభూషితలగునారీమణులొసంగునివాళులందుకొని జనకుండుదోట్కొనిపోవ లోపలికిం బోయి కనకరంభాస్తంభపల్లవతోరణ ముక్తాదామవిరాజితంబును మౌక్తికవినిర్మితనాగబంధబృందావనప్రముఖరంగవల్లికాలంకృతంబును నై భాసిల్లురత్నకళ్యాణమంటపమధ్యంబునం గనకాసనంబులం గూర్చున్నసమయంబునదగినవధూ జనంబులు సీతోర్మిళామాళవిశృతకీర్తులంగొనివచ్చి దాశరథులపార్శ్వభాగంబులం గూర్చుండబెట్టిరంత మంగళవాద్య ఘోషంబులును పుణ్యాంగనాభద్రగీతంబులును వెలంగవసిష్ఠవిశ్వామిత్రశతానందాది మునివరులువివాహమంత్రంబులుజదువనట్టియెడ జనకుండహల్యాశాపవిమోచనకారణంబులును పద్మాంకుశాదిదివ్య రేఖాశోభితంబులును నగు శ్రీరామచంద్రునిచరణారవిందంబులుకనకపళ్ళెరంబునంబెట్టి తనహస్తంబులగడిగి తజ్జలంబులు శిరంబునం జల్లుకొని మణిభూషణవరదక్షిణాదిసమన్వితంబుగా మధుపర్కంబొసంగి జనకుండు శ్రీరామచంద్రునకిట్లనియె॥

## సౌరాష్ట్రరాగము - అటతాళము.

ధన్యుడనైతిని నేటికి। పాపతతుల ద్రుంచితినిముమ్మాటికి ॥ ధన్యులే వేళనుతగిలి మానరునిన్ను। మాన్యచరిత్రనిమహనీయసేవచే॥ధన్య॥ మునిపతివెను వెంటవచ్చియూ। గౌతమునిపత్నినెలమి రక్షించియూ, వినుతికెక్కనినీవిమలపదంబులు। కనకపల్లెరము నగడుగ నాయన హాహా॥ధన్యు॥సముటెవ్వరిలగారునీకునూ। సురసంనుత గతినీవెనాకునూ। కమలవిలోచనఘనరంగధామనీ। వమలకృపనుముద్దుటల్లుడవాటచే॥ధన్యుడనైతిని॥

కందార్థం॥ శ్రీరఘువరయీఘనక।న్యారత్నముసీత నాకునందన నీకుం। జారుసహధర్మచారిణి। కూరిమితగనేలుకొమ్మి। గుణవతిసుమ్మి। నీకరుణసాంపారరా నిమ్మి। శ్రీరంగవరదానధారాపూర్వకముగ। కోరినీకొసగితిగొబ్బునసీకన్య। గుణవతిసుమ్మి॥

కందార్థం॥ ఖ్యాతింబ్రాణపదంబుగ। సీతనుతగబెంచినిన్నుసవించుటకై। ప్రీతిగనర్పణజేసితి। శ్రీతరుణీతుల్యబాలశ్రితజనపాల। జగదేకవిఖ్యాతసుశీల। పూతచరితరంగపురవాసయీ పంకజాతలోచననీకుసమమైనయిల్లాలు॥ శ్రితజనపాలా॥

క॥ శ్రీకరముగనీయూర్మిళ। శ్రీకరపాణిగ్రహణము। సేయుము ఘనపు। ణ్యాకరలక్ష్మణమాళవి। చేకొనగదవోయిభరతసిద్ధార్థుడవై॥

క॥ శ్రుతకీర్తిని సొంపారగ। సతిగానీకొసగినాడశత్రుఘ్నాతగం హితముగపాణిగ్రహణం। బతికుతుకముతోడసేయుముగవరధీరా।

శా॥ ఈరీతింజనకుండుబల్కగనురాజేంద్రాత్మజుల్ చారుశృంగారాకారులుహస్తపద్మములశ్రీకన్యాకరాంభోజముల్। శ్రీరంజిల్లగబట్టిరాగమవిధించెల్వొందగానవ్యోపం। పౌరుల్ బంధులుసంతసింపుచుకడుంభద్రాత్ములైచూడగన్॥

## కళ్యాణిరాగము - ఆదితాళము.

భూతలపరసీతాకళ్యాణము। పొసగవినుముఘనమూ। ఖ్యాతిగ ఘనతరతటిదభ్రంబులరీతినిమెరసిరిసీతారాములు॥భూ॥ చెలగిమంగళాష్టకములువిప్రులుచెప్పిరిరఘువరుడూ। లలితకనకమణిమంగ

ళసూత్రము వెలయఁగ సీతాగళమునఁ గట్టెను ॥భూ॥ చలమునఁ మౌక్తిక శేసలు సతిపతులెలమిఁ జల్లుకొనిరి। లలనలు సీతారాముల గెలుపులు బలికికొనిరి పక్షాపక్షములుఁగ ॥భూ॥ సురలు దుందుభులు మ్రోసెను ముని జనులు సుదతులాడిరపుడూ। కరము రుదుఁగ గంధర్వులు పాడిరి వరరంగేశుని పరిణయ వేళనూ॥భూతల॥

క॥ అంగన లంతట ముదమున। మంగళమణి మౌక్తికాదిమహితము లగు శ్రీ। మంగళహారతు లొసంగిరి। రంగుగ శ్రీరామునకును రమణీమణికిన్ ॥

మంగళహారతి. ఆదితాళము.

రామ సీతాభిరామ। రామ కోదండరామ। రామ రవికులాబ్ధిసోమ రమణ మంగళం॥ మందహాసకలితదివ్యసుందరాస్య ఘోరవైరిబృందగహనదహనసానందమంగళం॥ సజలజలదనీలసర్వ। సుజననివహపాలరవ్య। విజనవననివాసయోగివినుత మంగళం॥ అప్రమేయ వరదదాస। సుప్రసన్న చారుగో। విప్రరక్షణ ప్రమోద। విమల మంగళం॥ సంగర ప్రవీణ నిత్య। మంగళాభిరామ శ్రీరంగనిలయ దురితసంఘభంగ మంగళం॥ రామ సీతాభిరామ॥

మంగళ హారతి.

జయమంగళం సదా శుభమంగళం॥ ఘనసీరచాపునకు। కనకాభగాత్రికిని। వనజాతనేత్రునకును। వనజాక్షికి। మునిగణార్చితునకును। జనలోకవినుతకును। యినకులోద్భవునకును జనకజకునూ॥ జయ మం॥ కందర్పశతకోటిసుందరునకును లోక। సుందరికి రఘుపతికి శుభవతికిని। మందస్మితాస్యునకు। మత్తేభయానకును। కుందరదనునకు శరదిందుముఖికి ॥ జయమం॥ శృంగారవేషునకు। సురుచిరవిభూషకును। మంగళప్రదునకు రమాసమకును। రంగనాథునకు। శ్రీరంగేశురాణికిని। సంగీతలోలునకు చారుదతికి॥ జయమంగళం సదాశుభమంగళం॥

వ॥ ఇట్లు కాంతాలలామంబులు మంగళహారతు లొసంగినయనంతరంబ తోడిచెలియలు సీతారాముల వివాహవైభవంబుగనుంగొని॥

భైరవిరాగము - అటతాళము.

యంతో వేడుకాయనమ్మా। కాంతసీతాకన్యపెండ్లి। వింతగాకన్గొనలతన। కాంతునిసీతాచూడగ॥యంతో॥ రాముడల్లుడాయెజనక। రాజుభాగ్యమేమొగదవె। భామరో యీలేమమోము। స్వామితమి నీచూచువేళా॥యంతో॥ సీతాపెండ్లికూతురాయ। ఖ్యాతిదశరథునకాయ। గీతవాద్యరవములెంతో। ప్రీతిగా మ్రోయుచునుండా॥యంతో॥ కామినివినవెరంగ। ధాముడైనరాముమోము। కోమలీచూడగ మోహమేమొమిక్కిలాయగదవె॥యంతో వేడుకాయనమ్మా॥

కాంబోధిరాగము - ఆదితాళము.

యేమెనీనోముఫలముజానకి। నీవెంతాపుణ్యశాలివె జానకీ। సర్వస్వామియౌజగదభిరాముడు పెనిమిటాయె॥యే॥ కనులెత్తివిభునిలెస్సజూడవు। మాతోకలసిమెలసిమాటలాడవు॥వో॥ వనితాయీవిభునిమీదివలపురాశిగ్గట్టులాగల్గె॥ యే॥ ఘనుడైనభర్తదొరికె నేటికి। నీకు। వనజాక్షులెవ్వరమ్మసాటికి। వోనసబోణిమగని పేరత్యనురక్తిచెప్పగదవే॥మునియజ్ఞముగాచినదెవ్వరె। యీ శుధ నుఫుత్రుంచివైచినదెవ్వరె। వోపసరుహగంధి శ్రీరంగనివాసుడసరాదటె॥యేమెనీనోముఫలముజానకి॥

వ॥ ఇవ్విధంబునం బరిహాసాది వచనంబులు బల్కుచు వేడుకలు గావించుచుండి రట్టియెడ వసిష్ఠవిశ్వామిత్ర శతానందప్రముఖ మునివరులు సీతోర్మిళా మాండవీశ్రుతకీర్తికన్యా సమన్వితులగు రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల కగ్నిసన్నిధి నాగమ విధిప్రకారంబునం వైవాహిక శుభక్రమలక్షణంబులన్నియుం గావించిరంత విశ్వామిత్రుండు దశరథాదులం వీడ్కొని యుత్తర గిరికిం జనియె తదనంతరంబునం దశరథుండు జనకగృహంబునం సరసపదార్థసంపన్నంబుగా సఖిలజన సమేతుండై విందుభోజనంబు లొనర్చి యతనివలన దివ్యాంబరాభరణ వాహనాదివస్తు జాతంబులు బడసి వీడ్కొని కొడుకులుం గోడండ్రును నిజవధూ జనంబులును సమస్తబంధుమిత్ర సైన్యంబులం గొనిపోవుచుండు సమయంబున॥

సీ॥ అంతట భృగురాముడత్యుగ్రుడై వచ్చి శ్రీరాముసన్నిధిచేరిని

లిచి। పశుపతిచాపంబుపట్టి ద్రుంచితివంచు వినివచ్చి నాడనీవిక్రమం
బు। విరివిగానా చేతివిల్లెక్కు గావించి శరము సంధించిన సమర మిపు
డు। నీతోడ గావింతునేనని పల్కంగ దశరథుండది విని తత్తరమున। వి
నుతిగావింపనంతట వినక రాజ। రాముకన్గొని నిను ద్రుంతు రయము మె
రయ। ననుచు బలుకంగ రఘురాముడతని విల్లు। కేలగాని యెక్కుగావిం
చె లీలనపుడు॥

వ॥ యిట్లుతన పరాక్రమంబు చూపించిన పరశురాముండు శ్రీ
రాముంగనుంగొని యీవిల్లు యెక్కుబెట్టుటవలన నీవు సాక్షాద్వి
ష్ణుండవని యెరింగితి మనమిరువురము నారాయణాంశజులమేను
మహేంద్రాద్రికిబోయివచ్చెద ననివీట్కొనిచని యెనంతదశరథుం
డతి ముదంబునం సర్వసౌభాగ్య సమేతంబగు శ్రీమదయోధ్యాపు
రంబునకరిగి పుత్రమిత్రబంధుజనహిత పురోహితవందిమాగధా
దులంగూడి రాజ్యంబు సేయుచు సుఖంబుండెననిన వివరించినా॥

క॥ ఘనముదమున నభిమన్యు। తనయు నకీర్తి శుకుడు తగ జెప్పె నసం
వినిశౌనకాదులవ్యోష। నసుగత్తినిసూతుబాగడి రాదరమొప్పన్॥

గద్య॥ ఇది శ్రీమదుభయకావేరీమధ్య ప్రదేశ ప్రదీప్త సప్త ప్రా
కారమహామందిరాంతర్విరాజమాన శ్రీరంగనాథ చరణ సేవక
వరగంటి శేషగిరి దాస ప్రణీతంబగు శ్రీమద్రామకథాసంగ్రహ
యక్షగాన విలాసంబునం బాలకాండ యందే కాశ్వాసము॥

సంపూర్ణము.





శ్రీరస్తు.

# అయోధ్యాకాండము.



శ్రీవాణీవరహిమగిరి। జావల్లభవినుతరంగసదనసుయోగ। ప్రా
ణీఖ్యయోగిభావిత। భావరమామానచోరపాపవిదూరా॥

వ॥ నారాయణకథాశ్రవణతత్పరులగు శౌనకాది మునీంద్రు
లంగనుంగొని సూతుండిట్లనియె నట్లుప్రాయోపవిష్టుండైన పరీ
క్షిన్నరవరేంద్రుంజూచి శుకయోగీంద్రుండు రామకథాసుధార
సంబుశ్రోత్రాంజలులం గ్రోలుమనియిట్లనియె॥

గీ॥ యిట్టివిధంబునదశరథుండింపుమీర। తనపురంబునకటుజేరి ఘన
సుఖంబు। దనరనతిధార్మికుండనిజనులుబొగడ। సకలభూపాలనము
సేయుసమయమునను॥

క॥ వినుతగుణుండగుభరతుడు। తనతమ్మునిగూడిచనియెతడయక
నంతం। ఘనమగుమాతులపురికిని। మనమునకౌతూహలంబుమానక
కలుగన్॥

వ॥ యిట్లు భరతశత్రుఘ్నులు మాతులపురంబున కరిగినయనంత
రంబునం బ్రహ్మప్రార్థితజన్ముండును వీర్యవంతుండును ననసూ
యకుండును గుణంబులకు దశరథ సముండును ప్రశాంతాత్ముండు
నుమృదుభాషణుండును యవ్వరేనియుం బరుషంబులుబల్కిన మర
ల నవ్విధంబునం బలుకనివాడును తనకు కేవల స్వల్పతరంబగు యు
పకారంబుగావించిన నధికంబుగాదలంచు వాడును యాత్మవంతుం
డగుటంజేసి యుపకారశతంబులొనర్చిన నాత్మయందలుకలేక వ
ర్తించువాడును బుద్ధిమంతుండును మధురవాక్యుండును పూర్వసం
భాషియు ప్రియవాక్యుండును అనృతకథావిహీనుండును। వృద్ధజన
ప్రతిపూజకుండును ప్రజలచేత భజియింప బడువాడును ప్రజలన
నురంజింపంజేయు వాడును సానుక్రోశుండును జితేంద్రియుండు
ను బ్రాహ్మణప్రతిపూజకుండును దీనజన కరుణాకరుండును ధర్మ

జ్ఞుండును విషయవ్యాపారనిరోధనధురీణుండును శుచియును యు
త్తరోత్తరవాక్యనైపుణ్యంబున। బృహస్పతిసమానుండును పరాక్ర
మంబున నింద్రతుల్యుండును రాగరహితుండును తరుణుండును వ
క్తమయు దివ్యలావణ్యదేహుండును దేశకాలవిదుండును యదీనుం
డును సత్యవాక్యుండును బాణాస్త్రప్రావీణ్యంబున తండ్రికంటె
నధికుండును స్మృతిమంతుండును దృఢభక్తిసమన్వితుండును స్థిరప్ర
జ్ఞుండును నిస్తంద్రుండును యప్రమత్తుండును స్వదోష పరదోషం
బులం దెలియువాడును ధనుర్విద్యా విశారదులలోనను త్తముండు
ను లోకంబుననతిరథసమ్మతుండును గారాబుపట్టియునగు శ్రీరామ
చంద్రునకు దశరథభూపాలుండు పట్టంబుగట్టందలంచి సకలదేశా
ధీశులగు రాజన్యులనుం బ్రజలనుం బిలుపించి సభాస్థలంబునం గూ
ర్చుండి సమస్తజనంబులం గనుంగొని యిట్లనియె॥

సీ॥ వినరయ్య సకలభూజనులార నృపులార వేడ్కతో నామాట వి
మలమతుల। నీయుర్వి బహుకాలమేలితి భోగంబులొందితి చక్కనిసం
దనులను। బడసితి నింక నాపట్టియౌ శ్రీరామచంద్రునకత్యంత సమ్మ
తమున। పట్టాభిషేకంబు పదపడి సేయంగ మనమున గోరితి మమతద
నర। మహిమ వెలయంగ రాముడీమ్మహిని బ్రోవ। నెరిసమర్థుండె స
ద్గుణనికరుడగునె। మీకభీష్టమెయి కార్యమెలమినన్న। నేకవాక్యం
బుగా నందరిట్టులనిరి॥

నవరోజురాగము-అటతాళము.

యేమనివర్ణింతుమునె। మెంతనిభాషింతుము శ్రీరాముని విక్రమ
రూపరమ్యగుణములను। హేమపర్వతధైర్యుడు। శ్యామల మేఘవ
ర్ణుడు। తామరసపత్రనేత్రుడు మహాత్ముడూ॥యే॥ వినుతుడై పె
ద్దలచేరి। వేడ్కతో నమస్కరించు। జనులసౌఖ్యమెంచు మదిలో తన
సౌఖ్యము గాను॥యేమని॥ ఘనమతి నన్యకాంతల। కన్నతల్లులని యెం
చు। కనలికీడు సేయ గోరడ నిమిషనుతుడు॥యే॥౨॥ పొలుపుగ సంగ్రా
మమునకు। పోయివచ్చి పౌరజనుల। చెలగి కుశల మడుగువాడు సేవ
కావనుడూ॥యే॥౩॥ గరిమెతో రాముని బొగడ। కమలజుడైనా చాల
డు। నిరుపమవిక్రముడు రంగపురవల్లభుడూ॥యే॥౪॥

సీ॥ ప్రజలార్తి జెందుచో పదపడి కనివిన్న నతితాపమును జెందు
నాత్మయందు। జనులెల్ల శుభమహోత్సవముల హర్షింప తగ సంత
సము బొందు తండ్రి మాడ్కి। శరణన్నవాని నిర్భరకృపతో గాచున
యమార్గ నభయదానంబొసంగి। వలనొప్ప పరవీరులిల నెంతవారై
న విజయుడై వెంచేయు వెసజయించి। పరమ ధార్మికు డాశ్రితపారి
జాతు। డట్టి శ్రీరాము రఘురాము నరివిరాము। నార్తరక్షకు ననిమిష
నాథవినుతు। పట్టభద్రుని జేయుమో పార్థివేంద్ర.

క॥ తరుణులు వృద్ధాంగనలును। విరివిగనుదయాస్తమాన వేళలని
ష్టన్। సురలకు నమస్కరింతురు। గురుతుగ రామునకు మేలుగూర్పడ
టంచున్॥

గీ॥ ఘనుడు నీపట్టి మూడులోకంబులేల। జాలు నవలీల నిది నమ్ము జన
వరేణ్య। మహిమ వెలయంగ నీధరామండలంబు। పాలనము సేయుట
దియెంత పని నరేంద్ర॥

శంకరాభరణము- ఆదితాళము.

పట్టాభద్రుని జేయుమూ। రామచంద్రుని। పట్టాభద్రుని జేయు
మూ॥ పట్టాభద్రుని జేసి నెట్టన బ్రోవుము నీపట్టి వైరుల నెల్ల పట్టికొట్టె
టివాడు॥ పట్టా॥ ౧॥ తనకు తుల్యులధికులూ। లేనట్టివాడు। మునుకొని స
జ్జనగణములు। దినదిన మీరాము గుణముల ననురక్తి పొగడుచుందురు।
ఘనుడప్రమత్తుడు దుర్వచనములాడ డలసుడు కాడు॥ పట్టా॥ ౨॥ వేద
శాస్త్రార్థనిపుణుడు। శ్రీరామమూర్తి। సాదరవినయసహితు
డు। మోదమొందుదు మితని మోముగన్గొని శత్రుసూదను డౌరా
ముని చూడక నిల్వలేము॥ పట్టా॥ ౩॥ ధరణి బహుకాలమేలితి। వతిభోగ
ములకరమారు దుగనొందితి। వరయగ పెద్దవాడవైతి। ఇకనురంగ
పుర వాసుడైన రఘు వరుని వైభవమొప్ప ॥ పట్టాభద్రుని జేయు
ము ॥ ౪ ॥

వ॥ నరేంద్రా నీపుత్రుండగు రామచంద్రుండు సత్పురుషుండును
సత్యధర్మపరాయణుండును పురుషసారజ్ఞుండును వృద్ధజనులసేవిం
చువాడును స్మితపూర్వాభిభాషుండును ప్రసన్నముఖకమలుండును
విరుద్ధకథలయందు రుచిలేనివాడును ధర్మార్థకామ తత్వంబునె

...డును గజతురంగాద్యారోహణ నిపుణుండును అమోఘ క్రోధహర్షంబులు గలవాడును కోదండవిద్యా విశారదుండును దుర్జనదూరుండును కందర్ప కోటి సుందరాకారుండును జగన్మోహనుండును దీనరక్షా పరుండును కులోచిత మతియును గుప్తమంత్రంబు గలవాడును మహా పురుష లక్షణ లక్షితుండును సుకుమారుండును సుఖోచితుండును సీతావల్లభుండునునగు శ్రీరామునకు మీయభీష్టప్రకారంబున నెల్లవారలకు మానసోత్సవంబుగా పట్టంబుగట్టి రక్షింపుమని యనేకవిధంబుల వేడిన ప్రజలపల్కులు విని పరమానంద కందళిత హృదయారవిందుండై మీరుకోరినవిధంబు నంగావింతుననిపలికి యనంతరంబున॥

గీ॥ సభకు రాముని రప్పించి సమ్మతమున। గరిమెతోడుత కౌగిట గదియజేర్చి। శిరము మూర్కొని నాముద్దుచిన్ని తండ్రి। నీకుపట్టంబుగట్టెదనిక్కముగను॥

వ॥ కావుననీవు సీతాసమేతుండవై విధ్యుక్తప్రకారంబున నియతివహించి యుండుమని పలికిన రఘువరుండు నిజాలయంబునకుం జని॥

క॥ భూతలమేలెడుసంతోషాతిశయంబునను రామ చంద్రుడువేడ్కం। సీతా కాంతను గూడుక ఖ్యాతిగనుప వాసనిష్ఠ గావించె తగన్॥

వ॥ అంతదశరధానుమతంబున సుమంత్రాదులు పురంబధికశృంగారంబు గావింపనియమించిరి వసిష్ఠ ప్రముఖులు శ్రీరామపట్టాభిషేకమంగళద్రవ్యంబులు సమకూర్చి సిద్ధంబొనర్చి రట్టియెడపురంబునం గలసకల జనంబులుశృంగారంబులు గావించుకొని రామాభిషేక మహోత్సవంబు కన్నులారంజూచు తమకంబునం గాచి యుండిరి సకల మంగళ వాద్యంబులు మ్రోయుచుండె నాసమయంబునకైకేయి పరిచారికయగు మందరయనునది కైకపాలికింబోయియిట్లనియె॥

బిలహరిరాగము-అటతాళము.

ఎంతమూఢురాలవె।ఓకైకనీవెంతవెర్రిదానవే। చింతయేమి

ములేకశయనించియున్నావు। కాంతనీకాంతునికపటమెఱుంగావు॥
యం॥ పరమమంగళముగనూ। రామునకునీభర్త పెంపలరారనూ।
కరుణచే పట్టముగట్టంగబూనెనీ। మురిపెము ణంగేటిమోసమెఱుం
గావూ॥ యం॥౧॥ మనకుముదఱశగల్గెనె। నీసవతికిమన్ననలిక గల్గునె।
వనితనీవిటువంటివచ్చు కీడెఱుగకఘనమతినున్నావు కడు బేలవగుచు
ను॥ యం॥౨॥ రామునిహితజనులూ। సంతోషింపభామభరతహితు
లూ। వేమరుచింతింపవిభుడు శ్రీకరరంగ। ధాముని పట్టాభిరాముచే
శేజెరుగ॥ వెంతమూఢురాలవె॥౩॥

ద్విపద॥ అనియిట్లుమందరయనునదిదుఃఖ। వననిధిదేలుచువచ్చి తె
లుపగను। శ్రీరామపట్టాభిషేకసద్వార్త। తోరంబుగావినితొయ్య
లిలేచి। మురియుచుసంతోషమున జెందిదయను। వరరత్నలలిత సువ
ర్ణభూషణము। కరమొప్ప దానికకృరబూనియొసగి। వావిరిచెవు
లకు ౦రసుధరీతి। పావనంబగు రామభద్ర పట్టాభి। షేకవాక్యంబునీ
చేవింటిగదవె। నీకంటెహితురాలినేగానసన్న। తడయకదుఃఖించు
దాసినిజూచి। కడుచోద్యమందియాకైకయిట్లనియె॥

సురటరాగము-అటతాళము.

యాలాదుఃఖించదవె। వోమంథర। యాలతపించదవె। కాలము
గాదిదికడుచింతబొందగ। మేలైనయీశుభవేళత్తరపడి॥ యా॥ నిరు
పమధర్మజ్ఞుడు। శ్రీకరకృపా। కరుడు। సత్యసంధుడు। గురుభక్తిరతుడ
న్యతరుణవిముఖుడార్తపరిపాలకుడు రాముడరయకీడొనరింప॥ వే
లదుఃఖం॥ భరతునికెక్కువగా। శ్రీరామునిభావింతుమక్కువగా। వ
రరంగధాముడీవ్వసుధకుపతిమైన। గరితరోమనకేమికొరవగలుగ
నేర। దేలదుఃఖించేవె॥ వోమంథరాయాలా॥

క॥ అనియిట్లుకైకబలికిన। వినిమంధరఘోరదుఃఖవిహ్వలయగు
చుం। వనితరొభరతునినినుసను। ఘనయుక్తినిగాచి కొమ్మకనులద
శాక్షీ॥

సీ॥ రాముడీవ్వసుధకురాజైనకౌసల్యవిభవసుఖండమై వెలయు
చుండు। నీసుతుండేవేళదాసుడై వతిఞంచునీసొంపుకైంపెల్లమాసి
యుండు। ననియిట్లుయెత్తిచెప్పి సవివియాకైకయిందుకుసదుపాయ
[illegible]యవిన। గరిమనీపతిరెండువరములివ్వాడెతొల్లియాశరంబుల

ష్పచాపటూని। రాముపదునాలుగేడులరణ్యమునను। నుంచఁబొక్క-
టిభరతునికంచితముగ। పట్టముమరంగఁగట్టుటపరగనొకటి। యివ్వి
ధంబునకాంక్షింపుమిందువదన॥

గీ॥ యిట్లుమంథరబలుకంగ నెలమిమెచ్చి। లేనియల్క వహించి
యాలేమయొక్క। మందిరములోనబవళించెమహితభూష।ణాద్య
లంకరణములేకననఘచరిత॥

వ॥ఆసమయంబున॥

క॥ఆకైకకడకుదశరథ।భూకాంతుడుచేరవచ్చిపొలతినిగనియా।
రాకేందువదనమీదను।శ్రీకరకరుణామృతంబుజిలుకుచుబలికెన్॥

కళ్యాణిరాగము- ఆదితాళము.

ప్రాణనాయకినీవీనేలనుబవళించితివేమె। మానితరత్నవిభూషణ
వితతులు। మానిమదినిబూనినకోపంబున॥ ప్రా॥౧॥కనుగొనలనుక
నుగొనవేనాయడకపటమునుపనేలా। వనజగంధి రోనిన్నెవ్వరైన
సుమనసు నొవ్వగనిశిపలికినారచె॥ ప్రా॥౨॥ గరితరోనీమదిగలకో
రికెనాకెరుగఁదెలుపగదవె। గరిమనునీవేమడిగిననొసగెద। తరుణి
రంగపతిచరణములానగ॥ ప్రా॥౩॥

చ॥అనవినికైకలేచిపతినట్టెగనుంగొనిమున్నొసంగవే। యనఘ
వరద్వయంబధికహర్షమెలర్పగనావరంబులిం।పు,ననిపుడిమ్మటన్న
వినిభూవరుడిచ్చితినన్నాధుతో।ననియెపయోజగంధిహృదయాబ్జ
మునందురితేచ్ఛమీరగన్॥

క॥పదునాలుగువత్సరములు।సదమలమునివృత్తిరామచంద్రుండడ
విం। వదలకవర్తింపగసొం। పొదవగధరభరతుడేలభూవరయి
మ్మా॥

వ॥ అనియివ్విధంబునం గేకయరాజుపుత్రి బలికినం జెవులకు పి
డుగులచందంబై తోచిన మూర్ఛఁల్లి క్రమ్మరం దెలసి కైకమొగం
బుగనుంగొనియిట్లనియె॥

అసావేరిరాగము-అటతాళము.

ఏమనికోరితివె।యీకోర్కెనీ। కెవ్వరుబోధించిరె।యీదుశ్చిం
త।నెవ్వరుబోధించిరే॥రామునిజగదభిరామునిదనుజనిరామునిను

ఘనాభిరామునడవికంప ।యేమని॥ నినురాజపుత్రి వని । నెమ్మదిన ష్ముకుని నేవరించితిని॥ వనితనీవిటువంటిఘనకాలసర్పమవని । నన్నెరుంగనై తినిగదె పాపిష్టి॥౧॥ మునిజనవందితుడూ।సకలజగన్మోహనసుందరుడు । ఘనుడు రాముడు భరతునికంటెనీ సేవమనమున గోరి చేసునుగదెదుశ్శీలా।యే ॥౨॥ యేమి తప్పొనరించెను।నాచక్కని స్వామి నడవినుంచనూ । యేమైనయొసగెదగాని శ్రీకరరంగధాముడౌ శ్రీరఘురాముబాయగజాల।యే॥౩॥

ద్విపద॥ కటకటానీకింత కాఠిన్యచిత్త। మెటువలెసమకూర్చెనిల నువిధాత।గరిమె కేకయరాజగర్భాబ్ధిలోన।గరళతుల్యంబుగాగల్గితివేమె।నీకెంతపనసాయనీరజగంధి।కాకుత్స్థునడవికికడు వేట్కబంప । నిందీవరశ్యాముడినకులేశుండు । కందర్పసుందరా కారుడాఢ్యుండు।ఘనసత్త్యసంధుండుకరుణాకరుండు।జననుతుండగురామచంద్రుండునీకు। తనయుండుగాడటెతరళాక్షి ఘోర। వనసీమదోలెటివాంఛజాలించు।వెలదిరో యిటువంటివిపరీతకాంక్ష। వలవదు కోరికవరకీరవాణి।తరుణినీచరణముల్ తలదాల్తురాము। భరతులసమముగాపాలింపుమన్న। కనుదోయికింపుగాకడు బ్రకాశింప।కనలి యిట్లనియెనాకైకభూపతికి॥

మారువరాగము-అటతాళము.

ప్రాణవల్లభనిన్నుసత్యసంధుడవనిభావించుటదిదోసమూ।పూనియాకౌసల్యబోధకులోబడి। మానవేశ్వరధర్మమహిమదప్పటజేసి॥ ప్రా॥ మచ్చికతోడమున్నిచ్చినవరములుచెచ్చరదప్పదురా।హెచ్చైనకులధర్మమెల్లద్రుంచగమంచి।ముచ్చటాయనోనీకుముదిమివద్దెలుచుండ॥౧॥ వెరువకనేనింకవిషపానమునజత్తుసరవరనీవంతటా। భరతునివడిజంపిధరణిరామునికిచ్చి గరితకౌసల్యతోగరిమెగూడుమువులె॥ ప్రా ॥౨॥ గురుతుగనిక్ష్వాకుకులమునజనియించునరనాథు లవరై ననూ। విరివిగానాడినవాక్యముదప్పిరె। వరరంగనాథుడీసరణికిమెచ్చునె॥౩॥ ప్రాణవల్లభనిన్నుసత్యసంధుడవని భావించుటదిదోసము॥

గీ॥ ఇట్లు కైకపలుకనిలను మూర్ఛిల్లి। మిన్ను పైనబడినయట్లు పార్థివుండు। కన్నుగవను బాష్పకణములు రాలంగ। దీనుడగుచునుండె మానవేంద్ర॥

వ॥ అంతట నరుణోదయ సమీపం బయ్యె నాసమయంబున రామ మందిరంబున సీతా సమేతుండగు రాఘవుండు మంగళ తూర్య ప్రముఖ ధ్వనులవలన మేల్కాంచి పట్టాభిషేక మహోత్సవ కౌతూహలంబునా॥

శ్రీరాగము-ఆదితాళము.

యంతో మోదమున వెలసిరి। సీతా రాఘవులెంతో వేడ్కల వెలసిరీ। పంతముతోడ రాజ్యభారము దాల్తుమని। సంతోషమున పుణ్యజలములసుస్నాతులై ॥౧॥ చెలువమైనబంగారువలువలుగట్టిమేన। తళుకురత్నంపుసొమ్ములెలమితోడుత బెట్టి ॥౨॥ సురభిచందనకస్తూరివర మల్లికాహారాదు। లిరువొందబూని శ్రీ శ్రీ। కరరంగధాములనగ॥౩॥ యంతో మోదమున వెలసిరి॥

వ॥ అంతవసిష్ఠుండు పట్టాభిషేక మంటపంబునకు సమస్తముని గణంబులతోడ నరుదెంచి నానాదేశాధీశులగు రాజేంద్రులను మంత్రిశ్రేష్ఠులను యరుంధతి మొదలగు నారీజనంబులనుం బిలుపించి సకలనదనదీ సముద్రజల సంపూర్ణంబులగు హేమ కుంభంబులును ధనధాన్య రత్నభూషణ చందన కర్పూర మృగమద నానావిధపుష్పపల్లవ ప్రముఖంబులును రథగజతురగ కన్యకా ధేనువృషభ సహస్రంబులునుం దెప్పించి మంగళవాద్య నృత్యగీతాది సకలవైభవంబు లొనగూర్చి సుమంతుం బిలిచి దశరథుం దోడ్కొనిరమ్మని పంచిననతండు తీవ్రంబునం జని కైకమందిర ద్వారంబున నిలువంబడి దశరథేశ్వరు నుద్దేశించి మహాత్మా పట్టాభిషేకంబునకు సుముహూర్తంబు దగ్గరియున్నయది వసిష్ఠుండు బుత్తెంచిన వాడ ననిపలికిన వినికైకయిట్లనియె॥

కం॥ శ్రీరామచంద్రునిచటికి। నారూఢింబోడితెమ్ము యారాముని శృంగారవిభవమ్ముచూడగ। నీరాజేంద్రుండు గోరె నేడుము వేగనూ॥

గీ॥ అనుచు కైకబలుక నాసుమంతుడంత। రాముపాలికేగి రయము తోడ। విన్నపంబు సేయ విని రామచంద్రుండు। తలచె చిత్తమున సుతంత్రి జూడ॥

క॥ తేరెక్కి రామచంద్రుడు। వారణరథహయభటాదివర్గంబులతో। చారుతరవైభవంబున। చేరంజనె కైకగృహము శ్రితలక్ష్మణుడై॥

వ॥ ఇవ్విధంబున రామచంద్రుండు గేకయరాజనందన గృహంబు కడకుం జని రథంబుదిగి లోపలికిం బోయి విషాదంబున కన్నీరు నించుచున్న తండ్రిం జూచి భయపడి కైకేయికి వందనంబు గావించి తల్లి మాతండ్రి యగు దశరథుండత్యంత విషాదంబున వివర్ణముఖుండై యున్నవాడు నేనజ్ఞానవశంబున నపచారంబులెవ్వియు జేయంగదా యని యడిగినం గైకేయి యిట్లనియె॥

ద్వి॥ వినవోయి శ్రీరామ విశదంబుగాను। మును నాకు మీతండ్రి ముదము రెట్టింప। వరయుగంబొసగె నావరములీవేళ। కరమొప్పనిమ్మన గానిత్తునన్న। నినుపదునాల్గేడ్లు నియతితో ఘోర। వనవాసమొనరింప వరమతి నొకటి భరతునకింపుగా పట్టంబుగట్ట। గరిమె నొక్కటి వేడ ఘనవిషాదమున। నీకప్రియము బల్కనేరక నిట్లు। భూకాంతుడున్నాడు పొలుపొందనీవు। జనకుని సత్యంబు చక్కగా నెరపు। తనయుండవై తే నితగ సేయుమనుచు। బలుకంగ విని రామభద్రుండు భక్తి। వెలయంగ నంతట వెలదికిట్లనియె॥

భైరవిరాగము - ఆదితాళము;

జననిరో నీయాజ్ఞ దప్పనెవో॥ యమ్మ వినవె। జననిరో జనకుని సత్యవ్రతుని సేయని సుతుడేల। నీచరణములాన నమ్మవమ్మ వనభూమి। కేగుదు నింక వరములు యాచింపవలెనా। యీకార్యమీవు గరిమ సెలవివ్వ జేయనా। భరతుడు తమ్ముడ తండు గరిమెతో రాజ్యమేలగ। నరమురలేమున్నవమ్మ। పరమసంతోషమె కాదా ॥జన॥ జనయిత్రి నీకరుణ వలనను। మునికోటిపదవందనములు నాకబ్బు నింకనూ॥ మునివేషము ధరదాల్చి వనవాసమొనర్తు సర్వ। మునులు నన్ను రంగధాముడనుచు ప్రస్తుతింపుచుండ॥ జననిరో నీయా॥

క॥ అనియిట్లు బలికిపీటొక్కని। ఘనమతి శ్రీరాఘవుండు కడువడిజని తా। తనతల్లి యింటికయ్యెడ। మునుకొనిలక్ష్మణుడు దీనముఖుడై గొలువన్॥

వ॥ అంతటనంతఃపుర స్త్రీజనంబుల యార్తస్వరంబులు ఘోరంబుగా మ్రోయుచుండె నా సమయంబున శ్రీరామ చంద్రుండు లక్ష్మణ సమేతుండై కౌసల్యపాలికిబోయి పట్టాభిషేకంబునిర్విఘ్నంబుగా నేపడుటకై గ్రహశాంతులును హోమంబులును దేవపూజలుగావించుచు పరమానందంబునవతిరించుచున్నతల్లి కివందనంబుగావించియిట్లనియె॥

మధ్యమావతిరాగము-ఆదితాళము.

యేమియెరుంగనిదాన వేతల్లి। యేమని వివరింతు నేమతి జెల్లి॥ యేమో మోదముతో మించుచునా। క్షేమము జూడగ వేమరుగోరెద వేమి॥ గొనకొని కైకవరంబునకేను। వినుతిగలుగుముని వేషముతోను। వనమునపదునాలుగువత్సరములు। ఘనమతినేవసియింపగలిగెను॥౧॥ మరియొకవరమునకరుదారగను। భరతుడుధరణీతలమేలగను। గరిమనిట్లుచేకూడెనుపోమెద। వరరంగపురీశ్వరుడనిపొగడగ॥ యేమియెరుగని॥

వ॥ అనియివ్విధంబునంబలికిన॥

గీ॥ మొదలుగొట్టదెగినకదళికాభూజంబు। తెరగుదోపధరణినొరగి మూర్ఛ। జెంది తెలిసిలేచి శ్రీరమ్యమగు రాము। మోముజూచిశోకమునమునింగి॥

శోకవిరాళిరాగము-అటతాళము.

యెక్కడివనవాసగమనమువచ్చెనుచక్కనినాతండ్రీ। నిక్కమొకల్ల యోనిజమనినమ్మరి। పక్కజముగకల్ల లాడనేతుడె వెతండ్రీ॥ యెక్క॥౧॥ ఘనమగుయభిషేచనవిఘ్నములునీకుగలుగకుండునట్లుగా। పనిబడినేజేయు బహుహోమశాంతులు। నిను బ్రోవలేవాయగా శ్రీరామా॥౨॥ నా మోహనపుపట్టినాపెన్నిధానమనా ముద్దురఘునందనా। యేమని జెప్పదునీ మోహాశోకము నేమనిజీవింతునీ మోముజూడ

క॥౨॥ యిరువండసంతతిలేనిదుఃఖమునన్నింతతాపముసేయదూ। పరరంగధామనీవెనువెంటవచ్చెద।నరమరచేసినధరణిజీవింపనూ॥ యెక్కడివనవాసగమనమువచ్చెనూ॥

సీ॥ అంతట లక్ష్మణుండాయమ్మవిన రామచంద్రు గన్గొనిసుప్ర శాంతుమాటికి। నడవికినేగంగనాడబడివచ్చితివన్ననీవిదియొప్పన హాఁమగునె। చెలగినిన్నభిషిక్తుచేసెదననితండ్రి మదనాతురముగ నమ్మాటదప్పె। జనకుండుఘనమాగఁమసురక్తిచెప్పిననొప్పంగద గుదీనియొప్పదగునె।యేనయోధ్యనునిజఁనగానొనత్తుఁ।సెలవుకరు ణింపుమనరఘుశ్రేష్ఠుడంత।జనకువచనంబుదప్పంగజనదునాకు।వన ములవసింతుపదునాల్గువత్సరములూ॥

చ॥ అనియిటుబల్కితల్లి వినిహారఘునందనరామచంద్రపా।వన మునికోటివంద్యనతవత్సలదీనశరణ్యపద్మలో। చనభవచాపఖండన ప్రసన్నముఖాబ్జకుమారనన్నుబా।యనిదయబ్రోవవోయిశరణా గతపోషణశత్రుశోషణా॥

అసావేరిరాగము-అటతాళము.

యెన్నోనోములునోచినిన్నునేగన్నదియీవనవాసముకా॥ నిన్ను జూడకయరనిమిషమోర్వగజాల। కన్నులజూడుముకరుణచక్కని తండ్రి॥౧॥ఆకైకతనభర్తఁచేకొనిమన్నింపమాకంటెనెక్కువగా। శ్రీకరవైభవ చిన్నెలగోరకనీకేలవనవాసనియతిగోరెనుపుత్ర॥ ౨॥ అందరుసుఖమతినుండగనీవేలజెందగా రెదువనమూ।యెందు బోవలదునాయాజ్ఞ గైకొనుమికకందర్పఁ శతవేష ఘనరంగపుర వాస॥ ౩॥ యెన్నోనోములునోచి నిన్నునేగన్నది యీవన వాస ముకా॥

ద్వి॥ వినుముశ్రీరఘురామవినవోయిపుత్ర।నినుబాసి ప్రాణముల్ నిలుపంగజాల। నిండుచందురుబోలునీమోముజూడ। కుండంగనే తుఁనేకుమతియైనట్టి। సవతియాకైకకురుఘుడియంగనేర। ప్రవిమల మతినిన్నుబాయకవత్తు।ననియిట్లుబలుకంగనమ్మతోరాము। డనియె నీవనవాసమతిలీలగడపి।వేగవచ్చెదతల్లివిడువుముదుఃఖ।సాగరమ్ము నబొందజనవలదింక।ననిహితోక్తులునీతినమరంగజెప్పి। జనయిత్రిక

ర్మ్యేదసాగిలిమ్రొక్కి। అమ్మనీకొమరుండనగునట్టినన్ను।సమ్మతిదీవించిసదమలమతిని।బంధువుమనంగయాపద్మపత్రాక్షి। పెంపునరక్షలుప్రీతితోఁబెట్టి।వరయంత్రములుగట్టివరుసదీవించి।గురుకరుణాబ్ధియైకొడుకుకిట్లనియె॥

మారువరాగము- ఆదితాళము.

పోయిరానాయన్ననీవుపోయిరావోయి।బాయకయింద్రునకదితి।బల్కినమంగళములెల్ల।వేయువిధములనిన్నట్టి।విపినవిధులరక్షించు॥పో॥౧॥గరిమతోడుతనమృతము।గరుడుడుతేబోవువేళ।గురుతుగానవినుతబలుకు।కుశలమునిన్నేరక్షించు॥౨॥ధరణిలోబాలురనెల్ల।తల్లులుదీవించిపల్కు। నిరుపమకళ్యాణములు।నిన్నుజెందిబ్రోచునింక॥౩॥భీకరారణ్యములజాగ।రూకుడవైవెలసిరమ్ము।శ్రీకరరంగేశుడనుచు।నాకవాసులెల్లబొగడ॥౪॥పోయిరా॥

వ॥అనియివ్విధంబుసదీవెనలొసంగిన॥

ఉ॥ ఆరఘురాముడంత।తనయంబనువిట్లనిలక్ష్మణుండు।పెంపారగభక్తిగొల్వ। నిజభవ్యనివాసముకేగిసీతతో।ధీరతసర్వముందెలిపి।దీనతనొందకుపోయివచ్చెదం।భూరివివేకమొప్పవనభూమికిభీతకురంగలోచనా॥

వ ॥ ఇట్లుబలికినం వినినవైదేహి నితాంతదురంతశోక వ్యాకులితచిత్తయై నేత్రాబ్జంబులం వెడలుసాంజన బాష్పంబులవలన కనకకుచకల శంబులునిండింపుచు రత్నకంకణాద్యలంకృతంబులగుకరాబ్జంబులుసాచి ప్రాణవల్లభుండగు శ్రీరామునిం కౌగిలించుకొని దేవా నిన్నుంగూడి వనంబునకు వచ్చెదనీ తోటి వియోగంబున కొల్లనని బలుకుచున్న ప్రాణవల్లభి ననునయ వాక్యంబుల నూరడింపుచునిట్లనియె॥

అసావేరిరాగము-అటతాళము.

నీవెంతోసుకుమారివె। కారడవులనిలువలేవుమానవె॥వోవల్లభివినవెవనవాసము।భావింపజనులకుపరమాయాసము॥నీ॥౧॥ కరిసింహ ములుమించునె।శార్దూలములురుముగవిహరించునె। శరభభల్లూకవానరఖడ్గభీకర।గురుతరధ్వనులచేగుండెలవియుచుండు॥౨॥ నీవెం॥ఫలమూలములుదినుచూ। శీతాతప।బాధలెల్లనుబడుచు। శిల

లుకంటకములుగలదుర్గమములునెక్కి । తలిరుబోణిరో దుఃఖతాప ములబడలేవు॥౩॥ నీవెం॥ ఘనతరసర్పములు। రాక్షసకోటిగావించు ఘర్జనలు।వనములనమరురావలదు శ్రీరంగేశు । డననొప్పనా వాక్య మునకనుకూలింపు॥౪॥నీవెంతో సుకు॥

వ॥ అనియివ్విధంబునం బల్కిన ప్రాణవల్లభునకు వైదేహియి ట్లనియె॥

పున్నాగరాగము-అటతాళము.

నాధనిన్నెడబాయజాలనూ।రఘునాధనేత్తునీతో డను॥సాధుపో షణ నీచరణ సేవకురాల । బాధపెట్టకునన్ను బాసి మ్రొక్కెదనో యి ॥౧॥ నినుబాసిపురినివసింతునా।యీతనుసుఖంబులకిచ్చయింతు నా। వనమునగానిపట్టణమునగానినిన్ననుసరించియుండుటదేదివ్యవి భవము॥౨॥ వనమృగభయములునన్నును। జెందవనఘనీవెను వెంటను న్ననూ। ఘనరంగధామనిన్నెడబాయకుండిన। వనముగాదదిపట్టణ మునభోలును॥౩॥నాధ॥

కందార్థములు.

అనియిట్లుసీతబల్కిన।వినిరాఘవుడతివ జూచివినవెసీవా।వనవా స మెన్న డెరుగవు। ఘనమతినీవిచట నుండు । కామినినామాటవినవె భామినీ । మనమున నన్నుదలంపుచునత్తలకనురక్తినిపనులొసరగాసే యుచు కామినీ॥

వ॥ఇట్లుబలికినసీత॥

క॥ మునుసత్యవంతువెంటను।ఘనమతిసావిత్రి జన్నకైవడినలు నిం। వెనుకొనిచనుదమయంత్యాం। గనకై వడివెంటవత్తుకానకనూ ॥ నామీదనలుకలూనకు । మనసిజసుందరమన్నన బ్రోవుము। కనికర ముంచుముగమనమొనచేదు॥ కానకనూ॥

క॥పిరికితనమేలరాఘవ।పురుషాకృతిదాల్చినట్టిపొలతివటంచున్। గురుతెరుగకమజ్జనకుడు। పరిణయమొనరించెనీకుభక్తిని। నన్నునిల్ప బోకుముభక్తిని।కరుణాకర శ్రీకరరంగేశ్వర। శరణంటినినీచరణాబ్జ ములకు॥భక్తిని॥౩॥

గీ॥ యిట్లుబలుకుచున్నయిల్లాలిరాకకు। రాముడనుమతించెత్రే

మధనర। నంతలోనతమ్ముడన్న పాదంబుల। కెరగి యిట్టులనిరా కో
కేఁ దెలియ॥

శంకరాభరణము- అటతాళము.

అతిభక్తిని పాదద్వితయదాస్యము సేయనడవికేవచ్చెదరాఘవా।
హితమతితల్లుల బ్రోచుచునిచటసమ్మతినుండగదవోయిలక్ష్మణా ॥
౧॥ ఘనతరబాణబాణాసనములుదాల్చి వెనువెంటవచ్చెదరాఘవా॥
వనమునవసియించువలపేలయాభరతునిగూడి భువినేలులక్ష్మణా ॥
వలనొప్పనన్నురావలదనినిలిపిన నిలువదీ దేహముగాఘవా ॥ జలజ
నాథుడరంగనిలయుడనాబుద్ధిపలుకులువినవోయిలక్ష్మణా। ౩॥

సీ॥ అన్ననీ వెనువెంటనరుదెంతునినుబాసినిముష మోర్వనటుంచు నె
మ్మిబలుక। వినిరాముడంతతమ్మునిరాకకనుకూలచిత్తుడై చెచ్చెరసీ
తగూడి। ధనభూషణాదులుతగసుయజ్ఞాదులకనుర క్తితోనిచ్చివిను
తివడసి। జానకిలక్ష్మణసహితుడై వేంచెసియా కైకమందిరంబవ్వుడు
జొచ్చి। తానువచ్చినవార్తఁయాదశరధునకు। చెప్పి పంపంగ వినిరా
జుచింతతోడ। సూతునవ్వేళడగన్గొనిచోద్యమలర। పల్కెనిట్లనియత
నితోపార్థిఁ వుంచూ॥

ద్వి॥ సలలితంబగురామచంద్రుని మోము। వెలయనేనొక్కండపీ
క్షింపజాల। నా వెలంకులనెల్ల నయమూరనిటకు। వెవేగబిలుచుకవెలు
వడిరమ్ము। పొమ్మనిబలుకంగపోయిదో స్త్రైర। కొమ్మలందరువచ్చిగూ
డిరంతటను। జనకజాలక్ష్మణసహితుడైనట్టి। తనతనూజశ్రేష్ఠధర్మజ్ఞు
ననఘు। శ్రీరాఘవేంద్రునిసీతాహృదీశు । కూరిమి బిలుపించిగొన
కొనిరాము। మోముగన్గొనిచాలమూర్ఛఁముణెంగి। హా మోహనా
కారహాదయాసాంద్ర। హారామహారామహారామయనుచు। నీరిమి
దుఃఖించెనెలమియానృపతి॥

శోకవిరాళిరాగము-అటతాళము.

నారీజనులుదుఃఖమొందిరి। సారెసారెమూర్ఛలనెందిరి॥ వా
రకతమకుహృద్వల్లభుడగురణధీరుడౌదశరధభూరమణునిగూడి॥
నా॥ శ్రీరామచంద్రునిచేరికౌగిలించి। హారామహారామహారామ
యనుచును॥౧॥ కరమొప్పకన్నుదామరలకాటుకనీరు గురుతుగతము

కుచకుంభములటునిండ॥౨॥విరివిగయారాఘవేంద్రునిచెక్కిళ్లకరమొప్పదువ్వుచుకానకేగకుమని॥౩॥ వరరంగధామనీవారముమేమెల్లనిరతమునినుబాయనేరలేమనుచును॥౪॥నారీమణులు॥

వ॥ ఆసమయంబున॥

క॥తనపుత్త్రుజూచిదశరథు।డనియెఁ వనగమనమేలనాత్మజనీకుం। ఘనమతిరాజ్యముసేయుము। మునిగణములుబంధుజనులుమోదంబందఁ॥

శుద్ధకాంబోధిరాగము-ఆటతాళము.

నీమోముజూడకనిమిషమోర్వలేనురామచంద్రా॥నిండుప్రేమతోనిలిచినీమోముజూపుచునుండురామచంద్రా॥కనికరమిసుమంతకలుగదాయనీకురామచంద్రా॥ నీవువనమూలనుండయీ ఘనభోగమెవరికి।రామచంద్రా॥౧॥ననుగన్నచక్కనినాముద్దుతండ్రివి। రామచంద్రా॥ నిన్నుగనినకౌసల్యకేమనిదుఃఖముడీపెదో। రామచంద్రా॥౨॥ హారామహారామహాగుణస్తోమ శ్రీరామచంద్రా॥ రంగధామునిశాటవిరామనన్నేలుమురామచంద్రా॥౩॥నీమో॥

వ॥ అనియివ్విధంబున దుఃఖించుతండ్రినూరార్చి కైకేయి దెప్పించిన నారచీరలు సీతాలక్ష్మణ సమేతుండై ధరియించె నాసమయంబున శోకవిహ్వలుఁడగు దశరథుండు తనకోడలికికనకరత్నభూషణ దివ్యాంబరంబులు దెప్పించి యొసంగెనంత శ్రీరామచంద్రుండు సీతాలక్ష్మణ సమేతుండై దశరథకౌసల్యా సుమిత్రా కైకేయి ప్రముఖులకునువసిష్ఠునకుం ప్రదక్షిణ నమస్కారంబు లొనర్చి వెడలు సమయంబున లక్ష్మణుండు తనతల్లి యగు సుమిత్రం గనుంగొనిపోయివచ్చెదననివిన్నవించినకుమారుంగౌగలించుకొని శిరంబాఘ్రాణంబుగావించియిట్లనియె॥

యదుకులకాంబోధిరాగము.

పోయిరావోయితండ్రిపోయిరా॥భక్తిబాయక నేవేళ రామభద్రుసేవసేయుచు।పోయిరా॥తనుసుఖములకిచ్ఛయుంచకుమీ। ఘోరవనమూలధనువునెక్కిడించకు।చాలమనసూ శ్రీరామపాదవనజములందయుంచి॥పో॥రామూనిదశరథుగానెంచుమీ।సీతాభా

మునునన్నుగాదలంచుమీ।నీవుకామించివనమయోధ్యాక్కడవిచేట్ల। లక్ష్మణ ॥౨॥ పోయి॥ఫలమూలములుదెచ్చిపెట్టుమీ।రాత్రికానాడైనోన నట్టశాలలుగట్టుమీ॥యిరువురలసినిద్రించువేళనెలమికాపాడుచుమెలఁగుచు॥పోయి॥౩॥ నాయన్ననీకుబుద్ధిజెప్పితి।కోరి।నీయన్నవెంటబొమ్మనాప్పితి। రంగనాయకుఁడైనసీతానాయకు ననుసరించి॥ పోయిరా॥౪॥

వ॥ ఇవ్విధంబునం సుమిత్రాదేవి తనకొడుకునకుం బుద్ధివాక్యంబులు జెప్పిపంపిన యనంతరంబున శ్రీరఘువరుండు సీతాలక్ష్మణసమేతుండై సుమంతుండు దెచ్చినరథంబునం గూర్చుండి వనవాసగమనోన్ముఖుండై వెడలి రాజమార్గంబునంజనుచెంచు సమయంబునా॥

యదుకులకాంభోధిరాగము శేఖస్తి- ఆదితాళము.

యెంతాదిక్కులేదాయనెయీపట్టణమునా।యింతిరోయేమమ్మకైకయంతదలచితేనంతాయ॥యెం।పట్టాభిషేకమటంచుపట్టియాశాబెట్టిరాజు।పట్టిసిపిల్పించిపురమట్టిపెళ్లగొట్టినాడు॥యెం॥౧॥రామునికళ్యాణగుణస్తోమునిసుందరమేఘ।శ్యామునియడవికంపిరేమమ్మయీద్రోహబుద్ధి॥యెం॥౨॥ మందయానసరోమందరయందుండివచ్చునో।దీనిక్రిందద్రోచిచంపిసగానిందీరదోయమ్మదోస ॥ యెంతదిక్కు॥౩॥ శ్రీకరరంగేశుడైనశ్రీరామచంద్రునకిట్లు।ఆకైకకీడుగావించితాకడకేమెత్తుకపోనో॥౪॥యెంతదిక్కులెదాయనో॥

తోడిరాగము- ఆదితాళము.

రారెపోదాము ప్రేమమీరనూ।మనరామభూపుత్రికలతోడనూవోరామలారమనశ్రీరాముడడవికేగ। నేరీతితాళగలమీరాఘవేంద్రునిబాసి॥రారె॥సౌమ్యులింకేలధరియించనూ। సౌఖ్యమ్ములింకేలననుభవించను।అమ్మచల్లశ్రీ రాముడడవికెపోనాయగ।దమ్మమెత్తనిచరణమ్ములసీతతోడ॥౧॥అదుగోచూడారెరామచంద్రుడు।తమ్ముడుసీతగొల్వగుణసాంద్రుడు।యడవికేగుచున్నాడు।పడతుకలారయింక।తడవేలనమ్మరంగధాముసికిమ్రొక్కుచు॥౨॥

శా॥ఈరీతింపురకామినీమణులునన్యేందీవరశ్యాముశ్రీం। గారా

కుచకుంభములకుఁజనేత్రు విలసత్కల్యాణచారిత్రు। సీతా రమ్యానన పద్మ
రమొప్పదుప్పఁశాంతారణ్యయాత్రోన్ముఖుం। శ్రీ రాముంభవదూరునిం
మెల్లనిశమహాచింతం బ్రలాపింపగనూ॥

వ॥ఆసమయంబునా॥

సీ॥ దశరథేంద్రుండునుతల్లులుతనవెంటననతిదూరంబుతారరు
గుదేర। పురజనావళులెల్ల కరమొప్పగుమిగూడి హారామహారామ
యనుచుగదియ। జనకజాలక్ష్మణసహితంబుగాసూర్యసన్నిభంబ
గురథస్థలినివెలసి। దీనజనంబులదెసజూచినిలునిలుండికపోయివచ్చె
దనింపుతోడ।ననివచించుచుయాసుమంతునిరథంబు।శీఘ్రముగ బో
వనిమ్మనిశివవిరించి। సన్నుతుండగుశ్రీరామచంద్రుడపుడు। వనని
వాసంబునకునేగెననఘచరితా॥

వ॥ అంతదశరథుండుకౌసల్యాకులంగూడిచనుదెంచుచురాము
నింగదియడగ్గరనేరకకన్నీరునించుచుహస్తంబెత్తియిట్లనియె॥

నాదనామక్రియరాగము-ఆదితాళము.

నిలువవోయి।బంగారుతండ్రి॥శ్రీరామరామా నిలువవోయి॥
చెలువమమరునీనగుమొగమునుగనవలపగుచున్నదిజలదశ్యామ॥ ని
లు॥పలుకవేలా।శ్రీరామనాతోనలుకలేలా।నిలువకనీవిటువనమున
కరిగిన।నిలుచునెనాతనువిలపైపుత్రా॥అ॥చింతబాపు।నీముఖమికర
ధ్వాంతజూపు।సంతతమునురంగస్థలివెలసినచింతితకల్పకశ్రీరఘురా
మా॥నిలువవోయి॥3॥

వ॥యివ్విధంబునంబలుకుచునధికదుఃఖావేశంబున ధరణిపైబడి
మూర్ఛిల్లి లేచి శ్రీరామచంద్రుండు జనినమార్గంబునం దృష్టి
నిలిపి రథపరాగంబు గాంచుచు కైకేయిని నిందింపుచు మరలంజ
ని కౌసల్యా గృహంబునంజేరి శయ్యపైశరీరంబువైచికౌసల్యంగ
నుంగొనియిట్లనియె॥

పున్నాగరాగము-అటతాళము.

యేమిదోచదేమిసేతునె।వినవెకౌసల్యా। యేమిదోచదేమిసేతు
నే।యేమిదోచదేమిసేతుకోమలసుందరమేఘ।శ్యాముడైవెలుగొం
దు శ్రీరఘురాముడిపుడెందున్నవాడో।యే॥ యింతకెంతదూరమో

గునో। శ్రీరామరత్నమింత కెంతదూరమేగునో॥ యేయడవిచెట్ల।
చెంతలవతిఁ జూచునో॥ యింతిరో జానకిముఖమెంతవాడెనో న
దిఁజూచి కాంతుఁడౌ శ్రీరామచంద్రుఁ డెంతచింత జెందెనో॥ నాకేమి
దోఁచదేమిసే॥౧॥ కైకవరమెంత జేసెనే। నాపట్టికరుణలేక నన్నువీ
కఁబాసెనే। ఆకలిదప్పులకెంత వ్యాకులమొందుదురో నాయవివేకమె
ల్ల దలంచి లక్ష్మణుఁడేకరణి దూరుచునుండునో॥ యే॥౨॥ కన్నులనేరీ
తిఁగాంతుము। రాముని జేరి। యన్నటికి కౌఁగలింతునే। సన్నుతాంగి రం
గపురస్వామియై వెలసిన సన్నుగన్న పెన్నిధానమైన చిన్ని రఘువరే
ణ్యుఁబాసి॥ యేమిదోఁచదేమిసేతునే॥

వ॥ యిత్తెఱంగున దశరథుండధిక శోకాయత్తచిత్తుండై యుండె పురజనంబులు రఘువరుతోడం జని తమసాతీరంబున వంచితులై మరలి పురంబు ప్రవేశించి రంత రాఘవేంద్రుండు గంగాతీరంబున శృంగిబేరి పురసమీపంబున నున్న యొక్క హింగుదివృక్షంబు చెంత జేరి వసియించి యున్న సమయంబున నిషాధాధిపతియగు గుహుండు శృంగిబేరి పురంబు వెడలివచ్చి సీతాలక్ష్మణసమేతుండగు శ్రీరఘువరేణ్యుని చరణకమలంబులకు మ్రొక్కి యిట్లనియె॥

సౌరాష్ట్ర రాగము - ఆదితాళము.

మునివేషములు బూననేల। ఘోరవనమార్గములను రానేల। జన
కనందనతోడ ననుజుని గూడుక। జనుదెంచుట దియేమి జనవర్య తెలు
పుమా॥౧॥ నారచీరలు గట్టనేలా। భూనాయకత్వము మాననేల। కో
రి మీకెవ్వరీకుత్సిత మొనరించినారు తెల్పుము। రఘువీర ద్రుంచెదవా
రి॥ము॥౨॥ దాసుఁడనైతి నీకు। రంగధామ యభయమిమ్ము నాకు। భూ
సురసముదయపోషణ పట్టణవాససౌఖ్యంబులు వర్జించితయ్యన॥
౩॥ మునివేషములు బూననేల॥

గీ॥ ఇట్లు గుహుఁడు బల్కనినకులోత్తముండైన। రాముఁడతనిఁజూచి
ప్రేమదనర। కైకవరమువలన కానకువిచ్చేయు। కథనెఱుంగఁ దెలిపె
కరుణతోడ॥

వ॥ అంతట గంగాతీరంబున రఘునందనప్రముఖులారాత్రి వసియిం
చిరి మరునాఁడు రామచంద్రుండు సుమంతుంగని నీవయోధ్యకుర

థంబుగొనిపొమ్మనిననతండుబాష్పపూరితనేత్రుఁడై యిట్లనియె॥

యదుకులకాంభోధిరాగము - జంపెతాళము.

రామ నేనీశూన్యరథముతోఁ దనయోధ్య। కేమనుచుబోదుసీతామ
నోనాథా ॥౧॥ యీమహారథముసందీవు లేమికిజన। స్తోమములునను
స్త్రేమమానితిట్టుదురు॥౨॥ చరణసేవకుఁడనై వెనువెంటనరుదెంతు।
కరుణఁబ్రోవుమనఘసనసత్యభాషా॥౩॥ గరిమతోఁదుతరంగపురని
వాసుఁడవైన। వరరాఘవేంద్రసుందరదివ్యవేషా॥౪॥ రామనేనీశూ
న్యరథముతోఁ దనయోధ్య కేమనుచ ॥

ద్వి॥ అనియిట్లుబలుకంగనదివినిరాముఁ। డనుసయువాక్యంబులతనికి
జెప్పి। బనుపంగనతఁడేగెబహుదీనుఁడగుచు। నినకులోత్తముఁడంతనిం
తుతోఁదుతను। తనసహోదరుతోడ తెగజడల్బూని। ఘనమతిగుహు
చుచక్కఁగనాడఁగఁబంప। తానుసుతమ్ముండునుసిరుగాసీతయును। పూని
భాగీరథిపొలుపొందఁగాటి। గఁహానౌకనెలవిచ్చికొనుచుకొన్పసంత।
సహజుండుతానునుసోయనునసఁటి। ఘనభరద్వాజుని గాంచి సేవిం
చి। వినయంబుగాఁబుమునినీట్కొనితన్న। శ్రీకరంబగునట్టిచిత్రకూటం
బు చేరికగనతియొప్పచేరెసంతటను॥

సీ॥ కదళికాఖర్జూరఘనగసాలలవంగసరళాదిబహువృక్షచ
యముగల్గి। సనందకోకిలకీరషట్పదశారికానికరస్వనంబులనవ్వారిల్లి।
మందాకినీపద్మబృందగంధిళచారుసంగముతోఁ బొందుదన
రి। ఘనహోమధూమసంకలితమైనవతలాగిసదప్రపూర్ణమై మొన
సియున్న। చిత్రకూటమహారమ్యసీమవిధము। సీతకేవడఁజెప్పుచు
చింతలేక। చారుతరమగుయొకపర్ణశాలలోన। మునులమైత్రినివ
లసిరిముదముతోఁడ॥

వ॥ అంతసుమంతుండు రథంబుతోడ నయోధ్యపురంబునకేగి కౌ
సల్యాగృహంబుననున్న దశరథునిం దర్శించి రామవృత్తాంతంబు
చెప్పి యూరడించిన యానరేంద్రుఁ డధిక దుఃఖావేశంబున కౌస
ల్యాదులంజూచి పూర్వంబునతనకుసంప్రాప్తంబైనశాపవృత్తాం
తంబుచెప్పి రామలక్ష్మణసీతరాములందలంచి హారామహారామే
వాక్యంబులుబలుకుచు దివంబునకుం జనియె నంత కౌసల్యాదుల

ధిక దుఃఖంబున విలపించిరా సమయంబున వసిష్ఠుండు దశరథన్ప
తిదేహంబు తైలక్షిప్తంబు చేయించి సింహాసనంబునం గూర్చుండం
డబెట్టి యనంతరంబున భరతశత్రుఘ్నులం దోడ్కొనిరమ్మని నలు
వురమంత్రులం బనిచిన వారలతిత్వరితగతి కేకయ రాజు పురంబున
కుంజని యంతకుమున్నుఁ దుస్స్వప్న వృత్తాంతంబు తగిన జనులకు చె
ప్పుచున్న భరతుం గాంచి మిమ్ముల వసిష్ఠుండు దోడ్కొనిరమ్మని బం
చినం జనుదెంచితిమని పల్కిన తత్క్షణంబు కేకయ రాజు చేత ననుజ్ఞ
గొని శత్రుఘ్నసమేతుండై రథంబెక్కి వెడలి చనుదెంచుచు ॥

క॥ గిరులు వనంబులు నదులును। పురములు పల్లెలును చాలఁ బోవఁగ గ
డచి శ్రీ। కరుఁడగు భరతుఁడు గనుఁగొనె। సరుదారఁ గాంతిహీనమయిన
యయోధ్యన్॥

వ॥ ఇట్లు రామవియోగాదికారణంబు సంజేసి దుర్దశంబొంది
కాంతిహీనంబైన పురంబు గనుంగొని కంపమానగాత్రుండై సా
రథిం జూచి యిట్లనె॥

శోకవిరాళిరాగము-అటతాళము.

ఏమిదోచదాయెను। శ్రీమదయోధ్య। నిట్టుల జూచినను। యే
మి పోచకయున్న దేమని వివరింతు। నీమహాపురలక్ష్మి కేమె దుర్దశ
గల్గె॥ శ్రీనుంచు వాద్యము లేమియు వినరావు। నానావిధ పురుషులొక్క
రుగానబడరెందు। సామజరథహయసమూహములింపవు। ఏమి సే
యుదునింక నేమి వాటిల్లెనో॥౧॥ పరిపరివిధములను। పుష్పకుసుమ।
లరుమగగనుపడెనూ। తరుచుగ తనువెల్లతాపమాచున్నది। బరువడి
భయము సంభవమగుచున్నది। వరబుద్ధి మెన్నెన్నో వంకలబోవుచున్న
దరలేక నెడమకన్నదరసాగుచున్న। పరువంపు రంగేశు కరుణ య
ట్లోకద। సరగున నాగుండె ఝుల్ ఝుల్లుమనుచున్న॥ ఏమిదోచదా
యెనూ॥౨॥

ద్వి॥ అని యిట్లు బలుకుచు నతిదీనుఁడగుచు। చని చని పురిఁ జేరి జనశూ
న్యమైన। ఘనరాజమార్గంబు కలయఁ జూచుచును। కనకరత్నవితా
నకమనియ్యమైన। తనతండ్రి నగరు చెంతను తేరుడిగ్గి। పనిబడి వేగ లో
పలికేగి జనకు। గానక నంతట కైకమందిరము। మానక వడిజొచ్చి మా

తనుగాంచి। మ్రొక్కినయాకైకమోదంబుతోడ। నక్కున జేచి
తానతులితకరుణ।శిరముమూర్కొని కేలచెక్కిలిదువ్వి। వరపుత్త్ర
తోడ।నవ్వనితయిట్లనియె॥

రేగుప్తిరాగము-ఆదితాళము.

క్షేమమమనవారికెల్ల। క్షేమమాపుత్త్ర।నిండుప్రేమతో నీమామ
యత్తలేమైన।నన్నడిగినారా॥ ఖ్యాతిగలుగు కేకయభూకాంతుడుక
ళ్యాణమొప్ప।వీతకంటకము గతనభూతలమేలుచున్నాడే॥ క్షే॥౧॥
సామజఘోటకరథస్తోమములు బంధుజన। స్తోమము పౌరులు రంగ
ధామకరుణచే భద్రమె॥ క్షేమమా॥౨॥

క॥ తనతల్లి కరుణతో డుత। తనవారలకుశీలమడుగ తడయక కుశ
లంబని చెప్పి భరతుడంతట। జననింగనిమరల బలికె సంతప్తుండై॥

శోకవిరాళిరాగము-అటతాళము.

యేమిదోచదు చెప్పవె। అమ్మయ్య। నాకేమిదోచదు చెప్పవె।రా
మరో దశరథభూమీశుడే డమ్మ।స్వామి శ్రీకోదండ రాము డెంకు
న్నాడో॥యే॥ వినుతసద్గుణుడగుచు। లోకములందువిఖ్యాతివహి
యించుచు।నను ప్రేమజూచు వజ్జనకుడౌ దశరథ।జనపాలుడియ్యెడ
గనుపడకున్నాడు॥యే॥౧॥ పదములుతడబడెనే।నామదికే మోపటు
భయమొనగూడెనే। పదపడి శ్రీరంగపతిదయయికనెట్లో కడమున్న
కుసములువదలకదోచెను॥యేమిదోచదు॥౨॥

వ॥ అని యిష్వేనంబుసం బలికిన భరతుం గనుంగొని తల్లి యిట్ల
నియె॥

సీ॥ భరతనీజనకుండు పదపడిమును రెండువరములిచ్చెను నాకువళ్ల
ఫుత్తోడ।ఆరెండువరములుచారుశీలుండైన శ్రీరాముపట్టాభిషేకవే
ళ।యిమ్మని నేవేడనిచ్చితిసనియన్న నీకుపట్నముగట్టి నెమ్మినొకటి।
మునివేషమున రాముడనురక్తి వనముల పదునాలుగేండ్లుండ పరగ
నొకటి।యిట్లుగోరితినంతట నెలమిరాముఁడనుజుసీతాన్వితంబుగా
నడవికేగ।పుత్త్రశోకాగ్నినలమటబొందిపొంది। జనియెనీతండ్రి సు
రరాజసదనముసకు॥

వ॥ పుత్త్రా నీనిమిత్తంబున నింతనిష్ఠురకార్యం బాచరించితింగా
వున నీవింక నిష్కంటకంబైన రాజ్యంబేలు మని పలికిన యుల్లం

బుద్ధుల్లన హస్తతలంబులం గర్ణరంధ్రంబులు మూసుకొని మొదలునరికినం దెగిపడుకదళీవృక్షంబునుంబోలె శోకావేశంబున ధరణిం బడి మూర్ఛిల్లి కొంత సేపటికిం దెలిసి నిట్టూర్పు నించుచు తల్లి కిట్లనియె॥

శంకరాభరణము-అటతాళము.

యెంతఘాతకివె నీవెంత పాతకురాల వెంత దుశ్చారిణివె।యింత దుష్టాత్మకవనికలనైన నని స్నేరుగనైతిగదవె॥నను ప్రేమ బెంచుమజ్జనకునిపరలోకమున కేగ జేసితివి। జనయిత్రి నిన్ను జంపననించుకంత యుజనియింపదికదోసము॥౧॥శ్రీగుణస్తోముడైన రాముడేమితప్పొనరించెనె।ఆమోహనాంగుశుభాకరుసడవికి నేమిటికనిపితివె॥౨॥చెనటిరక్కసురాలవీకార్యము నేనునిను సేయమన్నానటె। మునివరదుండధరంగధాముడు నామనసు దెలియలేడటె॥౩॥యంత ఘాతికివె॥నీవెంత పాతకురాల వెంత దుశ్చారిణివె॥

అసావేరిరాగము-అటతాళము.

యింత క్రూరకర్మమేరీతి జేసితివేమెవోకులపాంసిని।కాంతరో నీవశ్యపతికన్యకవుగావు।వింతరక్కసురాలవిదితథ్యమనకున్న॥యింత॥శ్రీకరవిమలకృపాకరురఘువర్యు। లోకమోహనమూర్తిని।నీకట్లనోరాడెనడవికిబొమ్మనసీకోరికెలెల్ల నిర్మూలమైపోను॥౧॥ రాముడుజగదభిరాముడగ్రజుడుండ రాజ్యమేలుదునటవె।రామభక్తిధ్యానరంజితమగుచున్న నామానసవృత్తి నేమి దెలియలేక॥యింత॥౨॥ధరణి నేజచ్చితినని దుఃఖమొందుమతడయ నేలనింకనూ। ధరణి రాముకిచ్చి యడవినిల్చె దనింకమరుదుగ నామాట గురుతుగ మదినమ్ము॥యింత॥౩॥కటకటనీగర్భమున నేనుగలిగితి పట్టుపాపవశమున నూ। చటులదుఃఖమునకౌసల్యవివత్సయైనటియించు ధేనువ నాగయుందునుగదె॥౪॥ననలబోలినజానకిచరణములు కాననములదిరిగ గద। ఘనరంగధాముడై వెలయురాముడుకష్టమనుభవించగలడట వెదువ్రతశీల॥౫॥యింత॥

ద్వి॥భరతుడివ్విధమునపదపడి బలికి।కరముదుఃఖింపంగ నిత్తమ్ముడుంతె। కసలిమంథర్ర ద్రుంచ్చికె కనుగూర్లు। ననిఖడ్గ మంకించి యా

గ్రహంబునను । కైకదాసినిక్రిందకడువడిద్రోచి । భీకరంబునదా నిషేంచమణంప। నతియత్నమొనర్చుచుటది గాంచిభరతు । డతనికిహ్రీ తవాక్యమనురక్తిజెప్పి। వారించెనంతటవరసహోదరుని।భూరిశోకవిముక్తపాపూర్ణచిత్తమున।భరతుడేతెంచుటపరగకౌసల్య। వరమతిదెలసియువనితసుమిత్ర।నయ్యెడగాంచియోయమ్మయీపురికి।చయ్యనభరతుండుచనుదెంచినాడు।కనుగొనివత్తమీఘనదీర్ఘదశికి నగిపోవు వేళనయ్యెడకు శత్రుఘ్న। సహితుడైతల్లుల చక్కగా జూచె॥

వ॥ఆసమయంబున॥

ఉ॥ పారములేనిదుఃఖమున।పార్థివసంధనులిద్దరయ్యెడం।ధారుణిమూర్ఛబొంది। మరితామెయొకింతకులేచిదీనతం।శ్రీరఘువర్యమాతనటచెచ్చెరకౌగిట గ్రుచ్చితల్లి రో। తీరనిశోకతాపమెటుదీరిన టించెదవమ్మనీవికనూ॥

వ॥అనియిట్లుదుఃఖించుచున్నసమయంబున॥

గీ॥భరతుజూచిపెక్కపదపడికౌసల్య।వత్సనీకుకూర్మి వలనతల్లి।అఖిలరాజ్యపదవియార్జించెగావున।నిచ్ఛదనరనేలుమింకజగతి॥

వ॥ మదియ్యనత్రుండు మునివేషంబుదాల్చి ఫలమూలంబులు దినుచు యరణ్యంబున యున్నవాడు యేనుప్రాణంబులునిలుపంజాలశ్రీరామచంద్రుండున్న యెడకుబంపుమని విలపించుచున్నంజూచి భరతుండుశోక విహ్వలుండై తల్లి కన్నీరుతుడచిపదంబులుబట్టుకొనియిట్లనియె॥

రేగుప్తిరాగము-ఆదితాళము.

అమ్మనే ద్రోహిగానమ్మ। ననుకరుణజూడవమ్మ నేద్రోహిగానమ్మ॥శ్రీరామునిగన్నమ్మ।నేద్రోహిగానమ్మ॥అమ్మపాపుయీకైకమ్మసుతుడనౌటచే।నిమ్మాటలనుటకునిమ్మైయున్నదిగాక॥అమ్మ॥ జననిరో నేనీదుంతమమదినెరిగియున్నవినవమ్మ।సేయుశపథము।లనఘుడైనట్టిబ్రాహ్మణునిజంపినట్లు।మద్యమనురక్తిద్రాగినట్లుమొననినాకేసిద్ధించునమ్మ॥౧॥ గురుభామనంటికూడిన।వానిగతికిపురముపోవజేసిన।నరునిగతికిపోదునమ్మరామునికికీడు। నెరిదలంచితినే

నిక్క-మీపట్లు॥నమ్మవమ్మనే ద్రోహిగానమ్మ॥౨॥ నేసరునామీదనిలు
పకుమా।దోషములెరుగ।ననునీపుత్రునిగాదలపవుమా। ఘనరంగధా
మునౌపావనరామచంద్రచరణ। వనజసేవకుడుమఃఖవనధిముణె
గినవాడ॥నమ్మనే ద్రోహిగానమ్మ॥౩॥

పున్నాగరాగము-అటతాళము.

అమ్మనమ్మవమ్మ।రాములనుగన్నమ్మ।నమ్మవమ్మ॥ అమ్మ రాముని
పాదమ్ములుహృదయాబ్జమ్మునసేవేళనమ్మిగొలిచెటివాడనమ్మ॥ అ
లరాముని కికీడుదలచిచేసితినేనియిలగలబహుదోషములునే జేసిన
వాడ॥నమ్మ॥౧॥ వనమునరాముడువసియింపపట్టణంముననుండిసౌ
ఖ్యములనుభవించనేర॥నమ్మ॥౨॥ రామునిజగదభిరాముని పట్టాభిరా
ము జేసివనసీమనిలచెరచూడవమ్మ॥నమ్మ॥౩॥ స్వామిని శ్రీరంగధా
మునికోదండరామునిజూడకనామానసమునిల్వదమ్మ॥ అమ్మనమ్మ
వమ్మ॥౪॥

గీ॥ కపటమింతలేకకడుదుఃఖమొందెడి।భరతుకౌగిలించివరగనం
క। తలముజేచిశిరముతగమూకొనియును।శ్రీరాముతల్లి బలికె
ప్రేమవెలయ॥

శోకవిరాళిరాగము-అటతాళము.

సాటిలేనితండ్రిబుద్ధిదెలియకమాటలంటి। నామాటలుమదిలో
ననాటింపవలదునీమమతగంటి।నినుజూడగనుదుఃఖమినుమడించె
నాకునెమ్మితోను।శోకవననిధిసీదనావశముగాకున్నదినైపుతోను॥
౧॥ ఘనరంగధాముని వలచితండ్రికిసంస్కారమింక।నీవువనిబూని
సేయుముదుఃఖమొందకసద్భక్తినింకా॥౨॥

వ॥ యివ్విధంబున కౌసల్య భరతునూరార్చు సమయంబున వసి
ష్ఠుండు చనుదెంచి భరతుంగాంచి దశరథున కగ్నిసంస్కారాదు
లొనరింప విచ్ఛేయుమనిపల్కిన భరతుండు శత్రుఘ్న సమేతుండై
యంతఃపురంబునకుం జని తండ్రి కళేబరంబు గాంచి వసుంధరం
బడి మూర్ఛిల్లి కొంతసేపటికిం దెలసి యోరాజకంఠీరవ యోర
ఘువంశ జలధిసుధాకర నాతోయాలభాషింపవు కేకయ భూపా
లుండు నీనిమిత్తంబునంబంపిన భూషణంబులేల గైకొనవు కైకకొ

డుకుంగావున నాతోసంభాషింపనొల్లక నలిగి నట్లున్నయది శత్రుఘ్నుండు దుఃఖించుచు నేలంబడి యుండవాడతని యారాప్రణము ని యివ్విధంబున విలపించుసమయంబునవసిష్ఠాదులుబోధించియూ రడించిరంత భరతుండు వసిష్ఠాను మతంబున విధ్యుక్తప్రకారం బులంతంత్రికినగ్ని సంస్కారాదులొనర్చి విహిత ద్వాదశాహ కృత్యంబులు నిర్వర్తించి కృతకృత్యుండై నయనంతరంబునం వసిష్ఠుండు పట్టంబు గట్టుకొమ్మనిన నమ్మాటగై కొనక రాఘవేంద్రు నిందోడితెచ్చి పట్టాభిషేకంబుగావించెద నమ్మహాత్ముండురాకుంన తదియ్యచరణారవింద సాన్నిధ్యంబున వర్తించెదనని పల్కియనం తరంబాసుమంత్రాదులంజూచి శ్రీరామచరణారవింద సాన్నిధ్యం బునకుంజని సీతాలక్ష్మణసమన్వితుండగు యమ్మహాత్ముని దోడితే వలయుగావున సమస్తజనంబులకు ఘంటంబునం పయనంబుచెప్పి సైన్యంబులంగూర్చి ప్రయాణభేరీప్రముఖ వాద్యంబులు చెలంగం జేయుమని యాజ్ఞయొసంగిన వారట్లుచేసిన సమస్తజనంబులు శ్రీరామచంద్రముఖసందర్శనకుతూహలకందళిత హృదయారవిందులై యనేక విధంబులం భరతునికళ్యాణగుణంబులు కొనియాడుచు తమతమగృహంబుల మంగళాలంకారంబులు గావించి మిక్కిలే నిభాగ్యంబు చేకూరిన చందంబున రథగజాశ్వ శకటాందోళికాద్యారోహణంబులుగావించిగమనోన్ముఖులై రట్టియెడ॥

యరుకలకాంభోధిరాగము-ఆదితాళము.

రారంమ పోదాముసీతారాములజూడసూ। రారంమ భరతుని
వంటికారుణికోత్తములుజగతి। లేరంటు మనకెల్లరఘు వీరునిజూ
పింపగారే॥రా॥పనులుదోచకుంనవంమ।మనసుచక్కనిరామునిగ
నుగొనగోరుచుంనది।కనకరత్నభూషణములుమెరయగా॥రా॥౧॥
జనకజావల్లభుడైన।స్వామిశ్రీముఖాబ్జమెపో।వనజగంధిరొనాక
లను।దినదినమునుగనుగొననౌచున్నది॥రారంమ॥౨॥భరతుడుశ్రీకర
రంగపురవాసుడై వెలయురఘు।వరునితెచ్చిపురముగట్టి। బిరబిరబో
వగనేరిసిద్ధంచెను॥రారంమ పోదాము॥౩॥

క॥అనియిట్లుపురజనంములు। ఘనమతినాకరొకరిని కదుకనిబిల్లి

చుచుచయ్యున భరతుననుసరించిరి। మనమున శ్రీరాముగాంచుమను
తదలిప్పుడును॥

వ॥ ఆసమయంబున॥

సీ॥ కరిబృంహితంబులుతురగ హేషానాద మరుదుగారథఘట్ట
నాదిరవము।లిరువొందవాద్యాదివరనిస్వనంబులుభూనభంబుల నె
ల్ల ఘోసగనిండ। హితబంధుజనపురోహితవసిష్ఠాదులుతగుయాన
ములనెక్కితలిరాగ। తల్లులాందోళికా తలముల నొప్పార వెను
వెంటతమ్ముండువెలయుచుండ। ఘనగజంబెక్కితనమనసికంజుసీమ।
రామచంద్ర పదధ్యానమేమరకను।భరతుడంతటవెడలెనప్పట్టణం
బు।రాఘవేంద్రునిపట్టాభిరాముకొరకు॥

క॥ చనిచనిగంగాతీరంమున భరతుడునిలిచియుండ। మొనసీయచ
టికిం బనిబడిగుహుడేతెంచియు।కనిలసదాయిలను జూచికడుపడిబ
లికెను॥

క॥ మునివేషమమర జేసియు।ఘనుడగుశ్రీరామచంద్రు కాననము
నకుం।బనిపివెనువెంటసైన్యము। గొనిమరిపోవుచున్నవాడు। కుత్సిత
మతియై॥ చ॥ అనవినిశోకపూర్ణహృదయాన్వితుడై।భరతుం
డుపల్కెపావనుడగు రామచంద్రు। నవ వారిజ నేత్రు మహాత్మున
గ్రజుం।పనిబడిపోయితెచ్చి తగపట్టముగట్టదలంచినాడ। నెమ్మన
మునదింతెగాని।యొకమహనను మోసము లేదుధీమతీ॥ ద్వి॥ అని
యిట్లు బలుకంగనప్పుడాగుహుడు।వినిపరమానందవివశుడై భరతు।
గనిపల్కెనీవంటిఘనునెందుగాన।వనజాప్తకులసోము వరరఘురా
ము।వలనొప్ప గొనివచ్చి వచ్చినరాజ్య। మెలమినీగోరితివినకులతిలక।
నీమహిమంబెన్న నేనేరనింక। రామభక్తుడవీవు। రాజకుమార। రా
ముండుసీతయురామానుజుండు। క్షేమంబుగావచ్చి కొచ్చరనిచట। ని
లిచినారొకరాత్రి నిక్కంబుగాను।తలకకసన్నయుతమ్ముడిద్దరును।
జడలుధరించిముచ్చటలాడుకొనుచు।కడుపడినావచేగంగనుదాటి।
జనిరన్నవినిధరాస్థలిమూర్ఛబొంది। గొనకొనిలేచియాగుహునుద
కిట్లనియె॥ శోకవిరాళిరాగము-అటతాళము.

స్వామియచ్చటపవ్వళించెనూ। సీతా। భామయచ్చటశయనిం

చెనూ॥ రాముఁడిచ్చట రాఁ డేమి భుజించెనూ। సౌమిత్రి శుశ్రూషఁ జేసె
మిగానూ॥ స్వా॥ నా తండ్రి యిచటఁ గూర్చుండెను। యా సీతాతో
నేమి భాషించెనూ। ఖ్యాతిగా శ్రీరంగనేతయై వెలుఁగొందు। సీతేశ్వ
రుని పాదసేవకుండవు నీవు॥ స్వామి యిచ్చట॥ వ॥ యిట్లు బలుకు
చున్న భరతుం గనుంగొని గుహుండు మహాత్మా శ్రీరఘువరుం డిచ్చ
ట సీతాసమేతుండై కూర్చుండి సౌమిత్రి దెచ్చిన జలంబులు ద్రా
వి హింగుదీవృక్షమూలంబున జానకీ సమేతుండై శయనించెనంత
ట నేనును సౌమిత్రియు చాపంబుల ధరియించి జాగరూకులమై
యుండితిమని పలికిన రామశయ్యాప్రదేశంబు వీక్షించి నేలం బడి
మూర్ఛిల్లి మరలం దెలివొంది చిత్తంబున నిందీవర శ్యామ సుంద
రంబగు శ్రీరామచంద్ర దివ్యమంగళ స్వరూపంబు సీతాసమేతం
బుగా కన్నులం గట్టినట్లు దోచిన నైన హా రామ రామా యని విల
పించుచు దీర్ఘలోచనంబులం వెడలు బాష్పంబులు కరతలంబునం
దు దుడుచుకొనుచు నిట్లనియె॥

పున్నాగరాగము-అటతాళము.

అయ్యయ్యో యీ నేల నేటఁ బవ్వళించెనో రాముఁడు। గుణధాము
డు। చయ్యన జనకరాజపుత్రికతోడ నెయ్యముల రఁ బవ్వళించినట్టి
పడె॥ లలిత హేమ హర్మ్యములఁ బవ్వళించేటి స్వామికి। వైదేహి
కి। వలిగాడ్పు వెలయు నీ స్థలిఁ బవ్వళింపఁగ। గలిగెనహహా నా వలన నీకష్
టము॥ అయ్య॥ ఘనతర మంగళ వాద్యధ్వనులు వినువానికి। శుకవాణికి॥
వనమృగ ఘోరనిస్వనములు విననాయెసను భ్రోచు రంగనాథుని దయ
లేదాయె॥ అ॥ అయ్యయ్యో॥ క॥ భరతుం డీగతి బలుకుచు। ధరణిం
బడి దుఃఖమొందఁ దగ శత్రుఘ్నుం। డరుదుగ నన్నను బట్టుక। బరువడి
దుఃఖించె నపుడు పటురవ మెసఁగనూ॥ వ॥ అంత కౌసల్యా సుమి
త్రాదులు చనుదెంచి భరత శత్రుఘ్నులం గాంచి విలపింపదొడం
గి రాసమయంబున పతివ్యసనకర్శితయు నుపవాసకృశాంగియున
గు కౌసల్యాదేవి భరతుం గౌగిలించుకొని యనేక విధంబుల నాక్రం
దింపుచు తండ్రి దుఃఖింపవలవదేను రామవియోగపతిమరణదుః
ఖంబున దేహంబు విడువకనిన్నుం గాంచి యున్నదాన గావున నీదు
దుఃఖంబు మాని మమ్ము లదరనూరడించు భారంబు నీది ఘను

త్స్వదశని పలికి యతని కన్నులం వెడలు బాష్పంబులువస్త్రంబునం దుడిచి యూరడించిన యనంతరంబ భరతుండు జటావల్కలంబులుదాల్చి సైన్యంబులతోడ గుహుని సహాయంబునభాగీరథిందాటి భరద్వాజాశ్రమంబు ప్రవేశించి యమ్మునికినమస్కరించి తావచ్చినవృత్తాంతంబెరుంగంజెప్పిన సమయంబునా॥ చ॥అనుపమభక్ష్యభోజ్యపరమాన్నఘృతాదులనింపు సొంపుగా।మునివరుడేపఱరించి కలమూకలనెల్లనుతృప్తిజేసి।చయ్యనఘనగంధపుష్పవనితాది సుఖంబులొనపఱజాయుగా। మునిని నుతింపుచుం బరమ మోదము జెందిరిమానసంబులనూ॥ వ॥యివ్విధంబునం భరద్వాజుండు మహానియ్య వైభవంబు గావిందు గావించిన యనంతరంబ భరతుండమ్మునివరేణ్యునకుం బ్రణమిల్లి రాఘవేంద్రుండుచిత్రకూటంబునం వసియించియున్న వృత్తాంతంబును యామార్గ లక్షణంబులును మునివలనందెలిసి వీడ్కొని శతృఘ్నసమేతుండై తలిఁ చిత్రకూట సమీపమార్గంబునం బోవుచున్న సమయంబునా॥

సీ॥చిత్రకూటంబునసీతాసమేతుడై మునులమైత్రినిమహామోదమలర।వర్తించుచుసురఘువల్లభుఁడొప్పంగభరతుసైన్యధ్వానమరుదుగాగ।వినిపించవినిరఘువీరుండుసౌమిత్రిగనియివ్వనంబున ఘనసినాద।మచ్చుగావినబడెనదిగనుగొనుమన్న।గ్రక్కునయొకవృక్షమెక్కివేగ। భరతుడేతెంచుటలుగాంచిపరమకోప। వివశుడై కన్నులెర్రగావెలయవచ్చి। బాణబాణాసనంబులుపరగదాల్చి। రాఘవేంద్రునకిట్లనెరయముతోడా॥

ఆనందభైరవి-ఆదితాళము.

అడుగో వచ్చెభరతుడో సామీ యన్న లెమ్మీ। కైకకొడుకువీడునమ్మవలదన్నదక్మ్మి।దండెత్తివచ్చుచున్నాడుదపఱమొప్పా। వీనిఖండింతుముగ్రశోకముకైకకొప్పా ॥౧॥ ఆత్మగోపణగావింపుమగ్గినన్నా।శోభద్రాత్మకకవచనముదొడిగియలరుమన్నా॥౨॥ యింతీసీతనొక్కగుహానుడంతమింక।వచ్చుదం టఘోటకాదులజూడదగవే శంకా ॥౩॥ అదిగోకోవిదారధ్వజరథము పెంపూనీ।విదిగోచు.. వయ్యాసైన్యమొదవుసొంపూ ॥౪॥ మానకశరచాపములుబూ.వయూన్య।వినిమానకద్వంచినచింతమా నసయ్యా॥౫॥ వీనిద్వంవసగ

లేమ రాఘవేంద్ర రంగ శ్రీనిలయవాస సర్వమానవేంద్ర ॥[illegible]॥ డుగో ॥వ॥ యివ్విధంబున నంబలిక్కిన తమ్మునిం జూచి రఘువరుండిట్ల నియె॥

ఆనందభైరవి. ఆదితాళము.

శరచాపములు బూననేలా। నీమదిలో భరతు । చరితమేమెరిగితివి చాల॥ గురుతుగ వనిను నమరుదుగ వెలయగ। వరమతిగొని పోవగ భరతుడురా॥ శర॥ గురుతరాటవులకేగుదెంచి। ఘనమువసియించు పెరిగి తల్లినికడు భర్జించి। భూరిభూరి దుఃఖము బొందుచు వెలుపడి। భరతుడు మసలనుమరలు పగదియగ॥ శరచా॥ అన్నా లక్ష్మణ వినగదోయి। భరతుని వంటియన్నా పైకూర్మివారెరగోయి। నిన్ను నన్ను సీతను తన కన్నుల। చెన్నలరగ జూడగ నరుదెంచెగ॥ శరచాప॥ ౩ ॥ ఘనుడు భరతుడు ప్రాణసముడు। యిటువంటి సోదరుని నేవిట్లాడనాయని ఫుడు। మునినుతము గురంగనివాసుడనగు। నను గొలిచెటి భరతుని గని జపమున ॥ ౪ ॥ శరచాపములు బూననేలా॥ వ॥ అనియిట్లన్న వచింపగావిని యహా యన్యాయశీలుండనై। ఘనకారుణ్యమొకింతలేక భరతుం కాఠిన్యతం ఘోరశత్రునిగా నెంచితినంచు। లక్ష్మణుడు తా దుర్వార ఖేదంబునం। తనలో తా నెయణంగి శిగ్గునను సీతానాథు చింతించుచునూ॥ వ॥ అంత రాఘవుండు సౌమిత్రిని హితవాక్యంబుల వదిలపరచె నాసమయంబున భరతుండు సేనల వెనకరాబనిచి తానును తమ్ముండును పాదచారులై చిత్రకూటంబు చేరంజను దెంచి రామాశ్రమంబు వెదకుచు జనుదెంచుచు శత్రుఘ్నునికిట్లనియె॥

ఆనందభైరవిరాగము-అటతాళము.

తాపముబాయదు తమ్ముడా। హృదయతాపము ॥ తాపస వేషముదాల్చినయా సీతాపతిని వ్యస్వరూపము గనికున్న ॥ రాముని జగదభిరాముని సీతాభిరాముని పట్టాభిరాము జూయక గాని ॥౧॥ అరవిందసుంగరము యన్న పదములకొరగి మ్రొక్కి మ్రొక్కి కరుణబడయకున్న॥౨ ॥ శ్రీమదిందీవరశ్యాముని శ్రీరఘురాముని నెమ్మోము ప్రేమ జూడక గాని॥౩॥జనకజగాంచి చక్కని భక్తిమించి మజ్జన నిరోసన్న పాలన సేయుమనకున్న ॥ ౪ ॥ శత్రుపిఒయని సౌమిత్రిని పరమపవిత్రుని గని బహుమైత్రి నెరపకున్న॥౫॥ శ్రీరంగపతియని చెన్నమీరిన రఘువీరుని సన్నిధి చేరనివ్వక గాని ॥౬ ॥ తాపము బాయదు తమ్ము

శా॥ శ॥ యివ్విధంబునం బలుకుచు సీతావల్లభుఁడు దివ్య మంగళ స్వరూప సౌందర్యంబు కన్నులనెవ్వఁడు జూతునో యనుతలంపునం జనుదెంచుచూ॥ ద్వి॥ విరివిగా నవ్వనవీధియందలరు। మరభిచందన పటుసురుచిర వకుళ। వరలవంగరసాలవంజుళ ప్రముఖ। గురువృక్షశాఖలకొమరారునట్టి। సమదకోకిలకీర షట్చరణాది। విమలనాదంబులవిధమెల్ల వినుచు। చనిచని యొకపర్ణశాలలోపలను। మునివందితునిజగన్మోహనవేషు। నవనీరదశ్యామునయవాక్యనిపుణు। భవవినాశనుచారుపద్మపత్రాక్షు। సత్యసంధునిపుణ్యచారిత్రు సనఘు। సత్యవ్రతునిశరచ్చంద్రనిభాస్యు। శతకోటిమన్మథసౌందర్యకలితు నతిభక్తిభరతుఁడాయన్నను గాంచె॥ క॥ వరమతిమరియునుకన్నుల। భరతుండటగాంచెనధికభక్తియుతుండై। గురుదభ్రాస్తరణంబున। విరివిగఁ గూర్చున్నయట్టివిమలచరిత్రున్॥ వ॥ యిట్లుగాంచికన్నీరునించుచు॥ క॥ హా కాకుత్స్థకులేశ్వర। నాకతమున బూననాయెగా మునివేషం। బేకరణిఁ దనువునిలుపుదు। నీకరుణాలోకనంబునిగుడకయున్నన్॥ క॥ ఘనమణిసంపదవిడిచియు। వనమునవసియింపనయ్యెవసుధాసుతతో। ననుజునితో నావలనను। వనమే పురమాయెనీకు వనజదళాక్షా॥ క॥ ముని వేషము ధరియించిన। నినుగనియున్నాఁడనిలువనీరై నేని। వ్యసనము నిచావకనక్రియ। తనువుధరించితినియెంత దారుణమతినో॥ వ॥ అని యిట్లు బలుకుచు హాహాకారంబునం బరుగిడి శత్రుఘ్నసమేతుండై శ్రీరాఘవేంద్ర చరణారవిందంబులందలేక ధరణింబడి వివశుండై యున్న సమయంబున శ్రీరఘువరుండు కృశీభూతదేహుండును జటావల్కలధరుండును నగు భరతుం గాంచి విస్మయంబంది కౌగిలించుకొని యంకతలంబునం జేర్చి శిరంబు మూర్కొని మరియును శత్రుఘ్ను నవ్విధంబునం గావించి తదనంతరంబున భరతుం జూచి రాజ్యరక్షణవృత్తాంతంబును క్షేమప్రశ్నయు నడిగిన నన్నకిట్లనియె॥

శోకవరాళిరాగము-అటతాళము.

అన్నా నాకేమిటికి రాజ్యసుఖములు। నిన్ను బాసినవేళనూ। యన్నగనుసవంశమునకనిష్ఠుఁడుభూమేలుటమునువింటిమా। నీవెరుగవె॥ యన్నా॥ యన్నెన్నోరాజ్యభారముగలవారలచిన్నలనడిగితివి। న

న్నతాంగరాజ్యముసేయుకొంకనే నన్నెరుంగకోయన్న।నీపాద
మాన॥యన్నడు॥౧॥ విరివిగజడలువల్కలములు గల నన్నుపరమతి
గనుగొనుచు।గురురాజ్యవృత్తాంతమరయబోలునెచాలధరణిసా
ధకులునా తెరుగునయుందురె।౨।నేనేమియెరుగదుష్టాత్మయోకై
కచేనింతేలబొందితిని।నా నేరములుగాంచినన్నురక్షింపుము। మాన
కనరుదెంచిమహినేలుమ్రొక్కెద॥నన్న॥౩॥ పనిబడినేరాకము
న్నెదశరథుడుపరగనాకముకేగెనూ।ఘనరంగనాథునిదలచుచుసం
స్కారమనురక్తిచేసితినినుజునిగూడుక॥౪॥అన్ననాకేమిటికి॥

వ॥ యివ్విధంబునందశరథుండు స్వర్గంబునకుం జనినవృత్తాంతంబువిని దురంతదుఃఖావేశంబున సీతాలక్ష్మణసమేతంబుగా ధరణింబడిమూర్ఛిల్లె కొంతసేపటికిం దెలసి కన్నీరొలుక యనేక విధంబులవిలపించుచు జానకీ నీమామదివంబునకుంజనియె।సౌమిత్రినీవుజనకుండు లేనివాడవైతివేయని పల్కి మరియును నేను బాల్యంబున నాటలుమరిగియున్న నామేనిమన్నుదుడచిరక్షించినవాడెపెండుబోతివని దుఃఖింపుచున్నయెడ భరతాదు లూరార్చిరి తదనంతరంబ సీతాలక్ష్మణప్రముఖ సమేతుండై చని మందాకినీశుభజలంబులం గృతస్నాతుండై దశరథునకు బదరిమిశ్రిత హింగుది పిణ్యాకంబుసంక్రియలొనరిచి కృతకృత్యుండై యాశ్రమంబునకుం చనుదెంచిన సమయంబునా॥

సీ॥ దశరథస్త్రీలనందరివెంటబెట్టుక
యావసిష్ఠుడువేగనరుగుదేర। మందాకినీతీరమందు తండ్రికిరామ
చంద్రుండుచేసినసత్క్రియలును।మెండైనయాగారపిండిముద్దయు
జూచికౌసల్యయధికదుఃఖమునమూర్ఛ।జెందిసుమిత్రతోపొందుగా
నిట్లనియే మమ్మసకలోర్వినేలుసట్టి। తండ్రికిచ్చటరఘుపతితగయొన
చె।నట్టిసత్క్రియలివె।చూడ వమ్మ జగతి। భూరి విభవంబుగల్గి
నభూపతికిని।గారపిండిభుజింపగగల్గెనకటా॥

వ॥యిట్లు దుఃఖింపుచు కౌసల్యాదులు పర్ణశాలకుం జనిన సమయంబున శ్రీరామచంద్రుండు సీతాలక్ష్మణసమేతుండై వసిష్ఠునకుందల్లులకు వందనంబులు గావించి కౌసల్యయధికదుఃఖావేశంబున కొమరులంగౌగలిసిం గాగిలించుకొని కన్నీరొలుక రోదనంబుసేయ వారు నుభిలితే

నిమిషంబున విలపించుచుండిరంత సైన్యజనంబులును పురజనమ్ములును రఘువరుంగని శోకించిరా సమయంబున వసిష్ఠాదులు రామలక్ష్మణసీతాభరతశత్రుఘ్నకౌసల్యాదుల నూరడించి రయ్యవసరంబున భరతుండంజలిబద్ధుండై యన్నకిట్లనియె॥

## సౌరాష్ట్రరాగము-ఆదితాళము.

అన్నారమ్మికపోదమయోధ్యకు।యడవినుండనీకేలా॥ యీయడవినుండనీకేలా॥ చిన్నితమ్ముడానీవీలాగునచెప్పందగునాతండ్రి॥ యిటుచెప్పను॥అన్నానాహృదయమురంజిల్లగ।సవనిబ్రోవుమికసన్నా।నీవవనిబ్రోవుమికనన్నా।పన్నగమసకీధర్మవిరోధము।జన్నవసుమతిలోనా॥యిదిజన్నె॥యెన్నగమనకులమునకనిష్ఠుడిలనేలందగునాయన్నా।యిలయేలందగునాయన్నా।కన్నతండ్రిపనిసేయుటమనకక్కరగాదానాతండ్రి॥మనకక్కరగాదానాతండ్రి॥అ॥ వనమునవేవతించెదనీవికజనుముపురంబునకన్నా॥యికజనుముపురంబునకన్నా॥ ఘనరంగేశుడనగునేనెయివ్వనముననిల్చెదనింకాయివ్వనముననిల్చెదతండ్రి॥ గీ॥ అన్నయీక్రియతాసేయువిన్నపంబు।విశ్వసింపకబలికెడివిధముమదికి।తాపముదయింపసేయగంతల్లడగుచు।బాష్పపూరితనేత్రుడై బల్కెమరలా॥

## నీలాంబరిరాగము - ఆదితాళము.

వేంచేయవయ్యనీవయోధ్యకు।రామవేంచే॥పంతగించిదీనులనలయించన్యాయముగాదు॥వేంచేయవ।అన్నానీవాడనురక్షించుమి।తప్పులున్నాతండ్రివినసుశిక్షింపుమీ॥వే॥ యన్నారామనవివినతుంనాజీవింపనేర॥వేంచేయ॥నినుబాసినిమిషమోర్వజాలను।నేనువెనువెంటదగిలివెలయువాడనూ॥వే॥ ఘనరంగనిలయనీకీకాఠిన్యమేలవచ్చె॥వేంచే॥ వ॥యిట్లువిన్నపంబొనర్చిన రఘువల్లభుండు సాదరంబున ప్రతికూలవాక్యంబులు బలికినభరతుండుకన్నీరొలుక విలపించుచు॥

## శుద్ధకాంభోదిరాగము-అటతాళము.

యెన్నిజెప్పినమాయన్నాకుదయరాదున్నదేమో। వో యన్నలక్ష్మణ।నీవువిన్నపమొనరింపతిన్నగానూ॥కరుణజూడుమునన్నుకలుషహరుంగనికర్మముగాను। యీపరమపావనుడగుయన్నబోధిం

శుభకీర్తితోను ॥౧॥ అమ్మ సీతమ్మ యేమమ్మ చెప్పవు మాయన్నతోను।
పోయమ్మ యిర్వనము గృహమ్మాయెగదవమ్మ నెమ్మితోను ॥౨॥ అమ్మ
నీమృదుచరణమ్ములియ్యడవిలోన మరగాంచి । పోయమ్మ గ్రక్కున
గూలకున్నవాడను యేమన్నమించి ॥౩॥ వచ్చినవారెల్ల యూరకే చూ
చెదరచ్చగాను । మీరు క్రచ్చరరంగేశుడగు రాము వేడుడి పెచ్చ
గాను ॥౪॥ వ॥ ఇవ్విధంబున నంబలికి రాఘవేంద్రుండగనుంగొని
నీవయోధ్యకు రాకున్న ప్రాయోపవేశంబు చేతునని పల్కి తత్ప్రి
యత్నంబు సేయుచున్న తమ్ముని గౌగిలించుకొని మనమున క్షత్రియ
ధర్మంబు దప్పపాడి గాదు గావున వనవాస నిర్ణయ సమయంబుగ
డపి యొకదినంబై సమించకుండ నయోధ్యకు జనుదెంతునని యూర
డించి తదనంతరంబున యతండు వలసి యడిగిన పాదుకలొసంగి
న యాభరతుండతి భక్తింగైకొని శిరంబున దాల్చి యన్నమొగం
బు చూచి దేవా నీవు వచ్చునరకు యంతం జేను పట్టణంబు చేరక దేవర వా
రి పాదుకలయందు రాజ్యభారంబిడి భక్తింబూజింపుచు నందిగ్రా
మంబున నివాసంబు చేసి నియమంబున నుండువాడ నీవానతిచ్చినకా
లంబున కయోధ్య చేరకుండితి వేని నిక్కంబు గానగ్ని ప్రవేశంబు సే
యుదునని పల్కి శత్రుఘ్న సమేతుండై సీతారాఘవులకు ప్రదక్షిణ
నమస్కారంబులు గావించి లక్ష్మణుం గౌగిలించుకొని గమనోన్ము
ఖుండయ్యె నట్టి యెడ శత్రుఘ్నుండు మ్రొక్కిన లక్ష్మణుండు తమ్ము
నిం గౌగిలించుకొని దీవనలొసంగె రఘువరుండును సీతాలక్ష్మణు
లంగూడి వసిష్ఠునకుం దల్లులకు నమస్కరించ్చి వారివలన దీవనలం
బొందె నంత భరతుండు తల్లులం దోడ్కొని సైన్య సమేతుండై పు
రంబునకుబోయి యల్ల వారలసదనంబులకుంబనిచి తానునందిగ్రా
మంబున నిలచి నియమంబున రాఘవేంద్రుని పాదుకలు పూజింపు
చు కాలంబుబుచ్చుచుండె ॥ సీ॥ శ్రీరాముడంతట చిత్రకూటము
బాసి జనకజాలక్ష్మణ సహితుడగుచు । చనియత్రియాశ్రమంబున కే
గ సద్భక్తి మ్రొక్కి సత్కృతి జెందె దనకంజముగ । పెనిమిటి యనుమ
తంబున సీత యమ్మౌని సతియైన యనసూయ నతి తపస్వి । నయ్యెడ చని
కాంచి చయ్యన తన పేరు జెప్పి మ్రొక్కిన హర్షముప్పతిల్ల । కౌగిలిం

కుం జెప్పినట్లు సూతుండెరుంగించిన శౌనకాది మునీంద్రులు రామ ధ్యానపరులై యుండిరంతా ॥మాలిని॥ నిరుపమసుచరిత్రా సీలజీమూతగాత్రా గురుతర భవశోషా। కోటికందర్పవేషా పరమపదవిహారా పాపదైత్యప్రహారా। సురనుతపదపద్మా సూరిహృత్పద్మసద్మా॥ గద్య॥ ఇది శ్రీమదుభయకావేరీమధ్యప్రదేశప్రదీప్తసప్తప్రాకారమహామందిరాంతర్విరాజమాన। శ్రీరంగనాథచరణసేవక। వరగంటి శేషగిరిదాసప్రణీతంబగు శ్రీమద్రామకథాసంగ్రహయక్షగానవిలాసంబునందయోధ్యాకాండ సర్వంబునేకాశ్వాసము॥

సంపూర్ణము.



అరణ్యకాండము



క॥ శ్రీకరసర్వగుణాకర నాకేశప్రముఖవినుతనారాయణలక్ష్మీకామినీనివాస హాకర కమనీయరంగభవనవిహారా॥ వ॥ నైమిశారణ్య పుణ్యక్షేత్రనివాసులగు శౌనకాది మునిశ్రేష్ఠులకు సూతుండిట్లనియె నివ్విధంబున సత్రి మహాముని యాశ్రమంబువదలి రామలక్ష్మణులు సీతంబోలి ... గురతరారణ్యమార్గంబున బోవుచు॥ మధ్యమావతి రాగము. ఆదితాళము.

దండకాటవిజొచ్చిరప్పుడు రామలక్ష్మణులు ॥దం॥ మండితశరభవ్యాఘ్రమృగేశ్వర। గండకఘురువేదండపలితమా॥దం॥ సరళపున్నాగబదరీవకుళ। వటకుటజనింబకరవీరాశ్వద్ధవరవంజుళ। కురువకముఖబహుతరుశాఖాదులతరణికిరణములనెరిచొరనివ్వని॥దం॥౧॥ వనమృగములనిస్వనములు। ఝల్లిజనేడీఘనసస్యలతలని గనిగలూ। మునుకొనివిసిపించెడి రాక్షసగణమొసరెంచెడి భజనన లాదిక

గల॥ దం॥ ౨॥ జనకపుత్త్రికిభయముదోలఁగ। ఘోరవ్యాఘ్రములెసఁగికడు
భీతినిబారఁగ। మునిసన్నుతులగురంగపురీశులుపనివడిచాపధ్వనులమ
రింపుచు॥ ౩॥ దండకాటవిఁజొచ్చిరపుడు॥ క॥ ఈరీతిదండకాటవి। తో
రంబుగఁజొచ్చిచనఁగఁదొలఁగకసుగ్రాకారముతోడవిరాధుఁడు। చేరి
వడిందాయవచ్చిసీతాకాంతను॥ గీ॥ క్రోధమలరనెత్తుకొనిచంకబె
ట్టుక। రాముఁజేరవచ్చిరాజపుత్త్ర। మిమ్ములీలఁద్రుంచిమీమాంసములు
మెక్కి। గర్గెనాకటంచుఁగదియువేళ॥ సీ॥ ఆరాజనందనులత్యుగ్రులై
ఘోరసాయకావళులేయసరకుగొనక। జానకినటుడించిమానకచ
నుదెంచిరాఘవలక్ష్మణులనురయముతోడ। పటుపరాక్రమమునఁబట్టి
మూఁపులమీఁదబెట్టుకకొనిపోవఁదట్టిచూచి। జనకజశోకంపఁగనివాని
భుజములువడిదెగనేయుంగఘ్ఞసమిగూలె। వానిపెరగెల్లవారిచేకో
రిచెలసి। యేసుతుంబురుఁడను వాఁడనిలనఘనదు। శాపవశమునని నైతి
జనవరేణ్య। లారనాదేహమిలఁజొన్పిగాడపనుఁడ॥ గీ॥ నను బ్రోచిమీ
రుశరభంగసంయమీంద్రునమునికడబోవుఁడు। గొనకొని మిమ్ము మునివ
రుఁడుగౌరవించును ఘనభక్తినటంచుఁజక్కఁగేరనురవారఁగ॥ ద్వి॥ తన
తొంటిరూపంబుతగఁబొచ్చిచనిన। వెనకనారాఘవుల్ వెసవానితను
వు। ధరణిలోఁస్థాపించితగఁబోయిపోయి। శరభంగమునిశుభాశ్రమ
మంతఁజేరి। మునికినందనములుమునుమ్రొక్కనెయ్య। ననుగ్రహపూజించి
యగ్నిలోఁజొచ్చి। చనియెనమ్ముని బ్రహ్మసదనంబునకును। వినుతచ
రిత్రుడై విమలభోగమున॥ క॥ అంతటతాపసగణములు సంతసమున
వచ్చిరామచంద్రునిగని సన్మానభయభక్తితోడంత కాంతాలక్ష్మ
ణులఁగూడికడువడఁ బ్రొక్కెన్॥ క॥ ఇట్లు మ్రొక్కినదీవనలొసంగి దీ
నముఖులై మునులిట్లనిరి॥

శరణు శ్రీరఘుకులశరధిసుధాకర రామరామా॥ మమ్ము సరమర
సేయక కరుణ బ్రోవుము శ్రీరామరామా॥ మేమిప్పుడంబున తపము
లొనర్చఁగ రానరామా॥ మమ్ము బాములు బెట్టెదరుదుష్టరాక్షసు
లెల్ల రామరామా॥ ౧॥ అనయము ప్పసముననసురులుచాలరేగిరామ
రామా॥ దుష్టమునులవధింపుచు మోనసిచరింతురు రామరామా॥ ౨॥

దిక్కుగల్గినవారమైతిమి నేటికి రామ రామా ॥ మమ్ముగ్రక్కున బ్రోవుము రంగవల్లభ శ్రీ రామ రామా ॥౩॥గీ॥ ఇట్లు దీనులగుచు నెలమి భాషించెడి। మౌనివరులఁ జూచి మానసమున। చాలదుఃఖమొందిసదమలకరుణచే నభయమొసఁగి బల్కెనాతిఁబాయ ॥

పంతువరాళిరాగము-ఆదితాళము.

చంపెదనిజముగనింకా। రాక్షసకోట్లమునులారజనుడునిశ్శంకా చం॥ మిగులసౌఖ్యముమీకిచ్చుటనూఁగల్గ। తగఁజేయకున్ననాతనువేల ధరనూ ॥౧॥ ప్రతినబట్టితిధైర్యముననూ। దైత్యవితతిజచ్చినయట్లు వినవోదురికనూ॥చం॥౨॥ రంగధాముఁడనైతినేని। మీకుమంగళమొన రింతుమహిలోనబూని॥చం॥౩॥వ॥ ఇవ్విధంబునఁ ప్రతినబూని ముని గణంబుల వలన యనుజ్ఞ గొన్ని సీతాలక్ష్మణ సహితుండై కదలిరమ్య భూరుహవితాన మండితంబగు సుతీక్ష్ణాశ్రమంబు నకుం జని బ హుకాలంబచ్చట వసియించి మునిగణంబులకు రాక్షసబాధలేకుం డంజేతునని తానొనర్చిన ప్రతినవృత్తాంతం బెఱింగించిన నమ్ముని సంతోషచిత్తుండయ్యె నంతట యేకాంతంబున సీతా కాంత నిజ కాంతునింగనుంగొని యిట్లనియె ॥

మధ్యమావతిరాగము - అటతాళము.

పలుపనీ వైరములు మునుకుపలదునల్లభా॥ పలువనీవైరములు జెను పవలదు వలదీఘోరాటవులు। బలమదోపేత ఘోరరాక్షసులునటించు నెళవువిందు॥పలు॥వచ్చినకార్యము గడపి వచ్చితిమయ్య సమయోధ్య। కచ్చుగబోకమనకు హెచ్చుపంతము లేల॥పలు॥౧॥ చలము సేయన ట్టిదానవులవధింతునను మాటలు దోషములవలన బలుకనేలన విన నేత్ర మొక్కగాని॥పలు॥౨॥ మునులుచందమున నమసమువనముల నుండగవచ్చి। జను నెపకహింసలోన సపాపినుతరంగనాథనాథ॥పలు వనీవైరములు ॥౩॥ద్వి॥ అనియిట్లుబలుకంగసతి వెనుజూచి। ఘనమ ధుర్గోక్తుల కాంతుడిట్లనియె। వినవె చక్కనిరాణి వినవె పూబోణి। వి నుతికెక్కినమునుల్ వెసడాసినను। దారుణదైత్యబాధలకోర్వలేక నారూఢిమము బ్రోవుమని శరణన్న। మనము పాలింపక మానుటవగు నె। మునుల బ్రోచుటతోటి మొనసినమంబు వనజాక్షీకద్దటె వసుమ

తిలోన।దనుజసంఘములుమద్దారుణబాణ। తతిదాకిచాపకధరనుం
డగలరె।మతిలోననికభీతిమానుమటంచు।బలికెసుతీక్ష్ణ పరమసన్ము
నికి।వలనొప్పనంత కేవలభక్తిమ్రొక్కి॥గీ॥అమ్మునీంద్రునివీడ్కొని
సమ్మతమున। పావనుండగుకుంభసంభవమహర్షి । సోదరునియా
శ్రమముజేరి మోదమలర।వినయమునమ్రొక్కిమానిచే వినుతివడ
సి॥

పంతువరాళిరాగము-ఆదితాళము.

వేంచేసెనంతమీదా। శ్రీరామమూర్తి। వేంచేసెనం॥వేంచేసెసీ
తతోడవిమలభక్తినితమ్ము।డుంచి తాసక్తిగొల్వనగస్త్య మునివరశు
భాశ్రమమునకు॥వెంచె॥భూరిమోదముతోడా।మునులెల్ల వచ్చిచే
రిమమతజూడా।క్రూరరాక్షసులకెల్ల గుండెలుఝల్లుమనసారసనే
త్రములసదమలమునియాశ్రమములజూచుచు॥వేంచేసెనం ॥ శృం
గారరూపముప్పా।వైదేహిసౌందర్యసంగముచ్ఛటలజెప్పా।అంగ
జకోటిమోహనాంగము వెలయదివ్యరంగనాయకుడై నరఘుకుల
దుగ్ధసముద్రశశాంకుఁడు॥వేంచేసె ॥వ॥ ఇవ్విధంబున నగస్త్యాశ్ర
మంబుప్రవేశించి యమ్మునిక వందనంబులుగావించినయ్యగస్త్య
మునీంద్రుండు రామలక్ష్మణులం గౌగిలించుకొని మూర్ధ్నిఘ్రా
ణంబుచేసి జానకిందీవించి పరమానందంబున రాఘవేంద్రు నియ
నేకవిధంబుల నినుతించి ఇంద్రసమ్మంధంబగు తూణ బాణాసనఖ
డ్గతూణీరంబులొసంగి సంగైకొని యకుంభసంభవమునీంద్రు
నియనుజ్ఞగొని వెడలిచని నానావృక్షమండలతాగృహవితాన
మండితంబగు మహారణ్యమార్గంబునం జనిచని గోదావరీతీర
ప్రాంతంబునం జెన్నుమీరు పంచవటీస్థలంబునం జేరిన యనంత
రంబునా॥

యదుకులకాంభోదిరాగము-ఆదితాళము.

పర్ణశాలగట్టినప్పుడువర్ణనీయముగా।నిర్ణయింపనలవిగా
నినిశ్చలరామభక్తిని।వర్ణితగుణుడౌసౌమిత్రివలసిమంచికొమ్మలు
దెచ్చి॥పర్ణ॥ రాముడాహారముభుజియింపభామసీతరామునిగూ
డి।ప్రేమతో బవళింపనభిరామస్థలములేర్పరించి॥ప॥౧॥ మలయ
మారుతముచనుదెంచు। మార్గమమరించిపుష్ప।లలితపల్లవతోర
ణములుగట్టివాస్తువిధిని॥పర్ణ॥౨॥రంగనాథుడైనరఘు।పుంగవుడా

ల్ల నెరింగించిన ఖరుండు రౌద్రాకారుండై పదునలువుర రధికవరులం
బనిచిన వారు యుద్ధసన్నద్ధులై చుప్పనాతివెంటం జనిచని రామ
చంద్రునితోడ కయ్యంబొనర్చి నిమిషమాత్రంబునం జెగటారి
రంత శూర్పణఖ మరలంజని ఖరునకెరింగించి రోదనంబు సేయు
చు నిష్ఠురోక్తులాడిన యనంతరంబ ఖరుండు దూషణత్రిశిరప్ర
ముఖ చతుర్దశ సహస్ర రాక్షస సమేతుండై దండువెడలి పర్ణ
శాలకడకు వచ్చు సమయంబున రామచంద్రుండు సీతాలక్ష్మణుల
నొక్క గిరి గుహకుం బోవంబనిచి రౌద్రాకారంబునం ధనుర్ధ
రుండై నిలువంబడియున్న సమయంబునా॥ క॥ సురగరుడసిద్ధవిద్యా
ధర గంధర్వులును సకలతాపసగణముల్। వరరఘువీరుని విజయము
నెరిగోరుచు చూచువేడ్క నేతెంచిరొగిన్ ॥ క॥ ఆసమయంబునా॥

అసంపద్భైరవిరాగము - ఆదితాళము.

సుమహితకరిరథఘోటకేములతోడా। దైత్యసమితిగ్రమ్మివచ్చె
పర్ణశాలజాడా॥ భీకరాంగులగుచు రాముడాకేరంతా। డాకీవీక
తోనాయధములెత్తివిసరిరంతా ॥౧॥ సింహనాదములు గ్రుమ్మైచేసి
రంతా। రాజసింహులపై బాణవర్షముపిమ్మిరంతా ॥౨॥ అరాఘ
వేంద్రుడురౌద్రాకారమునను। నానమూరూధికంబ్రేసిచేసెనసు
రులడలను ॥౩॥ పరగస్త్రత్యాగధదివ్యచాగణమొప్పను। తీవ్రశర
ములనైన్యములగ్రుంచెనపుడాగను॥౪॥ అతులవిక్రమమునదూ
షణాదివీరులా। రంగపతిలీలగ్రుంకెనుదిక్యవాన వితతులా॥౫॥

క॥ ఖరుడుగ్రశగుచురాఘవ। బోరిగొందుసటంచడాకిపొలుప
గుయుద్ధం। బరుదుగజేసియురఘుపతి। శరములభూస్థలినిగూలెచ
య్యానసంతనూ॥౬॥ సురదుందుభులు మ్రోసెసుమవృష్టికురిసె। సు
రకాంతలాడిరిసుందరంబుగను। మునులెల్లవిచ్చేసిముదము రెట్టింప।
వినుతించిరారఘువీరునిచర్య। లంతటలక్ష్మణుండవనిజతోడ। సంత
సంబునపర్ణశాలకువచ్చె। మునిగణంబులకెల్ల ముదమామెననుచు।
మనమునసంతోషముగ్నైతలిర్చ। జనకజాపతిపర్ణశాలకే తేర।
గనిదిగ్గనసులేచికమలాక్షిసీత॥

సురటరాగము_ఆదితాళము.

నాధునికౌఁగిలించనూ। సీతావధూటి॥ నా॥ సాధుమానులకెల్లబా
ధలుదొలగరిపులసాధించి గెలిచెననిసరససంతోషమున ॥ నా ॥ తళు
కుచెక్కులమీటనూ।ధళధళను కెంపులలరుకమ్మలుమెరయనూ। చె
లువమైనబంగరుపచ్చలకీల్కంకణములు వెలయుహస్తాబ్జములువే
డ్కతోడుతసాచి ॥౧॥ నా॥ గొప్పకొప్పులనిండనూ।హర్షబాష్ప
ములుప్పతిల్లుచునుండనూ। తప్పకరాత్రుసవితతులగెల్వగబోయి। న
ప్పటినుంచికన్నులగప్పినట్లున్నావని॥నాధుని॥౨॥ సరిలేనికళలతోడ
నూ।నఘుమసియాడ।బిరబిరబోయి ప్రేమనూ।వరరంగధాముడైన
వల్లభుడాసిదైత్యవరులపెక్కండ్రనెట్లుబోరిగొంటి వంచుమరి
మరి॥నాధుని కౌగిలించనూ॥౩॥గీ॥ కామినీమణియగుసీతకౌగిలించ।
సంతసము జెందిశ్రీరామచంద్రుడపుడు। వసనశాలకు వెంచేసిపణ
తిగూడి।సోదరునితోడనొప్పె మోదమలర ॥౪॥ అంతట ఖరసై
న్యంబులో హత శేషుండగు యకంపనుండు దానవేంద్రుండగు
రావణుకడకుంజని కేలుమొగిచియిట్లనియె ॥

ముఖారిరాగము_అటతాళము.

వినవోయిరావణవినవోయినేడూ। మనకునాటిల్లెనుమహిలోన
కీడూ॥దనుజేంద్ర దశరథజనపతిసుతుడూ। వినుతోగ్ర బలుడస్త్రవి
దుడురాఘవుడూ॥౧॥ సలలితనవరత్నభూషసుందరుడూ । జలరు
హపత్త్రవిశాలలోచనుడూ ॥౨॥ వనజాంకుశగుడికన్నులతోడవా
డూ।మునిపత్నితొసనురత్నీవనిజేరినాడు॥౩॥నయమునమునులమన్నన
జేసినాడు।భయభక్తిచెలంగనభయమిచ్చినాడు॥౪॥ఘనదీప్తిపంచ
వటినిజేరిచాలా।మొనసివచ్చినయాశూర్పణఖనుకీలా॥౫॥ క్రక్క
నగోనుసెకసనాసములూ।మెక్కుడలేకన్నాకర్ణనివరలూ॥౬॥
కరమొప్పఖరదూషణాదిగామనవారి। బొరిగొనెనసవసచెచ్చెరగండుమీ
రి॥౭॥ ఆచందమాయందమావిక్రమంబూ। సీచందమనిచెప్పనికదము
లభంబూ॥౮॥ అతనినపొందరుడటువంటివాడు।సతికెవ్వారలు
గారుచవిణంపబోడు॥౯॥యెదిరించిబోరరాదెవ్వారలకునూ సదు
పాయమికనుభంచనజాయనగునూ॥౧౦॥ సతినిహరించితెచ్చితివేని

ధరనూ।మృతులగుదురుశోకహతులై క్రచ్చరనూ॥౧౧॥వరరంగనిల
యులస్వరమరమాని।కరమొప్పవంచనగావింపవ్రాని॥ వినవోయిరా
వణవినవోయినీవు॥౧౨॥ద్వి॥అనియిట్లుబలుకంగనామాటలెల్ల।విని
రావణుడురౌద్ర వివశుడై వేగ।మారీచుకడకేగిమన్ననగనిరి। యా
రాఘవునిచరిత్రాతిశయంబు। వారకవివరించివంచనతోడ।నారా
ముదేవినిహరియింతుమన్న।మారీచుడంతటమహితవాక్యముల। నా
రావణునితోడనతిచోద్యముగను। రామచంద్రునిపరాక్రమమెల్ల
జెప్పి।వేమారుబోధించివెసబంపెనంత॥క॥తనముక్కుచెవులుదశర
థ।తనయుడుగోయించువార్తదశకంఠునకుం।వినిపింపగజనిరావ
ణు।గనియాశూర్పణఖరాముకథజెప్పెగదా॥వ॥ఇట్లుబలికి॥

క ॥ బలవంతుడననిజగములు। గెలిచితిననిధాత్రిసమరకేళినినా
తో।చలమెత్తిగెలువలేరని।బలికెదవేవేళనీవుబలమిలనణగదా॥

గీ॥దాశరథులునన్నుతగవిరూపినిచేయ'యూరకున్నవాడవేరఖ
లుడ।చలముతోడదివ్యసాయకావళులేసిచంపు మింకవారితెంపుగ
లిగి॥వ॥అన్నానీవధిక విక్రమంబున పంచవటీస్థలంబున నిలిచి యు
న్న రామలక్ష్మణులనతియత్నంబున సంహరించితి వేసి జగన్మోహ
నాంగియుశ్రీ రామపత్నియు నగు సీత నీకు భార్య గాసిద్ధింనునాసీ
తాసౌందర్యంబునాకుందోచినయంతమాత్రంబునీకు వివ రింతువి
నుము॥

ముఖారిరాగము- అటతాళము.

కొమ్మచక్కనిముద్దుగుమ్మరా।మదినమ్మ బంగరుతిగిబొమ్మరా
చెలువొందుచికురులలాగు।ఆచెలియమ్ముంజేతులబాగూ॥౧॥ కరి
కుంభములసొంపుమీరు।ఆగరితకుచంబులతీరూ॥౨॥ సలలితఘననీల
వేణి।చారుసైకతతుల్యసుశ్రోణి॥౩॥దాడిమబీజకాంతములూ। నవ్య
తరమగుతెరుణదంతములు॥౪॥కస్తకంపుటరటులపెంపూ। చూచిక
లికిపెందొడలుహసింపూ॥౫॥ వదనముగెలుచుచందమూ।నెన్న
మనుజయింపనర్థేందూ॥౬॥ పక్వబింబఫలంబూ ఆతరుణికె
మ్మోవివిధంబూ॥౭॥చెలిగొప్పకన్నులసొరు । మంచితెలిదమ్మిరేకు
లగేరూ ॥౮॥ వలనొప్పతళుకునద్దములూ।ఆయలనాగచెక్కుటద్ద
ములూ ॥ ౯ ॥ కలదులేదనసందియంబూ।ఆకలకంఠికలరుమధ్యం

బూ॥౧౦॥సురముఖ్యకులములలేరూ।ఆసుదతికిజోడైనవారు॥౧౧॥ తెగుసీతనీకసురేశా।నీవుతగుదువాసతికరినాశా॥౧౨॥ అన్నారావణసీతనెన్నా।నోయన్నానావశముగాదన్నా॥౧౩॥రంగవాసులనుజయించు।కనకాంగినిగూడినటించూ॥౧౪॥వ॥ఇట్లుబల్కిన దశకంధరుండును మోహాతిరేకంబున రామభార్యాతస్కరణంబు మనంబునంగోరి మారీచు కడకుంజని నీవెవ్విధంబుననైన జానకినపహరింపందగుసదుపాయంబుగాపింపుమని సవాడిట్లనియె॥

యదుకులకాంభోధి. అటతాళము.

యెవరుబోధించిరిరావణా।నీకీపాపబుద్ధిదుశ్చారణా॥ భువిపతివ్రతలలోపూజ్యతనొందిన।ప్రవిమలయారామపత్నినిహరియింప ॥ నెవరు॥నీలంకజెడునింకనూటిగా।రణకేళిగూలెదవీవుపాటిగా।నాలాయముగబంధువర్గముతోడుత।కాలమువాటిలెగాబోలులేకున్న॥నె॥౨॥ మునియాగమునగంటిరామునిపిన్నతనమునదనుజవిరామునిసనువాయుశరమేసివననిధిద్రోయగ। నెనసినైపయోగమునజీవించినవాడ॥నెవరు॥౩॥నామదిరత్నములన్ననూ।రంగధాముడన్ననూరాజులన్ననూ।రామునిభయమునసేమిదోచకయుండునామహాత్మ్యకవరాధమొసరింప॥నెవరుబోధించిరిరావణా॥

ముఖారిరాగము- ఆదితాళము-

కనుపడుచున్నాడు।రాముడుకనుపడుచున్నాడు॥కనుపడుచున్నాడనువుగనామది।మునివేషముతోమొనసివనస్థలి॥కను॥గడుగక్కసులకెడువడిజంపగమండితశరకోదండధరుండై॥౧॥పొందుదనరమృగమదఘనతిలకంబందముగాముఖమందువెలుంగగ॥కను॥౨॥ సరసిజపత్రవిశాలనేత్రుడై గురుతరదినకరకోటిద్యుతితో ॥౩॥ సతతముంరంగపుశుదుచాపం బతిలీలనుతంకృతిగాపింపుచు ॥ కను పడుచున్నాడు॥౪॥గీ॥ యేను శ్రీరాముభయముచేనివ్విధమునయున్నవాడనుసీకేలనుర్విలోన।చాలబలవద్విరోధంబుసంగ్రహింప। మానుమీకోర్కెమదిలోనదానవేంద్రా॥ద్వి॥ అనియిట్లుబలుకంగనారావణుండు। వినివానిగన్గొనివెసనిట్లులనియె । వలనొప్పప్రతికూలవాక్యంబుబల్క। వలదుమారీచమద్వాక్యంబువినుము। కనకవనాంగంబుకడువేట్కవెలయు।ఘనమృగాకృతిబూనికానలోజొచ్చి। ఇ

నకపుత్రిక ప్రేమలచరియింపుమంత। కనుగొనిమదిలోనకాంతుజెం పొర।నినుబట్టితెమ్మనినీరజనేత్రి।పనిబడియాచించు ప్రాణనాయ కుని।శ్రీరాముడంతటసీతావధూటి। కోరినకోర్కెకైకొమరొప్ప నిన్ను।నారూఢిబట్టంగనరుదెంచువేళ।ఘోరాటవికిదీసిగొబ్బునకట ట।హాలక్ష్మణాయనియార్తస్వనంబు। చాలసేయముసీతసంతప్త యగుచు।తనమరదినిబంపుతగరాముకడకు। చనుదెంచినేనంతజాన కిదెత్తు ॥క॥ యారీతిబల్కగావిని। యారావణుసకును కామాస క్తుండై చేరెనటంచునుమదిలో।మారీచుడు నిశ్చయించి మరి యిట్లని యెన్ ॥గీ॥మంచిమాటలునీవాలకించవైతి। వేమిసేయుదునయ్యోడిదే మొతప్ప। దట్లుగావుననీకార్యమమరజేతు।ననుచుబల్కనసంతోష మతిశయిల్లా ॥సీ॥ దశకంఠుడంతటతడయకమారీచుగూడిరథంబె క్కికొమరుమిగుల। గురుతరారణ్యంబునరభసంబునజొచ్చి మారీ చునసుపంగమహిమవెలయ। వాడుతళ్కుపసిండివన్నెమైభాసిల్లి జింకరూపముదాల్చిపొంకముగను।పర్ణశాలకుబోయిపర్ణనియ్యాం బుగాజనకపుత్రిక ప్రేమలసంచరింప।జూచిమదిలోనమెచ్చుచుసుం దరాంగి। విస్మయమునుజెందిలోకైకవినుతుడైన। వల్లభునిజూచిచ య్యానవాంఛతోడ।బలికెకనకకరముదయింప ప్రాభవమునా॥

మధ్యమావతిరాగము-ఆదితాళము.

అదిగో ప్రాణేశపసిడిజింకా। వేవేగజనిపాం। పొదవబట్టితెమ్ము నీవింకా।పదపడిచెంగునవదలకనెగరుచు బెదరిబెదరి వచ్చుచుజను చున్నాదదిగో ప్రా ॥నెనరునామీదగలిగెనేని।కోనిరమ్ముదానివెను వెంటదగిలిపనిబూని। ఘనతరంగపురీశుడవనినినుచనువునవేడితినను మానింపకు॥మదిగో ప్రాణేశపసిడిజింకా॥క॥ కోరినకోర్కెనొసం గుము।వారకశ్రీరామచంద్రవరదుడవగుచుం। కారుణ్యమతినిల క్ష్మణ।ధీరుడవై బట్టితెమ్ముదివ్యమృగంబునూ ॥వ॥ యిట్లుజనకపుత్రి కయగు సీతాభామామణి ప్రేరేపణంబు సేయుచుండి రామ లక్ష్మణులం జేకొనని మృగంబుమీదివల పెరుంగించిన లక్ష్మణుం డు రఘువరునకిట్లనియె॥

అసావేరిరాగము-అటతాళము.

అన్నవినుమూ।యిదికైతవమైనమృగమూ।సన్నెసన్నెనన్నెల

లరగ।నున్నదిదికనుగొన్న భ్రమయొక।నన్నవినుమానమ్మదగదూ।
త్రొక్కెదనీమృగమ్ము వలదూ। నెమ్మదినిసీతమ్మ దీని। విధమ్ము దెలి
యక నెమ్మిగోరెనో॥యన్న॥౧॥ దానవులకూ।పగవారలమైనమన
కూ।ఘనివైరముతోడపగతులు। మానకీక్రియ సేయుమోసము।ల
న్నవినుమా॥౨॥ మానవేశా।శ్రీరంగపురీనివేశా।కాననంబులనుం
డుజింకల।గానమామునుగానమిట్టివో॥యన్న॥౩॥గీ॥ దీనితెరగెల్లగ
నుగొన్నమానసమున।కోరిమారీచుడీరీతికుత్సితంబు। ఘనిగావించి
నట్లుగాగానబడియె।జానకీముఖకంజాతచంచరీకా॥ద్వి॥అనియిట్లు
లక్ష్మణుండన్నతోబల్క। ఘనశుచిస్మితముఖకమలయాసీత।తనభ
ర్తనటుజూచితడయంగవలదు।జననాథకులనాథచర్యానబోయి।
నీవీమృగంబును నేర్పుతోబట్టి। వేవేగకొనిరమ్ము వేడ్కతోమనమ।
వనవాసః ర్యంబువరుసతోగడపి।మనపురంబునకేగిమణిమయసౌ
ధ।మునసుంచుకొందము ముదము రెట్టింప। ననియిట్లుబల్కంగనా
రాఘవుండు।వినిలక్ష్మణునిగాంచివెసనిట్లనియె॥గీ॥ యీమృగంబు
మీదనిందీవరాక్షికి।చాలవాంఛగలెల్లెదనర। వెంటవెంటనంటివెస
నేర్పుచేబట్టి। తెచ్చిసీతకెత్తుతెగువతోడ॥గీ॥మంచిమృగముగాక
మారీచుడొనరించు।కపటమాయనేనిఘనశరాగ్ని।మడియజేసివత్తు
మహిమచెనీవింక।గాచియుండుమచటకమలముఖిని॥వ॥ఇట్లుబలికి
సీతాసుందరీ హృదయంబు రంజిల్లధనుబాణతూణీరధరుండై
మృగంబుమీదదృష్టినిలిపివెలువడి॥

ఆరభిరాగము-అటతాళము.

మృగమువెంటనంటిచనెనూ।కోదండపాణి॥మృగము॥శ్రీరామ
మూర్తి॥మృగమువెంటనంటిచనెనూ॥మృగమువెంటనంటిచనగ।న
గణితలీలనుధగ। ద్ధగితకాంతులలరగనదిదివికెగరుచు గురుగహన
ములకుదియ్యగ॥మృ॥౧॥ గరిమతోనట్టిట్టుపొంచుచూ।తిరుమేనగల్గు
చిరుచెమటబోదుడుచుకొనుచు।కరమొప్పడగ్గరినమృగవరమునుబ
ట్టగబోవ।బిరబిరనదిపరుగిడిదూరస్థలిమెరయగగనితత్తరమునవిసు
కుచూ॥మృ॥తరుణీసీతకింపుగాగనూ।నేనెట్లుబట్టు।దరుదుగనీచిత్ర
మృగమునూ।గురుతుగనతిమాయచేగ్రుమ్మరుచుచిక్కలిడసాగె।

గురుతరరాక్షసకృత్యంబిదియనిసరగునరంగేశ్వరుడూహించుచు॥ మృగమువెంటనంటిచనెనూ॥సీ॥ అంతటరఘురాముడామృగంబా నరించుమాయాప్రచారంబుమదినిదెలసి। దానిద్రుంపదలంచితడ యకతనవింటబాణంబుసంధించిపటుజవంబు। దనరప్రయోగింపతే ద్ప్రాణహానిజేసిమాయామృగాకృతిమానితొంటి।తనువుతోమారీచ దనుజుండుహాసీతహాలక్ష్మణాయంచనధికఘోర। రవముతోబలికి వాడీల్గెనవనిమీద।నంతనయ్యార్తనాదమయ్యింతిసీత।వినిమహాశో కసంతాపవివశయగుచు।మరదిగన్గొనిపల్కెత్తరముతోడా॥

శోకవిరాళిరాగము- ఆదితాళము.

పోవోయిపోవోయిలక్ష్మణా।నీయన్నకడకు ॥ పో॥ బంగారుతండ్రి పోవోయి॥పోవోయినీయన్నకేమిగావించిరో మోసము । మాయావుకారాక్షసులివ్వనమునా।యేమిదోచదు॥పోవోయిపోవో॥ శరములుచాపముబూనుమీ। చెచ్చెరజననీ। వరుడుగనన్నుబ్రోవు మీ।సరసుడౌశ్రీరఘురామచంద్రుని మోముజూడక।ఁరుఁగ ప్రాణములుండునా।తనువునిల్చునా॥పోవో॥యేమిటికెలుగెత్తిపిలిచెనో నా ప్రాణపతి।కేమినిష్టురార్తిగల్గెనో । నామానసమెన్నోదాలక వేమరుబోచున్నదిరంగస్వామినినేనెట్లుజూతునూ॥యేమిసేతును ॥ పోవోయి॥క॥ అనియిట్లుసీతబల్కగ।విలక్ష్మణుడధికభక్తివినయం బెసగం। జనకసుతదుఃఖముడుపగ। తనమదితలపోసిబల్కెధరణిజ తోడనూ॥ శోకవిరాళిరాగము-ఆదితాళము.

త్వరపడకమ్మా।అదిరాముని।స్వరముగాదమ్మా।విరిబోణిశ్రీరఘు వరుడగునీభర్త।నరసురదనుజకిన్నెరులకసాధ్యుడు॥త్వ॥విలపింప వలదు।రాముని కెందువిజయముగలదు।వలనొప్ప నాయన్నబలశౌ ర్యదర్పము।లిలన్నీవెరుంగవెకలకంఠినాతల్లి ॥త్వ॥వినవెమాయమ్మ కన్నులనీరువిడిపింపకమ్మ।నినుబాసినేనెందుజనరాదుఖలులగు।దను జులేతెంతురుతడయకవేవేగ॥త్వ॥౨॥చాలదీనతనూ। రాఘవుడిట్టు లేలచిలుచునూ।వాలాయముగరంగపతిశీఘ్రమునవచ్చు । నాఁస్య మికలేమనామాటనమ్ముము॥త్వరపడకమ్మా॥వ॥ఇట్లురామచంద్రు ని సమీపంబునకుం బోకపలుకుచున్నమరిది వాక్యంబుల కత్యంతకో

పశోకసంతాపంబులుమనంబునం బెనంగొన జానకీదేవిలక్ష్మణునకి ట్లనియె॥

శోకవరాళిరాగము-ఆదితాళము.

అయ్యయ్యో నానాథుఁ డడవిపాలాయెటనీ కానందమాయఁగదా।నీకది పర।మానందమాయఁగదా॥చయ్యానరఘుకులస్వామిగావఁబోక।చ చిక్కంపమనసాయఁగా।నట్టడవిలో॥నయ్య॥హారామయనుచు దుఃఖిం పఁగసొంపునఁ నాలకింపనాయఁగా। సారెకు మూర్ఛమునుంగుచు విల పింపఁగోరిచూడనాయఁగా।ముచ్చటదీర॥నయ్యయ్యో॥౧॥ ఘనభక్తిత మ్మునివలెనున్న పఁగతుఁడవని రాముఁడెరుఁగఁడుగా మునుకోసరంగ నా థునికికీడు డరనీమనసుచల్లనాయఁగా॥నిజంబుగ॥నయ్యయ్యో॥

అసావేరిరాగము-అటతాళము.

అలనాఁడే పాపశీలుఁడవని తెలసితేనడవికిగొనివత్తుమా। ఖలుఁడవు ఘోరకుటిలుఁడవునీతోడ।బలుకాడినంత నే ప్రాప్తించు దోసము॥ అ లనాఁడె॥ ఘనమోమునననన్న కాంక్షించి యారాఘవుని చేటుమది గోరుచు। పనిబడినాభర్తఁ పాలికిబోకనన్నను సరించియున్నావక టలక్ష్మణనీ॥వలనా॥పదపడియే సన్యపురుషులకలనైన పదమున దా కదునా।వదలకనీకున్నవరంగ భ్రామునిపదభక్తిజూచి నెమ్మదినమ్మి తినిగాక॥నలనాఁడెపాపశీలువని తెలసితెనడవికి॥౨॥ అనియిట్లు బ ల్కుచునధికదుఃఖమున।తనహస్తములతోఁ టెతఁగసుదరంబు। గొన కొనితఁగగొట్టుకొనుచు పాపాత్మ। నిన్నుకై కపుత్రుండు నెమ్మితోఁబ నుబ।పనిబడి ప్రచ్ఛన్నభావంబుగల్గి।చనుదెంచినావు వంచనశాయ బూని।చెన్నుమీరినయట్టి శ్రీరాము మోము। కన్నుదోయినిజూడక నునిల్వ జాల।సొరిదినేవనవహ్నిచారచారియైన।గరళంబుదినియైన కాయంబువిడుతు।నని ఘోరముఁగబల్కి నాలక్ష్మణుండు। వినిదిగ్గున నులేచి వెసకేలుమొగిచి॥

ఆనందభైరవిరాగము-ఆదితాళము.

ఎటువంటి మాటలాడీనావమ్మతల్లి।కటకట నెనరువీడి॥ చిటుకున నీవాడినకఠినంబులకెటుదోఁచదు నేనెటు బ్రతుకుదు భువి॥ నెటువం టి॥ననునొవ్వనాడన్యాయా।మానా నేనెప్పుడసురక్తిశావశాయ।త నయునివలెమిమ్మ నయముగొల్చుచు। ఘనభక్తినిపనమునకరుదేర

గ॥నెటువంటి॥నిన్నుసుమిత్ర గానూ।దలతురాముని।కన్న నాతండ్రి గానూ।చెన్నుగమదిలోనెన్నుదునిటువలె।నెన్న డుబలుకవెకన్నతల్లి నీ॥వెటువంటి॥౨॥ జననీ నేనింక వేగా శ్రీరంగపురధా । ముని దెత్తు బోయిబాగా।ఘనుడగు రాముని చరణములానగ। మనమున నే పాప ములెఱుగనున ॥ న్నెటువంటిమాటలాడి॥వ॥ఇవ్విధంబునంబలికితల్లి బోయివచ్చెద నీకుభద్రంబయ్యెడునని ప్రదక్షిణ నమస్కారంబులుచేసి ధనుర్బాణధరుండై పోవకాల్లురాక నెట్టకేలకు తెంపుజేసి మున్ను రాఘవుండు మృగంబువెంట జనినమార్గంబునంజనియె నంతా ॥చ॥ అంతట రావణుండుహృదయంబునసంతసమందిరామ భూకాంతునితమ్ముడేగె। నిక గ్రక్కునజానకినింహరింపగా । నెంత యుమంచివేళ।యనినింపునవొక్కయతీశ్వరాకృతిం । వింతదలిపర్ణ దాల్చి।కడువేగమెవచ్చెనుపర్ణశాలకునూ॥

పంతువరాళిరాగము- అటతాళము.

వచ్చెరావణుడంతనూ।భూతము తెల్లవిచ్చిపారుచునుండనూ ॥ చెచ్చెరకాషాయచేలము ఛత్రము।హెచ్చైనదండకమండలంబులు సి॥వచ్చె రావ॥ జపమునుపమునుననూ।పూసలు వ్రేళ్ల।నుపముసజర పుచును।చపలతమానినతపసిమాట్కి శ్రీరం।గపతినామంబులుకడు జపియించుచు॥వచ్చెరావణుడంతనూ॥స్వ॥గరిమతోడుతదశకంధ రుండిట్లు।విగివిగాసన్యాసవేషంబుదాల్చి।సరగునపర్ణశాలలోజొచ్చి।వరచంద్రహీనమైవర్ణంచునట్టి।ఘనరోహిణీ తారకనుబోలి కేల।వనజంబులేని శ్రీవనితనుబోలి।చెక్కటచెయిజేర్చిచెలగికూ చుండి।చక్కని శ్రీరామచంద్రు దలంచి । కన్నీరునించు రాఘవప త్నిగాంచి।మోన్నడుజూడనేనిటువంటిదివ్య। సుందరాంగనటంచు సొక్కిజూచుచును।కందర్పశరములకడ నొచ్చినొచ్చి।తగనిట్టులని యెత్తరమునజెంది।మ గువయాసీతతో మంజువాక్యములు॥

సౌరాష్ట్రరాగము- అటతాళము.

ఎవ్వరిదానవుసుందరీ। నాకెరుగజెప్పుముకంబుకంధరి ॥ యవ్వన మొప్పగనివ్వనముననునీవెవ్వాసిపైబుద్ధినివ్వటిల్లగయున్న॥ ఎవ్వా రి॥పరిపక్వచింబఫలంబూ।వోతరుణినీమోవివిధంబు । గురురత్నహా రశ్రీకరములౌపాలిండ్లువరతాళఫలముల కరికుంభములబోలు ॥ నె

న్నా॥౧॥లలననీకన్నులతీరూ।మంచి తెలిదమ్మి రేకులగేరూ। వలనొప్పనీదంత ములుకుంద కుట్మలమ్ములబోలు నెమ్మొముపూర్ణ చంద్రు నిమించు॥ నెవ్వా॥౨॥ చందనగంధిపూబోణి। ఓసుందర సైకతశ్రోణి। పొందుగ దేవకిన్నరనాగగంధర్వ। సుందరిజనులునియందమించుకబోల॥ రెవ్వ॥౩॥ నిరుపమబాలేందుఫాలా।నీచరితము జెప్పమచాలా।గరితవినుము ఘోరతరమృగరాక్షసవనవాసమిచ్చొటవసియింపగనుబోల॥ దెవ్వ॥౪॥కనకాంగినీనామమేమీ।నాధునిపేరుజనకుపేరేమీ।ఘనరంగధాముడిచ్చిననేప్రేమతోడనాకనువుగజెప్పమువినగోరియున్నాడ॥౫॥వ॥అనియివ్విధంబునంబలికిన విని జానకీదేవి కపటయతివేషధరుండైనరావణునకర్ఘ్యపాద్యాదిసత్కారంబులుగావించి మహాతపస్సంపన్నుండనితలంచియిట్లనియె॥

ద్వి॥ వినవయ్యతాపసవిశదంబుగాను। వినిపింతుదశరధవిభునకేయ్యలను। చారుతనూజుండై సత్యాత్ముడైన।శ్రీరామునకు నేను చెలువొందుసతిని। జనకపుత్రి నినన్నజనులెల్ల సీత। యనుచుందు రవనిలోనరుదుగాకైక।వరముచేజనకాజ్ఞ వనవాసమునకు। వరమతినేతేరవాంఛించివేగ।వచ్చనాపతివెంటవలనొప్ప నేను।మచ్చికతోడనామరిదిలక్ష్మణుడు।చనుదెంచితిమిమౌనిసంఘముప్పొంగ। ననువుగామేమిందునధివసింపగను।మృగమొక్కటరుదేరమిగులనేగాంచితగబట్టితెమ్మనితద్దయువేడ।రామచంద్రుడుబోయిరాకన్నపిదపరామానుజుండేగెరయమునసటకు।చెలగినాకధనీకుజెప్పితినిటకు।నలరుచునీవేలనరుదెంచితనిన।వినిరావణుడు మోహవివశుడై సీతగనిబల్కెనింకనాకధవినుమనుచ॥

కేదారిగౌడ-అటతాళము.

ఏనురావణుండను। నచ్చితి మోహమింపుమీరుచుండను। ప్రానిమృత్యువునైనమృత్యువునొందింతు। మానకయముడైన మర్దింతుబంధించి॥ నేను॥ రాక్షసనాధుడను।దేవతలనుశిక్షించియున్నాడనుదక్షుడననుచుశివుండుండుకైలాసమక్షీణబలమునన మరనెత్తినవాడ॥ నేను ॥౧॥ కడుకోపమొదవగను।లోకములెల్ల గడగడవణకాదును।పుడమియాకాశమువడిబట్టివాయింతు। తడయకనాలంకజ

డసిధిలోనుండు॥నేను॥౨॥ నాయాజ్ఞ లేకుండనూ।సూర్యుడుయెండ
గాయకుండును చాలను।బాయక చల్లగ పవనుడు వీచును।శ్రీయుతుం
డను రంగనాయక సాక్షిగ॥ఏను రావణుండను॥౩॥వ॥ అనియివ్విధం
బునం బల్కి జానకింగనుంగొని రావణుండు మరలనిట్లనియె॥

కేదారిగౌళ- అటతాళము.

రావే పోదము సుందరీ।లంకకు తలిరిణీ॥రావే॥ రావే పోదము నీవు రా
ముని విడువుము।భావింప నీవు నా పట్టంపు రాణివై ॥రా॥ వినవే జానకి
లంకనూ।గోపుర హేమ।మణిమంటపములో ప్పునూ।ఘన హేమ సౌ
ధములను వుగనుద్యానవనములు కోలనులు వలసిననున్నావి॥రా ॥
తరుణులనందరునూ।నీ శేవల। మరగింపచే శెదనూ। పరిమళమాల్య
చందనరత్న భూషణాంబరములు ధగియించి గరిమ భోగింతాము ॥
రా॥అతివలు ననుగోరుచూ।కానుకలిత్తురతి మోహావశులగుచు। మతి
నిన్ను జెందిన గతి వారి జెందదు। సతతము శ్రీరంగపతి మాయా విధమే
మొ॥రావే పోదాము॥ద్వి॥ఆనియిట్లు రావణుండరుదుగా బల్కి।తన
పూర్వరూపంబు తడయక జూప।కని సీత మూర్ఛిల్లి గ్రక్కున లేచి।
కనలి చిత్తంబున కడు ధిక్కరించి।వానికిట్లనియె నువరకిరవాణి। మాన
క శ్రీరాము మదినమ్ముకొనుచు॥

ఆరభిరాగము-ఆదితాళము.

ఏల పాపములాడేవురా।వోరోరి రావణ ॥ఏలపా॥ ఏల పాపము
లాడేవు।కాలము డగ్గరిన రీతి।శీలము లేని దుష్టాత్మ శ్రీరాములకెల్లాలర
నేనూ॥యా॥రాముడే నా హృదయేశుడు।మోహానియ్యడో।రాము
డే నా చిత్తచోరుడు । రాముని దప్పనన్యుల నేమియు గోరను మది శ్రీ
రామపాదశ్రయసు వ్రతను రాముడే నా విహితుడు పతిదైవము ॥
యా॥యింత దుర్మదాంధమేలరా।దుర్వాక్యములు వింతగాననా
డనేలరా। యింత త్రుళ్ళవలదు రా నా కాంతుడు వేగమె వచ్చి పంత
మున నీ శిరములు కరము లెంతయు ఛేదించు శరముల ॥యా॥ ధీరుడై ఖ
రదూషణాదులా।చంపడే రాముడారయ ఘోర బాణముల రా। సార
సాక్షుడై నరంగస్వామి నై చెలువొందు రఘువీరుని దోర్బలములు నీ
వు విని తెలియవె రాక్షసగణముల చే॥యాల॥వ॥ఇట్లు బల్కుచున్న సీ

తావాక్యంబులు లెక్కసేటకదుష్కాముండై దుర్వాక్యంబులాడు రాక్షసేంద్రునకుమరలవై దేహియిట్లనియె॥

ఆనందభైరవిరాగము- అటతాళము,

నేను శ్రీరాముభార్యనురా।కన్నుగానసనిపల్కులాడకురా॥పూని వస్త్రమునదావాగ్నిగట్టగబూనువానిచందముగాదెవలసిగోరుట నన్ను॥వలనొప్పకంఠమందునను।దొడ్డశిలగట్టుకొనివేగమునను। జలనిధిదాటగదలచినట్లనుకొమ్ము ఖలుడనాపైనీకు గలమోహ మెల్లను॥ నేను॥౧॥గరిమనాపతిలేనివేళ।వంటరిపాటుననువచ్చిచాలా। దురితములాడేవునీవునీవారితో మరణముబొందగమతినూహించితి వేమొ॥ నేను ॥౨॥ నాపతితోసరివారు।వోపాపాత్మజగములలేరు। శ్రీపతియగురంగధాముడునాపతివో పతితుడనీవేపాటివాడవు॥ నేను శ్రీరాముభార్యనురా॥౩॥ సీ॥ మదగజేంద్రముతోటిమార్జాలముసమంబె ఘనచందనముకుపంకముసమంబె। పరభుగెంద్రునితోడ వాయసంబుసమంబెజలరాశితోడపల్వలముసమమె। సింహంబునకు నక్కచెలగిసమంబౌనెపసిడికెలోహంబుపరగసమమె। సారసంబునకునుసమమౌనెగృధ్రంబుకలహంసతోటిబకంబుసమమె।గానదుష్టాత్మవినరరాఘవునకీవు।కోటిజన్మంబులెత్తినసాటిగావు।మించిరామాగ్నిపైనీకుమిడతబోలి। వచ్చిచచ్చెదువాంఛవలదుపోరా ॥

వ॥ఇవ్విధంబున జానకీదేవిబల్కిన వాక్యంబులువిని రావణుండద్దేవిని హరియింప మనంబునందలంచి కడియంజనుదెంచి హారామ హాలక్ష్మణేతి వాక్యంబులుబల్కుచు రోదనంబుసేయుచుండ బలాత్కారంబునం గొనిపోయి కఠినవాక్యంబులనద్దేవిని భర్జింపుచు నంకస్థలంబుననిడికొని రథంబునం గూర్చుండి గగన మార్గంబు నబోవుచుండె నంతట॥ క॥ దారుణమునదశకంఠుడు।క్రూరతవై దేహినిట్లుగొనిచన।యాహాకారముతోవనదేవత। లారూఢినిభీతిబొందిరతికంపమునన్ ॥ గీ॥ తళుకుబంగరుకెంజాయతనువుమెరయ। రక్కసునిచాతజక్కి శ్రీరాముభార్య। యాకసంబునబోవుచు నాత్మనాథు।గూర్చిదుఃఖింపుచునుబల్కెనువలయ యాక్షి॥

శోకవిరాళిరాగము- అటతాళము.

రామరామరామరామా| రామరాక్షసవిరామా| హామనోనాధహృదీశా|హామహానుభావదేవా||౧|| హాజగన్మోహనవేష| హా మునీంద్రజనతోషా||౨||హావిశాలారవిందాక్ష|హామహాశాత్రవశిక్షా||౩|| శ్రీకరరంగపురీశా| సేవకసంతాపనాశా||౪||

అసావేరిరాగము- ఆదితాళము.

వేవేగరావోయివల్లభా| మోసమువచ్చె||వేవే|| వేవేగనుగ్రతగదిసిదేవరదేవినౌనన్ను| రావణుడుగొంపోవుచున్నాడు|| దివిజనుచున్నాడు||వే|| గ్రక్కునమొగయాలకింపుమీ| ప్రాణేశనీకు| మ్రొక్కెదనసువిడిపింపుమీ||దిక్కులేనివారికెల్ల| దిక్కైనసిపుగర్గసె|దిక్కులేనివాననైతిగా మోసపొలగా||వెవె||౨|| మామునుజూడగగల్గనో| లేకయుందునోస్వామినాపాల్లికనెట్లుండునో| శ్రీసుతోశ్రీరంగపురధాముడవైసట్టిరఘురామచంద్రసౌమిత్రితోడనూ|| రోషముతోనూ||వేవేగరావోయి||౩||వ|| అనిఇట్లుపలపించిహారామయనుచు| ఘనమయినకాటుకకంటనీరెల్ల|చనుకట్టుపైబడజానకిదేవి|మొనసిదుఃఖింపుచు మోహనాకారు|డనన్ను శ్రీరాముడనుజునితోడ|నన్నుపుగారక్షింపసరుదెంచుసనుచు| గరిమతోదిక్కులుకలయజూచుచును|విరివిగారాకున్నవెసలపింపుచును|హాలక్ష్మణాచాలనన్యాయవాక్కులు|లేలబల్కితినినిన్నేలబొమ్మంటి|శ్రీకరంబుగనీవుచెలగికాపున్న|నాకిట్టికష్టంబునాయన్నరాదు ||వ|| అనియిట్లత్యంత దుఃఖావేశంబున కురరియనుపులగు చందంబున విల పించుచు నిట్టూర్పులు నించుచు తనమనంబున శ్రీరామచంద్రుని మందస్మిత ముఖారవింద సౌందర్యంబు మాటిమాటికి దలంచుచు జగన్మోహనదివ్యమంగళవిగ్రహుండగు ప్రాణవల్లభుండు కన్నులంగప్పినట్లుదోచిన మణివిస్ఫురితకంకణాలంకృతంబులగు హస్తంబులుసాచి కౌగిలింపంబోవుచు మూర్ఛిల్లుచుమరలందెలివొందుచు కన్నీరు మున్నీరుగానేడ్చుచునిట్లనియె||

పున్నాగరాగము-అటతాళము.

మొందున్నావోకదా| శ్రీరామరామ ||మొం|| పొందుగనీప్రియ

సుందరినగునన్ను। జెందినయూపదచందమెరిగి దాయ ॥ కెం ॥ ఘనప న్నగశాలకొక్కడు రాక్షసుడు జేరి। ననుగొనిపోచున్నాడనఘవాని నిద్రుంప॥ కెందు॥ శరచాపములుబూనిజను దెంచియాదైత్యు। వరుని కంఠములుభీకరలీలదునుమాడ॥ కెం॥ వంటరిపాటునవచ్చినన్గొనిపో వు। తుంటరిదైత్యునిజంటబాణములేయ॥ కెం॥ నీమోముజూడకనిమి షమోర్వరంగ। ధామదయాకర ప్రేమతో వేంచేయ ॥ కెందున్నా వో కదా॥

భైరవిరాగము-అటతాళము.

యెంతనగుబాటాయజన్మమిలలోననాకూ॥ కాంతలకెందైనఘ విలో। నింతమరవస్థలుగలవె। చింతశాయఫలమేమి। మున్నెంతదోస ముజేసితినో॥ యెం॥ జనకపుత్రికనైదశరథునకుపెద్దకోడలనై। ఘనజ గన్మోహనుడౌ శ్రీరామునకుభార్యనై। చెనటియా యీ రాక్షసుని చేచిక్కిదిక్కులేకదుఃఖ। వనధిమునగనాయకై కవాంఛనంభో పూ ర్ణమైవెలయ॥ నెం॥ ౨॥ గరిమతో మాయామృగమును। కాంక్ష జేసిపతిని బంపి। వరుసదుర్వాక్యములెనేంనో। మరిదినంటిని। సరగునన్నావంటి క్రూరచరితకిట్లురంగపుర। వరునిబాయుటెంతపనివారకసాటివా రిలో॥ నెం॥ ౩॥ వ॥ ఇట్లుబలికిపాపకర్ముండగురావణుంగనుంగొని॥

ముఖారిరాగము-ఆదితాళము.

రక్కసనన్నువిడిపించరా। శ్రీరాములనుజూచిరానివ్వరా। చక్క నిరాముబాసితుణమైనతనువునిలువ। దక్కజముగనీకుమిక్కిలిపుణ్య మగు॥ ర॥ పాపపుణ్యములెరుగవేమిరా। వో పాపాత్మ యింతకఠినమే లరా। నాపోవుటకునెంత తాపమొందుచురంగ। శ్రీపుణ్యనిలయులా తిఙంచెదివెదకుచుందురో॥ రక్క॥

అసావేరిరాగము-అటతాళము.

ఎక్కడబుటితినెక్కడజొచ్చితినెక్కడికరుదెంచితి॥ చక్కని శ్రీ రామ స్వామిసన్నిధిబాసిరక్కసుచేజిక్కరానాయనభమున ॥ యె క్క॥ పనిబడికదిసినన్నీపాపకర్ముడుగొనివచ్చు టెరిగున్ననూ। పెను దీగవృక్షమునునుసరించినట్లు। ఘనమతిరాముని కౌగిలివిడుతునే ॥ యెక్కడ ॥ యిరువురమెన్నడిట్లెడబాయ మీవేళ నరుదారనదిగల్గె నూ। కరమొప్పశ్రీరంగపురపతిస్వామింకగరిమ గన్గొనెడిభాగ్యము

నాకులేదేమొ॥యెక్కడబుట్టితి॥చ॥ కురువకమాధవీవకుళ కుందల
వంగరసాలకేతకి।సరళకురంట కార్జున విశాలకదంబ ఫలాశము
ఖ్య। సుందరతరులార పక్షిసముదాయములార మృగంబులార।నా
పరిభవమెల్ల రాఘవునిపజ్జను జేరివచింపగాదగుక॥గీ॥వినవె గోదా
వరీదేవివిమలభక్తి।వందనముజేతునావార్త వల్లభునకు। చెప్పగద
వమ్మదయబుట్టనొప్పదనర।మాల్యవంతమదెల్పు నావాటపతికి॥

ముఖారిరాగము- ఆదితాళము.

రారయ్య పుణ్యాత్ములార రాముభార్యనూ। నన్నుచేరి బ్రోవర
య్యకరుణచెలువుమీరనూ॥ ధన్యులారసకలలోకమాన్యులారా।
సౌజన్యతగావుడీసురమూర్ధన్యులార॥౧॥ అనుపమదేవగంధర్వగ
ణములార।వీనిదునిమిరక్షింపుడీకీర్తిధనముచేరా॥౨॥దండకాటవి
లోనున్నతపసులారా।మీయండనిలుపుకోరయ్యనన్నసఘులారా॥
౩॥ సోమసూర్యులారనన్నుసొంపుగానుగంగధాముగూర్పరయ్య
నిండుప్రేమతోనూ॥౪॥రారయ్య॥వ॥ఇట్లుబలికిన॥క॥అంతటజటా
యుగనియా। కాంతామణిఘోరదుఃఖకలితాత్మకయై। పంతమెల
పగరాముని।కెంతయునావార్తదెలియనెరిగింపుదయక॥

వ॥ యివ్విధంబునంబలికినజనకపుత్రింగనుంగొనిగృధ్రపతియి
ట్లనియె ॥మ॥ చింతంబొందకుమమ్మతల్లి।వినునీచిత్తంబురంజిల్లదు
ర్దాంతోదగ్రబలంబునం।రిపునిదోర్దర్పంబుమాయించి। నీచిం
తాశోకమణంగవీని।శిరముల్చెండాడినిన్నెంతయుం।కాంతుంగూ
ర్చిసుఖింపజేతు।ధరణింకళ్యాణిశ్రీజానకీ॥వ॥ఇవ్విధం బున యూర
డించిదశకంఠునకిట్లనియె॥

పంతువరాళిరాగము-ఆదితాళము.

విడువరా।ద్రోహివిడురా।సీతమ్మను॥విడువరా॥గడుసరిదైరా
ముపడతినెత్తుకనీవు।వడిజనుచున్నాడవడుగుదాటనివ్వ॥విడు॥ ముక్కు
నచెక్కలమొనసిపదంబులచక్కగనినుజీల్చిచెక్కుచెక్కలుజేతు॥
విడు॥ భీతిలేకజగన్మాతనుదొంగిలి। పాతకనీవునాచాతబ్రతుకబో
వు॥ విడు॥ వంతరిపాటునవైదేహిదెచ్చిన।తుంటరితనమెల్లమంటి
పాలొనరింతు॥విడు॥చండకోపమునసీకండలుపెకళించి।దండిభూ

తములకు మెండైనబలిసేతు॥విడు॥రంగపురీశునిరమణి విడువకున్న॥సంగరస్థలినరక్షణమునబడవైతు॥విడువరా॥క॥ అసిపల్కి రావణునిమా।కోణనిపదములదన్ని వానిఘోరాంగముము।క్కునజీల్చి నెత్తురొలుకగ।ననిజేసెను దేవగణములాశ్చర్యపడగ॥ద్వి॥ అంతట రావణుండధికోగ్రుడగుచు।వింతగా బహుబాణవితతులుగురిసె।కులశైలములబోలికొమరొప్పనీరువు।రెలమి బోరిరినెత్తురిలమీదగురియ। పరగనంతటగృధ్రపతిధైర్యమునను। వరిసూత ఘోటకధ్వజచాపములను।ధరణిపైబడనేయుచును జేంద్రుడంత।ధరణికి జేరిసీతనుడించి వచ్చి।ఘనఖడ్గమునను పక్షములు ఛేదింప్ప। ననువుగా గృధ్రేశుడవనిపైబడియె।కరమొప్పనంతటకన్నీరుగార। ధరణిజవడిఁడ సీతగగృధ్రపతిని। గరిమకౌగిట జేర్చికడుదైన్యమమర। గురుశోకమునబల్కెకోకిలవాణి॥

తోడిరాగము-ఆదితాళము.

దుఃఖముమీద దుఃఖమాయెనూ।నీదురవస్థకన్నులజూచుటను॥దుఃఖముగలిగె విభునితోలగి వచ్చుటకునా। దుఃఖము మూన్ప వచ్చి దుర్మతిచేగూలుటచే॥చ॥ యేమోమదశవచ్చె చాలనూ।రంగధామునికరుణలేదాయను।నామామసఖ్య మెంచినన్ను బ్రోవదలంచి। యేమోవింతగబోరిభూమిపై బడుట వలన॥ దుఃఖము మీద దుఃఖమాయ॥వ॥ఇవ్విధంబున సీతాలతాంగి దుఃఖించు సమయంబున రావణుండద్దేవిని గొనిపోవగమకింప నతిదుఃఖంబున నొకవృక్షంబుగౌగిలించుకొని యూడిగిలం బడి హారామ హాలక్ష్మణేతి వాక్యంబులు బల్కుచు విలపింప నద్దురాత్ముండు బలాత్కారంబునంగొనియాకాశమార్గంబునంబోవుచుండె నప్పుడు సకలలోకంబు లాహాకారంబునంబొంది వడవడవడంకుచు చీకట్లుగమ్మినట్లుండె దండకారణ్యనివాసులగు మునిగణంబులు సీతావృత్తాంతంబు యోగమార్గంబునం దెలిసి రావణునకు మరణంబు సిద్ధంబని తలంచిరంత॥

వ॥ఆసమయంబున॥గీ॥శ్రీకరంబగు పీతకౌశేయవస్త్ర।కనకభూషణకలితమై గానుపించు।సీతతో రావణుడుదిలి చెన్నుమీరె।వహ్నితోడుత వెలయు పర్వతముబోలి॥గీ॥చారుభూషణనిచయఘోషంబుతోడ। దనరుచున్నట్టి సీతతో దశశిరుండు। గగనమునబోవుచును

మించెగౌరవమున। గర్జనము సేయునీలమేఘంబుభోలి॥క॥ జనకసు
తముమ్నుతనపతి। మనమున సంతోషమొందిమానక మెచ్చం। మునుత
లముడిచినపరిమెళ। ఘనపుష్పములెల్ల వీడికడువడిద్రాలెన్॥

గీ॥ కమలదళనేత్రి యొక్కనగంబుమీద। వానరులనేవురనుగాంచి
వస్త్రమునను। భూషణంబులు బంధించిపోసగవై చె। పతికితనవా
ర్త జెప్పంగమతినిగోరి ॥సీ॥ అంతటరావణుండాసీతగొనిపోయి
లంకలోపల జేరిపొంకమునను। కనకగోపురహర్మ్య మణిమంటపా
రామకాసారముఖ్యముల్ కలయజూపి। గరిమభోగింతమీఘనపట్ట
ణంబునన న్నేలుమనిబల్కనాతియల్గి। కాఠిన్యవాక్యముల్ కడువడిబ
లుకంగవాడంతను గ్రుద్ధై వనితనపుడు। దనుజకాంతలకాపుంచితగ
నశోక। వనమునందుండగా జేసివలపుగల్గు। నట్లుబోధింపబనుపుచున
ధికకాము। తప్పుడయ్యెండెనీరీతిదశశిరుండు ॥చ॥ అంతటరామచం
ద్రుడు। మృగాకృతిదాల్చినదుష్టరాక్షసం। పంతముతోడజంపితన
పర్ణకుటీరముకేగుదెంచుచో। సంతసమింతలేకతనసన్నిధికై జను
దెంచులక్ష్మణుం। వింతదలిపజూచి। రఘువీరుడుబల్కెసతండుమ్రొ
క్కగన్॥

సురటరాగము-ఆదితాళము.

ఏలవచ్చితివిజనకజనొంటిగనేలమిఘోరవనమునడించి। లోలనే
త్రిదనుజస్వనమునువినిజాలిబొందిననుబనుపగవచ్చితి॥వే॥ విజనాట
వీజనకజనువిడిచిరావిహితముగనీకిట్లా। సుజనవినుతవినుమతికరి
నోక్తులుసుదతిబలుకనిలువకచనుదెంచితి॥౧॥ పొందుగనడవినిసీత
ను బ్రోచుచునెందుబోవుమనవేదా। సుందరిననుకడుదిట్టుచునేడ్వగ
ముందువెనకదోచకనిటువెడలితి॥౨॥ మగువపలుకులకురాజెల్లనె
ద్దుష్టగరాక్షసభయమందుండా। విగతఖేదరంగేశ్వరనీవికవేం
చేయుముపోదమునశాలకు॥౩॥ యే ॥గీ॥ అన్నతోడనులక్ష్మణుం
డార్తిదనర। నంజలిఘటించివిశదమానట్లుదెలిపె। జనకపుత్రికయా
పర్ణశాలలోన। మించిపల్కెనకఠినోక్తులంచితముగ॥ద్విపద॥ అంత
టరఘురాముడనుజునిజూచి। వింతగాబల్కెనవ్విపినంబులోన। సీత
నొంటిగడించిచెలగినీవిట్లు। ఖ్యాతిగానరుదేరఘనకార్యమగునె। త
లకకనెట్టివార్తలన్నగాని। వెలదియేమాయనోవెసఘోరదుష్ట। గు

రుమృగంబులచేతగూలెనో లేక। బరువడిరాక్షసుల్ బరతెంచి దాసి।
హా సీతా మహాలక్ష్మణా యనియార్వ। కోరిగొంపోయిరో కసుమతురై
చంపి। భక్షించిరో దయాభావంబు మాని। వీక్షింతమిక బోయి వేవేగ
సఖియ। నని బల్కి రఘువరుండనుజుని గూడి। ఘనపర్ణశాలమార్గ
ము బట్టిచనుచు। తమ్ముని గ్గని తడయక మోము। దమ్మి విన్నన జెందత
గ నిట్టులనియె॥

శోకవిరాళి రాగము- అటతాళము.

యేమిదోచదాయ సీతనెట్లుగందు। ఆరామకు క్షేమమే వనసీమ
యందు॥ చారుమృగములకు కన్నీరు జారసాగె। బల్ క్రూరముగ గో
మాయువులు గుయ్యసాగె ॥౧॥ తడబడుచున్నాది నా పాదద్వయం
బు। ఆపడతి మదికెంత గల్గెనో పటుభయంబు ॥౨॥ చాలచీకట్లా
యె పర్ణశాలదిక్కు। సన్నెలి నసద్గుణవతి నాకెపుడు మ్రొక్కు ॥౩॥
రమణి హంసనడతో నెదురైరాని దేమి। ఆ కమలగంధి మేనితళుకుగా
నమేమి ॥౪॥ కళలుగల్గు రంగపుర కాంతతోను। నే వలపున బాసించక
గా నిలువలేను ॥౫॥ వ॥ అంత॥ గీ॥ అన్నదమ్ములిద్దర తివేగముస బోయి।
పర్ణశాలజొచ్చి పద్మనేత్రి। నచటగానకార్తి హా జానకీయంచు మూ
ర్ఛ బొంది పొంది మొనసి దెలసి॥

ఘంటరాగము. అటతాళము,

సీతయేది। సౌమిత్రి। సీతయేది॥ తమ్ముడమన సీతయేది॥ సీతలావణ్య
సమేత పావనగుణవ్రాత విమలధీవిఖ్యాతయైన సమన॥ సీత॥ రంగపుర
మున వెలుంగుచునుండు సారంగనేత్రి మోహనాంగియై మించిన॥ సీ
తయేది ॥క॥ అని యిట్లు బలికి తత్తర। మున రాఘవుడనుజు గూడి ముది
తామణిని। ఘనగిరులు తరులపొదలను। పనిబడి తగ వెదకి వెదకి పర
వశుడగుచున్॥

అసావేరి రాగము- అటతాళము.

చందనభూరుహమా। సీతాసుందరిగంటివటే। మందారమమ
మా। కుచజితమందర నెరుగవటే॥ సుందరమన్మథమా। మత్ప్రియ నేం
దుగనుంగొనవా। మందస్మితముఖిని। సఖిని కుందమ కానవటే ॥౧॥
శ్రీకరగుణవతినీ। సతిని యశోకము చూచితివా। సీకరణిని నన్ను। చా
యవె శోకరహితముగను ॥౨॥ కీరమ పల్కగదే। చారుమయూరమ

దెల్పగదె। కూరిమినను బ్రోచు। శ్రీమన్నాకీమణిజాడా॥ ౩॥ భృంగవితతులారా। లలితరథాంగయుగములారా। రంగపురస్థలినివెలసి నరమణినిగనుగొనరా॥ ౪॥ చందనభూరుహమా॥ ద్విపద॥ అనియిట్లువెదకుచుహాసీతయనుచు। కనుదమ్ము లనుయశ్రుకణములుజార। వనజాకరంబులవరనదీస్థళుల। ఘనమైనగుహాలలోకలకంతినభ్రుడు। వెదకిలేకన్నా పీరవర్యుండు। మదితల్లడిల్లంగమగువగోనన్ను। వదలిపోవుటకెట్లువలసెనీమనసు। సదమలమతినొక్కసారినీమోము। సుదతిరోకన్నులచూపవేవేట్క। మోము మోమున జేర్చిమోహము ప్పొంగ। వేమరుభాషింపవేమెప్పుగాతి। చెలియనీతొడలపైశిరమటుచేర్చి। చెలిమినేబవళింపచెలువొందమేని। చెమటనీపయ్యదచే నంటితుడుచు। మమతయుమోహంబుమానితివేమే। వినుముసౌమిత్రి జలింపంగనేర। జనుమయోధ్యకునీవుచర్చింపవలదు। తగకైకమదిలోనదలచినట్లుగను। జగతిసకామమైచక్కగావెలసె। ననిపల్కివిరహాశోకాతురంబున్ననుమ। జనకనందనరూపుచయ్యనదలచి॥

పున్నాగరాగము-అటతాళము.

ఎంతబోతివేదివ్యసుందరీ। నన్నేలినఘనకంబుకంధరీ। పొందుగపున్నమ చందమామను గెల్వ నందముగల మోముచంగముజూపక॥ ఎందు॥ ౧॥ నేరములున్న శమింపవె। నన్నుజేరిచెచ్చెరకౌగిలించవె। భూరివిక్రమశౌర్యపూర్ణులమైనిన్ను। ఘోరవనంబునగోల్పోతిమయయో॥ ౨॥ చిరునవ్వుపలుకులుబల్కవే। నీకరుణామృతమునాపైజిల్కవే। తరుణిరో శ్రీగోదావరిస్నానముకరుదుగనా వెంటనరుదేరకీవేళ॥ నెందు ॥ ౨ ॥ సుదతినీతనుకాంతిజూపవె। నామదితనాతాపముబాపవె। వదలకనినుగూడివ్వనమయోధ్యగనెంతు। నిదియరణ్యముగనాకిపుడుదోచుచునున్న॥ దెం॥ ౩॥ రాయంచనడలుజూపించవె। నాయకినన్నుసేవించవె। బాయకశ్రీరంగభవనములోపల। వేయువిధంబులవేట్కలమించుచు॥ ౪॥ నెందుబో॥ ౫॥ ఎక్కడనున్నది చెప్పవు। చక్కనిభూపుత్రిపవనశాలవిడిచితా। నెక్కడికేగెనోరక్కసు। లక్కజముగచంపితినిరో హాసౌమిత్రీ॥

జుజావంత్తిరాగము-అటతాళము.

బ్రతికియున్నదోలేదోపణతివైదేహి। బ్రతుకనెటికిచారుమతిసీ

తనికఁ బాసి॥మనవిలువిద్యసీతనుగావదాయె। మనపర్ణశాలశోభన
హీనమాయె॥౧॥దనుజులుద్ధతినిసీతనుడాసిచంపి। తినిరొచంపకదో
సఖునిదాఁచినారో॥౨॥సతిఘోరవనమగ్గతతులలేదాయె।సతిదుఃఖ
జలధినామతిచెందనాయె॥౩॥ఇచ్చటనిలుచుండునిందీవరాక్షి।ముచ్చ
టలచోట్లమునసిచెప్పుచునాతో॥౪॥ గరిమతోఁడుతరంగపురమున
నుండు।గరితనన్నెడబాసినరమరచేసి॥౫॥ బ్రతికియున్నదోలేదో॥

వ॥అనిపల్కి-మితిలేనిశోకావేశంబుననిట్లూహించుచు॥

అసావేరిరాగము-అటతాళము.

పొలతివంచనజేయకే।నవ్వులుజాలుఁపొదరిండ్లలోడాగకే॥ జల
జాక్షినీమీదివలపునిలుపలేకపిలచినబలుకకనలమటబెట్టేవు॥ విగత
ఖేదునిజేయవే।నీచెక్కిళ్లనిగనిగలికజూపవే। వగమీరనెకసక్కెములక
నిల్పుమలసితిమగువవానిల్జూపులసొగసెల్ల జూపక॥౧॥ వనమృగ
మిటుదేకనూ।వచ్చితిననివనితకోపమొసీకునూ। వనజగంధిరోరంగ
వాసవై వెలసిన నినుజూడకున్న నేనిమిష మోర్వగ లేనూ॥ పొలతి
వంచనజేయకే॥

పున్నాగరాగము-అటతాళము.

రావెకళ్యాణి।హరినీలవిరాజితవేణి। రావెశ్రీవైదేహి।రావెసీ
తాంగన।రావెహోమైథిలిరావెశ్రీజానకీ॥ కనుపడవేమే।నీమదికింత
కాఠిన్యమేమే। ఘనభక్తిసౌమిత్రి కాననఫలములు గొనివచ్చినాఁడిం
డుకోరిభుజింతము॥౧॥మనపర్ణశాల।చీకటిజెందెమగువయీవేళ।
కనకకంకణదివ్యకరపద్మమున నేడువనపుష్పములనెల్లవలసికోయ్య
వదేమి॥౨॥ గరిమతోమించు।శ్రీరంగాఖ్యపురినివసించు। గరితనీనగు
మోముగానకుండగ రేనుచరణాబ్జములఝుళంఝుళలనందెలుమ్రో
యు॥౩॥ రావెకళ్యాణి॥ వ॥అనియిట్లుంచితమోహతాపమున నయ్యా
బ్జాక్షిమందస్మితాననసౌందర్యము మధురవాగ్విలాసము లానప్రత్య
ముంప్రేమయుం।తనలోదానెతలంచి మూర్ఛిలుచు సీతానన్ను
గొంపోవరమ్మనుచుంచయ్యనలేచిబిల్చుచు వడింపోతమ్ముఁడా యం
చునూ॥౪॥ ఈరీతినివిలపింపఁగ।నారాఘవుజూచితమ్ముడనెనంతట
ధాత్రీరమణాదుఃఖమొందకు। మీరమణిని వెదకికొందమంతట నింక

ము॥గీ॥అవని శ్రీవిష్ణుడసురేంద్రుడైన బలికి। కోరి బంధించి వసుమ
తి గొన్నగతి। సతులధీరత్వమమరంగ సధికవెదకి। సతిని సాధించి పొం
దెద వతిసుఖంబు॥ద్విపద॥ అనివిని శ్రీరాముడనుజుని జూచి।ఘనమతి
వనవాసకాలంబు గడపి।మనపురంబునకేగి మాతలకెట్లు।వినిపింతు మీ
మాతలు దీరులమయ్య।నిర్వీర్యుడనియు సునిర్దయుండనియు। నుర్వి
లోనిట్లందురూహించి జనులు। జనకనృపాలుండు చనుదెంచి సీత। న
నువుగాగనగోరి యతివ లేకుంన।శ్రీరాఘవేశ్వర సీతయేదన్న।ధీరత
నేనేమి దెల్పుదునవ్వ|డని చింతజెందుచు హా సీతయనుచు। మునుకొ
నిసౌమిత్రి మోమటుగాంచి। తరళాక్షి సీత గోదావరీనదికి। వరప
ద్మములు గోర్యవాంఛతోనకట। జనియనో నీవేగి చని చూడుమన్న।
చనిగాన కా వార్త చయ్యన చెప్ప।విని తానె చని చూచి వెలది లేకున్న।
పనిబడి వెంచేసెపతిదీనుడగుచు॥సీ॥ అన్నలక్ష్మణ జనకాత్మజ రాక్షు
సాధీనమై వనములో దిక్కులేక । కనుదమ్ములను బాష్పకణములు జా
రంగనెంత దుఃఖించుచు నేమియనెనొ । సతతంబు ననుబాయదతి
మోహభక్తి చేకదలంగ వెను వెంటగదలుచుండు । నీశిలాతలమునం
దేను వసింపంగ నాతోడ గూర్చుండినయది మూలాడు।నిట్టి జానకి యొం
టిగా నెట్లు జనెనో।చారుచందనలిప్తమౌ చన్నుదోయి। పరగనీవేళ
శోణితపంకదిగ్ధ।మగుచునో ప్పారుగా మోలునరసి చూడ॥వ॥ఇట్లు బ
బలికి కర్మసాక్షియగు సూర్యునింగనుంగొని నీవెరుంగని వృత్తాం
తంబు లేదు గావున సీతావృత్తాంతం బెరింగింపుమని పల్కి తదనం
తరంబున నదీపర్వత ప్రముఖంబుల నడిగి దుఃఖించుచు సర్వంగసుం
దరియగు సీతాస్వరూపంబులం కన్నులంగట్టినట్లు దోచినంగౌగిలిం
పంగోరుచు పరిపక్వబిల్వతాళఫలంబు గాంచి జానకీకుచద్వయం
బు దలంపుచు పద్మబులభీతకురంగంబులంగని వైదేహి నేత్రంబులు స్మ
రింపుచు శుకపికస్వనంబులాలించి మైథిలి గళస్వనంబని నమ్ముచు కద
ళికాండంబులం దర్శించి భూపుత్రికతొడలసొబగని యూహించు
చు మత్తమధుకరశ్రేణులం జూచి సీతాభామామణివేణి భరంబు
నెన్నుచు లతావితానంబుల నవలోకించి యచ్చేడియతనువు భావగదు
చు సైకతంబులవిలోకించి యక్కంబు కంధరి నితంబంబులు నుతిం

పుచు మందకుట్మలంబులనిరీక్షించియవ్వధూటిదంతరుచివహించుబిం
బవటుఫలంబులవీక్షించియక్కోమలికోమలాధరంబు స్తుతింపుచువి
రహాశోకసంత ప్తచి త్తంబున॥

అసావేరిరాగము-త్రిపుటతాళము.

ఏలావచ్చితివెనీవీఘోరవనసీమకెమెవో జనకాత్మజా।యేలనెనీ
తనీవింటనుండుమటన్నానాలించివినవైతివి।వెంటనంటితివి॥యే॥సా
ముజగమననీచక్కందనముమరల।భామయెన్నడుచూతునె॥ భీమదై
త్యులునిన్నుపెలుచగొంపోవమమ్మేమనిబిలిచితివె।యేమిబలికితివే॥
౧॥ఘనరాజ్యభంగమువనవాసగమనముననుదుఃఖితునిజేయవు।వని
తనీపోవుటవలనగల్గెనుదుఃఖవనధినేనెటుదాటుదు।నేమిసేయుదు॥
౨॥ యెమెనీకాహారమెవ్వారిత్తురెనేడుభామనీగతిబల్కవె।శ్రీమ
హనియ్యరంగేశ్వరినాకింకవేమిసౌఖ్యములేలనె॥దేహమేలనె॥౩॥
యేలావ॥గీ॥ఇట్లుదుఃఖింపుచునురాముడెదుటనున్న।మృగగణంబు
లవటుగాంచిమృగములార।చెన్నుమీరంగచెప్పరెసీతవార్త।కరు
ణచేనన్నామృగగణములంతా॥క॥తత్క్షణముననాకాశము।వీక్షిం
పుచుపంక్తులలరవెపజనసాగెన్ । దక్షిణమార్గముబట్టుక। నక్షు
యముగమృగగణంబులవనిజజాడన్॥వ॥ ఇవ్విధంబున యామృగం
బు లాకాశమార్గంబుచూచుచు దక్షిణదిక్కు జనుటంగనుంగొని
రామలక్ష్మణులు తమచిత్తంబులనమ్మార్గంబునంజానకింగొనిపో
యినట్లుభావించి కదలిపోవుచున్నసమయంబున భూమిపయింబడి
యున్నపుష్పనిచయంబు లంగనుంగొని జనకనందన తలలో నలంక
రించుకున్నవనపుష్పంబులుగానెఱింగిదుఃఖింపుచుతమ్మునికిట్లనియె॥

భైరవిరాగము-ఆదితాళము.

ఈపువ్వులుమనజానకితలలోనెలమిశోభిలినవీ।పాపాసురులాస
తిగొనిపోవగ।నీపగిదినివీడిపడినవెన్నగ॥లలనతానెకోసినపుష్పము
లివి।లలితలతాతతులా॥వలపుతోడనెగోసినవివియా। చెలికినీవుభ
క్తినిగోసినవలె॥౧॥ తొలగకనీపువ్వులునాతోడపైవెలదివెలయువే
శా। చెలిమిదనరగనుకొప్పునజుటితినలరిమెచ్చికౌగిలి సతియొస్గగ
గ॥౨॥యేమిసేతుతమ్ముడశ్రీరంగపురీశ్వరియగుసీతా। సెమముగా

పెంపైనవసించునాభీమరాక్షసులు పెలుచవధించిరో॥౩॥యీపుష్ప
ములనజానకితలలో॥ద్విపద॥శ్రీరాముడీరీతిచెలగిదుఃఖించి।చారు
శీలుండైనసౌమిత్రిగూడి।వనిచనివేగప్రస్రవణశైలంబు।గనిసీత
జెలువుముకాదేనినిన్ను। పనిబడివిదళింతుపటుబాణతతుల। ననివ
లికెచయ్యనటచనిభువిని। ఖండితచాపంబుఘనశరావళులు। మెం
డైననెత్తురుమెరయురధంబు। వరకేతనఛత్రవాహనంబులను। సర
గునజానకీచరణచిహ్నాలను।గనివధూటిదలంచికన్నీరునించి। తనస
హోదరునితోతగనిట్లులనియె॥క॥ జనకతనూజనురాక్షసు।లనువు
గభక్షించిరిచటనధికాతురులై।ఘనవీరవర్యులిద్దరు।పనిబడి తగబో
రిరచటపటుదర్పమునన్॥వ॥ఇట్లుబలికి జానకింగానిపోవుటకత్యం
తవిషాదంబునం బొంది మరికొంత సేపునకు మహోగ్రంబగు వీ
రావేశంబునా॥

యదుకులకాంభోధిరాగము-అటతాళము.

విలుదెమ్ములక్ష్మణవిలుదెమ్ము వేగా। చెలగిమద్బలదర్పములజూ
డుబాగా॥వి॥ప్రకటవిస్ఫురితోగ్రబాణాగ్నిశిఖలా।నికద్రుంతునఖిల
చరాచరావళులా॥౧॥ తడయకదేవదైత్యాదులనెల్లా।పొడిపొడి
జేతునీభువితల్లడిల్లా॥౨॥వననిధులింకింతువసుధనుగూల్తు।తనివిబ్రాం
డకనక్షత్రములరాలింతు॥౩॥నాపత్నినెవరుదాచేపాటివారు।చూ
పిచెప్పకనైనసురులున్నవారు॥౪॥జగమెల్ల నేడునిర్జగమొనరింతు
మగటిమిచూపించిమగువదెప్పింతు॥౫॥ధరణిశ్రీకరరంగపురవరుడ
నగా।సురదైత్యముఖరులుగురుతెరుంగరుగా॥౬॥ విలుదెమ్ములక్ష్మ
ణావిలుదెమ్ము వేగా॥వ॥ ఇట్లత్యంత రౌద్రాకారుండై పలికి రక్తా
బ్జసదృశ విశాలనేత్రంబులుం గెంపుగదుర జూచుచు సకలజగంబు
లాహాకారంబునం గడగడవడంక సౌమిత్రి చేతివిల్లందుకుని టంకృ
తస్వనం బూనచిర మదియ్యప్రచండ కోదండపాండిత్య మహిమ
చెన్నొంద చండకాండప్రకాండప్రయోగంబు గావించి బ్రహ్మాం
డకటాహంబు పగిల్లునం బగులచేతునని బలికినవిని దృష్టపూర్వం
బుగాని యన్నకోపంబుగనుంగొని సౌమిత్రి పద్మాంకుశాది రేఖా
లక్షణలక్షితంబులగు శ్రీరాఘవేంద్రునిచరణారవిందంబులు బట్టు

కొనియిట్లనియె॥ క॥ సతినొక్కఁడు గొనిపోవగ। నతులితరౌద్రము నవి గ్రములన్నియు చెరుపం। మతిచేతు రెనీవలిగిన। నీతరులు బ్రోవంగ నే రరినకులతిలకా॥ వ॥ కావునం గరుణింపుమని బల్కిన రఘువరుండు ప్రసన్నచిత్తుండై తమ్మునింగూడి కదిలిపోవునెడ పర్వతాకారంబుగా ధరణింబడి కన్నుల దెరచి చూచుచున్న జటాయువుంగనితమ్మునికిట్లనియె॥ రేగుప్తి రాగము-ఆదితాళము.

అదుగో రాక్షసుని జూడు । జానకినిమ్రింగిపడియున్నవాడు నేడూ ॥ వీడుఒకదివ్యబాణములకడువడివీనిద్రుంచెద ॥నడు॥ సతినిభక్షించిమత్తునా।నున్నాడు ద్రోహమతివీనిపోవనిత్తునా। సతతము శ్రీరంగపురస్వామినౌననువీడెరుంగడదుగో॥ రాక్షసునిజూడూ॥

గీ॥ ఇట్లుబలికిచాపమెక్కిడిఘనబాణ। మేయబూనువేళనినకులేంద్ర। డైనరాముతోడనాజటాయువుబల్కె రామరవికులాబ్ధిసోమ వినుమూ॥

ముఖారిరాగము- అటతాళము.

పనిబడివినుము శ్రీరాఘవా।నీకుపగవాడగానోయిరాఘవా।ఘనబలుండగుదశకంఠుడీవేళపోవనియగు సీతనుగొనితెచ్చనభమున ॥ హారామహాలక్ష్మణాయని। సీతా రామామణిబల్కగావిని। కారుణ్యముననిదుకొఁనితల్లి నీకువిచారమేటికివీనిసంహరించదనంటి॥ ౧॥ తొలగకరిపుమీదదూకితి।నాబలదర్పములుచూపసాగితి।తలపడిరిపునితోతగబోరుచునువానిచలపట్టిరక్తధారలముంచిముంచితీ॥ వ॥౨॥సూతరథాశ్వచాపములనూ॥ నేసోరిదిద్రుంచితిచూడుమచటనూ॥ ఖ్యాతిగవాడంతకాంతనుధరడించినాతోబల్వడిబోరినన్నిట్లుబడనేసె॥౩॥ ననుబట్టుకునివిలపించెనూ।యావనజాక్షిసీతతానంతనూ।ఘనరంగధామనికాంతనంతటవచ్చిగొనిచనెనంబరంబునదశకంఠుడు॥౪॥పనిబడి॥వ॥ అనిపల్కి ముఖబిలంబున నెత్తురుగ్రక్కుచు రాఘవేంద్రా కాంచనవృక్షంబులుగానవచ్చుచున్నయవి ప్రాణంబులింక నిలుపశక్యంబుగాదు జగన్మోహనంబగు నీముఖారవిందంబుగాంచి సీతవృత్తాంతంబు చెప్పుటకై ప్రాణంబులు చిక్కించుకొని యున్నవాడననిపల్కిన విని రాఘవేంద్రుండు చేతి ధనుర్బాణంబులుబారవైచిలక్ష్మణుండునుం దానునుశోకావేశంబునగన్నీరొ

ఖుకపక్షిపతిం కౌగిలించుకుని విలపింపందొణంగి రంత॥

శోకవిరాళి రాగము-అటతాళము.

హాహానికెంతకష్టమాయనూ।నీదేహముమాకై విడువనాయను।
హాపక్షీశ్వరనీస్సాహాయ్యమేమనందు।యూహించినిన్నుఁగంటెను
దయించెదుఃఖమేమొ॥యెలారావణుడుపగబూనెనూ।సీతనెమ్మా
గగనమునను గొంపోయనూ। వాలాయముగరంగవాసినియైనసీత।
చాలానేమెమిబలికెనాలించితేచెప్పుము॥౧॥ హాహానికెంతకష్టమా
యనూ॥క॥ఎటువంటివాడురావణు। డీటకేమిటికరుగుడెంచెనెచ్చ
టనుండుఁ।పటుబలశౌర్యములెట్టివి। కటకటవాడెవనికొడుకుకడు
డెల్పఁగదె॥వ॥అనిపల్కి-నపక్షీంద్రుండెట్టకేలకు రాఘవేంద్రునిఁగ
నుంగొని మెల్ల నీదీనస్వరంబుతో రాఘవేంద్రా రాక్షసేంద్రుండ
గు రావణుండు విశ్రవసునికుమారుఁడు శౌర్యవిక్రమంబులనింద్రా
దులకజేయుండై లోకకంటకుండనం బరుగువీడు సీతా చౌర్యంబు
నం చేసి గాలంబుమ్రింగినమత్స్యంబుచందంబునం జెడిపోవుననిబ
ల్కి రామచంద్రా నేను ధరణిపైబడిన యనంతరంబ రాక్షసేం
ద్రుండు జానకింగొని దక్షిణమార్గంబునంజనియె నని చెప్పి ప్రా
ణంబులువిడిచిన యనంతరంబ దుఃఖితుండై రఘువరుండు లక్ష్మణున
కిట్లనియె ॥క॥ ఘనరాజ్యభంగమడవికి।జనుదెంచుటలతివెషోకచ
య్యనపక్షీంద్రునిమరణమిన్నిటెనగొనె।ననువుగనాడుదగ్ధశాఖ్న
లగ్నింగాల్చునూ॥వ॥ఇట్లుబల్కి లక్ష్మణుండును దానును దశరథు
నికిం గావించుచు చందంబున పక్షిపతికగ్ని సంస్కారాదులొన
ర్చి దివ్యపదంబునకురిబంచి యచ్చోటుతల్లి క్రౌంచారణ్యంబు
గడచి మతంగాశ్రమంబుప్రవేశించి వచ్చునెడా ॥ద్విపద॥ అంతన
యోముఖియనునదిగదియు।వింతగసౌమిత్రి వెసవిరూపంబు।గావిం
పజేనెనం తకాకుస్థకులులు।వేవేగనయ్యడవెలయకగదలి। జనుచుం
డనొకదొడ్డశైలంబుమాటిక్రి। దనరికబంధుండుతనహస్తములను।
వారలభక్షింపవడిసాచిబలిమి । నారూఢిదియ్యంగ నాహస్తయు
గ్మ।మురువడితెగగోసిరుగ్రాత్మలగుచు। ధరగూలెవాడంతతగరక్త
ములక॥వ॥ఇవ్విధంబున కబంధుండు భూమింబడిదేహంబువదలిది

వ్యరూపంబుదాల్చి రామలక్ష్మణులవృత్తాంతంబు వారివలనం దెలిసి సుగ్రీవునితో వృత్తాంతం జెరుంగించి మీరచటికిం బోవలయు నని బలికిచనినయనంతరంబా॥

ఆనందభైరవిరాగము - ఆదితాళము.

అచ్చోటువిడిచివచ్చిరి రామలక్ష్మణులడవులన్నియుజూచుచు। హా దైచ్చనచింతచేవచ్చనూర్చుచునిద్దరచ్చుగయా సీతముచ్చటలాడుచు॥అ॥సరగునశబరియాశ్రమమంతచేరగగురుభక్తిదనరారను।కరమొప్పశబరిశ్రీకరరంగవాసులగరిమనచిఁణంచిచెచ్చరనిశ్చఫలతతు॥అచ్చోటువిడిచివచ్చి॥గీ॥ అంతశబరిరఘుకులాధ్యక్షు మోముపై చెలగిచూట్కి నిలిపిచిచ్చుబొచ్చి। తనవువిడిచిదివ్యతనువుప్రకాశింప॥జనియెనంత్తదివికిఘనులుబొగడా॥వ॥ తదనంతరంబున శ్రీరామలక్ష్మణులచ్చోటవెడలి నానావృక్షషండమండితంబును రమ్యారవిందప్రశోభితంబును శుభజలాకీర్ణంబునునగు పంపాసరోవరతీరంబునం జేరిరంత॥క॥ అసిసవ్యసాచిపౌత్రున। కనఘుండగుశుకుడుచెప్పెననిసూతుండా।మునివరులతోడచెప్పగ।వినిసమ్మోదాత్మలలుచువెలసిరిజాలన్ ॥మాలినీ॥ సరసిజదళనేత్రా చారునీలాభ్రగాత్రా కరివరపరిపోషాగర్వితోగ్రారిశోషా।నిరుపమశుభహాసా నిత్యసౌందర్యభాసా పరమపదవిహారా భక్తదుఃఖాపహారా॥

గద్య॥ఇది శ్రీమదుభయకావేరిమధ్యప్రదేశప్రదీప్తసప్తప్రాకారమహానందిరాంతర్విరాజమాన శ్రీరంగనాధచరణసేవకవరగంటిశేషగిరిదాసప్రణీతంబగు శ్రీమద్రామకథాసంగ్రహయక్షగానవిలాసంబునందారణ్యకాండసర్వంబు ఏకాశ్వాసము॥

సంపూర్ణము.





శ్రీరస్తు.

## కిష్కింధాకాండము.

క॥ శ్రీమద్భక్తజనాశ్రయ। కామితమందారదేవగణసన్నుత। ల క్ష్మీమానినీహృదీశ్వర। దామోదరరంగధామదైత్యవిరామా॥

గీ॥ అవధరింపుముశౌనకాద్యఖిలమునుల। నింపుతో దుతగనిసూతు డిట్లులనియె। వినుడుమునులారశుకుడుభూవిభునిజూచి। పరమకారుణ్యమలరంగబలికెనపుడు ॥ద్వి॥ శ్రీరామచంద్రుడా శ్రితరక్షకుండు। చారుశీలుండైనసౌమిత్రితోడ। పంపాతటంబునపదపడినిలిచి చంపకమందారసరళామ్రనీప। ఘనసారజంబీరకరవీరవకుళ। పనసరంభాశ్వత్థభవ్యమాకంద। సరళకుందకదంబసంతానముఖ్య। వరవృక్షతతులు కేవలరమ్యమాన। ఫలపుష్పపల్లవభ్రాజితమగుచు। వెలయనందువసించువివిధవిహంగ। కలనాదములనెల్ల గ్రక్కునవినుచు। వలనొప్పనాసరోవరవీధినమరు। సరసిజోత్పలపుష్పచయమరందంబు। గురుతుగాగ్రోలిఝుంకృతులు గావించు। భ్రమరంబులను గాంచిపద్మాక్షిమీది। తమకంబుననుబల్కెతమ్మునితోడ ॥సీ॥ కమలపత్రములశృంగారంబుపీక్షింప కమలాక్షి కనుదోయి గాత్రుమించు। తలతుమ్మెదలచాలుసలరకన్నులగన్న జలజాక్షి వేణి సంస్మరణకబ్బు। ఘనచక్రములతీవిగనుగొన్నమదిలోనతరళాక్షిగురుకుచద్వయముదోచు। మల్లికాకేతకిమహితాబ్జగంధంబులతివమేనిసుగంధమాశ్రయించు। లలితశుకపికరవములలలనసేయు। మధురసంభాషణములునామదికిదోచు। నేమిసేయుదుకలకంఠినెట్లుగాంతు। చెప్పగతవోయిసదుపాయమొప్పదనర ॥గీ॥ యిట్లు శ్రీరాఘువేశ్వరుడింతిదలచి। విరహసంతప్తచిత్తుడై వెలయుచుండె। సంతసుగ్రీవుడనువానరాధిపుండు। హనుమదాదిచతుష్టయంబాశ్రయింప॥

క ॥ తనయన్నభయమువలనను। పనిబడితగబుశ్యమూకపర్వతమునసొంపుననుండి దాశరథులను। కనుగొనికడుభీతిడిగ్గఘనపర్వాత

ముక్ ॥వ॥ ఇట్లుసుగ్రీవుండతిభయంబున పర్వతంబుడిగ్గి హనుమం
తుంగనుంగొనియిట్లనియె॥

పున్నాగరాగము-ఆదితాళము.

వారెవ్వరివారు। ధరనెవ్వారలు సరిగారు । ధీరులుశరతూణీరశ
రాసన।ధారులుపంపాతీర స్థలిగల ॥వారె॥సారసలోచనులు।వైరి
విదారులుఘనబలులు । వీరులుదివ్యాకారులురాజకుమారులుఘన
సుకుమారులుశూరులు॥వారె॥౧॥ కడుభయమాయనుగ।వారలత
డయకకనుగొనగా । నుడుగకవీరవ్వాలిబనుపనీయ్యెడ కరుదెంచ్చి
రోవడినసుబాడువగ॥వారె॥౨॥వరరంగేశులుగా।మదిలోనరయగ
దోచెనుగా।గురుతుగనయ్యిరువురవృత్తాంతమువరమతిదెలసుకన
రుదెమ్మికచని ॥వారెవ్వరివారు॥౩॥వ॥ అనియిట్లుబలికి ॥క॥ హను
మంతనీవుజని। యాఘనులగురాజేంద్రసుతులగనుగొని। వారివ్వన
మునకరుదెంచినకథ। పనిబడితగదెలసిరమ్ముపటువేగమునక్॥
వ॥అనిబలికిననాంజనేయుండుభిక్షురూపంబుదాల్చి దాశరధుల
పాలికింజనిసవినయంబుగాప్రణమిల్లి యిట్లనియె॥

సురటరాగము-అటతాళము.

మీరవెవ్వరివారు । మిమ్మునబోలువారలెవ్వరులేరూ॥మీరుచక్ర
విరాజకుమారులుశరతూణీరశరాసనధారులుధీరులు ॥మీ॥ జలద
హేమదేహులు।దీర్ఘబాహు।లెలమిజగన్మోహులు।లలితవిపులవ
క్షస్థలులబ్జనేత్రులువలనొప్పసూర్యచంద్రులమించియున్నారు॥౧॥
భూరిభుజాబలులూ।సన్నుతశౌర్యులారయగుణనిధులు। చారుసం
పూర్ణసుధాకరవదనులు।దారుణవైరివిదారుణులనఘులు॥౨॥
కరమొప్పజగమేల।మీరర్హులై కాసలరానేల।గరిమశ్రీకరదివ్యాంబ
రధారుణాహులై।నెరినారచీరలక్కరగట్టనేటికి॥మీరలెవ్వ॥౩॥
కరితురంగములెక్కనూ।రథములెక్కధరసహులై చాలను। సర
గుననిటుపాదచారులైవచ్చితి।రరుదుగ శ్రీరంగపురవాసులనదగు॥
ర॥మీరలెవ్వరివారు॥సీ॥ అనఘాత్ములార నేనంజనిపుత్త్రుండనవనిలో
హనుమంతుడంద్రునన్ను। వనచరేంద్రుండైనవాలికితమ్ముడాను
శ్రీ వనచివుండసారదిమున్న। పగబూనిసుగ్రీవుభాగ్యహైకొనివా
లివెళ్లంగధరుమతావిశ్వమెల్ల ।సంచరించుచునొక్క సంయమిశా

పంబువలనవాలికిఁజేరనలవిగాని। ఘనతరంబగు ఋశ్యమూకమునని లిచి। మిమ్ముఁగని వాలిపంపునమీరుచంప। వచ్చితిరటంచుశంకించి వాంఛతోడ। నన్నుఁబనిచెను మీకథలన్ని దెలియ ॥వ॥ ఇట్లు బల్కి మహాత్ములారా వాలిభయంబున వర్తించు సుగ్రీవుండు జగన్మోహన దివ్యమంగళస్వరూపులయిన దేవరవారలతోఁ జెలిసఖ్యంబు సేయంగోరియున్నవాఁడని పలికినయనంతరంబ శ్రీరామచంద్రుండు సౌమిత్రింగనుంగొని యిట్లనియె॥క॥ మతివెలయనితనితోఁడుత। చతురాగమవేత్తలయిన సంభాషింపం। జతగారుగానమనకథ। నతినిపుణతఁ దెలియఁ జెప్పుమతనికిఁ జాలన్ ॥క॥ ఇతఁడఖిలవ్యాకరణము। లతికుశలతనేర్చినసఘుఁడాతఁడు మెచ్చం। హితభాషలాడు మేభూ। పతికీతఁడు దూతయైనఁ బని చేకూరున్ ॥వ॥ అనినవినీతలక్ష్మణుండాంజనేయునితో నెయ్యంబలరనిట్లనియె॥

సురటరాగము - త్రిపుటతాళము.

వినుము మాకథనూ। వో హనుమంత। వినుపింతు వెసనూ। ఘనుడైన దశరథజననాథాగ్రణిగల। డనువుగానతడేలు సర్వావని। నయోధ్యనునిలిచి పెంపున ॥వినుము॥ ఆరాజోత్తముఁడూ। గనె నునలువుర సందరికితడు। భూరివిక్రముఁడితని। శ్రీరాములనియందు। రారయగ నేనతని తమ్ముఁడ పేరు లక్ష్మణుఁడనుచు బిలుతురు ॥౧॥ వినుము॥ జనక వాక్యమునూ। చేయంగదలచి। వనసీమలకునూ। జనకనందనతోఁడ జనబూనుయా రాఘవుని పదాంబుజ సేవసేయుచు మొనసినే వెనువెంటవచ్చితి॥౨॥ వి॥ వరమునితతుల। బ్రోవంగదలచి। ఖరముఖ్యరిపులా। నేరివధించెను రాముఁడురుబాణాగ్నులనంత। పరగవమువంచించి రాక్షసపతిహరించెను। రాముభార్యను ॥౩॥ సతినిగానకనూ। వచ్చుచు గృధ్రపతినిగాంచియును। మతిమీరసత్క్రియలతి సత్కృపను జేసి। హితముగనురంగేశుడును నేనతివెవెదకుచు వచ్చినారము॥ వినుము మాకథనూ॥౪॥ గీ॥ అన్నదమ్ములమిద్దరమార్తివలన। చాలనీవేళ సుగ్రీవుశరణుగోరి। యున్నవారముమము బ్రోవుముల్లమలర। చారుధీమంత హనుమంత సత్యవంతా ॥గీ॥ సకలలోకశరణ్యుడై సర్వభూము। లేలదగినట్టిసద్గుణశాలి రాము। డవనిసుగ్రీవశరణు తానాత్మ

సా॥ రా॥ నంచుఘాముత్రిశన్నిగునించెచాలా॥ వ॥ అట్లావసరంబునసమీ
ఘునందనుండు వారలంబొడగని భిక్షురూపంబుదాని సమాజ రథా
ష్టంబుగ్రక్కొని నితాంతభక్తి యోగంబున మహాత్మ్యాహ్వాంబు డగు
చు రామలక్ష్మణులతన వీపెక్కించుకొని వేగంబున నంబోయి సుగ్రీ
వునిసమీపంబునం డించి యమ్మహాత్ములవృత్తాంతంబెల్లక్రమంబు
న నెరింగించియిట్లనియె॥ చ॥ పరమదయాపరుల్ భువనపాలనదక్షు
లుదగ్రవిక్రముల్। వరమునిపాలకుల్ త్రిదశవందితులాశ్రితసద్ర
క్షిత్రులి। నిరుపమసుందరాంగులిటునిన్నతగంశరణంబుగోరివీ॥ర
ఘుదుగవచ్చినారు కరుణాకరకార్యము సేయుమింపునన్॥ వ॥ ఇట్లుబ
లికెసుగ్రీవునితోమరలనిట్లనియె॥

రేగుప్తిరాగము- ఆదితాళము.

నీకుదుఃఖముదీరెనూ। వోహోసుగ్రీవ। నీకుభాగ్యము జేకెనూ॥
నీకుదుఃఖముదీరెనీ కాకుస్థకులేశు। లీకళ్యాణవిగ్రహులింమవేంచే
యుటచే॥ నీ॥ వీరుమహానుభావులూ। దొరికిరినీకుశ్రీరంగపురనివాసు
లూ। కూరిమితోడనీవువీరిసఖ్యముసొంపు। మీరసగ్నిసన్నిధికోరిచే
యుముచాలా॥ నీకుదు॥ ౧ ॥ ద్వి॥ అనవినిసుగ్రీవుడంతటరాము। గను
గొనిప్రీతితోకమలదళాక్షు। ఘనశీలుడవుదైత్యగణమర్దనుండవు।
జననుతుండవుకృపాజలధివినీవు। నినుజూడనాకబ్బెనెమ్మినీతోడ। న
నువుగాభాషించుటదినాకుగల్గె। కరమొప్పనీమహాకళ్యాణగుణము।
లరుదుగాహనుమంతుడమరంగజెల్ప। విని సంతసించితివేట్కతోనే
ము। గొనకొనిసఖ్యంబుకోరి చెయుదము॥ వ॥ అంత॥

సౌరాష్ట్రరాగము-అటతాళము.

సఖ్యము జేసిరిరామసుగ్రీవులుసంతోష మొదవగనూ। ప్రఖ్యాతి
గానగ్నిపవనాత్మజుడుదెచ్చిముఖ్యుడై వెలిగింపమురియుచు నచ్చ
ట॥ యిద్దరిసౌఖ్యములిద్దరిదుఃఖములిద్దరికగునట్టూ॥ లొద్దికతోడ్పుతవ
లసినిభయించితద్దయువేల్పులత్తరివినుతింపగ ॥ ౨॥ సుమతుల్లగుచు
రంగేశుడురవిజుడుశుభమావహిల్లగనూ। తమకాపదలుదీర ధర
జనులుమెచ్చ। తమతమభార్యలతాముగూడుటకిట్లు॥ సఖ్యము జేసి
రి॥ ౩ ॥ గీ॥ కోరిసుగ్రీవుడొకచెట్టుకొమ్మదెచ్చి। రామునకుపీఠమొనరిం

ధైర్యమ్ముతోడ । నాంజనేయుండు సౌమిత్రికప్పుడమును విడిచితా
దెచ్చెనాకకొమ్మ వెసవసింపా ॥ద్విపద॥ అందమొప్పగ రాఘు—
భానుజుండు। పొందుగా కొమ్మపైపాలు పారనంత। నరుమగా సుగ్రీ
వుడతిదీనుడగుచు। గరిమె కన్నులనీరు గారనిట్లనియె। ఘనఖలుండగు
వాలికరమొప్పనన్ను। వనచర రాజ్యంబువడి దాటునట్లు । బాములబె
ట్టిదోబలమున నెట్టి। భూముల పైచాలబోవంగ జేసి। కామించినా
భార్యగైకొనెనింక। నేమని చెప్పుదునిట్టి వృత్తాంత। మనియిట్లు బలు
కంగ నాతని తోడ। నినవంశదీపకుండిట్లని పలికె॥

రేగుప్తి రాగము-అటతాళము.

వాలినుద్ధతి ద్రుంచెద। నిన్నగచరవర రాజ్యమేలించెదా॥ చాలక
నా శరజాలము లీవేళ। నాలము గోరుచు లీల మెరసెనింక ॥వాలి॥ ధర
సౌఖ్యములమించు మీ। నీ భార్యాపహారుడైన నియంచు మీ। కరమొప్ప
మద్ఘోరతర బాణములవాని। నరసి చంపకున్న వరరంగేశుడగాను ॥
గీ॥ అనుచు బలుకంగ సుగ్రీవుడాత్మలోన । చాలముద మొంది విను
తించె జానకీశు। నంత సీతకు వాలికయ్యాసురపతికి। వామనేత్రంబులద
రె కేవలపువిధనీ ॥గీ॥ అంతసుగ్రీవుడానందమతిశయిల్ల। ఘనపమ
క్ష్యాము శ్రీరాముఖలవిరాము। కలయకన్గొని నా చెలికాడవైతి। వింక
నాకెదికొరవలేదినకులేశ॥

సౌరాష్ట్రరాగము- జంపెతాళము.

జనకజను చెప్పింతు నిచటికి। జానకీశా। నేనిక క్షణములో వెదకించిచ
య్యనజానకీశా ॥౧॥ సీతనిక సాధింతు దివిభువి చెలగి వెదకి తెప్పను ।
భూతలంబున కుశలమగు నీపుణ్యసతికి ॥౨॥ చారురంగపుగీనివాసవి
శాలనేత్ర। సీతా॥ సారసాక్షిని గూడగలవికజలదగాత్ర ॥౩॥ జనకజ
చెప్పింతు॥వ॥ అంత॥గీ॥ సీతదివిరక్కసుని చేత జిక్కి చాల। హారఘూ
ర్ణమహాలక్ష్మణాయటంచు। నాతిణతో బోవుచు నువస్త్రఖండుగట్టి।
మహీసి వైచిన సొమ్ములమాట జెప్పి॥వ॥ తత్క్షణంబున సుగ్రీవుడొక్క
గుహాలోకింబోయి సొమ్ములమూట దెచ్చి రామచంద్రుని ముంద
టంబెట్టినం విచ్చి చూచి లక్ష్మణుండు నుందానును గన్నీరొలుకదుః
ఖించిరయ్యెడ రామచంద్రుండు సీతాసుందరి దేహాలగ్నంబగు

సౌమ్యులుర స్థలంబునం గొంతసేపు బెట్టుకొని మోహంబున మున్గ
గొనియిట్లనియె॥

మారువరాగము:- ఆదితాళము.

సౌమ్ములారా మీసొమ్మైన కొమ్మయేదె। మోహమ్మునన నెన్నలు
ముద్దుగుమ్మయేదె సుదతిబాసిరా జెల్లునసౌమ్ములార। ఆమదితమి
ముకోపించెనటరె సౌమ్ములారా॥౧॥ వనితబనుపనేమి జెప్పవచ్చినా
రో। దుఃఖవనధిబాపి సీతగూర్ప వచ్చినారో॥౨॥ క్షేమమా రంగనా
యకి క్షేమమటరె। సీతాకామిని యచ్చోటనున్నదో కదసిపల్కరె॥
౩॥ సౌమ్ములారా॥ వ॥ అంతటనుత్తరీయంబుం గనుంగొని లక్ష్మణున
కుంజూపి విలపించునెడ సుగ్రీవుండు రాఘవేంద్రుం గనుంగొని యి
ట్లనియె॥ సీ॥ శ్రీరామ నీవిట్లు చెలగి దుఃఖింపంగ వలదు మానసము రాజ
కులవరేణ్య। సకలజ్ఞుడవు ఘోరశాత్రవాంతకుడవు సచ్చరితుండవు
నన్మనీంద్ర। వినుతుండవీవెరుంగనిదేమి మిత్రుండగాన జెప్పెద నీకు
కమలనేత్ర। ఘనకార్యములు ముందుగలవుగావున మహాధైర్యసంప
న్నచిత్తంబుతోడ। చెన్నుమీరంగ వెదకించి సీతనింక। దెచ్చిపెట్టింతు
నీ ప్రేమలెగువతోడ। ననుచు బలికిన రాఘవుండతని మెచ్చి। కౌగిలిం
చెను సంతోషకలితుడగుచు॥ వ॥ తదనంతరంబున వాలిపరాక్ర
మంబును తనమీదనతండు బూనిన వైరలక్షణంబును సుగ్రీవుడెరిం
గించిన విని రాఘవేంద్రుండు సుగ్రీవుం గనుంగొని మీకిరువుర కివ్వి
ధంబున వైరంబు గలుగుటకేమి కారణంబని యడిగిన సవినయంబు
గా సుగ్రీవుండిట్లనియె॥ ౪॥ వినవయ్య శ్రీరామ వినవయ్య వాలి। ము
నుకపిరాజ్యంబు ముదముతో శాయ। మాయావియనువాడు మత్తుడై
వచ్చి। బాయక నడురేయు బవరంబు గోరి। కదియంగ నవ్వాలి కడుకో
పమొదవ। పదపడి వడి డాయ భయమందివాడు। గిరిబిలంబవలీల జొర
లి చొరంగ। సురపతిపుత్రుండు సారది తా చొచ్చె। పనిబడి గుహలోన
బలువడి నిద్ద। రనియోన పర్గ నంత నాశ్చర్యమునను। వెలుపల నేనుండి
వెసగను గొంటి। నలరుచు ప్రవహించునట్టి శోణితము। సంతటనొక
వత్సరాంతమై వెలయ। వింతగా నవ్వాలి వెడలి రాకున్న। ధరగూలెన
నిసమ్మి తగ శోకమొంది। వెరువక శిలచాత వెసగుహ కప్పి। కపిరాజ్య

హేలంగ కడు చోద్యముగను। కపినాథుఁడగు వాలి క్రచ్చెర వచ్చి॥
క॥ ఎన్నివిధంబుల వేడిన। మన్నింపక కాలదన్ని మరిమరి దరుమం। క్ర
న్నన తిరిగియు నిచ్చట। చెన్నలరగ తపసి కరుణ చేరితి వేట్కన్॥
వ॥ అని పలికి వాలి పరాక్రమ ప్రసంగంబు సేయుచు దుందుభిచా
రిత్రంబెఱింగించి రామచంద్రునివలన వాలి తెగటారుటకై శంకిం
చి యున్న యెడ రఘువరుండు పాదాంగుష్ఠంబున దుందుభి కళే
బరంబుజిమ్మి సప్తసాల ప్రభిన్నంబు గావించి సుగ్రీవుని నితాంత సం
తోషస్వాంతుం గావించిన సుగ్రీవుండతి వినయంబున సీతావల్లభుం
బూజించె నట్టియెడ రఘువరుండు సుగ్రీవుం గనుంగొని॥

రేగుప్తి రాగము-అట తాళము.

వెను వెంటవచ్చెద చూడుమీ। నీవు। చని వాలితో డపోరాడుమీ। వనచ
రోత్తమ నిన్ను బనిపి నేనుండను। ఘనబలుండగు వాలి నాహవమున శ
రాగ్నులనొంచి మ్రంచగ॥ వెను॥ మదిలోన నికభీతి మానుము। ఘోరక
దనమునకు వాని జీరుము। వదలకు వాలిని వ్వసుమతి పడనేసి। పదిలముగ
నిను బ్రోతు నమ్ముము। సదయుఁడను శ్రీరంగధాముడ ॥వ॥ అనిపలికి॥
సీ॥ అనిపల్క సుగ్రీవుఁడవ్యక్షకిష్కింధకతుల వేగంబున నరిగియా
ర్వ। వినిరోషమున వాలి చనుదెంచి సుగ్రీవు గని జవంబున దాకగను మ
హోగ్ర। మేరు మందరములతీరున రవిహూతాశనులచందంబున దన
రిపోర। నచటికి శ్రీరాముఁడరుదెంచి ధనువెక్కుగావించి ఘనవిశిఖంబు
దొడిగి। మొనసి వారిద్దరొక్కరూపముగ వెలుగ। మదిని శంకించి శ
రమేయమానెనంత। సూర్యపుత్రుండు వాలిచే స్రుక్కిపారి। పర్వత
ముచేరెనతిదీనభావమమరా॥
గీ॥ చేరివచ్చుచున్న సీతేశ్వరుని జూచి। సమదరిపువిరామ సార్వభౌ
మ। చారుసఖ్యమగ్ని సన్నిధి గావించి। చంపదలచి పంపచనునె నీకు॥
వ॥ అనిన రఘువరుండిట్లనియె॥

సురట రాగము-అట తాళము.

నిను మోసమొనరింతునె నేను। సూర్యతనయ పాపపుచిత్తముతో
నూ॥ కర మొప్ప మీరలిద్దరు బోరా। దివ్యశరము సంధించి వచ్చితి చేరా
వలనొప్ప మీరూపములతీరు చూడ। తెలియదాయను యించుకలేరు।

శంక జెందితివింతేశౌర కేమయా।నీవింక జనుము వాలి దాస డాయ॥౩॥ సోద
రున్ను ముసీతనీసొమ్ము।నీమానసాంబుజమున నిదినమ్ము॥ఘనశ త్రుద్రుం
తువాలిని జేమ।నిన్ను వసిబూని ప్రోతునిక్కము జూడు॥క॥ అనియిట్లు
అలికితమ్ముని।గనుగొని గజపుష్పమాల గ్రక్కనసీ సే।ఘ్రణనగా చిణ
యుసుగ్రీవుని।ఘనకంఠమునందమరుచుకళ్యాణముగాన ॥క॥ రా
మునియనుమతమునయా।రామానుజాదట్లు చేసెరతమమునసంతం।
రామరామానుజాదుల।ప్రేమను తనవెంట నడువ బిరబిర సంతస ॥
వ॥ ఇట్లు జనిసుగ్రీవుండు కిష్కింధాద్వారసమీపంబున ప్రవేశిం
చి బ్రహ్మాండభాండంబద్రువ సింహనాదంబొనరించిన రణవిద్యా
శాలియగు వాలి యాధ్వనివిని పటురయంబున నంబర తెంచుసమయం
బున సుత్తుంగ కుచకుంభంబులం గ్రుచ్చి జీవితేశ్వరుం కౌగిలించుకొ
ని తారయిట్లనియె॥

మారువరాగము- జంపెతాళము.

వలదువలదీవేళ నిలుపునీగమనంబు తొలగి మ్రొక్కెదనోయి జీవితే
శ్వరుడా।తొలగి పారినతమ్ము డేలమి రెండవసారి। కలహమునకిటు
వచ్చుటలు వింతే గాదా॥౧॥ బలవంతు డెవ్వడో ప్రాపుగా కుండినను।
చలమెత్తి వచ్చియాపురలు శాయగలడా॥౨॥ ఘనులయిన దాశరథు
లనున్నపాత్మజులిద్ద।రిసతనూజుని చేరిరని వింటిసుతుచే॥౩॥ మొనసి రం
గోతతోడను సఖ్యమకనజూడు।పనిబూని చేసెనట జనవలదు నాథా॥
ఉ॥సారసనేత్రి మోహమునచయ్యన మ్రొక్కుచునిట్లు చెప్పగా।
కూరిమి విశ్వసింపక నుకోమలికిట్లను యుద్ధకాంక్షచే। వైరులువచ్చి
పిల్వగనవార్యపరాక్రమమొప్పలీలతో।పోరకిబోకనిల్చుటది పూజ్య
మ బెభువి చారుభాషిణీ॥ద్వి॥ అనిపల్కి చని వేగ నతులోగ్రముగను।
ఘనుడైన సుగ్రీవుగని చాకెనంత। నిరువురు గ్రతభోరనెలమితో పొం
చి। తరణికులేశుండు తడయక వింటి। ఘనబాణమత్యుగ్రత సంఘ
టించి।పనిబడి సంగ్రామపండితుండైన।వాలిపైవడి నేయవసుధపై
త్రాలి।చాలదూరుచు రామచంద్రుతోననియె॥

సావేరిరాగము- అటతాళము.

సదమలధర్మ దయాకలితుడవని మదినెరిగితిగాని రామా। నీవాద

యుడవై ధర్మహానికోర్చియు। చంపుటది యరుంగను సార్వభౌమా। నీ
సత్యధర్మదయాసుచరిత్రావళులా సీతతో బోయెనేమో। వాసవసుతు
నన్నువడి జంపుటది నీకు దోసమనుచు దోచదేమో ॥౧॥ వలనొప్పక
ముప్పుగప్పిన నూతివని నిన్ను దెలియనైతిని రఘురామా। జలజాక్షి తా
రబోవలదనిని నిలిపిన నిలువనైతిని రిపుభీమా ॥౨॥ ననుజూడకుండ చయ్య
న గూల్చుటది యేమి న్యాయము శ్రీరఘువీరా। నినురంగనాథుడవని
నమ్మబోలు నెనీకీకుత్సితము పెంపారా ॥౩॥ క ॥ ఇనకులభూషణనా
శా। పనిబడి తెల్పినను వేగ పంక్తిగ్రీవుం। ఘనగర్వమణచి సీతను। ము
నుకొని సాధించి నీదుముందర నిడనే ॥ క ॥ నాముద్దు పట్టి సంగదు। నేమని
నే బాయనేతు నెల్లఘడునా। ప్రేమను వర్ధిలుచుండును। నామా
ససమతనిమీద సయము సవెలయక ॥ సీ ॥ అనవిని శ్రీరాముడవ్వాలి కిట్లు
సుష్యగయుండుపనముల మృగవితతుల। పొంచిచెచ్చగద్రుంచుపొం
చకపడిద్రుంచు కడువడినారీతి గాదె నిన్ను। శాఖామృగంబని సం
హరించితిలిలసది గాక సుగ్రీవుననుజూడనక। సతిపాపమతిని తల్పతి
గూడియాతనిఘరచాట వెళ్లంగదరమినాడ। వింత దుష్టుడవగుట చే
నిన్ను వేగ। ఘోరబాణంబు చే భువి గూలనేసినాడ। శరణన్న సుగ్రీవు
నయము తోడ। కరుణ బ్రోవంగ మది నెంచి కపివరేణ్య ॥ క ॥ భరతుని వ
సుపున మెమిధరణి। నిదుజనులన రసితగ వధియింపం। దొరకొంటి
మి గాపున నిన్ను గుదగ గూల్చితి నిమిష్టుడను చుకపీంద్రా ॥ ద్వి ॥ అని
పలుకాటలిట్లాడంగ సంత। వినియూరకుండె నవ్వాలి। తరు
చరావళుల చేత సవతిపాతల। సరుదార విని తారయంగదు తోడ।
బొరబొరిమఱిశిఖించి భువి మూర్ఛ జెంది। గరిమ తోడుత వచ్చి కాంతు
సమీప। నెరి వ్రాలి యేడ్చుచు నేలతయిట్లనియె ॥ హా నాథ హా నాథ హా
మహావీర। పూని నా కౌగిట భోగింపకేవు। చయ్యన నేచట కిజనగోరి
నావు। వెయ్యాలనిసుబాసివెసనోవ్వజాల। జగతి కౌగిట జేర్చి శయ
నించినావు। జగతి నాకం చెసతె స్త్ర్యైందర్యవతియె। బాలుడంగదుడు నీ
పట్టిసివీని। లాలింపనొల్ల వీలాగహణమగునె। ధరశూరులకు నివ్వాద
గదంద్రుకన్య। నరుదుగా శూరుల కవనిలో మరణ। మదియట్టులన్న
నీవధికశూరుడవు। కదనమన్నను బోయి కడకిట్లునైతి। వనిపల్కి సుగ్రీ
వు సయ్యడజూచి। గొనకొని నీయన్నగూలె నీవలన। మేలాయ సుగ్రీవ

మేలాయెనీకు। చాలవానరరాజ్యసంపదగల్గె। ననిరామచంద్రున
వ్యాంభోజనేత్రు।గనిదూరెనంతనాకాంతచెచ్చరనూ॥క॥ అంతట
సుగ్రీవుడుమది।నెంతయుదుఃఖింపరాఘవేంద్రుండును। తాచిం
తాక్రాంతుడగుచు।నితాంతదయఁ శోకముడిపెతగు వాక్యము
లఁ॥వ॥తదనంతరంబున సుగ్రీవుండు సౌమిత్రి వలనంబోధితుండై
తారాంగదాది పరివృతుండగుచుంజని వాలికి నగ్నిసంస్కారాది
కర్మంబులు నెరవేచిఁ రామచంద్రునిసన్నిధికిం జనిన యెడ నాం
జనేయుండు రామచంద్రునింగనుంగొని శ్రీరఘువంశ జలనిధి సు
ధాకరా సుగ్రీవునింగరుణాకటాక్షంబునం గావదలంచినవాడవు
గావున కిష్కింధాపురంబునకరుదెంచి సుగ్రీవునభిషిక్తుం జేసి యత
నిచేతంబూజలువడసి వేంచేయుమని విన్నవించిన రఘువరుండు
సుగ్రీవుం గనుంగొని వనవాసదీక్షం జేసి పురంబు చేర నహఁంబు
గాదు గావున లక్ష్మణసమేతుండనై ప్రస్రవణశైలంబున వర్షాఁ
కాలమాస చతుష్టయంబు గడచునంత్యంతంబు నిలిచియుండెద నీవు
సకలవనచర సమేతుండవై పురంబునకుంజని మహావైభవంబున న
భిషిక్తుండవై వాలినందనునకు యావ రాజ్యాధికారం బొసంగి
యెల్లసుఖంబులవతిఁంపుచు వర్షాకాలంబు గడచిన యనంతరం
బసీతాన్వేషణకార్యంబుగావింపుమని పనిచి సౌమిత్రి సహితుండై
నానాశృంగారకలితంబగు ప్రస్రవణశైలంబు ప్రవేశించి యుండె
నంత॥గీ॥రామచంద్రునికరుణచేరవిసుతుండు।తనపురంబునకటజే
రితగినకపుల।వలనజలనిధినదనదీజలములింపు। తోడదెప్పించెనతు
లసంతోషమమరా ॥వ॥ మరియుసుంపట్టాభిషేకంబున కువలయు
మంగళద్రవ్యాదులెల్ల వనచరులుసముకూర్చినయనంతరంబా॥

ముఖారిరాగము-ఆదితాళము.

పట్టాభిషిక్తుఁడాయెను।సుగ్రీవుడుచేపట్టినరామప్రేమను।పట్టిర
మ్మానివాలిపట్టినికౌగిలించి।నెట్టినయావరాజ్యపట్టమింపుగట్టి॥ ప
ట్టా॥తరుచరవీరులెల్లనూ।తారారుమాదితరుణిసంఘములెల్లనూ
గరిమెసేవింప రంగపురవాసుకరుణనింద్రుడరుదుగస్వర్గఁమునక
భిషిక్తుడైనరీతి॥వ॥ ఇవ్విధంబునా ॥ఉ॥ వారిజబాంధవాత్మజుడువా

రిజబాంధవవంశనాథు।విస్తారదయాప్రలబ్ధమగుసర్వవనేచరరా
జ్యలక్ష్మినిం । పొరగదాల్చివై భవవిభాసురుడై సుఖలీలనొప్పగా ।
నారఘు నందనుం డమరె। నద్రిపయింవిరహాతురంబునన్॥

ద్వి॥అంతవర్షాకాలమావహిల్లంగ।కాంతదలంచిలక్ష్మణుమో
ముగాంచి।వారిదంబులుమింటవలనొప్పగన్పె। కోరిమయూరముల్
కొమరొప్ప నాడె।నరుమగానారావణాంకమందలరు।గరితజానకి
మాటిక్కాలమేఘముల।ధళధళమనివియత్తలమిలనెనయ। వెలయు
చున్నవితటిద్వితతులల్లవిగో।పదపడిమేఘసౌపానంబులెక్కి।కదసి
భానునిచాలకానసప్రప్ప। ములనలంకారంబమదముతొనేయ।
నెలమితోదగియున్నదీయంబరంబు।ధారాధరములంబుధారలతో
డ।వారకభూవినెల్లవర్షింపసాగె।నరలేకసఖిపిక్తుడైనసుగ్రీవు।క
రణిసగ్గివారికణములనమరె।జగతీతలమునస్యజలము చెమించె।
తగబాప్పసిక్తయాధరణిజమాటిక్కి।ననియిట్లుబలుకుచునచ్చటగడ
ప।జనియించెఘనశరత్సమయ మందముగ॥వ॥అంత॥గీ॥ పవనత
నయుండుసుగ్రీవుపాలికేగి।సీతవెదకంగవనచరశ్రేష్ఠతతుల। వే
గబిలువింపించిబనసుప్రభుత్వోక్తడయ। వలదనుచు జెప్పె నయభయవా
క్యములనూ॥గీ॥అంతటనుసూర్యపుత్రకుండట్టలేచి।నీలుగన్గొనివన
చరానీకములను।పటుగయంబునదోట్టాకొనిపరగరమ్ము। రానికపు
లకుదండనమానడను ము॥వ॥ఇట్లుభంబన సుగ్రీవుండు నియమించి
నయనంతరంబునఘువరుండు సంప్రాప్తంబైనశరత్కాలలక్షణం
బుపలక్షించిలక్ష్మణునకిట్లనియె॥

శంకరాభరణము-అటతాళము.

శరదాగమ ముజూడులక్ష్మణా।దీనిచందమెల్లనుచాలలక్ష్మణా।వ
రచంద్రముఖియైశరద్యామినీకాంతగరిమ వెన్నెలచీర గట్టినట్టిద
ఆను॥శరదా॥శారదనదులలబల్మెల్లనూ।జూపసాగెసైకతములనె
ల్లనూ।వారకనస్య సంగమలజ్జితాత్మలై।కోరిభాషలుజూపగురుని
తంబములన॥శర॥ కలహంసచక్రనిషేవ్యమై।ఫుల్ల జలజవిలోలష
ట్చరణమై।సలలితసర్వత్ర సన్నజలంబులుగలిగి నదులు సొంపలరు
చున్నవి చాల॥౨॥శర॥తరణిపుత్రకుడు రాడాయెను। సీతాశరుణిని

వెదకింప బోయెను। వరరంగేశుడనొసన్నరుడుగవంచించిపురమున నున్నాడుపొలతులవశమున॥౩॥శరదాగమమువచ్చె॥

నీలాంబరిరాగము-త్రిపుటతాళము.

జనకజనేటుగాంతునో। సుగ్రీవుడెప్పుడు। చనుదెంచినను బ్రోచునో। ఘనమౌశరత్కాలమనువొందెలక్ష్మణా॥జ॥ చెలగియూవనపుష్పములసీతకనుగొన్న। నలరికోయకమానునా। చెలియవిడుచునా॥జ॥వలనొప్పనీసరోవరపద్మములతున్మెదలగన్నసఖికురులా। దెచ్చెనుమరులు॥జ॥౨॥ చెలువొందనీశరచ్చంద్రబింబము గంటెపొలతుకనగుమొగము।గనగోరెమనము॥౩॥జ॥వరరంగపురమునగరితేజానకితోడ నేరిసుఖించుటలబ్బునా।మొనసిగొబ్బునా॥౪॥జనకజనేటు॥

శా॥ఆలుంబట్టముబాసి తానడవిలోనత్యంతదుఃఖాంబుధిం। దేలంగాంచిరిపుంవధించికపిరాడ్డాధిపుంజేయగా। నాలుంబట్టముబాసినేనడవిలోనత్యంతదుఃఖాబుధిం। దేలంగాపగరాడుభానుజుడునా దీనత్వమూంబాపగ॥గీ॥ ఖలుడుసుగ్రీవుడుపకారఫలమెరుంగ। డఖిలవనచరరాజ్యనుఖసుఖంబు। జెందిమనకార్య మెంతయుచిత్తమందు। దలపకున్నాడుతారతోచెలిమిగూడి॥సీ॥ చూడకృతఘ్నుండు గాడుహంతఘ్నుండుగరిమెతారామోహపరవశమున। మత్తిల్లియున్నాడుపనకార్యమెంచకచుదనకేళిలోలమానసమున। జనసీవుసుగ్రీవుగనిబలకసీయన్ననవనిగూల్చినశరంబగ్రభాగ। మునసించుకంతయుమొక్కబోదదినిన్నపడిద్రుంపజాలుటనవ్వాలిజన్న। మూగణమునసేగుటనినీకు మంచిదనుచు। కాంతుగల్గినమత్నాయకప్రకాండ। మెలమిబరగించినీయన్నగలయజేతు। నిక్కమిదినమ్మమనిచెప్పుమక్కజముగా॥వ॥ఇవ్విధంబునంబల్కనలక్ష్మణుండుకేలుమొగిడ్చియనుజ్ఞగొనిసుగ్రీవుమీదనుదయించినకోపంబునకాలాగ్నిసదృశంబుగావెలుంగుచుబాణబాణాసనధరుండై పోవుసమయంబున రామచంద్రుండు తమ్మునిసామోపాయంబున కార్యసానుకూలంబుగావింపుమని పల్కి పంచిన నతండచ్చోటుకదలి దూరదూరంబున పదంబులిడుచు పదఘట్టనంబునం జేసిశిలశల్లనుగ్గునూచంబుగావింపుచుంజని కిష్కింధాద్వారంబున నిలువంబడియున్నసమ

యంబున నుగ్రాకారుండగు సౌమిత్రిం గనుంగొని కపి గణంబుల
లో కొందరత్యంతభయంబున తరుపాషాణంబులుఁ గొని నిలువంబ
డిరి కొందరు రాచుఁచు సుగ్రీవు కడకుంజని మొరలిడిన తారా దివ
ధూవ్యా మోహంబునందగిలి మత్తుడై వినకుండెనంతటఁ లక్ష్మణుం
డు పురంబుచొచ్చివచ్చు చు నంగదుం గనుంగొని నారాకసుగ్రీవు
న కెరుగింపుమని పల్కిన నతండంతఃపురబునకుంజని తల్లులకుండం
డ్రికిం నమస్కారంబుగావించి విన్నవించె నయ్యవసరంబున మం
త్రిప్రముఖులును యంగదుండును ప్రబోధించిన లేచి సింహాసనా
సీనుండైనసుగ్రీవుతోడ నాంజనేయుండిట్లనియె ॥

వృదయరాగము-అటతాళము.

రామానుజుడరుదెంచెనూ। రౌద్ర రసమునకపులు చలించనూ ॥
ఏమోయి మత్తతను తారామోహవశమున। స్వామికార్యము మతి
లో మరచితివని ॥రామా॥ సతిబాసి పర్వతసీమను। నీవతి తాపమున
బొందగ్రేమనూ। సతిగూర్చి కపిరాజ్యసంపదనిచ్చి। హితముగ
నామేలుమరచి రచితివని॥రా॥౨॥ శరచాపములతోడ పిలనూ। రంగ
స్వామితమ్ముడు మెరుగ సాలనూ। కర మొప్పనిల చేసక్రోధబూనినీవేగి।
వరభక్తిగననగన్నతని మెప్పించవనూ॥౩॥ వ॥ అనవినిసుగ్రీవుడాత్మద
లంకి। మొనసిలక్ష్మణుడుగ్ర మూర్తి నైనన్న। కడగి కోపింపంగ కా
రణమేమి। కడుచోద్యమద్యాశ్చర్యంబుగానని।విని హనుమంతుండు
వేట్కతో నీవు।పనితో సుఖంబులవలనొప్పవెలసి। ఘనమత్తతనుశర
త్కాలంబువచ్చుటనుపుగానెరుగంగనలవిగాకిట్టి। లున్నవాడవ
టంచనుడుగకలోక।సన్నుతుండగు రఘుస్వామిసీకడకు।సౌమిత్రిన
నుపంగ చండకోపమున।నా మహావీరుడిందరుదెంచెననగ। నంతట
లక్ష్మణుండరుదెంచి చంద్ర।కాంతోపలద్యుతుల్ కర మొప్పవెలయు
కనకసౌధంబులంగల యానములను।జనసుతంబగునట్టి శయ్యాసనా
దులలరు సుగ్రీవుదివ్యాంతఃపురంబు। కలయజూచుచు సప్తకక్ష్యలు
గడచి।సకియలనూపురస్వనములాలించి।సుకవాణులొనరించు శుభ
గీతనృత్య। నినదంబువినిచాపనినదంబొనర్చ। వినిరవిపుత్రుండు వే
గంబలేచి।తారాంగననుజూచితగువాక్యములను।వారింపుమా రఘు

వల్లభానుజుని। భూరికోపమటన్న పొలతితానంత। కనకభూషణము
లకాంతిసొంపార । జనిలక్ష్మణునిగాంచిచయ్యనబలికె॥

బిలహరి రాగము-ఆదితాళము.

ఏలాకోపమ్ముగల్గెనో। దివ్యచిత్తమునునేల కోపము॥ యేలకోపమొ
మునుపు। కేలిననుగ్రీవు। నీలాగుకోపింప। నెవరుబ్రోచెటివార॥ ఏ
లకోపము॥ మునులుకొందరుచాలనూ। తపమెల్ల మాని। వనితలవశ
మునమా। మునువతిఁగాంపరెసుగ్రీవునిజెప్పనేటికి । ఘనశీలనీవెరుంగ
నిరహస్యములులే॥ వేలాకోపము॥౧॥ మున్నాగానియమించెనూ। కపి
కోట్లశ్రీరా। ముని కార్యమొనరించెనూ। యెన్నగతప్పులేదిసజుని మీద
ను। సన్నుతగుణులొమిన్నగణనీయ్యముమార॥ దేలాకోపము॥౨॥ తాల
గకకరుణించనూ। తనుసతండు। మితోబుట్టువుదలంపనూ। వలనొప్ప
శ్రీరంగస్థలనాథుకరుణచే। నిలఘస్యతను జంపిదలపకండునెమేల॥
యేలాకోపము॥౩॥ గీ॥ ఇవ్విధంబున బలికితానిసకులేంద్ర। సంతిపురి
లోకిగొనిపోవనతివతోడ। దివ్యభవనంబుపేయుదేదీప్యమానుడై
న। సుగ్రీవునయ్యెడననురగాంచె॥ వ॥ తత్పురంబున సుగ్రీవుండు రు
మాపరి రంభణాది విలాసంబులఁ జాలించి కృతాంజలియై డగ్గరిన
సుగ్రీవుజూచి రౌద్రంబునం భృకుటిసూచితనిటలుండై నీవు కా
మోపభోగంబులం జేసి కాలంబెఱుంగక రామకార్యంబు మఱచి
యున్నవాఁడవతికపటంబునమండక స్వనంబుగావించు సపఱంబ
వసి తెలియక నీవాడినమిథ్యావాక్యంబులనమ్మి రామచంద్రుండు
గావించిన మహోపకారంబు మఱచియున్నవాఁడవని పల్క-రామ
ప్రోక్తంబులగు వాక్యంబులు వివరించెనసమయంబున తారయిట్లని
యె॥ క॥ మరువడురామునికార్యము। తరుణినిచిరకాలమింపుడుధర
బాయుటచే। స్మరకేళివెలసెనదియును। కరుణాకరరాఘవేంద్రుక
రుణనుగాదె॥ గీ॥ తపముమానిమున్నారుణిమేనకగూడి। కాలమెరు
గఁడయ్యె గాధిసుతుఁడు। గానమున్నలేని కథలిట్టివుండఁగనా। కరుణ
తోడనితనిగావుమ సఘా॥ సీ॥ అనవినిలక్ష్మణుండతిప్రశాంతుడై క
రుణతోసుగ్రీవుగారవింప। నతఁడనుమైథిలిపతిదయారసముచే కపి
రాజ్యమతివయుగలిగెనాకు। గావుననికవనౌకసకోట్లచే సీతవెదకిం

చిదశకంతు వెసవధింప। నమితయత్నము సేతుననిబల్కి లక్ష్మణుడతి
ముదంబలరంగనతనిజూచి।నిన్ను కోపించిరఘువరుండన్న పలుకు ।
లతులరౌద్రంభుతోడనిన్నాడినాడ । నాత్మ నుంచకుమమ్మా టలకఱ
పుత్ర।మాకుతోబుట్టువీవుమమ్మాటికనఘా ॥వ॥ అనియివ్విధంబు
నంబలికిన యనంతరంబున సకలపర్వతకానన ప్రముఖస్థలంబులవ
సియించు వానరకోట్లను దెంచి పొడసూపిన సుగ్రీవుండు వారలం
గొని లక్ష్మణుండునుం దానును వానరవీరులు మోసీతెచ్చిన పసిం
డిశిబికలోనంగూర్చుండికప్పలువింజామరలు వేయుచుం జనుదేర
రామచంద్రునిసమీపంబునపుంజనియానంబుడిగ్గి పద్మాంకుశాదిశు
భరేఖా ప్రశస్తంబులగు రామచంద్రుని చరణకమలంబులు శిరం
బు సోకం ప్రణమిల్లిన సంతోషచిత్తుడై లిగువాక్యంబులెవ్వెడంబ
ల్కసట్టియెడ॥

పంతువరాళిరాగము-ఆదితాళము.

వెదకబంపెనునీలసూ।సుగ్రీవుడంపెబనవానరకోట్లనూ॥ముదిత
వెదకిమాసమునకురానివారిని పటకపంపంతుపలని చూడండనె॥ వెద
క॥వినుతాదికోశులను।తూర్పు... ...గపట్కి సేవలరించెనూ।పనిబడి
పవననందనవాలితనయాద।వనచ... ...కదక్షిణదిక్కునియమించి॥
వె॥మొననిపచ్ఛిమమున... ...వెదు... గనూ।తనమా
మయనుసుషేణుని బహు... ... ...పంటనసునరింప
గజేని॥వెదక॥౨॥ ... ... ... ద్యగతిను త్తరపు
త్రోవనూ।హితశ... ... ...।పతమెచ్చనందరి
కలబుద్ధిబోధించి॥... ॥౩॥ ... అ... ...వేంద్రుడు
మహాబలశాలియసంగమించు।ధీమంతునిస... ...యుగనిమానితస
ద్గుణనీవుజానకీ।కాంతకొసంగుముంచుక... ...వెలుగొందివి
స్ఫురాకాంతులనీసుముద్రికెసనఘు... ...తీనిచ్చెసొంపుగనె॥

వ॥ ఇవ్విధంబున రఘువరుండునిజనామాంకితంబగు ముద్రికెయొ
సంగిసంగ్రై కొని వందనంబుగావించి పరమానందంబున శిరంబునం
దాల్చె నట్టియెడ॥ ద్వి॥ కరమొప్పనంతటకపివీరులెల్ల।వరుసగాకద
లిపర్వతకాననాదు।లరసిజానకిగానకందరుజేరి। వరుదారనాంజ

శోకవిరాళిరాగము-అటతాళము.

మాసముమించెనుమనువగస్పడదాయె। దాశభోమనకాలము। మున్నెమిమి। జేసితిమొదోసము। వాసిగ ప్రాయోపవేశముమనమిక జేసిన్నమేలుసుమీసర్వకపులార ॥౧॥ కరుణలేనివాడుకమలాప్తుతన య్యుష్ణుఖరశిఖలానరించునూ। సీతసుజూడకరుడెంచుఖిలెంచునూ గురుతుగమజ్జనకునిగూలనెయించు। దురితచిత్తుడుడగ్గరనేర నికమీద॥మాసము॥౨॥తనువునిలుపనొల్లఘనమతినావాతఁజనితల్లి కెరుగించుడీ। మొనసిశ్రీరంగనాథునిదేవిగానక। జనినకీడతరుచయ్యానసమ్మకొనుడిక ॥౩॥మాసముమించెను॥గీ॥ వాలిపుత్త్రుడిట్లువచియింపగావిని। పవనసందనుండుభయముసయము। దెలిపిపల్కెనిట్టితెగువలానపఁగ। గూడదనుచుకేశకొట్లువినగా ॥వ॥ యిన్విధంబునం బల్కినంగదుకొనక దుఃఖింపుచుదక్షిణాగ్రంబులుగాదర్భఁలుపరిచి ప్రాయోపవేశనిష్ఠుండై పవ్వళించెసకలవానరులు రోదనంబు చేయుచు సన్నిధానంబునంగావించిరంతట సంపాతి యనుగృధ్రపతి వింధ్యగిరిబిలంబుననుండి వానరవీరుల ప్రాయోపవేశవృత్తాంతం బాలకించి మెల్లనపదంబులనడచి కొంతదూరంబున నిలచి దైవవశంబున నాకాహారంబుగలిగెననిపల్కిన నంగదుండాంజనేయులంగనుంగొని వైవస్వతుండై నయముండీరూపంబున మసల మృతిబొందింపందలంచెనని పలికిరామచరితంబు క్రమంబుననుగ్గడించిసీతారక్షణార్థఁంబరిగిమృతిబొందిన జటాయు చందంబున మనమందరము రామకార్యనిమిత్తంబున ప్రాయోపవేశంబు జేయంగలిగెనని పల్కిన సంపాతియన్వాక్యంబులు విని తనతమ్ముండగు జటాయువుజచ్చుటకు దుఃఖించి కపీంద్రులారా నన్నుమీకడకుంగొనిచనుండేను రామచరిత్రంబును జటాయుమరణంబును వినగోరినవాడనని పల్కిన కొందరుకపులతనింగొనివచ్చి డించిన సమయంబునవాలితనయుండతనికిసర్వవృత్తాంతంబెరుంగింపసంపాతియిట్లనియె॥

రేగుప్తిరాగము-ఆదితాళము.

వలదుప్రాయోపవేశము। కపులారమీకు। గలుగుకార్యవిజయము।వలదుకాలస్యమును జెందవనితసీతమ్మక్షేమ। మెలమిగొంపావగ

లరలరాముచంద్రు కడకు॥వలదు॥హారామరామయనుచు । దుఃఖిం చుచున్న శ్రీరాముభార్యగొనుచు । కోరిరావణుడు లంకకునుబో యననుచు।నాకాహారముదెచ్చుకొరకరిగినాసుతుడుబల్కె॥వల॥ ౨॥ ఘనరంగనాధుకరుణను । పక్షులకుశతయోజనదూరదృష్టివెల యునూ।వనచరోత్తములారగనుపడుచున్నదిక్కో। డన వొందవై దే హిమొనసిలంకాపురిని॥౩॥క॥అని పల్కకపులుగొనిచన।చనిజలని ధిజలకమాడిసహజన్మునకుం।ఘనతర్పణంబొనర్చియు।వనచరు లనుజూచిపల్కెవరవచనమునకు॥సీ॥ వినుమునిశాకరుండనుమహా మునిపాలనాతన్ముడనునేనునయముతోడ।పనిబడివసియించిబలగ ర్వమునయొకనాడుపందెములాడివాడికిరణ।ములుగల్గుసూర్యమం డలసమీపమునకుబోవంగనతితాపమూపహిల్ల।నునువంద రెక్కల నడంబుగాగప్పికొనుచుజటాయువుకోరిబ్రోవ। నంతమీద రెక్కల రుదుగాకమరంగ।వింధ్యమీదబడితివేగవచ్చి।తన్మూడాతుడగుచు తగజనస్థానంబు।జెందెనసితలంతుచిత్తమందు॥వ॥ ఇవ్విధంబున నే బద్ధబన్నంబులు నిశాకరమునీంద్రున కెరుగించిన గొంత గాలంబు నకు దశగ్రీవుండరణ్యంబునవంచించిరాముభార్యంగొనిలంకా నగరంబునందాచిన యనంతరంబ సీతాన్వేషణంబుజేయుచు రా మకింకరులగు వానరోత్తములీవింధ్యకడకరుదేర గలరు వారల తోనీవుభాషించి సీతావృత్తాంతంబెరింగించిన మరలపక్షంబులుగ లిగిసుఖించెద వని పల్కెం గావున మీరుశీఘ్రంబున మహేంద్రప ర్వతసమీపంబునకుంజని సముద్రంబుదాటి సీతా దర్శనంబు జేసి మేలువార్త రామచంద్రునికెరుంగింపుడనిపల్కి సంజాతపక్షుద్వ యుండై గగనంబునకెగచనియెనంత॥

ముఖారి రాగము- అటతాళము.

వనచరులంతేటనూ। బ్రహ్మానందవననిధిదేలుచునూ।వినువీధికెగ రుచువెలదివై దేహినిగననాయనసనుకొనుచు॥౧॥ మరువగూడదుని త్యము।సంపాతినిమదిలోసనిదిసత్యమూ।విరివిగా ప్రాయోపవేశని ష్ఠులనందర బ్రోచననుకొనుచూ॥౨॥ గురువేగమునజనిరి।మహేం ద్రాద్రికరుదారగనుజేరిరి।సరగున శ్రీరంగపురపతికాంతనేకరణి

జూతుమొయనిరి॥వనచరు॥౩॥వ॥అంత॥ద్వి॥ అందరుకపులు శైలా
గ్రంబునందు।పొందుగాగూర్చుండిపాలుపారుచున్న। ఘనసము
ద్రముగాంచికడుభీతిజెంది।మొనసివారతిదీనముఖులగుచుండ। కని
వాలితనయుండుకపులారచింత।జనునెవిషాదంబుజనములచేరుచు।
గానకోనిఫణిబాలకునిజంపునట్లు। లనిపల్కి-మరియుతానసె వాని
తోడ॥గీ॥యెలమితోడనెవ్వరెంతెంతదూరంబు । జలధి దాటగల
రో జవముతోడ । జెప్పవలయునసుచు జెప్పినసంతట । వరుసజప్ప
దొణంగిరరుదుగాను॥

శుద్ధకాంబోధిరాగము-అటతాళము.

ఘనమతిగజుడుయోజనదశకముదాటగలనని పచియించెనూ। ప
నిబడిపేగగవాక్షుడువింశతియనితగవివరించెనూ॥౧॥ పదలకగవ
యుడంచితలీలబలికెముప్పదియోజనములనుచూ। ముదమునశరభు
డెపఁడనెప్పుకొనె।నలుబదియోజనములనుచు॥౨॥ కణకతోగంధ
మాదనుడుయాబదిదాటగలననెఖ్యాతిగనూ।వినుమరువదియోజన
ములుదాటుదునని।వెసమైందుడలరుచునూ॥౩॥కరమొప్పద్వివిధసు
షేణులుజెప్పిరిపరరంగపతిదయనూ।పరగడెబ్బదియెనబదియోజ
నములబ్ధినేరిదాటుదుమనుచునూ॥౪॥వ॥అంత॥గీ॥ జాంబవంతుం
డుతనపూర్వచరితమెల్ల।నొప్పగాజెప్పతొంబది యోజనమ్ము। లబ్ధి
దాటంగగలనన్నసతనిజూచి। బలికెవాలితనూజుండు ప్రాభవము
నా॥గీ॥ఈసముద్రంబుదాటంగనెలమినేతు।మరలరాగల్గుదునొలే
నొమహిమ వెలయ । ననుచుబలుకంగనంగదునపుడుజూచి జాంబ
వంతుడుపలికెనుత్సవమెలప్పా॥వ॥నీవు పరాక్రమంబునవాలితు
ల్యుండవీ సముద్రంబవలీలం దాటి జానకిం జూచి రాగలవైనను
మాకెల్లనధి కారివి మూలం బవు నిన్నుంగని పెట్టి కార్యంబు సే
యంగలవారము గావుననిన్ను సముద్రంబుదాట బనుపం జాలము
నిపల్కిన నంగదుండతనింగనుంగొని మనలోనసముద్రంబు దాటి
సీతాదర్శనంబుగావించి వచ్చి మనలసందరంబ్రోచు మహానుభా
భావుండెవ్వండనిపల్కిన జాంబవంతుండిట్లనియె॥క॥హనుమంతుడీచ
టగలుగగ।మనకేటికినింతచింతమనలకజలరాశినిదాటిసీతగనుగొ

ని। ఘనవిక్రముఁడితఁడు వచ్చుఁ గడు వేడుకతోఁ ॥వ॥ అని పలికి హను
మంతుఁ గనుంగొని యిట్లనియె॥

మధ్యమావతి రాగము-అటతాళము.

వినవోయి శ్రీహనుమంతా। లోకవిఖ్యాత ఘనబలవంత। వనచరు
లందరు వసుధి దాటెడుమాటలనుకొనుచుండఁగ వినిబల్కవేమియు॥
గరిమతో నబ్ధి దాటఁగను। వనచరులోపరెవ్వరిచటను। విరివిగ సకల
వానరకోట్లనీ వేళ కరుణఁ బ్రోవుము రామకార్యధురంధరా॥౧॥ చం
డబలుండవియ్యలను। నీచందమెరుంగరెవ్వరును। మండితసవ్య
మార్తాండుని చిన్నిబాలుండవై కదియ వేదండిఫలంబున॥౨॥ వర
వాయుదేవపుత్రుఁడవు। శ్రీకరరంగపతికి దాసుఁడవు। గరుడసమానవి
క్రముఁడవీ జలనిధి గురువేగమున దాటుమరమరఁ జేయక॥ వినవో॥౩॥

నీలాంబరి రాగము-అటతాళము.

జలధి వేగమె దాటవోయి। రామసతి నిగన్గొని రాగదోయి। చెలు
వొందు మా రెక్కె సీతకమ్మని రాముఁడొసఁగెను నిచ్చుట బలవంతుఁ డసిగా
ని॥ పండిరాక్షసులనెంచి॥ పట్టి చెండాడుదువు విక్రమించి। పండి
తోత్తముఁడ వఖండతేజుండవు। సిండుమతిని రంగనిలయుని సమ్మతివి
వృా॥జలధి॥ వ॥ ఇవ్విధంబున హనుమంతుని విక్రమస్తోత్రంబులెరిం
గించి యనంతరంబున నతండిట్లనియె॥

సౌరాష్ట్ర రాగము-అటతాళము.

జనకాత్మజను జూచివత్తునా। శీఘ్రముగ లంకఁ జొచ్చి వెకలించి చెత్తు
నా॥ నను వేల్పుతండములనువుగ వీక్షింప। మొనసి నీసముద్ర మీక్షణము
నలంఘించి॥ జన॥ మేరుపర్వత మరుదారను। వేయు మారులు దా
టుదు లీలను। భూరిధరాస్థలి పాసగ బగుల్పగ। నేరుపుగల దనుసురా
రుల నదళించి॥ జనక॥ గిరిబృందములఁ గదలించెదా। భూరిశరధ్ధూళి నె
ల్లఁ గలంచెద। తరణిమండలమత్యుద్ధతి జేరి చాకుదు। నరయఁగ శ్రీరంగ
పురపతి కరుణను॥ జనకాత్మ॥ వ॥ ఇవ్విధంబున నాంజనేయుండా గతి
చ్చైసని వివరించి॥ క॥ ఘనముగ మునన భిమన్యుని। తనయున కెరిగిశౌనకుడు
తగ జెప్పసనం। విని శౌనకాదులవ్యాడ। ననురక్తినిసూతుబాగడిరా

దరమొప్పౌ॥ గద్య॥ శ్రీమదుభయకావేరీమధ్యప్రదేశ ప్రతిష్ఠితసప్త ప్రాకారమహామందిరాంతర్విరాజమాన శ్రీరంగనాథచరణసే వకవరగంటి శేషగిరిదాస ప్రణీతంబగు శ్రీమద్రామకథాసంగ్ర హాయత్తగానవిలాసంబునం గిష్కింధాకాండ సర్వంబును యేకా శ్వాసము॥

సంపూర్ణము.



శ్రీరస్తు.

## సుందరాకాండము.

శ్రీరమణీరమణనవాంభోరుహనేత్రా శ్రీరంగపురనాథకృపా |
పారావారజనార్దన | క్రూరాసురనివహశోషకోవిదతోషా .

గీ॥ అవధరింపుము శౌనకాద్యఖిలమునుల। నింపుతోడుత గనిసూ డిట్టులనియె। వినుడు మునులార శుకుడు భూవిభుని జూచి। పరమక ల్యాణముల రంగ బలికె నపుడు॥ ద్వి॥ హనుమంతుడంతట నధికోత్సవము న। ననిమిషనుతవిక్రమాన్వితుండగుచు। ఘనసారజంబీరకల్ప కాశ్వ త్థ। పనసరసాలాదిబహువృక్షకలిత। మగుమహేంద్రాద్రిపైనమ రంగ నిలిచి। తగుమంచిఫలములతరులైన నవిరుల। గురువాసనలు ఘు మంఘుమనొప్పుచుండ। శరభవారణసింహశార్దూలఖడ్గ। ఘోర మృగావళుల్ క్రూరసర్పములు। చారుకీరమయూరసమదపికాళు। లారూఢి భయముచేనట్టిట్టుబార। కోరి గంతులువైచి కోమరొప్పజ లధి। నవలీల దాటంగనాత్మలో దలచి। పవనజుడుత్తుంగభంగసంఘూ త। సంజాతభీషణస్వనయుక్తమగుచు। రంజిల్లు జలరాశి రయమున జూచి। పంకజవదనముత్పలలోచనములు। పొంకమౌసైకతభూర్నిని తంబ। ముమ్మగ్గలసురనదీమోహనకాంత। నెలమి కౌగిట జేర్చ నింపు తోసాచు। ఘనసముద్రనిలసత్కరములనంగ। సనువొందెననిపించు

లఁబట్టిగర్జించుచు।కరమొప్పనుదయాద్రిగనుపడునవ్య।సరసిజాప్తునిరీతిచక్కఁగావెలసి।పదపడిగురుభుజాస్ఫాలనమంతు।వదలకచేసిదుర్వారుఁడైయెంచి। కలవానరులనెల్లఁ గ్రక్కునఁజూచి। పలికెనంతట భుజాబలము రెట్టింప॥

శంకరాభరణము-అట తాళము.

కపులార సెలవా।లంకకుఁబోవ।కపులార సెలవా॥ కపులార శ్రీరామకృపచాతజలనిధి।సపరిమితోత్సవములరదాటెదనింక॥కపులార॥ చరణఘట్టనమూ।భూపలయము। సొరిదిఁగ్రుంగగనూ।గురుభక్తినెగసిశ్రీకరరామచంద్రునికరముద్రికఁ గొనివ్యాకరముకీర్తినిబోదు॥ కపులార॥౧॥ జనకనందనసూ।లంకకుఁబోయి।కనిపత్తుతగనూ। జనకజలేకున్నఘనతౌద్రమునరావణునిదెత్తునుద్యగ్గళీసిబట్టిగ్రద్దుచు॥ కపులార॥౨॥సురపమతులనూ।బల్విడివాకిళ్ళగణగూల్చెదనూ।పగరంగనాథునికరుణాలంకాద్వీపమరుదుగవైకిచెచ్చెరదెత్తుజవమున॥ కపులార సెలవా॥౩॥వ॥ఇవ్విధంబునంబలికి॥గీ॥ పద్మమిత్రశక్రపవమానచతురాస్య।ముఖ్యదేవతలసుమదముతోడ।మదిదలంచి మ్రొక్కిమానకరఘువర్యు।పదములాత్మలోనఁపదిలపరచి॥

నాదరామక్రియరాగము-ఆది తాళము.

రామునిదలచెదనూ। మదిలోన సీతారాముని॥రామునిమేఘశ్యామునిసుగుణస్తోమునిదైత్యవిరాముని సీతా॥రాము॥కమలవిలోచనునీ। మోహానాంధునికలుషవిమోచనుని। సమదోగ్రాసురసముదయసంహారుసమితపరాక్రమునసఘునిసీతా॥రాముని॥ నింపుమతీదలంతూ।శ్రీరంగపురినుండువిభుపరింతు।పండితగణనుతువర్ధ్యనిమరితవిఖండనుధృతకోదండునిసీతా॥రామునిదలచెదనూ॥౩॥వ॥ఇట్లునిష్ఠాగరిష్ఠుండై రఘువరేణ్యునిందలంచి మ్రొక్కియనంతరంబా॥

గీ॥పదములిలమీదదృఢముగాపదిలపరచి। వాలముద్ధతిదిరుగదుర్వారుఁడగుచు।చాలనాలంకమీదదృగ్జాలమమర।సత్యదగ్రతగనుచుమహాజవమునా॥

ఆరభిరాగము- అటతాళము.

హనుమంతుడేగసెనంతటనూ। దేవగణదుందుభులుధణంధణాను

మ్రోయగనూ। తనపత్నినపహరించినరాక్షసుని ద్రుంచ। కనలిరా
ఘవుడత్యుగ్రతనేయుశరమన॥ దండిదైత్యులుతల్లడిలనూ। వేల్పు
తండములతిహర్షమునవర్ధిలను। చండదర్పమునప్రచండుడగు
చుమహోద్దండతహూంకించుచుండిరుఘోరాలుస॥హ॥౨॥ గురువృక్ష
తతులుక్రచ్చొరనూ। దుర్భరజవంబునకన్నియును పెకలియునూ।
తరుచుగతనవెంటనరుగుగనరుదేర। వరరంగ పతినామస్మరణగా
వింపుచూ॥వ॥ఇట్లుజనుచుండ॥క॥హనుమంతునివెనువెంటను। జనిచ
నివృక్షములువరలచయ్యనవచ్చెన్। తనపుట్టంబునుబనిచియు। పనిబ
డిమరివచ్చునట్టిబంధులభంగిన్॥గీ॥ఎగసిపోవుచుహనుమంతుడెలమి
నొప్పె। తోకతోడుతనత్యంతభీకరముగ। చారుపరివేషకలితుడైభూ
రిదీప్తి। వెలయశోభిల్లుసూర్యునివిధముబోలి॥సీ॥ అనుపమరామకా
ర్యార్థమెవడిబోవుహనుమంతునుతియించిరఖిలమునులు। సురులు
వర్షించిరత్తరిపారిజాతాదికదివ్యపుష్పవర్షములుచాల। త
పనుడుదండుడై తపియింపడయ్యెసమీరుండుహితము సొంపారవి
సరె। గరుడగంధర్వకిన్నరనాగముఖ్యులుమించిచిత్తములహర్షిం
చిరంత। మొనసివారుతినేత్రముల్ఘనగరీంద్ర। మంచువెలుగొందు
దీపాగ్నిచందముగను। మెరయుచుండంగజనుచుండెనరుదుగాగ। వ
సధిలీచులనెన్నంగజనెడికరణి॥సీ॥ ఈరీతిహనుమంతుడెలమిబోవు
చునుండగనిసముద్రుడురామకార్యమునకు। గరిమెసహాయంబుగా
వింపుమదినెంచితనలోనమైనాకునెనయుజూచి। రామకార్యమున
కై రయమునహనుమంతుడెవచ్చుచున్నవాడలుపుదీర। నతనికిసా
హాయ్యమమరగావింపుముతడయంగవలదన్నతక్షణమున। ననిలజు
నిజేగినిలుచుండెనాతడతను। విఘ్నమొనరింపవచ్చినవీరుడనుచు। రో
ష్మబలమునగ్రుమ్మంగసౌమ్యసిలియు। బలికెమైనాకుడతనితోప్రా
భవమునా॥గీ॥వనచరోత్తమరామసేవకుడవీవు। బనిచెననున్నసము
ద్రుండుపరమకృపను। విశ్రమింపుమునామీదవేట్కతోడ। చారుధీ
మంతహనుమంతసత్వవంత॥వ॥ఇట్లు బలికిన విని మహాత్మా నీవు వా
త్సల్యంబునం బలికిన, పలుకులకు సంతసిల్లితి రామ కార్యంబునకు శీ
ఘ్రంబునం బోయివత్తునని కపులసన్నిధిం బలికివచ్చినవాడగావున

ముఖారిరాగము-ఆదితాళము.

ఎంతో శృంగారమయ్యున్నాది। యీలంకాపురమెంతో॥ దంతిరథ
తురగ ముఖాదులమరి। శశికాంతాంచిత శ్రీకరమంటపమై॥యుం॥ కనక
నిర్మిత ప్రాకారములు। రమ్యహర్మ్యములు। మణిమయోన్నతగో
పురములూ। ఘనవికసితవనజములకు కొలనుల। ననుపమలసదుపవన
ములనలరుచు ॥నెంతో॥ మంగళతూర్యనాదములూ । భేరీతాళమృ
దంగకమనియ్యనిస్వనములు। రంగుగవినబడుచున్నవి మోహనరంగ
పురీశునిరమణివసించుట॥ నెంతో శృంగారమయ్యున్నాది॥

సీ॥ ఘనపరిఘాట్టాలకధ్వజతోరణకనకగోపురహర్మ్యకలితముగు
చు। కీరమయూరకోకిలనిస్వనాంచితనవ్యోపవనవితానములనమరి।
కమలకల్హారశ్రీకరమహోత్పలలసత్కాసారపంక్తులఘనత వెల
సి। సాగరపవమానసంసేవ్యమానమైసాగరతుల్యఘోషంబుగలిగి।
చాలమెరయుచునున్నదీచారుపురము। నాకమునకంటె నెక్కుడై శ్రీ
కరముగ। వనచరోత్తములిచటికివచ్చిరేని। సకటతలపోయగనునిర
ర్థకముగాదె॥ గీ॥ అకట శ్రీ రామచంద్రుడిందరుగుదెంచి। గరిమ
తానేమిసేయంగగలడుతలప। నెట్టివీరులకైననిప్పట్టణంబు। విక్ర
మంబునచొరనెట్లు వెసలభించు॥ వ॥ ఇవ్విధంబునం దనమనంబునంజ
చింపుచు రామపత్నియగుసీత వెదకందలంచి ప్రదోషకాలంబు
న పృషదంశుకమాత్రస్వరూపుండై యప్పర్వతంబు డిగ్గి లంకాన
గరంబుడగ్గరి మహోన్నతమణిమయస్తంభసమంచితసౌధవితాన
విరాజితంబునుకింకిణీకలితమహాహాటకజాంబూనదతోరణాకీర్ణం
బును భీమరాక్షసప్రకాండసంసేవితంబును రావణబాహుపాలితం
బైదుర్నిరీక్ష్యంబగుయప్పురంబుదెసమొగంబెత్తికనుంగొనిచింతా
క్రాంతుండై మరలధైర్యంబుగొని పురంబుజొచ్చుసమయంబున॥

క॥ లంకానామనిశాచరి। శంకాలేశంబులేకచనుదెంచివడిం। కొం
కకహనుమంతునిగని। బెంకెములాడుచునుడాసిపెలుచంబలికెన్॥

మధ్యమావతి-రేకు ప్తి-అటతాళము.

ఓరిదురాత్మనీవెవడవు। నన్నుమీరిపోగోరినవాడవు। క్రూరతనీను
బట్టికోరి మ్రింగుదుగాని। చేరనిత్తునె లంకాద్వారమీవేళను॥౧॥

ననునీవుధర్షింపనేవతేవు। వేగమునన డ్డపడుచు త్రే లేదవు। ననుని ల్వారింపనింద్రునికైన జెల్లునె। పనిబడనీవిట్లగినిసిరానేవతేవ॥౨॥ లంకాధిపునియాజ్ఞ వలనను।నిశ్శంక బ్రోచెద నేనీపురమునూ। లంకానామముగానలంకారూపిణినీనా వంకకువచ్చినవాడ వెవ్వడవిట్ల॥౩॥ఘనమతినీలంకలోననూ।గల్గుకనక గోపురహర్మ్యములనూ। పనిబడిచూడగ చనుదెంచితిని శ్రీరంగనివాసు బంటుచయ్యాసచావకే గుమ॥౪॥యోరి॥ద్వి॥ అనవిని యాలంకె హనుమంతుడాసి।తనహస్త తలముచేతగ గొట్టుటయును।కసలిమారుతిమహాగ్రంబున దాసి। పనిబడిముష్టిచే ప్రహరింపధరణి।బడితల్లడిల్లి యోపావనగాత్ర। తడయకశరణంటితగ గావుమింక। చెడునింకనీలంక చెచ్చెరదప్ప। దుహుగ కబలికెదనొక మాటవినుము। కమలగర్భుడునాకుకర మొప్పమున్న।విమలాత్ముడై చెప్పె వెసనర్వమెల్ల।గావునవిజయంబుగలదుశీఘ్రముగ।పావనాంగినిరామపత్నినీపురిని।వెదక బొమ్మనిపలుక వేగంబుతోడ।కదసిప్రాకారంబు గ్రక్కునదాటి।ఘనరాత్రుసత్కుయుకారణంబుగను।తనసవ్యపదముముందర బెట్టిచొచ్చి।బంగరుమేడలేపర్ఢడచూచుకొనుచు।రంగైనకనకతోరణరాజిగనుచు। శాతకుంభద్వారచయములుగనుచు।భీతిలేకనుబలిభిన్నణిస్తంభ। చారుమంటపవజ్రసోపానతతుల।తీరెల్ల చూచుచుతిరుగుచున్నంత॥

భైరవిరాగము-ఆదితాళము.

ఇంటింటికిజనిచని వెదకెనుపూర్ణేందునిభాననూ।మింటికినంటినమేడలగలవాల్గంటులలోకలకంఠిగలదనుచు॥నిం॥ గురుకుచముల హృద్వారులను గ్రుచ్చుచు।సరసములాడెడిగరితలగాంచుచూ॥నిం॥ ౧॥గురుతరమణివిస్ఫురితమహాంతఃపురసీమలసుందరినింగానక॥ నింటిం॥౨॥ సలలితరంగస్థలఘతివల్లభి।నలరుచుగానకనలమటగలగక॥నింటింటికి॥౩॥వ॥ ఇవ్విధంబునం హనుమంతుడు సీతాన్వేషణంబు సేయుచు రాజమార్గంబుజొచ్చి విద్రుమసోపానంబులెక్కుచు మరకత స్తంభాగ్రంబులకెగరి నిక్కి చూచు ముక్తాజాల సమంచితకాంచనద్వారంబులన మరియున్న వజ్రకవాటంబులమెల్ల నసెట్టి పల్లవాధరింబరికింపుచు యువతీజన శృంగార సంగీత లాస్యా

యు। రాత్రి సాధ్వి తను దా రావణమాటల। వీక్షించి వీక్షించి విస్మయ
మందె। యారాత్రి సేంద్రప్రశయ్యాభాగమందు। కోరి నిద్దుర జెందుకో
మలిద్దైన। గరిత మందోదరిఁ గని మహానంద। పరవశుండగుచు సుస్వాత
మున కెగసి। గంతులు వైచి రాఘవపత్ని యైన। కాంతామణి సీత గం
టి నటంచు। మరిమరి జూచుచు మానసమందు। మురియుచు మరల తా
మొనసి యూహించి॥

ముఖారి రాగము - అట తాళము.

అపరాధ మొనరించితి। రావణు పత్నిగ యయోనిసీత గ నెంచితి। విప
రీతమయిన పాపపు భావము రీతి కృప జేసెగద దైవము॥ అప॥ సొమ్ము
లు ధరియించుచు నా। మోహన మైన సొగసులు గావించునా। సొమ్మ దిన
స్వ శయ్యాలమీద నిట్లు సీతమ్మ తా శయనించునా॥౧॥ కంబుకంధర [illegible]ం
చునా। పాలిండ్ల శ్రీగంధలేపనముంచునా। తాంబూలరసరంజితం
బైన మోవి సీతాంబకెయ్యెడ కల్గునా॥౨॥ కన్నీరునించుచునూ। హా
శ్రీ రామ కావు కావుమంచునూ। నన్నేలుమి కరంగ సాధనీవని సీత చె
న్నుగ విలపించదా॥౩॥ అపరాధ॥ వ॥ ఇట్లు దలంచి మనోజ్ఞంబగు పా
నభూమింగనుంగొని యా ప్రదేశంబున దివ్యాంబరాభరణభూష
మాలికలు ధరియించి మధురాపాన పరవశంబున మత్తిల్లి యొకరి
నొకరు కౌగిలించుకొని శరీరంబులు మఱచి నిద్రించు సుందరీజనం
బు లగోప్యమనంబులు గాంచి తనమంబున॥

రేగుప్తి రాగము - ఆది తాళము.

వ్రతము చెడిపోయు నేమి సేతూ। సద్బ్రహ్మచర్య వ్రతము చెడి॥
హనుమంతుడనై మగువల పాదముల। కితరము జూచక నుతికెక్కిన నా॥
వ్రతము॥ పరనారిజనుల గోప్యాంగములా। తరుచుగ నేడు వరుసగ
ను గొంటినా నేత్రములా। మరి తాత్మ శ్రీకరరంగేశ్వరుకరుణ
దప్పితిని రయముగ లదిక॥ వ్రతము చెడి॥ వ॥ ఇట్లు విషాదంబునం జెంది
మరల ధైర్యంబు గొని॥ గీ॥ వెలదులున్న చోట వెలదిన న్వేషించు। కితర
చోట్ల వెదక నేమి ఫలము। గాన కాంతలందు కాంతనన్వేషించి। వింతే
కాని దోసమేలకలుగు॥ క॥ కామించి చూడనెద్దియు। కామాతురమున
గనుగన్న కలుషములబ్బుఁ। రామాజ్ఞ వలన నేనా। రామను వెదకితిన

నేకరామావళిలోన॥వ॥ ఇట్లునిశ్చయించి హనుమంతుండావిమా
నాంతఃఖుఃరంబున జానకి నధిక ప్రయత్నంబునం వెదకికానకచిం
తా క్రాంతమానసుండై॥

శంకరాభరణము-అటతాళము.

జనకజగనుపడదాయా। నామనసుకేమియుదోచదాయ। కనక
సౌధములెల్లగడిసిశోధించితి।ననువాండనుద్యానవలములువెదకితి॥
జలధిదాటుటనిష్ఫలంబు।లంకకలయనేవెదకివ్యర్థంబూ। వలనొ
ప్ప సంగదాదులకెట్లువివరింతు।కలికివై దేహినిగనుగొనలేదని॥౨॥
ఇందుజానకిగలదంచు।సొంపుజెందద్విజుండనేనంచూ।పొందుగ శ్రీ
రంగపురపతివల్లభి।నిందువెదుకవచ్చితిట్లను వెరుగనూ॥జనకజ॥
వ॥ఇట్లుచింతింపుచువిమానంబువలనంధూకి రావణుమందిరంబు
వెడలి ప్రాకారంబుమీదవసియించిమరంతంబై నవిషాదంబున॥

ముఖారిరాగము-ఆదితాళము.

ఏమాయనో।సీత।ఏమాయనో।జనని ॥ఏ॥ ఏమాయనోసీతాభా
మగన్పడదాయ।భీమరాక్షసులుగడిసిపెలుచభక్షించినారో ॥ఏ॥
పతినెడబాసినసతిబ్రతుకేలని।పతిముఖపద్మముమతిగనుచు।నతితా
పవశమునహారామరామాయని। పతిదలచుచుదేహమతివబాసె
నోలేక॥ఏ॥౧॥ వననిధిగనిభీతివణకుచు ప్రాణము।లనువ్రుగవిడిచనో
హాయనుచూ।పెనురక్కసబోటులభీకరాంగముజూచి। వనితజచ్చె
నో ప్రాణవల్లభవల్లభయని ॥ఏ॥౨॥ ఎక్కడవెదకినసింతిగన్పదా
య। నక్కటనేమిసేతుహాదైవమా।మిక్కిలికరుణదప్పెమేటి శ్రీ
రంగపతి।చక్కనిరామలక్ష్మణులసన్నిధికేమనిబోదు॥ఏమాయనో॥
ద్వి॥ అచింతజెంక చునధికశోకమున। గనుపదదాయచక్కనిరా
ముభార్య। కపులకుకాలంబుగదిసెగాబోలు।నపరిమితోగ్రపాషా
దులవలన।శుకవాణిసర్వాంగసుందరీనబల।నికనెట్లుగనుగొందునె
వ్వరుదిక్కు।కటకటానేబోయికాంతలేదన్న।పటుశోకమునరామ
భద్రుండుదేవా।మతివేగమునబాయునంతటతమ్ము।డతులశోకంబు
ననట్టితాజచ్చు। వారిద్దరిట్లైనవార్తనాలించి।వారకభరతుండును
సుధపైగూలు।వెనువెంట ప్రాణముల్విడుచుశత్రుఘ్ను।డనవాం

దనాత్మజులారీతిజచ్చు। బెరిగిజత్తురుమాతలెల్ల వేగముగ। సురవి
షాదంబునగూలుసుగ్రీవు।డరుదుగారుమజచ్చునవ్విభుగాంచి। గరి
మెనత్యంతశోకంబును జెంది।తడయకతానిట్లుతారావధూటి।కడు
వడి సమయునంగదుడంబజూచి।వనచరులటమీదవరముష్టిహతుల
జనిబడిప్రాణముల్బాయంగగలరూ ॥గీ॥ గానరాముకులముకపి
కులంబీరీతి।జచ్చునింకమీదజలధిదాటి।చనగనొల్ల నేనుజనకనుండీతి
నేని।బ్రతుకగలరుయాశబలమువలనా॥

శుద్ధకాంభోధిరాగము-అటతాళము.

ఎన్నగమరణముమేలనిదోచుచునున్నదింకా।లోకసన్నుతశ్రీరా
మరామహరేయనిజత్తునింకా।పదపడివిషపానమొనరించిదేహము
బాతునింకా।నేనువదలకనగ్ని ప్రవేశముగావింపవలతునింకా॥౧॥
విరివిగనుశ్వంధనమునప్రాణంబులువిడుతునింకా। నాకు పరమపా
వనిగన్పడదాయనగ్ధిలోబడుదునింకా॥౨॥ ఘనపక్షివృగములదిను
మనియొసగుమతనువునింకా।,దివ్యమునివృత్తితపమునమొనయగనే
బోదువనముకింకా॥౩॥ చెలగిహస్తాదానాదివ్రతంబులనిలుతునిం
కా।రంగస్థలపతిపదములుదలచుచుగుహలలోవెలయుదింకా॥౪॥
ఎన్నగ॥గీ॥ఇన్నిసేయనేలనిలమీదజీవించి।పటుపరాక్రమమునపం
క్తికంఠు।తోకతోడగటితో డ్తెచ్చిరఘుపతి। సన్నిధానమందుచక్క
నునతూ॥వ॥ఇట్లనేకవిధంబులనూహింపుచు చింతాపరంపరలవల
నంజిక్కుపడి ముందటమహోన్నతంబగు నొకయశోక వనంబు గ
నుంగొని యివ్వనంబునవై దేహిని వెదకకున్నవాడ నికమీద వెదకి
చూడవలయుననితలంచితనమనఃకమలంబునరాఘవేంద్రునిపాదక
మలంబులుజూచుచు॥

భైరవిరాగము-జంపెతాళము.

చారుసౌమిత్రిసహాయుడై విలసిల్లు। శ్రీరాఘవేంద్రునకుచెలగి
మ్రొక్కెదును ॥ జనబృందములకెల్ల జననియనదగునట్టి । జనకాత్మ
జాంఘ్రులకుసాష్టాంగమిడుదును॥౧॥ పరమభక్తినిరుద్రసురనాధ
దండధర।వరసమీరాదులనునిరతముదలంతుజ॥౨॥కరుణతోడనున
న్నుగావుమని శ్రీరంగపురధామునాత్మలోభాసగవినుతింతుజ॥

ధూమముతోఁడగలస్సినవహ్ని।తెరగునమలినంబుదేహమందమర।
దరిలేనిదుఃఖాబ్ధితగమునుంచుచును।తనవారిగానకదారుణదైత్య।
వనితలనేవేళవారకగనుచు।కులమృగంబుల బాసి కుక్కలగమిని।
వెలయుకురంగిగా వెసవసింప్రుచును। కోరిసొమ్ములుకొన్నికొమ్మ
నంటించి। హారామహారామహారామయంచు। విలపించివిలపించి
విధినెన్నుకొనుచు।వలనొప్పమాసినవస్త్రముప్పార।కురులెల్లజడ
గట్టికొమరారుచుండ।నిరత మాహారంబునిద్రయులేక। వర మణి
భూషణావళులంగములను।చిరకాలముండుటచేసొంపుమీర। సర
గునసైల్యమాఛాయలదనరి।గరితకునెమ్మేనగనుపడుచుండ।దిక్కె
వ్వరునులేకదీనతజెంది। చక్కనిశ్రీరామచంద్రుదలంచి। కన్నీరు
నించురాఘవపత్నిగాంచి।మున్నెన్నడిటువంటిముదితనుగాన।నను
చుసీతమ్మగానాత్మలోనమ్మి।కనుగొంటినహహాశ్రీకళ్యాణవతిని।
జననినినాజన్మసాఫల్యముగను।మొనసిధన్యుఁడనైతిముజ్జగమ్ములను॥

మారువరాగము-అటతాళము.

ఈమోహనాంగి శ్రీరాములకిల్లాలిదిసత్యమిదిసత్యమూ।స్వామి
మానసముయీభామయందున్నాది। భామ మానసముశ్రీరాము
జెందెనుజూడ॥యీ॥ అనాడురాక్షసేశ్వరుడుగొంపోయినలలన
బోలుచునున్నది।కలయమాసినయీమెకాంచనవస్త్రము। తొలుత
నగ్గిరిబడ్డవలువకుసమమాట॥నీమోహ॥స్వామిజెప్పినసొమ్ములున్న
వికొమ్మకుచారుమోహనియ్యమై। స్వామిజెప్పని సొమ్ము లేమకులే
దాయ।నీమెచక్కందనమెవరోపరిట్లన॥నీమోహ॥౨॥ ధన్యుడనైతి
నిరంగపురీశునిదయతోఁడనీవేళనూ। మాన్యతనొందినమగువయాజ
నకరాజన్యపుత్రికనిచ్చోచయ్యానగనుగొంటి॥నీమోహ॥3॥

చ॥గురుతరసంపదల్విడిచిఘోరవనంబులకాత్మనాధునిం।నిరుప
మభక్తిగొల్చుచునునిష్టదలిపఁగనొప్పుచుండయీ। తరుణికివచ్చె
నాపదయుదగ్రగతింవిధినేమనందుభీ। కరముఖరాక్షసాంగనల
గాంచితపించగగల్గెనక్కటా॥క॥ జనకునిపుత్రికైదశరధ।జననాథు
నికోడలఖిలజననుతుడగురా। మునిభార్యలోకపావని।ఘనరాక్షసు
చాతజిక్కగాగల్గెగదా॥

శోకవరాళి రాగము-అటతాళము.

కన్నదో యినిగాంచి బ్రతికియున్నాడనీ కాంత దుఃఖము౹ యిట్లి
వెన్నెన్ని గాంచుటకున్నవాడనో భువినిదియుసత్యము౹ నిలువుమీరుగా
కనిలిచితిలలనకన్నీరు జూచి౹ వలనొప్పదగ్గుడగా నైతి చెలిశోకవహ్ని
జూచి॥౧॥ వాపీగ నెన్నటికైన డాయదుమన్న యాసతోడనూ౹ సౌం
పుబాసియన్యోన్యులుదరిచూచుచున్నారుగా సీగాగనూ॥౨॥ యిద్దరి
శోకములిద్దరి మోహము లెంచిచూడనూ౹ తద్దయనొక్కటిగాదో
చెశ్రీరంగధాముకృపను॥౩॥ వ॥ మరియునా హనుమంతుంజడుగన్నో
హనదివ్యమంగళవిగ్రహుండగు శ్రీరాఘవేంద్రునితోడలయంద
కలంకవై భవంబునం గూచుండి తేజరిల్లందగిన సర్వాంగసుంద
రియగుసీతాస్వరూపంబు మరలం గాంచి యాసాధ్వికిం బ్రాప్తిం
చినబన్నంబులకచ్చెరువందుచుంగన్నీరునించి॥

అసావేరి రాగము-అటతాళము.

ఎటువలెజీవించెనో౹ శ్రీరాఘవుడీయింతి నెడబాసి౹ కటకటయీ
కాంతగనుపడకున్న౹ నుత్కటశోకముననంతట ప్రాణములు బా
యు॥ ఎటువలె॥ యెంతదుష్కరుడాయెను౹ శ్రీరాఘవుడీ రామబా
యుటనూ౹ చింతించుచున్నయీసీతలేమికిదుఃఖ౹ సంతాపముునను
తానింతైనక్షీణింప॥ ఎటువలె॥ రామారామయనుచూ౹ సంతత
మాత్మరమణునివచియించుచూ౹ ప్రేమతోడుత రంగధామురమ్మ
నుచున్న౹ కామినిమణిబాసికాతిన్యహృదయుడై॥

శుద్ధకాంబోధి రాగము-అటతాళము.

ఈ కాంతకె గాదా కాకుస్థతిలకుడుశోకసమేతుడై చాలా౹ హే
కమలేక్షణహాజానకీయనివీకనిద్రింపడేవేళా॥ వనమున శ్రీరఘువరు
డుమారీచునివధియించుటీమెకెగాదా౹ ఘనలీలతృణమునకాకాసు
రునిగర్వమణచుటిలలనకే కాదా॥౧॥ ఖరదూషణాదిరాక్షసఖండ
నముసేయుటరుదారనీమెకే కాదా౹ సరగునయాకబంధునిద్రుం
చిపంపకుజనుదెంచుటీమెకే కాదా॥౨॥ వలనొప్ప ఘోరతరాటవి
వెదకుచు౹ విలపించుటీమెకే కాదా౹ చెలగిసుగ్రీవునిసఖ్యమొనచు
టి౹ కలహంసయానకే గాదా॥౩॥ కరమొప్పనొకదివ్యశరమునవాలి

నిఖండించుటీమెకేగాదా।తరుచరరాజ్యమురవిజునకిచ్చుటీపరమక ళ్యాణికేగాదా॥౪॥దిక్కులకెల్ల వానరకోట్లబనుచుటీదివ్యసుందరి జాడగాదా॥గ్రక్కునవేవచ్చిజలధిదాటుటలుయీకళ్యాణినిగాం చగాదా ॥౫॥ యీలంకశోధించుటీనవ్యపద్మవిశాలనేత్రినిగనగా దా।చాలగనీపుణ్యశీలగనుటరంగస్వామిసత్కృపగల్లగాదా॥౬॥

క॥పతివలనమరదివలనను।సతతమురక్షింపబడినజానకి యిచ్చో। నతిభయదరాక్షసస్త్రీ।ప్రతతులుకాపుండదుఃఖపడవలసెగదా॥

గీ॥మంచువలనకాంతిమాసినపద్మినీ।కరణిదుఃఖముననుగాసి జెం ది।చక్రవాకరహితచక్రవాకియుబోలె। వెలదియున్నదిచటవిభుని బాసి॥వ॥ఇవ్విధంబునందలపోసి॥క॥జనకజ తోనే నిప్పుడ।ఘనమ తిభాషింపవేళగాదనుచునుయా।హనుమంతుడణగియుండెను। పని బడిపర్ణములవలనప్రచ్ఛన్నుండై॥వ॥ఆసమయంబున జగత్కం టకుండగు దశకంఠుండు మేల్కాంచి జానకిందలంచిమన్మథశరపీ డితుండైయద్దేవినింజూడంగోరి॥

పంతువరాళిరాగము-ఆదితాళము.

అతివైభవముతోడనూ।రావణాసురు।డరుదెంచెసీతజాడను।స తులుకొందరాభరణద్యుతులుదిక్కులుగవియ।ధృతదీపపాత్రలగు చుజతలై ముందరనడువ॥నతివై॥తరుణులిరువురువేట్కనూ। డగ్గరి వింజామరలువేయుచునుండనూ। గురుతుమీరగహేమకుంభములె త్తుకొనుచు।గరితలెల్లనునీరుకలయజల్లుచురాగ॥నతి ॥౨॥ శృంగా రకలితుడగుచు।నొకచెలియకేలు।పొంగుచుబట్టికొనుచు।రంగుమీ రగదివ్యరంగధామునిసతి । శృంగారము జూడగశృంగార వనము న॥నతివైభవముమీరను॥౩॥వ॥ఇట్లుజనుదెంచుచున్న దురాత్ముండ గు రావణుంగాంచి యావైదేహి మహా మారుతంబునం గదలు కదళీ వృక్షంబునుం బోలె గడ గడవణంకుచు తొడలవలననుదరం బును హస్తాబ్జంబులకుచకలశంబులుం గప్పుకొని దుఃఖించు చున్న యెడ దశకంఠుండు మెల్లన చనుదెంచి రామ పత్నిం గనుంగొని యిట్లనియె॥

సురటరాగము-ఆదితాళము.

మోమెత్తిచూడలేవెమా।నన్నుమోహించికోరవెభామా ॥ సా
మజయానసీచక్కందనముజూడ।ప్రేమతోనిచటికిబిరబిరవచ్చితి॥
తనుమధ్యమేలదాచేవు।నన్నుగనిగడగడవణకేవు । వనితమానుము
నావలనగలిగినభయము । మనయమునన్నేలుమతి హర్షమలరగ ॥
మో॥౧॥మలినవస్త్రముగట్టనేలా।మూర్ఖమతివై కృశింపగనేలా।
చెలమితోదుతసీయావనసమయము। కలికిరోవ్యర్థముగాబుచ్చ
నేటికి॥౨॥ శృంగారమేమిశాయకనూ। ధూళిబ్బంగెడినిన్నుజూచి
నను।మంగళమయ్యన్నదహహాసొంపుగనీవు । శృంగారించిన వేళ
జూడగశక్యమె॥౩॥లలనాక్రీడింతమనిశము।నాలలనలసేతూనీవశ
ము।వలనొప్పశ్రీరంగవాసుసాక్షిగజేతు।నెలతనీతండ్రినిఖిలభూ
మిశుగ॥మోమెత్తి॥౪॥గీ॥ అనుజుతోడరాముడడవిదుఃఖింపుచు।యు
న్నవాడొలేకచన్నవాడొ।శ్రీదొలంగివనముజేరియాకలములు। ది
నెడినరునిమీదకనసుదగునె॥చ॥వననిధిదాటిరాగలడెవచ్చినను గ్ర
పరాక్రమంబుచే । ననిమిషనాధముఖ్యులమహాహవమందుజయిం
చినట్టినన్ననిమొనగెల్చినిన్నుగొననక్కటశక్యమెలక్ష్మణాగ్రజుం।
డనుపమశౌర్యవిక్రమగుణాదులనెంచగనన్నుబోలునె॥వ॥ ఇట్లుబ
లికినంగన్నిరొలుక నత్యంతదుఃఖసంతప్తచిత్తయై యొక్కతృణం
బువానికడ్డంబుగాకేలంగొనియిట్లనియె॥

సురటరాగము-ఆదితాళము.

తలవరానితలపులుతమిదలుపగవలదిలబ్రతుకుమతొలగి ॥ ఖలు
డనీవునన్ననినదురొక్తులఫలమికధరననుభవమగుసూటెని ॥త॥ పర
కాంతలమదివలచుటనిదిబహు పాతకమనుచుదెలియుము । గరిమ
తోడవలపెల్లనునీప్రియతరుణులయెడగొనివరమతివగుమిక॥౧॥
దురితహృదయనీగరితలనితరులుకరముదుగమదిగోరా। గురుతు
గమనమునకెటులనువొందదొవరులకుదలపుము ప్రతికూలంబని ॥
ఖలు॥త ॥౨॥ వలనొప్పగరఘువరునికరాబ్జముతలగడగాగొనునే
నూ।చెలిమివెలయనన్యులకరములునేతలపగనేర్తునే తలగడ సే
యుగ॥ఖలు॥౩॥ ఘనరంగేశ్వరుడగురఘురాముసకనుగుణ్యాంగనన

గుచూ।దనరితిధర బ్రతుకనువలపుండిననను గొనిచనిరాముని కొస
గుముపడి॥తలప॥౪॥

ముఖారిరాగము- అటతాళము.

ఇంతత్రుళ్లెదవేరఘూతకా।నిన్నేమనందును ఘోరపాతకా।చెల
గిదువాక్యములాడగా।సీజింపవ్రయ్యాలుగానిదాయగా ॥౧॥
ఘజనులివ్వరినివసించరా।నీకుసుజ్ఞానమెలమిబోధించరా॥౨॥ సీర
ముగజీవించుదిట్టవా।నీవుధరనాడవారితోబుట్టవా॥౩॥పతిసన్నిధినితే
నివేళనూ।చౌర్యగతిదెచ్చితివిలజ్జలేకనూ॥౪॥నీవునీవారనిజావగా।
దుష్టభావనాప్రభుబాపినావుగా॥౫॥ననునీవెరుంగవనిందనూ।మో
హనరంగనాథునికొమ్మను ॥క॥ అలరామలక్ష్మణులగని।చలమునకే
ట్టెదురనిలువశక్యమెనీకుం।పులులగనుగొన్నశునకము। వశతిధీతినిబ
రతుఘీవువసుమతికదలక॥ద్వి॥వినరోరిదుష్టాత్మవిశదంబుగాను। ఘ
నశీలనగునన్నుకాంక్షించుట్లెల్ల।ఖలుడనీమృతికిదికారణంబనుచు।
దెలియుమజ్ఞాపునిదేవియాచాయ।బాయనిగతిరామభద్రునేవేళ।
చాయనుడెందంబుపరమానురక్తి।వనమునతగ గట్టివై చినయటి।
ఘనగజాంగదెచ్చిగజపతితోడ।కరమొప్పగూర్చినకరణిగానన్ను।
గరిమెతోశ్రీరాముగలపిసద్భక్తి। శరణుబొందుమతండు సైరించి
బ్రోచు।కరుణాసముద్రుండుగావునవేగ।నటుగాకసకలదేవావళి
నెల్ల।పటువిక్రమంబునబవరంబుజేసి। విజయమొందితినంచువిర్ర
వీగినను।నిజముగాపవరింతునియతిచేవినర ॥క॥ కరమొప్పనింద్రశ
రునుల।శరములుతప్పించుకొనగశక్యంబగుభీ।కరరాఘవాస్త్రవిత
తులు।ధరతప్పవునిన్నుద్రుంచుతగనెందున్నక॥వ॥దురాత్మా నీవు
స్వర్గమర్త్యపాతాళలోకంబులనెచ్చోటికింబోయి దాగినరఘు
వర ధనుర్విముక్తచండకాండప్రకాండంబువలన విఖండిత కంఠ
బాహుండవై యామ్యాలయంబు నకుం బోగలవని పల్కినసత్యాం
తరాద్రంబునం బొమలుముడిబడ జురజురంజూచుచు లేవంగమకం
చురాక్షసేంద్రునకడ్డంబెవచ్చి ధాన్యమాలియిట్లనియె॥గీ॥ వలపు
లేకయున్నవనితపై మోహంబు।వలదునన్నుగూడివాంఛవెలయ।
కామకేళిదేలుమీమోహనాంగితో।వాదులేలమనకువలదురమ్మ॥

గీ॥ ఇట్లు బలుకంగ విని రాక్షసేశ్వరుండు। ఘోర రాక్షస వనితల కో రి బిలచి। బోధలొనరించి ధర్షించి బుజ్జగించి। జనకపుత్త్రిని వశ్యంబు సేయ వలయు॥ క॥ వనితారత్నము రెండుమాసములకుం బవస్యంబు గాకున్నచో। య్యన మీరందరు దాసీశూలముల దివ్యాంగంబు ఛేదించి తెం। పునమాంసంబులు సర్వకామినులు సంపూర్ణంబుగా మెక్కు డా। కనువొందం వివరింపగావలయు మీరానందముప్పొంగగా॥
వ॥ ఇవ్విధంబున బలికి రావణుండు నిజాంతఃపురంబునకుం జను న యనంతరంబున రాక్షసాంగనలు జానకిం గదిసి తర్జన భర్జ నంబులు సేయందొణంగిరందులో నేక జటయును నదియిట్లని యె॥
గీ॥ రాక్షసాధీశ్వరుండగు రావణుండు। బ్రహ్మవంశంబునందు సంభవమునొంది। మించి తేజోబలాదుల మేటియనగ। వెలసెగద వ ప్పునీవేల వలయు వమ్మ॥ వ॥ ఇట్లు బలికిన యనంతరంబ హరి జట యిట్లనియె॥

రేగుప్తి రాగము-ఆది తాళము.

ఇంద్రు నిజయించినాడె చంద్రవదనా। రాక్షసేంద్రుని సేవించ వెవో కుందరదనా॥ సకలభోగములొందవె చంద్రవదనా। నీవు సకల లోకములేలవె కుందరదనా॥ నాబుద్ధి పల్కుగైకొవె చంద్రవదనా। రంగనాధుని మానవె నవ్యకుందరదనా॥ వ॥ ఇట్లు బలికిన యనంతరం బున ప్రహాస యిట్లనియె॥

యదుకులకాంభోధి రాగము-అట తాళము.

తరుణిరత్నమైన మండోదరిని పక్కబాసి నిన్ను। గరిమ జూడవచ్చె గదవె॥ నీభాగ్యమేమె। గరితరో నాబుద్ధి వినవె॥ భామరో రాక్షసేంద్రు ని। భామవై భోగములు జెంది। ప్రేమతో మమ్మున బ్రోవవే। శ్రీరంగ పురస్వామిపై మోహము మానవె॥ వ॥ అంతట వికటయనునదియి ట్లనియె॥ క॥ సురగరుడోరగవిద్యా। ధర కిన్నెరసమితినెల్ల ధరగెలచి నయా। సురరాజవైరితోడను। వరసౌఖ్యములొందగదవె వారిజనే త్రి॥ వ॥ అని యిట్లనేక విధంబులుగా బల్కనం గన్నీరునించుచు రా క్షసాంగనలంగనుంగొని మీవాక్యంబులత్యంత కల్బిషాన్వితంబుగా దోచుచున్నయవి మనుష్యాంగన రాక్షసునకెవ్విధంబునం భార్య

గాసిద్ధించు నన్నుం జంపి నామాంసంబు మీరు భుజియింపం బూను
వేళనైన నను నాహృదయంబు పాపకార్యంబు సేయం గోరదు ప
ద్మమిత్రుండైన సూర్యునిం సువర్చలయు త్రిభువనాధీశ్వరుండగు
దేవేంద్రుని శచియును నిర్మలతపోధనుండగు వసిష్టు నరుంధతియును
ముదభాంధవుండగు చంద్రునిం రోహిణియు మహాప్రభావ సంప
న్నుండగు యగస్త్యుని లోపాముద్రయు లోక పావనుం డగు చ్యవ
నునిం సుకన్యయు విమలాత్ముండగు సత్యవంతుని సావిత్రియు మహా
త్ముండగు కపిలునిం శ్రీమతియు పరాక్రమోపేతుండగు నలునిం దమ
యంతియు సద్గుణుండగు సౌదాసునిం మదయంతియు రాజేంద్రుం
డగు సగరునిం గేసినియు ననుసరించి పాతివ్రత్యంబు సలిపిన చందం
బున నాహృదయంబు కళ్యాణగుణాభిరాముండగు రాముని యొ
క్కరుణం బైనం బాయక చరణసేవ సేయం గోరుచుండు మదీయా
సవ్యచరణంబున నైనను రావణునంటం గోరననిపలికినవిని ఆయోము
ఖియనునదియిట్లనియె॥

రేగుప్తి రాగము-ఆదితాళము.

ఓసిసీతా నిన్ను నేనూ గోసితిందునే। చెంపవేసి మూర్ఖగుణము
దొలగజేసి విడుతునే ॥ వో ॥ యెందరు జెప్పిన రాక్షసేంద్రుని మో
హించకిట్లు। మందబుద్ధితోనున్నావే మడియతనము మానకున్న॥ వో ॥
రంగనాథుడైన రఘుపుంగవుడియ్యబ్ధిదాటి। రంగుగరానేరడింక రా
వణుని గోరకున్న॥ వోసిసీతా ॥ క ॥ అంతటచండోదరియను। కాంతమ
హాశూలమొకటి కదుద్రిప్పుచునీ ।కాంతనికజంపితిందము। పంతమె
లపఁగదీని పలలము లెల్లనూ ॥ గీ ॥ ఇట్లు రక్కసచేడియ లెలమిబ
ల్కు। విని మహాశోకసంతాపవనధిమునగి। హారఘూత్తమ హారామ
హాయటంచు। చాలవిలపించెపుష్పితశాఖబట్టి॥

శోకవిరాళి రాగము-ఆదితాళము.

రామా నేనిన్ను బాయనాయె। సకలగుణాభిరామా నేనిన్ను ॥ నీ
మోము జూడకున్న నిమిషమోర్వని నన్ను। ప్రేమ వెదకుచు నెచ్చోచా
ములొందుచున్నావో॥ రామా॥ ధృతి నాకు గల్గదాయె ధరసూ। నా

లమురాక్షసున్న। మృతిదులర్భ మెవ్వారలకునూ। సతతమీదానవవనితా
లదుర్వాక్యముల। నతితాపమొందవలసెనయయో నాపాపమేమొ॥
రామా॥ జలముగోసినతీరముగను వ్యసనపరంపరలచేత। నిచటక్ష
శింపుచును। జలజలోచనరామచంద్రుని మోముజూడ। కిలనేదుష్ట
రాక్షసలలనావలయమునజిక్కి॥ రామా॥ గరళమొసంగుపుణ్యులేరి।
సామదర్శనసుధరణిదొలగించుసామతులేరి। గరిమనిన్ను సేవింపకను
నేజీవింపజాల। వరరంగధామ ఘోరతరదుష్కృతవిరామా॥ రా
మా నేనిన్నుబాయనాయ॥ ద్వి॥ కటకటాగతజన్మకర్మ గాకున్న। నిటు
వంటియాపదలేల చేకూరు। ధరమనుష్యత్వంబుతగగాల్వ మేలు॥ ధర
పరాధీనతతగగాల్ప మేలు। మనసుగల్గినవేళమరణంబురాదు। మనసు
లోదుఃఖంబుమమతయుఁబోదు। ఘనుడైనభర్తనక్కటబాయనా
యె। వనధిమధ్యమునందువసియింపనాయె। ఘోరరాక్షసవధూకో
ట్లనీచోక్తు। లారూఢివిననాయనహహానాత్రాత। యేవధూవరుల
మున్నెడలుబాపితినో। యేవిమలాత్ములకెగ్గుజేసితినొ। జగతినాకది
యెల్ల సంప్రాప్తమయ్యె। నగణితగుణగణుండగు రాఘవేంద్రు। చి
రునవ్వుగలమోము సేవించువారు। ధరణిధన్యులుగదాతల పోసిచూ
డ। పతియేలరాడో కోపగవానిజంప। వెత జెందినన్నెందువెదుకుచు
న్నాడో। వాడెనో నానాథువదనాంబుజంబూ। వాడెనో నాదుష్టవా
క్యముల్ మరది। కరువాయనాకుచక్కని రాముచెలిమి। కరువాయ
శ్రీరాముకౌగిలిసుఖము। వలనొప్ప నేనిందువసియించువార్త। చె
లువొందుదెలియందుచిత్తంబులోన। నించుకదెలసిన నేతెంచిదై
త్యు। ద్రుంచకమానునేతొలగియెందున్న। ఖరదూషణాదులఖండిం
చువిభున। క్రరయన సాధ్యులెందైననుగలరె। గరిమెతో నీలంకగల
యింతులెల్ల। కరమొప్పదుఃఖింపగలరునారీతి। ననియిట్లుబల్కుచున
వనిమూర్ఛిలుచు। మనమునననధికమౌ మమత రెట్టింప। హారామరా
మ రామానుజయనుచు। హారాఘవేంద్రాంబ హాలక్ష్మణాంబ।
గారుణ్యమునన్ను గావరేయనుచు। నీరీతిదుఃఖించె నిభరాజగమ
న॥ వ॥ అంత॥ గీ॥ కదసికదసి దైత్యకాంతలా జానకి। నమితభర్జనా

దులమరసేయ। వారినెల్ల జూచివారించి త్రిజటతా। బలికెదైత్యసతులుభయము జెందా॥

వుదయరాగము- అటతాళము.

ఎంతోచక్కనికలగంటినె। నియ్యింతిసీతకుమేలుగంటినె ॥ కాంతలారసీతగదసియేమనకుడీ । కాంతకాంతునిగూడికడుసౌఖ్యములు జెందు॥ నెం॥ కరిదంతమయమగుశిబికనూ। రాఘవుడుగూర్చుండినభమునను। వరశుక్లమాల్యసద్వస్త్రరుచులతోడ। గరిమశోభిలగచక్కనితమ్ముడటుగొల్వగా॥ జలధిలో తెలిగట్టుమీదను । రాముడలరజానకిసొంపుతోడనూ। వలనొప్ప తెల్లనివలువదాలిచిసూర్య్యు। నెలమిచే రెడిఛాయవలె రాముచేరినట్లెంతో॥ చక్కని॥ చెలగిచతుర్దంతగజమును । రంగనిలయుడుత్సాహాము వెలయనూ। చెలువొందనెక్కిలక్ష్మణుడు గొల్వగమింట। వెలుగుచువిహారింపవేల్పులుబొగడినట్లెంతో॥ యంతోచక్కనికల॥ వ॥ మరియునుంసముద్రమధ్యంబుననున్నతంబగుశైలాగ్రంబున నొక్కచతుర్దంత దంతావళంబు మీద రాఘవుండుగూర్చుండ యమ్మహాత్మునితోడలయందీజానకివసియించి చయ్యాన లేచి సూర్య చంద్ర బింబంబు లం గరతలంబున స్పృశించినట్లగాంచితి మరియును రఘువరుండు పాండు వృషభంబులం గట్టినయరదంబుమీద శుక్ల మాల్యాంబరంబులుదాల్చి సీతాలక్ష్మణసమేతంబుగా గూర్చుండి వేంచేసి నట్లుగాంచితి మరియునుం సకలభువనసనుస్యూతంబగు బ్రహ్మాండంబు రాఘవుండవలీల మ్రింగిన తెరంగునంగలకంటి నిదియునుంగాక క్షీరసముద్ర మధ్యంబున నొక్క శ్వేతపర్వతంబు దయించినట్లు దానిమీదనింద్ర దంతితుల్యాంబగుచు చతుర్దంత దంతావళంబొక్కటి మహోన్నతంబుగా వెలుంగుచున్నట్లు యాదంతావళంబుమీద సర్వాంగ సుందరుండగు రామచంద్రుడిం దీవ రాక్షియగు వైదేహితోడ శుక్ల మాల్యాంబరంబులుదాల్చి ప్రాఙ్ముఖంబుగా గూర్చుండి సౌమిత్రివలనం సేవలుగొనుచు దేదీప్యమానంబుగా మెరయు చుండ సమస్త దేవ గంధర్వ సిధసాధ్యమహర్షిగణంబు లతోడంజతురానన నాదులు సర్వతీర్థజలంబుల నభిషేకంబుగావించి స్తోత్రంబులొనర్చినట్లు

గాంచితి మరియునుం జానకీవల్లభుం డగు రఘూద్వహుండు పర బ్రహ్మయు సచ్చిదానంద దివ్యమంగళ విగ్రహుండును యోగీశ్వరేశ్వరుండును ప్రకృతిపురుషాధీశ్వరుండును శంఖచక్రధరుండును పుండరీకాయతేక్షణుండును శ్రీవత్సకౌస్తుభవిరాజితవక్షస్థలుండును సమానాధికరహితుండును సనాతనుండును నిత్యయువ్వనుండును నగు శ్రీమన్నారాయణుండు నగు సాక్షాద్విష్ణుండు తానై ప్రకాశించుచున్నట్లుగాంచితి మరియునుం రఘువరుండు సీతాలక్ష్మణసమేతుండై మణిమయంబగు పుష్పకవిమానంబునం గూర్చుండి గగనమార్గంబున నుత్తరదిక్కు వేంచేసినట్లుగాంచితి రావణుండు రక్తమాల్యాంబరంబులు దాల్చి విమానంబుననుండి నేలం బడి నల్లని మలినాంబరధారియై గార్దభయుక్తంబగు రథంబున నెక్కి దక్షిణభాగంబు నకుం బోవుచుండె మరియు రావణప్రముఖ రాక్షససమూహంబులెల్లను రక్తాంగులై రక్తమాల్యాదులు దాల్చి పానంబులు చేసి నృత్యంబు లాడుచున్న రీతిం గాంచితి నిదియునుం గాక విభీషణుండు శుక్లమాల్యాంబరంబులు ధరించి చతుర్దంతగజంబు మీదం గూర్చుండి శ్వేతచ్ఛత్రంబు వెలయ నృత్యగీతాదివైభవంబులతోడ నొప్పుచున్నట్లుగాంచితి నీస్వప్నంబు సీతావల్లభుండగు రామచంద్రునకు విజయంబును రాక్షసేశ్వరుం డగు రావణునకు వినాశంబును గల్గునట్లు దోఁచుచున్న దిదియునుం గాక కనుంగొనం డిదె వైదేహికి వామలోచనభుజోరుభాగంబు లదరుచు మంగళప్రదంబులగు పంచిశకునంబులు శ్రీరామునిం దెచ్చి ముందట నునిచిన చందంబున నగుపడుచున్నవి గావున రాముని విజయంబు నిశ్చయంబు సీతతోడం బగఁ గొనక హితంబుగా మెలంగుచు కాలంబు పుచ్చుచుండుఁ డని పలికి యూరకుండె నా సమయంబున॥ గీ॥ అతివ సీత రాక్షసాధ్యక్షుఁ డాడిన। దారుణోక్తు లెల్ల దలఁచి దలఁచి। హా రఘుప్రవీర హా లక్ష్మణాగ్రజ కరుణ వెలయ వచ్చి కావవేమి॥

## ఆనందభైరవిరాగము_ఆదితాళము.

హా రామ రామ సత్యవచన। హా దీర్ఘబాహు। హా పూర్ణచంద్ర

తుల్యావదన॥ ఘోరకృపారసధారలతోనను। చేరి బ్రోవవకటా రఘు
నందన॥ హా రామా॥ వెరచియున్నావా రిపులనణప। లేకున్నననున్నా। ము
రచియున్నావా కరుణదలప। ఖరకులసంహార చెరవిడిపింపక। నరము
రజేసిన ధరజీవింపను॥ హా రామ॥ ౧॥ అయయో విషమెవ్వారివ్వరైరి।
మరణము రాదాయ। నయయో నెవరాదరించరైరి। భయముదొలగ
నభయముదయ సేయుచు। నయముననను మన్నన సేయవదే॥ హా రా॥
౨॥ మొన్నాళ్లనుచు తాళుకొందు। నీమోముదమ్మి కన్నులజూడ కె
ట్టులుందు। మొన్నగనీరూపము నిరతమునా। కన్నులకట్టిన కైవడినున్న
ది॥ హా రామ॥ ౩॥ వలసిమిధిలలోనను పెండ్లాడి। నిను మానననినీవల
నాడనలసన్నిధినాడి। తలపవలదు వాడి ననువిడనాడగ। సలలితరంగ
సలనిలయాధిప॥ హా రామా॥ ౪॥ వ॥ ఇవ్విధంబున జనకనందన మహా
రణ్యంబున నంవిడిపింపంబడిన బాలకన్యయుంబోలె దిక్కులేక రో
దనంబు గావింపుచు॥ ద్వి॥ హా నాథ హా నాథ హా రఘువీర। మానదుని
న్నా నా మానస మెపుడు గరిమెతో నీమోము గననట్టివేళ। మరణంబు
మేలుగాదిదో చెనకట। చెలగి రావణుడు హింసించుచో నైన। వల
నొప్ప భావమివ్వ కనుండుదాన। ఘర బ్రాహ్మణుండు మంత్రముశూ
ద్రునకును। కరము చెప్పని కైవడిబోలి। నానియమంబును నానిశ్చ
లంబు। నానోము పతిభక్తి నాతుమాగుణము। నాధర్మ శీలంబు నాధ
వ్రతంబు। నాధరాశయనంబు నాభావమెల్ల। గణుతింప విఫలంబు
గాదోచె నహహా। రణపటిష్టుండగు రావణు జంప। ననుజుని గూడ నీవ
తిశీఘ్రమునను। నను గావరాకున్కి నాకిట్లు దోచె। పరగ నే నిలనల్ప
భాగ్యను గాన। నిరువొందనిన్ను నే నిటు బాయనాయ। ఘనమతి వన
వాసకాలంబు వేగ। నచురక్తిగడపి నీవనుజుని గూడి। పురముసొంపున
జొచ్చి హాలతులతోడ। సరససంక్రీడనాసక్తుండవగుచు। వెలయు
చుండెదవింక విధి వ్రాసినట్టి। తల వ్రాలు దప్పక తథ్యగకృశింపుచును।
ప్రాణముల్ విడుతు దుర్భర తాపమునను। ప్రాణేశని పాద పద్మ
ముల్ దలచి। నేనిందు విలపింపనీ కేమిచింత। నేనిట్లు కృశింపనీ కేటి ము
మత। తగ సాధ్యము కగాదుతనువు నే నిలుప। తగసాధ్యమిక గాదు తా
పంబు నిలుప। ననిజడశోకంత మువలీల జుట్టి। కనుదమ్ములను నీరు కడువ

చి వెడల। జలజాక్షి లేచి వృక్షము చారబోయి। లలితపుష్పితశాఖలాగి
తాబట్టి। పదపడి ప్రాణముల్ బాయంగఁ గోరి। మదిలోనఁ దన వంశమ
హిమంబు రాము। చెరితంబు శీలంబు చక్కఁగా దలచి। మరియూరకు
న్నంతమగు వకయ్యాడను। ఘనసౌఖ్యముల కెల్ల కారణంబైన। ఘనశు
భ శకునముల్ క్రమమునఁ గల్గె॥

కాంభోధి రాగము-జంపె తాళము.

అంతటను హనుమంతుడతివెతాపము జూచి। చింతిల్లి చింతిల్లి చెల
గియూహించి। కాంతను గనకున్న కడు మోసమగునంచు। నెంతయు
దలంచి తగ నిట్టుల నెనపుడూ॥౨॥ వలనొప్ప దశరథాత్మజుడు శ్రీరా
ముడన। నిలలోగలండు ప్రవిమలగుణుండగుచు॥౩॥ జనకాజ్ఞ వలనత
నవనితయును తమ్ముండు। తను గొల్వ నతిఘోరవని చేరియుండుఁ॥౪॥
చెనటియగు రావణుడు సీతఁ గొంపోవంగ। నినతనూజునితోడ నిష్టము
నరించెఁ॥౫॥ కరమొప్ప వాలిసంహరణంబు గావించి। కరుణ చేర
విజునకు కపిరాజ్యమొసగెఁ॥౬॥ పొలతి వెదకుటకు రవిపుత్రుండు కపి
కోట్లు। నలుదిక్కులకు బంప నెలమి నేసంతఁ॥౭॥ జలధి గడచియురం
గనిలయుడగు శ్రీరాము। నెలత వెదుకుచును నేనిల చితిచ్చటను॥౮॥

వ॥ ఇట్లు బలికిన యనంతరంబున॥ గీ॥ సీతముఖమెత్తి వానర శ్రేష్టు
జూచి। కపినిగంటినికలలోనఁ కపిని గాంచి। నట్టియశుభంబు రామరా
మానుజులకు। నాకు నాతండ్రికిలనదిసోకకుండా॥ వ॥ రక్షింపవల
యునని సకల దేవతలం దలంచి మ్రొక్కి మరియును దనమనంబున
నేను రామచంద్రు నిముఖకమలంబు గనుంగొనని శోక సంతాపం
బున నిద్ర లేక యున్నదానం గావున నిది కల గాదని యంచుచు ఆశ్చ
ర్యసంతోషంబులు పెసంగొనిన చిత్తంబుతో వర్తించుచున్న సమ
యంబున నాంజనేయుండు శింశుపావృక్షంబు వలన మెల్ల నండిగ్గి
వచ్చి సవినయంబునం బ్రణమిల్లి శరీరంబు వంచి చేతులు మొగిడ్చి
యిట్లనియె॥

సౌరాష్ట్ర రాగము- ఆదితాళము.

ఎవరమ్మా మీరిందు వేంచేసియున్నా। రెరుఁగ దెలుపగదవమ్మా।
తల్లి। యెరుఁగ దెలుపగదవమ్మా॥ మలినాంబరము ధరించి కృశించుచు।

మరిమరిచింతిల నేలా। చాలావిలసితసద్గుణశీలా॥౧॥ తరుశాఖాలంబ
నమొనరించియు। తల్లిరో భయపడ నేలా। దివ్యతరభోగములుమాన
నేలా॥౨॥ వెలదిరో నీకనుదమ్ముల జలములు విడిపించెద వేమమ్మా।
దుఃఖజలధిమునఁగ నేలనమ్మ॥౩॥ సురగరుడోరగగంధర్వాన్వయ।
తరుణులలో నెవరమ్మా నీవు। గరితరో తెల్పఁగదవమ్మా॥౪॥ జననిరో
దెలుపుమువల్లభు పేరునూ। జనకుపేరు నీపేరు। భువివనితరో నీసరిలే
రూ॥౫॥ భామరో నీవు వసిష్ఠునిబాసిన। శ్రీమదరుంధతివేమో। కోప
చిత్తముతో వచ్చితేమో॥౬॥ చంమరుపొందెడబాసి తొలంగిన। సుం
దరిరో హిణివేమో। నలుకజెందివసించితివేమో॥౭॥ రాజలక్షణము
లగుపడుచున్నవి। రాజపుత్రికవుకొమ్మా। నీవు రాజపత్నివేనమ్మా॥
౮॥ సరగున రావణుడిటు గొనివచ్చిన। సఖియవై వినవమ్మా। రంగ
స్వామికి చేడియవమ్మా॥౯॥ యవరమ్మా॥ గీ॥ ఇవ్విధంబున హనుమం
తుడెలమిబల్కి। తల్లిరో నీదువృత్తాంతమెల్ల నాకు। విశదముగఁ దెల్పు
మనుచు తావిన్నవింప। పవనజుని జూచిపలికె నప్పద్మనయనా॥

మధ్యమావతిరాగము- అటతాళము.

ఏమని దెల్పుదూ నీతోనూ। యేమని దెల్పుచు భువిలో। భాములెవ్వా
రుబొందని। బాములబొందేటియల్ప। భాగ్యను లజ్జింపలేక॥ యేమని॥
ధరణిపశరథేశునకు। తద్దయుకోడలనవుదు। గరిమెజనకభూపాలు
నకు। వరతనూజనై నదాన॥ నే॥౧॥ సరసుడౌ శ్రీరామచంద్రుడరు
దుగా పెండ్లాడినట్టి। సరసిజగంధిని నన్ను। సర్వజనులు సీతా యెం
ద్రు॥౨॥ చెలగిపది రెండువర్షములు। చెలువు నీతోడ। నయోధ్య నె
లమిసుఖభోగములొందితి। లలనలందరుత్సహింప॥ నే॥౩॥ జనకవా
క్యమునకై ఘోర। వనమునకేతెంచు రాము। ననుసరించివచ్చితిమి
నెనరుతో మరదియు నేనూ॥౪॥ వనమున వంచించి రంగ। వాసినైన న
న్నిచ్చటికి। మొనసి రావణుడు దెచ్చి। ముదితలకాపునచినాడు॥ యేమ
ని దెల్పుదూ॥౫॥ గీ॥ చెలిమి వెలయ రెండు నెలలకు వశ్యంబు। గాకయు
న్న నన్ను గదిసిచంపు। డనుచు రాక్షసేంద్రుడసురాంగనల కెల్ల। నా
జ్ఞ చేసె దుర్మదాంధుడగుచు॥ వ॥ అనియివ్విధంబునం బలికి కన్నీరు

భవ్యమూర్తి। మహితశీలుండు మన్మథమన్మథుండు। చారుగోభూ
సురేంద్రరక్షాపరుండు। జననిరో నేను వర్ణింపజాలనమ్మా॥

ఉ॥ చారుగుణాకరుండు మనసారగ జూచిసతీరసత్కృపం। గారము గల్గువాడు సురకంటకులం రణవీధి నుగ్రుడై। ధీరత ద్రుంచువాడు భువిదీనుల బ్రోవ దలంచువాడు మ। ర్త్యారబలాఢ్యుడమ్మ నవవారిజగంధిరో రాఘవుండిలన్ ॥ ఉ॥ శారదపూర్ణచంద్రునెకసక్యముసేయు మొగంబువాడు। జంభారిగజేంద్రహస్తసమబాహుడునై వెలుగొందువాడు సొం। పారగ భక్తలోకపరిపాలకుడై విలసిల్లువాడు పం। కేరుహగంధిరో విమలకీర్తిసుధాకరు డెంచిచూడగన్॥ గీ॥ కమలలోచనుండు కాకుత్స్థతిలకుండు। సద్భ్రాతములకు సత్ప్రియుండు। తల్లి వినుము రూపదాక్షిణ్యసంపన్ను। డట్టిరాము బాగడ నలవియగునె॥

ముఖారిరాగము - ఆదితాళము.

ఎందుజూచిన లేరమ్మ। రామునివంటి। సుందరమూర్తులో యమ్మా। పొందుగ దేవముని బృందము లెల్ల రఘు। నందను మోముజూచి డెందమందు మోహింతు॥ ఎందు॥ చిరునవ్వు మోమువాడమ్మా। పలుకులతేనె। గురియించు నేర్పువాడమ్మా। శరచాపధారుడమ్మ సత్య సంభాషుడమ్మా। కరుణాసముద్రుడమ్మా। గన్నతల్లి సీతమ్మ॥ యెం॥ ౨॥ శరణన్న బ్రోచువాడమ్మా। లోకము లేలసరుదారదగినవాడమ్మా। నిరుపమచరితుడమ్మా। నరవరశ్రేష్ఠుడమ్మా। వరరంగపురమున మెరయుచునుండునమ్మా॥ యెం॥ ౩॥ వ॥ శ్రీవిభుండగు రామచంద్రుండు సత్పురుషశ్రేష్ఠుండును పద్మాస్యుండును బ్రహ్మచర్యవ్రతనిపుణుండును శ్రుతిమంతుండును వేదవేద్యుండును ధనుర్వేదవిశారదుండును విపులాంసుండును కంబుగ్రీవుండును శుభాననుండును గూఢజత్రుండును స్నిగ్ధవర్ణుండును ప్రతాపవంతుండును త్రిస్థిరుండును త్రిప్రలంబుండును త్రితామ్రుండును దశపద్ముండును చతుర్లేఖుండును మహాభాగుండును ధనుర్ధరవరుండును మహాపురుషలక్షణలక్షితుండును క్షమాగుణంబున క్షోణిసముండును బుద్ధివలన బృహస్పతితుల్యుండును కీర్తివలన నింద్రప్రతిముండును నైచెన్నొందుచుండు నమ్మహాత్ముని తమ్ముండగు లక్ష్మణుండు కనకవర్ణశరీరం

బుగల్గి సద్గుణంబులతనయన్ననుంబోలి వర్తింపుచు భక్తివిశ్వాససం
బులుడుగక శ్రీరామపాదారవింద కైంకర్యతత్పరుండై యుండు
నని పల్కి మరియునిట్లనియె॥క॥ నినువెదకుచురఘువీరులు।ఘనమగు
పంపాతటంబుకడకరుదేరం।గనిభయమునసుగ్రీవుడు। ననుబంపె
నువారికడకునయమొప్పారన్॥వ॥ నేనుభిక్షురూపంబుదాల్చి జవం
బునంబోయి సౌమిత్రిసమేతుండైన రామచంద్రుని దివ్యమంగళ
స్వరూపంబు కన్నులారసేవించి యామహాత్ముల నిరువుర నావీపె
క్కించుకొని తెచ్చి సుగ్రీవుని ముందటంబెట్టిన సమయంబున రా
మసుగ్రీవులగ్నిసన్నిధిసఖ్యంబుగావించి రాసమయంబున మున్ను
నీవు రావణుండు గొనిపోవ నాకసంబునంబోవుచు గిరిమీదవైచిన
సొమ్ములమూటసుగ్రీవుండుగొనివచ్చిరాఘవునికొసంగినసంతప్తుం
డై కన్నీరునించి హాజానకినన్నుగొనిపోకవిడనాడి నీవే కాకిగానె
చ్చటనిడుములం బడుచున్నదానవని తమ్మునింగూడి దుఃఖించు చు
న్నయెడ నేనును సుగ్రీవుండును హితవాక్యంబులనూరడించితిమం
తట రఘువరుండు సుగ్రీవునిహితంబుమనంబుననిల్పుకొని॥

సీ॥వాలివధించియావనచరరాజ్యంబుసుగ్రీవుకిచ్చెననుగ్రహాము
న। సరగునరామప్రసాదంబుచేసూర్యపుత్రుండుకపిరాజ్యభూతి
వెలసి।నినుధరాస్థలిని యన్వేషింపసకలవానరకోట్లబనుపంగదురు
జవమున। జనిరంతతారేయజాంబవదాదులగూడినిన్వెదకుచుగ్రు
మ్మరుచును।వనితవినసమ్మసంపాతివాక్యమునను। జననినీవిందువసి
యించుజాడదెలసి।శరధికవ్వలవానరచయమునిల్పి। పరగదాటితి
జలధిగోష్పాదముగను॥వ॥ఇట్లుసముద్రంబవలీలందాటి లంకాపు
రంబెల్లగలయంవెదకి నాభాగ్యవశంబున నిచ్చటంగన్నులారంజూ
చినవాడతల్లీ నీకుకష్టంబుదీరె కల్యాణగుణాకరుండగు రాఘవేం
ద్రుండు నీకుశలవృత్తాంతంబునావలనందెలసి శీఘ్రంబున వానర
సమేతుండై జనుదెంచి పుత్రమిత్రబంధుసమేతంబుగా లోకకంట
కుండగు దశకంఠునిద్రుంచివైచి పరమానందంబున నిన్నుందోడ
లయొందిడుకొని శ్రీమదయోధ్యాపురంబునకు వేంచేయు నని పలికి
న యావాక్యంబులు కర్ణామృతంబుగా నాలకించి మితిలేనిసంతో

షంబున నుదయించిన కన్నీరువలనం గుచకుంభంబులు నిడింపుచు నాంజనేయుంగనుంగొని వైదేహి యిట్లనియె॥

ముఖారి రాగము - అటతాళము.

ఎంతపుణ్యాత్ముడవోయి నీవూ। కాంతుని వార్తలు చెప్పినావు। చింతలెల్ల బాయగ జేసినావు। వింతగ ప్రాణములిచ్చినావు॥యెం॥ మరువగలనా నీయుపకారమహిమ నేమందును సొంపు మీరా। శరధి నవలీలను దాటితౌర। శత్రువిజయుడవు మేరుధీరా॥౧॥ క్షేమమా శ్రీరామచంద్రునకూ। క్షేమమా నన్నేలు విభునకు। క్షేమమా రామానుజునకు। క్షేమమా నీకు బంధులకు॥౨॥ కరుణగల్గెనా నేటికిని। కరిమతో రంగపతికిని। నిరుపమ దయామతికిని। నేను మ్రొక్కెదమాటికిని॥యెంతపుణ్యాత్ముడవోయి నీవూ॥౩॥ వ॥ ఇట్లు బల్కిన యుల్లంబు ప్రాణవల్లభుని పాదాబ్జంబుల యందు గీల్కొలిపి మరల హనుమంతున కిట్లనియె॥

ముఖారి రాగము - ఆదితాళము.

నిజముగ విభుడు నిన్ను బంచెనా। హృదయాంబుజమున నన్ను దయదలంచెనా॥ఓ॥ విజయశీలుడ నన్ను వేట్కబ్రస్తుతి జేతు॥౧॥ ఆనంద మాయె మనసు చాలను। నిన్ను గానగల్గెను నాకీ వేళనూ। రామధ్యాన నిష్టుడవైన దాసుడ। వెంచిచూడ॥ని॥౨॥ శ్యామసుందరుడైన శ్రీరాముడు। నాకేమి జెప్పెను రిపువిరాముడు। రంగధామ సేవక నీవు తడయక జెప్పుమింక॥నిజ॥౩॥ గీ॥ ఇట్లు బలికిన హనుమంతుడింపుమీర। నతివకిన్ను నిరాఘవుడంపినట్టి। తళుకు బంగరుముద్రిక తరుణికివ్వ దలచి। చూపించి పలికె సీతమ్మతోడ॥

భైరవి రాగము - ఆదితాళము.

ఇదిగో। స్వామిముద్రిక। యిదిగో॥ రాముని ముద్రిక। చక్కని తల్లి॥ యిదిగో॥ ముదితరో వినుమతి మోహావశతనీ। హృదయేశ్వరుడింపొదవగ నొసగిన॥ దిదిగో॥౧॥ వరరఘుపతి కరమున మణిమయమై। గరితదగద్ధగ కాంతుల మీరసేటి॥ దిదిగో ॥౨॥ శ్రీమజ్జగదభిరామునకింపగు। భామరో రఘువర నామాంకితమగు॥ టిదిగో ॥౩॥ లలనవినుమునీ

వలపునరంగ।స్థలనిలయుడు నిర్మలదయ బనిచెన॥ ఇదిగో॥౪॥

వ॥ ఇట్లు బల్కి ముద్రికయొసంగి నంగైకొని తనవల్లభుండగు రఘువల్లభుం జూచిన చందంబునం జూచి యక్కునం జేర్చి కనుదమ్ముల వెడలు బాష్పంబుల నభిషేకంబు గావించి నేత్రకమలంబుల పూజించి దుఃఖావేశంబున నమ్ముద్రికతో వైదేహి యిట్లనియె॥

ముఖారిరాగము.. అటతాళము.

ఏమేమో ముద్రిక నీవు। యెందుండి వేంచేసినావు। కామకోటివేషుడైనా। స్వామిని బాసి రాదగునా॥ యే॥౧॥ పతిని నను మున్న మరగూర్చి। బాగుగ పెండ్లి యొనర్చి। జతదొలంగియున్న మరల। సఖుని గూర్పగ జనుదెంచితివా॥ యే॥౨॥ స్వామికి మంగళమటవే। ప్రేమున నన్ను దలచు నటవే। శ్యామలాంగుడై నరంగ।ధాము డేల రాడాయనె॥ యేమేమో॥

ద్వి॥ అని యిట్లు ముద్రిక సతి మోహమున ను। గనుగొని దుఃఖించి కమలదళాక్షి। హనుమంతు జూచి నాకైన బన్నంబు। లనువొందదని వేళ నన్నియు చాల। కొనగొను ప్రాణ మీ చెట్టుకొమ్మపైనుండి। క్రమమున గంటి నాకన్నుల నిండ। సారసాప్తకులాబ్ధి చంద్రుడైనట్టి। శ్రీరాముసతు కోర్కి తీరెయనవయ్య। రావణు చేజిక్కి రాక్షసస్త్రీల। కావలిలో నుండె కెదినోక్తులెల్ల। బడనాయె నాప్రాప్తఫల మేమ సందు। పుడమిలో రఘువర్యు బొందెడబాసి। జీవచ్ఛవము రీతి జీవించుకంటె। జీవంబు విడుచుట శ్రీకరంబిలను। రమణుని ముఖపద్మ రమ్యవైభవము। సుమహితానురక్తి చూడక గాని। తనువు నిల్వదటంచు తద్దయు బల్కి। కనుదమ్ముల నశ్రులు వడివడి బడల। వనిత శోకింపంగ వాయునందనుడు। గని దుఃఖసహితుడై గాంతకిట్లనియె॥

పున్నాగరాగము - అటతాళము.

జననీ దుఃఖింపకుమమ్మా। నన్నుగనిన బంగరు జిగిబొమ్మా। వనితరో శ్రీరఘువరుడిందు వేంచేసి। గినిసి దుష్కరుడై దైత్యగణము దతిని గూల్చు॥ జన॥ పరమపావనవి మాయమ్మా। నీకు భయమేలనమ్మ సీతమ్మా। కరమొప్పు సకలరాక్షసవర్గముల ద్రుంచి। సరగున లంకగాల్చగ శక్తిగలదమ్మా॥ జ॥ కరుణతో వినగదవమ్మా। రంగపురవర నాథునికొమ్మా। గరిత రావణకుంభకర్ణాదివీరుల। నురువడిగదసి క్రచ్చరజం

బగలనమ్మా॥జననీ॥గీ॥జననివినవమ్మశ్రీరామచంద్రమూర్తి।కమి తకరుణారసంబునీయందుగలదు। వేగనరుదెంచిరాక్షసవితతిగూల్చి।పొందుదనరంగనినుగొనిపోవునమ్మా॥వ॥ అనినవైదేహితనమనంబునశోకమోహంబులుపెనంగొననిట్లనియె॥

సురటరాగము-ఆదితాళము.

ఏలనన్నుచింతించునురఘువరుడేమిటికిననుదలంచుఁ।చాలసన్నిధివసించినవేళనెసకలదయలువలపులుసరమ్ములు॥యే॥ ఘనుడగురఘునందనునకుమునుపటి।నెనరుమోహమిపుడున్న।వినుతవిక్రమంబునలంకేశ్వరునివధించిననుగొనిచనకుండునె॥యే॥౨॥సరగుననవనవాసవ్రతశేషము। పరిపూర్ణముగావించి। పరమానందమునననురంగస్థలికరిగివెలయుసుఖమునననువిడిచియు॥యే॥౩॥వ॥ ఇట్లుబల్కిన విని తల్లీ దుఃఖంబు మానుము జగద్వల్లభుండగు రఘు వల్లభుండు నావలనం భవదీయ్యాకుశలవృత్తాంతంబు తెలిసి శీఘ్రంబ సంజనుదెంచి రావణకుంభకర్ణాది రాక్షస సంఘంబుల బాణాగ్నిజ్వాలలనందగ్ధంబుగావించి పరమానందంబునమిమ్ముందోడ్కొని శ్రీమదయోధ్యాపురంబున కరిగి సకలజనంబులుసంతసిల్ల పట్టభద్రుండై ప్రకాశింపుచుండుననినపల్కినవైదేహియిట్లనియె॥

శోకవిరాళిరాగము-అటతాళము.

కరుణాకటాక్షవీక్షణ సుధావర్షంబు నాకుస్థిరెపుడుగురిపించుఁ।గురుతరవియోగదుర్భరతాపనుడుగరఘువరుడెపుడునను చుఁ।కౌగిలించుఁ॥౧॥ ఖరదూషణాద్యసురకాండములవిదళించుశరములెప్పుడుప్రయోగించుఁ।గరిమగుదారుణంతరావణకంఠఘనబాహుఖండనంబెపుడుగావించుఁ॥౨॥సరగుననుతీవ్రరోషజ్వాలలుదయించిసౌమిత్రియెప్పుడరుదెంచుఁ।భరతుడీదిదెలసిభీకరరథాశ్వప్రముఖబలములెన్నటికిబంపించుఁ॥౩॥ చింతవలదనుచునత్యంతదయవిభుడెపుడుచింతదొలగంగభాషించుఁ।సంతసంబునరంగసదనుడెన్నడునన్నుసంతరింపగనాత్మనెంచుఁ॥౪॥కరుణాకటాక్ష॥

ద్వి॥హనుమంతవినుమునీవనఘశీలుడవు। ఘనబలుండవుశత్రుగణమదర్దనుడవు।గాననినిన్నిటుబంపెకాకుత్స్థకులుడు। పూనినాకేమే

విబుధులు జెప్ప। నేమనివిలపించు నెట్లునటించు। నేమిభాషించు నిలనన్నుగాంచి। పదపడినన్నిట్లుబాసితానన్య।హృదయమించుక లేకయుండియున్నాడె। నాకాంతుడై నట్టిసలినాయతాక్షు। డేకాంతమునమది నేమియూహించు। గానకొనిభరతాదికుశలంబువినునె। ననుచేరగోరు నెనయమెప్పుచుండ। కరమొప్పమద్వియోగప్రాప్తి వలన। కరుణదప్పడుగదా కాకుస్థకులుడు। కరుణనిజంబుగాగల్గిన శైలైన। పరమపావనుడేలబరతేరడయ్యె। ననియిట్లుబలుకంగనద్దేవి జూచి। వినయవిధేయుడై వెసనిట్టులనియె॥

సురటరాగము-ఆదితాళము.

నిన్నెడబాసినదినమదిమొదలుగనిద్ర యెరుగడమ్మా। ఎన్నగనీపై గలిగినమోహామునెన్నజాలనమ్మా॥ కొమ్మా॥ జననిరోనినుబాసినకతమునమాంసముభుజింపడమ్మా। మనసుననినుగనగోరితపించుచు। మధుపుగ్రోలడమ్మా। కొమ్మా॥ ఘనమగుఫలపుష్పములనుగనుగొని కన్నీరిడునమ్మా। నినుదలంచిహాసీతాయనుచును నేరి మూర్ఛిలునమ్మా। కొమ్మా॥ నిన్నె॥౨॥ సరగుణమీరిచ్చటనువసించుటస్వామియెరుగడమ్మా। వరరంగేశ్వరుడగురఘుపతినికవలసితెత్తునమ్మా॥ కొమ్మా॥౩॥ గీ॥ తరళకుండలరత్నవిస్ఫురితమగుచు। ఘనసుధామండితాధరకలితమగుచు। చెన్నుమీరిసరఘుపతిశ్రీముఖంబు। సుదతిరోశీఘ్రమునసీవుచూడగలవు॥ వ॥ అనినవైదేహియిట్లనియె॥

యదుకులకాంబోధిరాగము-ఆదితాళము,

చక్కనిసామికియెక్కడిదుఃఖములక్కజముగగల్గెనో। యేమిచింతిలెనో। మక్కువనునను బ్రోచురఘుపతిమాటిమాటికినుదలంపుచు వెక్కసంబగు తాపవశమునస్రుక్కుచునునస్నేమి బలికెనో॥ ౧॥ వలదన్నవెనువెంటవచ్చినందుకెకాదా। వల్లభునకుకాననుయిడుములాయెనూ। చెలువుడగుశ్రీరంగపతిముఖజలరుహామువుష్కింపకుండునె చెలిమిగలననువిడిచియొంటిగ నిలిచిపరితాపించుకతమున॥ చక్కని॥౨॥ గీ॥ పురుషనవలీలత్రాటితోపాసగగట్టి। ఘనతరైశ్వర్యమందుదుఃఖంబులందు। పరగద్రిప్పుచుననుభవింపంగ సేయు। నవసిలోదైవమిదిసిజంబనిలపుత్రా॥ వ॥ పవననందనా యిమ్మ

హావ్యసనంబు రామలక్ష్మణుల కిరువురకుం నాకును గలిగి యున్న ది యేనేమి సేయంగలదాన నింక రావణుండు నన్ను జంపనిర్ణయించిన కాలంబు రెండుమాసంబులనుచుం దెలియుము మదీయహృదయేశ్వరుండగు రఘువరేణ్యునకు నన్ను సమర్పింపుమని విభీషణుం డనేకవిధంబులం జెప్పిన యారావణుండంగీకారంబు సేయక దుర్బుద్ధిచే నున్నవాడని యవ్విభీషణున కగ్రపుత్రిక యగు నల యనునదితల్లి వలనం బ్రేరితయై నాకుం వివరించె నాహృదయం బత్యంతపరిశుద్ధంబుగా నుండియున్నది మత్ప్రాణవల్లభుం డగు రఘువరేణ్యునకు నుత్సాహ సత్య పౌరుష విక్రమ ప్రభావాదిగుణంబు లనేకంబు లుండియున్నవి యింద్రస్నేహంబు గోరిన శచీదేవి యనుంబోలె నాచిత్తం బనవరతంబు రామస్నేహంబు గోరుచున్న దనియానతిచ్చిన నాంజనేయుండిట్లనియె॥

పంతువరాళిరాగము-ఆదితాళము.

వీపెక్కువేంచేయవమ్మా।వోతల్లి రో నావీపెక్కు॥ వీపెక్కువేంచేయవమ్మా పాపాత్మపురినుండ నేల।నీపాదమానమ్మయర్ధనిమిషమునవిభుసి జేతుర॥౧॥నినుగొనిసాగరలీలనూ।దాటెదచూడు।మనువుగనాలాఘవమునూ। కనకగోపుర ప్రాకారకలితమౌలంక జెగల్చి। గొనకొనిరంగేశుచెంతకోరిసిలుపగలనోయమ్మ॥౨॥

చ॥అనవినినీవుమర్కటుడవర్కటసూక్ష్మతనుండవేక్రియం।నను గొనిపోవనేతురవసి నాతివచింపగపర్వతోన్నతిం।గనుపడితల్లి రో వినుమఖండబలంబునరాక్షసాలితో। ననువుగలంకగొంచు నలినాప్తకులేశ్వరు జెందజాలెదన్॥ద్వి॥ అనవినివైదేహిహనుమంతుజూచి।ఘనబలాఢ్యుండవుకపివర్యనీవు।నినువినుతింపంగనిర్జరుల్ నేర।రనఘరక్కసులఘోరాహవభూమి। దునుమాడగలవీవు దోర్దర్పమొప్ప। వినుమొకవాక్యంబువివరింతునీకు। పోలుపొందననుగొనిపోగూడదిపుడు।వలనొప్పనెట్లన్నవానరవినుము॥సీ॥ఘనజవంబుల నన్నుగొనిదివిజనుచుండ కరమొప్పనఖిలరాక్షసులుడాసి। వివిధాయుధంబులువెసప్రయోగింపంగ నారయ నీవునిరాయుధుడవు। ననుబ్రోచుచునుయెట్టులసియొనర్పగనేర్తువదిగాక నవనిజయా

వజయము। లీశ్వరాధీనమానిట్లనగారాదు వీకశస్త్రాస్త్రముల్ దా
కిగాని। భయమునవడంకిజలధిలోబడియుగాని। ప్రాణములునేను
డాయంగపవనపుత్ర।నీవుజేసినకష్టంబునిష్ఫలంబు। గానసహాయం
బుగాదుమద్గమనమునకు॥వ॥ఇదియునుంగాక॥గీ॥ధరణివేనస్యపురు
షులదాకనొల్ల।మునుదశగ్రీవుడుద్వృత్తిమొనసినన్ను। వివశనై
యుండ తాడచ్చెవిభుడులేని।వేళతనచెటెరుంగకవిమలచరితా॥

వ॥ మరున్నందనా కోదండవిద్యావిశారదుండగు రఘువరేణ్యు
నిచ్చటికింగొని తెచ్చి రాక్షసక్షయంబుగావించి నన్నుంగడ దేర్పుగా
మనిపల్కి మరియునిట్లనియె॥

కేదారగౌళ: అటతాళము.

స్వామినిదోడితేమ్ము।స్వామిరిబోమ్మ్మా।నామీదనెనరుగల్గి।కోమలసుం
దరమేఘ।శ్యాముడై సర్వ గుణాఢ్యు।రామచంద్రునట్టి॥స్వా॥చారుకోదం
డవిద్యావి।శారదుడైసమరభూమి।ధీరుడై రాక్షసుల ద్రుంచు।దివ్య
మూర్తిని॥స్వా ॥౧॥ క్షణమైననన్ను జూడక।మనసునిలుపలేనివాని।
మునిగణవందనునిజగ।న్మోహనాంగుని॥స్వా॥౨॥కరముప్పసౌమిత్రి
తోడ।గురుతుగ శ్రవణానాము।గిరిమీదవేంచేసియున్న।వరరంగే
శుని॥స్వా॥౩॥క॥ అనవిని మారుతసూనుడు।వనితామణిచారుమధుర
వాక్యములెల్లన్।వినితనమనమునసుబ్బుచు। ఘనభక్తిని బలికెనప్పుడు
కాంతామణితోన్॥

ముఖారిరాగము - అటతాళము.

తల్లియేమమ్మ నీగుణములూ।గల్గు।దలపనానందాశ్రుకణములూ॥
చరితరొనీవన్న పలుకులూ।నిక్కమరయగమాధుర్యతరములూ॥౧॥
పతిమెచ్చువివరింతుచాలనూ।నీభవ్యసౌశీల్యములీలనూ॥౨॥భువిలో
ననీసాటిలేరమ్మా।పరిపూర్ణపతివ్రతవీవమ్మ॥౩॥నినుగనిభాషించు
టెల్లనూ।రాముడనుగ్రహతనమదినమ్మనూ॥౪॥ వరరంగపతిరాణివి
నవమ్మా।నాకుకరుణనభీష్టానమీవమ్మ॥౫॥తల్లియేమమ్మ॥

వ॥అనినరామపత్ని పవననందనునకిట్లనియె॥శా॥ శ్రీరమ్యంబగు
చిత్రకూటగిరిపై క్షేమంబుగానొప్పుచో।శ్రీరాముండొకనాడునా
తొడలపైకెల్యొందని ద్రింపగా।ధీరత్వంబుననొక్క కాకమటకుం

తీవ్రంబునంవచ్చి తా।క్ర్యూరోద్రేకతనాకుచంబుబొడిచెం।కోపం
బుదీపింపగఁ ॥వ॥ ఇవ్విధంబున నింద్రపుత్రుండగు జయంతుండు శాపవశంబునం గాకాసురుండై నాకుచ భాగంబు రక్తధార లొలుకంబొడచిన నవ్వేదనలవలనం దపియించుచున్న రఘు వరుండు చయ్యనలేచి నన్నూరడించి స్వకీయ్య దర్భాస్తరణంబున నొక్క దర్భఖండంబుద్రుంచికాకాసురుమీదం బ్రయోగించిన నదియున నన్యభేద్యంబగు బ్రహ్మాస్త్రంబై వెనువెంట నంటదొణంగినముల్లోకంబులందిరిగి రక్షకులులేక గ్రమ్మరంగరుణాసముద్రుండును శరణాగతత్రాణపరాయణుండునునగు శ్రీరాఘవేంద్రునిపాదారవిందంబులపైంబడికన్నీరునించుచునిట్లనియె॥

యదుకులకాంబోధిరాగము- అటతాళము.

అయయోనామొరవినవయ్యా । నేనపరాధి నపరాధి నపరాధినయ్యా॥అ॥శరణుశరణుదీనరక్షా।నన్ను। కరుణింపుమికనవ్యతరపంకజాక్షా॥అ॥ భయముమాన్పుమురఘురామా।నాక।భయమియ్యవె లోకపావననామా॥౨॥ జనకుడుననుమానెనయ్యా।దీనజనపోషన వెనాజనకుడవయ్యా॥౩॥ శ్రీకరరంగనివాసా।నన్ను నేకొని బ్రోవుముసీతాహృదీశా॥౪॥అయయోనామొర[illegible]య్యా॥వ॥ఇవ్విధంబున॥క॥ మొరవెట్టెటి కాకాసురు।క[illegible]జూచిచారుకరుణాకరుడై।బొరిగొనక బ్రోచెనమె[illegible]వగనుతినిదిడెల్పు మకఁవంశజుతోడఁ ॥వ॥ అనిబలికె వా[illegible]ట్టికరుణాసముద్రుండై నమహానుభావుండు నన్నూ[illegible]తీవ్రంబున నరుజేరక యున్నవాడే నేమిసేయంగలడాన[illegible]త్మనితోడ న్నారయుడగ రుణకల్గునట్లుగా భాషించి తనసంత[illegible]నచందంబు నంజెప్పుమనియిట్లనియె॥

సౌరాష్ట్రరాగము- ఆదితాళము.

ఇంతినిపరులయింటనుంతురా న్యాశ్యవంతులుదీనికిసహింతురా।
ఓ కాంతుడనీ భుజవిక్రమమెందుబో యనయయో॥యింతి॥౧॥ చెరలోననిలువలేనువల్లభా।నన్నుకరుణనేలుముజగద్వల్లభా।దివ్యశరచాపములుగల్గి సౌమిత్రివెంటనుండ॥౨॥ నెలమీదనుర్వి బ్రతుకజా

లసు।యూవల ప్రాణములువిడుతులీలనూ। నవ్యజలజాతురంగపుర నిలయకోదండరామా॥యింతి॥3॥వ॥ఇట్లుబలికిమహాత్మాధనుర్ధరశ్రేష్ఠుండగు శ్రీరామచంద్రుండతిరయంబునంజనుదెంచిశత్రుభేదనంబుగావించి నన్నుసముద్రంబుదాటించునట్లు సేయుమని బల్కియిట్లనియె॥సీ॥ ఏజగద్వల్లభునిలలోనకౌసల్య ప్రేమనోములనబి ప్రీతిగనెనో । యేజగత్కళ్యాణునీక్షించి నాతండ్రినన్నిచ్చి చేసెనోమున్నుపెండ్లి।యేమోహనాంగుండునామోముదమ్మిపై మోముదమ్మిఘటించుముచ్చటాడ।యేమహాత్ముడరణ్యసీమలవనపుష్పమాలికల్ మద్వేణిచాలజుట్టు । నట్టిభువనైకసౌందర్యుననఘుచరితు।సాటిలేనట్టిరఘుకులస్వామినసఘు।మహితభక్తినిడాసినమస్కరించి।కుశలమడిగితిననవోయికూర్మితోడ॥సీ॥ రఘువరేణ్యునిపాదరాజీవయుగళంబునిత్యమెవ్వఁడుగొల్చునెమ్మితోడ । వనసీమపతితోడననువుగానిద్రింతపవరభక్తివెలయనెవ్వండుబ్రోచు। తనయన్ననాత్మలోదశరధుండనిసన్నుతల్లిగానెవ్వండుదలచుచుండు।కరమొప్పసద్గుణకలితుడైధరనార్యజనములనెవ్వండుసమతగొల్చు। నట్టికులదీపకుమరందిననఘశీలు।నాడరానిదురోక్తులేనంటినకట । నన్నియుశమింపుమనుముసిన్నాదరమున । కుశలమడిగినదనుముదుష్కృతవిదూరా॥వ॥మరియును సుగ్రీవాది వానరశ్రేష్ఠుల నందరం గుశలంబడిగితినని జెప్పుమనిపల్కి తనవస్త్రంబున ముడిచి యున్న శిరోమాణిక్యంబువిచ్చి రఘువరేణ్యున కానవాలుగా నొసంగుమని యొసంగి కన్నీరునించి వాయునందనా యికమీదనొక్కమాసంబుపకంటె నధికంబుగాజీవింప నేరనని నిశ్చయంబుగా జెప్పిదోట్కానిరమ్మనిపలికియిట్లనియె॥

శోకవిరాళిరాగము- అటతాళము.

వచ్చునా।స్వామివచ్చునా। హైమచైచనకోదండముచ్చుగధరియించి ధిచ్చలవిడిరక్షోవీరులవధియింప॥వచ్చు॥ బ్రోచునా। కరుణజూచునా।నాఛందమెల్లనీవాచంద్రముఖుతోడ।సూచింపరక్తాబ్జలోచనుడగుచుతా॥వచ్చు॥౨॥వలచునా।నన్నుదలచునా।చెలువమమరరంగనిలయుడునామీది।వలపునతమకమునిలుపజాలకవేగ॥వచ్చునా॥స్వా

మివచ్చునా॥౩॥సీ॥విభునిపదాబ్జముల్ వేఁడ్కనొత్తఁగఁగోరుచేతులెం
దువసింపజేతునయ్యా। పతిదివ్యసౌందర్యభావంబుగనఁగోరుకన్ను
లెక్కడదాఁతునన్నేను। కడువడిహృదయేశు కౌఁగిలింపఁగ గోరు
మోహమెందణఁగింతుసాహసమున। వరుని శ్రీకరమంజువాక్యముల్
వినఁగోరుకర్ణంబులెందుండనిర్ణయింతు। నేమిసేయుదుదుఃఖాబ్ధి
నెట్లుగడతు। వినుముహనుమంతగుణవంతవీర్యవంత। నామనోహరు
డైన శ్రీరామచంద్రు కదసియేనెన్నటికిఁగాంతుకౌఁగిలింతు॥

వ॥ ఇట్లుపలికిన నిద్దంబు చెక్కుటద్దంబుల నలంకరించిన మనస్వి
లాతిలకవృత్తాంతంబు జెప్పి వాయునందనా నీవెవ్విధంబున జెప్పివై
నరఘువరునతిదయాళుం గావించితోడ్తెమ్మనిపల్కిన నాంజనేయుం
డు వినయంబుననద్దేవినింజూచి తల్లి దుఃఖింపవలదు జగద్వల్లభుం
డైన శ్రీరాముతోడ సఖ్యంబుగావించిన సుగ్రీవుని సైన్యంబుల లో
నాకంటె నధికపరాక్రమసంపన్నులును నాతోటి సమానవిక్రము
లునుం గల్గియుందు రింతియకాని నాకంటెహీనవిక్రముండొక్క
డైనలేడని చిత్తంబునందలంపు మిట్టివనచర సైన్యంబు గొలువరఘు
వరుండరుదెంచి రావణప్రముఖ రాక్షసులం గూల్చి పరమానం
దంబున నిన్నయోధ్యకుం గొని పోవుగావున నేనింక ప్రయాణంబు
గావించెద దీవించి శెలవుకృపసేయుండనిపలికినం గన్నీరునించి యి
ట్లనియె॥గీ॥కోరిసర్వాంగతాపంబుదీరిపోవ।నతులసర్వాంగసుంద
రుండైనవిభుని।తమకమునకౌఁగిలింపంగఁదగనొనర్చు। మారుతా
త్మజనీమేలుమరువనయ్యా॥గీ॥నన్నుగన్నతండ్రి నాయన్ననిన్ను నే
నాడినట్టిపల్కులాత్మ మరచి।కరుణఁబ్రోవుమనుచుగట్టిగామరఁదితో।
కరుణగల్గ ననుముకరుణతోడ॥వ॥అనిపలికినయనంతరంబునా॥

మారువరాగము-ఆదితాళము.

సెలవిమ్ము చక్కనితల్లి సెలవిమ్ముతల్లి।నూర్మిళవెలయు నిన్నెన్న
టికిమరలవీక్షింతుతండ్రి॥దనుజులెల్లజచ్చినట్లుదలపవెతల్లి। అట్టిది
నమెన్నటికికఁ జేకూరు చెప్పుమతండ్రి॥౧॥ సెలవిమ్ము॥విభునికినీసాక్షి
ల్యముమవివరింతుతల్లి। రామవిభునిదోడి తెమ్ము నిన్నువినుతింతు తం
డ్రి॥౨॥పదములాడవన్ము నిన్నుబాయనాతల్లి। నీవుకదలిపోవచింత

మరలగలుగు నాతండ్రి ॥౩॥ వరరంగనాథునకు నీపై కరుణగలదమ్మా
రఘువరునకు నా పాటు జెప్పి చెరబాపుమన్నా ॥౪॥ సెలవిమ్మ ॥
వ॥ ఇట్లు బలికిన యనంతరంబున ॥ క॥ హనుమంతుడు వైదేహికి । వి
నయమెలర్పంగ మ్రొక్కి వీట్కొని మదిలో । ననువుగ నాలోచించి
యు । తన విక్రమ మెల్ల జూపదలచి రయమునన్ ॥ వ॥ తత్క్షణంబున న
త్యంతరౌద్రాకారుండై శృంగారతరంబగు యా ప్రమదా వనం
బునంగల వృక్షంబులెల్లం బెరకివైచుచు వనపాలకు లందరమి చం
పుచు విహరించుచున్న సమయంబున ॥

పంతువరాళి రాగము - ఆదితాళము.

వనము బెరుకసాగె నెవ్వడే । యీ వానరుడు ॥ వనము ॥ వనరక్షగా
వించు దైత్యవర్గములగద సిద్ది । మొనసి కుయ్యో మొఱ్ఱో యనగ
మూతులెల్ల విరగదన్ని ॥ వ॥ ఇదుగో వచ్చెనదుగో వచ్చెనే । వోయమ్మ
పెద్దపిడుగు రీతి బడుచు వచ్చెనే ॥ కడకాళ్లు బట్టుక త్రిప్పి ఝుడియక నె
ట్టి వీరుల । పుడమి గొట్టుచును మంచి ఫ్రూత పండ్లు కాయలున్న ॥ అ॥ సీత
తో భాషించుచుండెనే । యిందను కా వీడు ఖ్యాతి లేక నణగియుండెనే ।
వోతల్లి వోయక్క వీడు భూత మొదయ్యో మొలేక । సీతడు శ్రీరంగపతి
దూతగ వచ్చినాడేమో ॥ వనము బెరుకసాగె నెవ్వడే ॥౩॥ వ॥ ఇవ్విధం
బున రక్కసచేడియలు భయంబున వడంకుచుండ నాంజనేయుం
డు వనభంగంబు గావించి సింహనాదంబు బొనర్చి తోరణస్తంభం
బుమీదం గూర్చున్న సమయంబున ॥ గీ॥ అసురకాంతలెల్ల నతిభ
యంబున వచ్చి । రాము భార్య జూచి రమణి వినుము । వానరుండొకండు
వచ్చి నీతో మాటలాడి వనము బెరికినాడు నేడు ॥ వ॥ వీడెవ్వండు భ
యంబు మాని పలుకుమనిన నప్పద్మగంధి యా రాక్షసస్త్రీలం గనుం
గొని సర్పపదంబులు సర్పంబు లెరింగినట్లు మీ రాక్షసమాయా
కృత్యంబులు మీ రెఱుంగవలయు మాబోట్ల కెవ్విధంబునం దెలియవ
చ్చు నని పల్కిన యనంతరంబునం గొందరు రాక్షసేంద్రునికడకుం
జని యిట్లనిరి ॥ గీ॥ వనచరుండొకండు వచ్చి సీతమ్మతో । మాటలాడు
చుండి సాటిలేని । విక్రమంబు గల్గి వెసరౌద్ర వివశుడై । వనము బెరికివై
చె దనుజనాథ ॥

ఆనందభైరవిరాగము-ఆదితాళము.

వనమునాశనమాయదనుజనాథా । నీఘనమైనదోర్బలములజూ
డుదనుజనాథా।తరుణిసీతకనువయ్యన్నతరువుదప్పా।నన్నితరువు
లభంజించెనయ్యాదర్పమొప్పా ॥౧॥ కరమొప్పఫుష్పాలుపండ్లుకా
యలెల్ల।జూడనరుదుగభూమి పాలాయ నమ్మచెల్ల।సముదగ్ర
విక్రముడయ్యాచెరాజెయ్య। రంగస్వామికిభటుడేమోనయ్యశై
లధైర్య॥వనమునాశనమాయదనుజనాథా॥౨॥చ॥ అనవినిరావ
ణుండుమదినాగ్రహమొప్పగనస్త్రవేదులై।మొనసినయట్టిదైత్య
భటముఖ్యులబంపగవారుచయ్యనం। జనిహనుమంతుమాకొనిన
చక్కగరాఘవునింస్మరించితా। ననిమొనవారిగూల్చిచనెనంతటతోర
ణమాశ్రయింపగనూ॥గీ॥వారుచచ్చుటవినిదైత్యవల్లభుండు।జం
బుమాలినిబనుపచంచద్రథంబు।మీదగూర్చుండిసైన్యసమేతుడగు
చు।దాకెహనుమంతునుద్దండదర్పమలరా॥వ॥ యివ్విధంబున జం
బుమాలి హనుమంతు తోడం దలపడి క్రూరబాణంబుల నొప్పిం
చి యతనిచేత సైన్యసమేతంబుగా హతుండై ననంతటహతశేషుల
వలనం యావృత్తాంతంబు రావణుండెరింగి మంత్రిపుత్రులం బని
చిన వారును యుద్ధసన్నద్ధులై హనుమంతునిప్పట్టంబోయిభగ్న
సంకల్పులై సైన్యంబులతోడ నేలంబడిరంతదశకంధరుండుకోపో
ద్దీపితముఖుండై యూపాక్షు విరూపాక్షు దుర్ధరభాస కర్ణాది
సేనా నాయకులం బనిచిన వారత్యంత భీషణాకారంబుల తోడం
జని ఘోరంబుగాబోరిపోరిహనుమంతువలనమరణంబునొందినా॥
వ॥ వినిరావణుడక్షుండను।తనయునిముఖముబ్జెచూచితనయుడ
నీవా।వనచరునితోడయుద్ధం। బనువొందగజేసిపట్టుమతియత్నముు
నన్ ॥వ॥ యిట్లుబలికిన నక్షయకుమారుం డతీతశౌర్యవిక్రమప్ర
తాపంబులొప్పార రథగజాశ్వప్రముఖచతురంగసేనాసమేతుం
డై ధనుష్టంకారంబుగావింపుచు తనపరాక్రమంబునకు చూపరులు
చ్చెరువంద నప్పవననందనుతోడం బోరిపోరి సైన్యంబులతోడ హ
తుండయ్యెనాసమయంబునా॥

శంకరాభరణము-అటతాళము.

దనుజేంద్రుఁడంతటతనయుఁడుజచ్చుటవినిరోషవశుఁడగుచు।ఘన
బలునింద్రజిత్తునిఁజూచివలికెనీవనుపమవీర్యుఁడవు ॥౧॥ కరమొప్ప
ననుబోలుదువిక్రమాదులఁగావుననికజనియు।సరగుననవ్వనచరుని
బట్టుకరమ్ముసమరముఁగావించియు॥౨॥అనిబల్కసకలసైన్యావళు
లమరఁగనినతుల్యరథమెక్కియు। మొనసిచాపముచాలమ్రోయిం
చుచునుజనిసునిశితశరములను॥౩॥ హనుమంతునేయఁగనవియెల్లఁజి
మ్ముచునాహవమొనరింపఁగా।కనలియోచించిబ్రహ్మాస్త్రప్రయోగ
ముగావించెజవమునను ॥౪॥ గరిమతోఁడుతరంగస్ఫురవాసుఁడగుర
ఘువరునికింకరుఁడంతను।సరసిజసంభవశరబంధమునఁజిక్కిధరణి
స్థలినివ్రాలెను॥దనుజేంద్రు॥౫॥గీ॥ వ్రాలిమదిలోనయా బ్రహ్మ
వాక్యమునను।జగతినించుకకాలమీశరమువలన। జిక్కినట్లుండవలె
గానజిక్కినట్లు।గానబడియెదనేనునిక్కంబుగాను ॥౬॥ పదపడి
నేనిట్లపట్టుపడ్డట్లు।పదిలంబుగానున్నభటులెల్లవచ్చి। కదిసిబంధిం
చిచక్కఁగమోసుకొనుచు।వదలకరావణువద్దనున్నంతు। రంతటద
నుజేంద్రుసమరంగఁజూచి।వింతగాభాషించివెసజనువాడ। ననుచు
నూరకయుండెననిలాత్మజుండు।మనసులోనీరీతిమర్మంబుగలిగి।హ
నుమంతుడబ్జగర్భాస్త్రబంధమును।ననువుగానంటకనతఁడుండులె
ల్లి।కనిశక్రజిత్తుతాఁకరమరుదంది।తనమదిలజ్జచేతఁగనూరకుండె॥

వ॥అంత॥క॥ పెనుద్రాళ్లఁగట్టి పవనజు।ననువొందఁగమోసుకొ
నుచుసాపుణలతోడం। దనుజులుగొనిచనిడించిరి। దనుజేంద్రుని
మ్రోలనధికదర్పమెలర్పన్ ॥వ॥ అంత నయ్యంజనేయుండుస్వ
ర్ణరత్నప్రభాశోభితంబైనకొలువుకూటంబునదివ్య మాల్యాం
బరాభరణ కలితుండై ధగద్ధగాయమానంబుగా వెలుంగు దశకిరీ
టంబులతోడ నొప్పారుచు నొడ్డోలగంబునం గూర్చుండి యున్న
లోకకంటకుండగు దశకంఠునింజూచి యాశ్చర్యంబున నహా వీని
యొప్పిదంబేమని చెప్పవచ్చు వీఁడు పాపకార్యాసక్తుండుగాకయుం
డెనేని మూఁడులోకంబులేలం దగినవాఁడ నీమనంబునందలంచె నా
సమయంబున రావణుండు క్రోధోద్దీపితముఖుండై యివ్వానరుని

వృత్తాంతంబుశీఘ్రంబునం దెలియుమని ప్రహస్తుతో డంబలికిననతం డాంజనేయునకిట్లనియె॥

నవరోజురాగము-ఆదితాళము.

ఓరివానరనీ వెవ్వారివాడవురా। యీరమ్యపురి కేలనే తెంచితివిరా। ఘనమైనవనము భంగముచేయనేలా। దనుజకాంతల నెల్ల దషించవనేలా॥౧॥కదనముద్ధతినీవుగావింపనేలా।వదలకరధికావళులవిదళింపనేలా॥౨॥సురముఖ్యులనుపగసారిదివచ్చితివో వరరంగేశుడు బనుపవచ్చి చేరితివో॥౩॥ఓ ॥ద్వి॥ అనవిని పవనజుండాతనిజూచి।వినరోరిచెప్పెద వేడ్కతోనేను। హనుమంతుడనువాడననిలసుతుండ। నినజునిసచివుండనిద్ధతేజుండ। ఘనుడైన యట్టి రాఘవకింకరుండ। ననుపమసౌశీల్యయగుసీతవెదుక జనుదెంచిపొడగాంచినద్వాతలాడి।దనుజేంద్రజూడతాత్పర్యంబుగలిగి।వలనొప్పశృంగారవనమెల్ల బాహు।బలమునబెరికితినటువేగమునను।వెరువకరాక్షసవీరులేతేర।నెరిద్రుంచిదేహంబునే బ్రోచుకొంటి।ననిపలికిరావణునమరంగజూచి।సునయంబివిధములసొంపుగాబలికె॥

గీ॥ సోదరస్నేహమలరంగసూర్యసుతుడు। ప్రేమతోడుతనడిగె నీక్షేమమెల్ల । శ్రీరఘుస్వామియనుబుద్ధి జెప్పుమనియె।సకలబలగర్వకలితనిశాచరేంద్రా॥సీ॥ దశరథేశునకగ్రతనయుడౌ శ్రీరాముడవికిజనకాజ్ఞనరిగియుండ।సీతావియోగంబుచేకూరెనచ్చటనారఘూద్వహుడంతననుజుగూడి । కరమొప్పఋష్యమూకము జేరిసుగ్రీవుసఖ్యంబుజేసినిశాతచండ । బాణంబుననువాలి బడగూల్చికపిరాజ్యమిచ్చె నకజునకునింపుతోడ।నంతటనుసీతవెదుకనన్నంపెనినజు। డేనుచనుదెంచివైదేహినిచటగంటి । ఘనతపంబునమున్నావిఖ్యాతిజెంది।జగతిపరదారచౌర్యంబునలుపదగునె॥వ ॥ దానవేంద్రా।ధర్మఫలంబు అక్షయసౌఖ్యంబులను భవింపం జేయు నధర్మఫలంబుశీఘ్రంబునం గులక్షయంబు గావించు నీవునుయధర్మపరుండవై చౌర్యంబునన నింద్యయగు రామపత్నింగొనివచ్చి నీతోడంగులక్షయంబుగావించుకొన దలంచియున్నవాడవు జనకనందన నష

హరించుట విషాన్నంబు బుచ్చుకొన్న చందంబుగా దలంపు మని
యిట్లనియె॥

కేదారిగౌళ - అటతాళము.

ఏరరావణ రావణా। సకలదుర్విచార పాతక కారణా। శూరుడ
ననుచు విస్తారము ప్రేలుచు। చోరత్వమమరించి సుదతి దెచ్చితివిభీ॥
యేర॥ ధీరుడు రఘువరుడు। దివ్యాస్త్ర విశారదు డతిబలుడు। ఘోరత
రాహవ శూరుడన్వీనాది। వీరుడుజ్వల చాపమారూఢిచేగొన్న। దే
రిచూడగ వశమా। నీబోటివారా రామునకు లక్ష్యమా। ఆరాఘవేశ్వ
రుడని సంహరింపగ। కోరినవారి నెవ్వారు బ్రోవగలేరు॥ యేర॥ ౧॥
దండకాటవిలోననూ। యారాముడఖండదర్పముతోడనూ। గండు
మీరినయట్టి ఖరదూషణాది ప్రచండ రాక్షసుల కోదండవిముక్తోగ్ర
కాండ ప్రకాండములా। నస్మృత లీల ఖండింపడె తానిలా। దండిమగం
డవై దాకకనప్పుడెందుండియున్నావు నీగండతనము మండ॥ యే॥ ౨॥
జనకపుత్రిక నెన్నగా। నీమెడకు దాల్చిన కాలపాశముగా। ఘనమస్తక
మున చయ్యన బడ్డని ఘూర్ణ తనుని మది నమ్మి పావనమగు శ్రీరంగ। మున
నొప్పు రఘురాముని। సకలజగజ్జనకలుషవిరాముని। గని నీవు జనకసం
దననిచ్చి తత్పాద। వనజయుగ్మమునకు మొనసి శరణుబొంద॥ యేరరా
వణరావణా॥ ౩॥

యదుకులకాంబోధిరాగము - ఆదితాళము.

బ్రతుకవలసితేని రాముభార్య నివ్వరా। నాహితబుద్ధి వినకున్న
యుద్ధక్షితిని జావరా॥ మించి రాఘవేంద్రుడీ ప్రపంచమెల్లనూ। సం
హరించి తా సృజించగలడెంచిచూడను ॥౧॥ రామనివ్వకున్న హో
హూ రావణ వినరా। సీతారామకోపాగ్ని జ్వాలల ధూమిగూల
రా॥ ౨॥ ఘనరామాదివ్యాస్త్రతతులు గదియకమున్నె। లక్ష్మణుని చా
పటంకృతి చెవుల వినబోకమున్నె ॥౩॥ నీకంఠబాహులు ద్రుంపనే నె
జాలుదు। దనుజానీకముతో లంక గాల్ప నేనె జాలుదూ॥౪॥ చారురం
గేశ్వరుడు నిన్ను జంపుదునన్నా। ప్రతిన నారూఢి నేదలచుట చే బ్రతి
కితివెన్నా ॥౫॥ సకలసురదైత్యగరుడభుజంగయక్షు। వితతిచే చావ
కుండంగ విశ్వమందు। వరము గొంటివి గాని వానరులవలన। నరులవల

లనను దెగకుండంగ వరము లేదు ॥౮॥ కావున నీవు నాబుద్ధివాక్యంబువి
నకున్న రాఘవునివలన నీకు మరణంబు సిద్ధంబని యెరుంగుము మఱి వా
రుండు ధనుర్ధరుండై నిన్నువధింపం దలంచె నేనియు బ్రహ్మేంద్ర
రుద్రాదులైన నడ్డపడంజాలరని పల్కి—నయా రావణుండత్యుగ్రాకా
రుండై రక్తోవీరులం జూచి యివ్వానరుం దెగటార్పుండని పల్కి—
నవ్విభీషణుండన్నతో నిట్లనియె॥క॥ దూతవధనలన బహుళ విఖ్యాతం
బగు కీర్తి చెడును గావున। నీవీదూతను జంపింపకుమిల। పాతకమని మ
దిని తెలసి వంక్తిగ్రీవా॥౨॥ అనవిని రావణుండ సురులనెల్ల। గనుగొ
ని మీరలీకపితోకగాల్చు। డనయన్న వినివారలందరమ్యేడను। పనిబడి
కార్పాసపటములు దెచ్చి। ఘనతైలమునముంచి కడుధైర్యమమర।
హనుమంతుతోకకుననువొందజుట్టి। వదలక శిఖిని ప్రజ్వలనంబు చేసి।
కడసి కాల్చియు మహోగ్రతనార్పు లెసగ। సకలవాద్యములతో సా
మీరి గొనుచు। ప్రకటమౌవీధులపరు గిడుచుండ। సరగునరంతరాక్షు
సకాంతలెల్ల ధరణిజకడకేగి తరుణీ పాలి। కరుదెంచి మాట్లాడినట్టి
వానరుని। బరువడి నిశిచరుల్ బంధించితోక। సరుదారగనునగ్నినం
టించి చాల। కలవిధులందెల్ల క్రచ్చరవాద్య। ములు మ్రోయద్రిప్ప
చుమొన సెదరన్న। వినుగుం డెఝల్లన వెసమూర్ఛ జెంది। కనుదమ్ము
లనునీరు గ్రక్కు—న వెడల। శోకించి శోకించి సుదతి తానంత। వీకపావ
కుగూర్చి వెలది తా బలికె॥

శుద్ధసాంబోధి రాగము-అటతాళము.

మ్రొక్కె—ద నయ్య నీకగ్నిహోత్ర కేలు మోడ్చి చాలా। నీవక్క—జ
ముగ నామనవి నైకొని బ్రోవవయ్య లీలా ॥ పాలుపొంద మాహను
మంతుని చల్లగ బ్రోవవయ్య। భక్తి వెలయను తింతు మారుతికి శీతలుడ
వై వెలయవయ్య ॥౧॥ కరుణించి నన్ను రాఘవుడబ్ధి దాటించి గాచు
నేని। నీవు గరిమతో డుత శైత్యకారివి గావయ్య కరుణబూని ॥౨॥ గొ
నకొని పరమపతివ్రతనని ఖ్యాతి గొంటినేని। నీవు ఘనమతి నాంజనే
యుని మన్నింపు ముదయగలిగెనేని॥౩॥ అరుదుగ నాపతి సత్యసద్వ్ర
తుడాయనేని। శ్రీకరరంగవాస సేవకు నేలుమికనుతీక్షణము మాని ।
మ్రొక్కె—ద నయ్య నీకగ్నిహోత్ర॥౪॥క॥ అనివినుతింపగ నంతట। హను

మంతునకగ్ని హేమాంశుడతిశీతలుడై । ఘనహిమము బోలి వెలసెను । కనికరమున సీతవినుతిగైకొని చాలఁ ॥ వ॥ అంత నయ్యాంజనేయుం డగ్ని భయంబులేక సీతాపాతివ్రత్య ప్రభావంబుననో రామప్రసాదంబుననో యపాయంబులేక భద్రంబుగానున్నవాఁడనని యాశ్చర్యంబునం బొంది బంధంబులుద్రుంచుకొని గగనంబున కెగరి తోరణంబుమీదనున్న పరిఘంబు పుచ్చుకొని తన్నుం బట్టి తెచ్చిన రాక్షస సహస్రంబుల నాశంబొనర్చి తనవాలంబున దేదీప్యమానంబుగా వెలుంగు వహ్నివలన రాక్షస మందిరంబులు దహించె నట్టియెడ॥

రేగుప్తి రాగము-అటతాళము.

లంకాపురిగాల్చెను । శ్రీరాఘవకింకరుఁడవలీలనూ ॥ యింకెట్లునని యింతులెల్ల తత్తరపడి । చంకబిడ్డలతోడ వంకవంకల కేగ ॥ లంకా ॥ భటులైన సౌధములూ । ద్వారకవాటపటుమణిస్తంభములూ । చిటచిటమిణుగులుఁ చెదరి పెట్టెట పెట । పెటిలి పేల్చి పడ్డభీకరధ్వనులూప్ప ॥ లంకా ॥ ౧॥ భగ్గుభగ్గునమండుచూ । దిక్కులకెల్ల । నగ్గలముగ డాయుచు । డగ్గరనిష్వనిదారుణాగ్నులలోన । ప్రగ్గుహయంబులు మత్తేభములుగల్గ ॥ లంకా ॥ ౨॥ భీమరూపముతోడనూ । మేడలమీద వేమారుదిరుగుచునూ । రామ శ్రీకరరంగధామపావనదివ్య । నామ శ్రీరఘురామ రామహరేయని ॥ లంకా ॥ ౩॥ వ॥ తదనంతరంబున ప్రహస్తమహాపార్శ్వ వజ్రదంష్ట్ర శుకసారణ సురేంద్రజిత్కుంభనికుంభ నరాంతక కుంభకర్ణ మకరాక్ష ప్రముఖ రక్షోవీరుల గృహంబులు క్రమంబునం దహించి విభీషణగృహంబు వర్జించి నానా రత్న భూషితంబై సర్వమంగళశోభితంబై మేరుమందరతుల్యంబగు రావణుమందిరంబు జ్వాలాగ్నివలనం దరికొల్పి కాల మేఘంబు గర్జిల్లిన చందంబున సింహనాదంబొనర్చి ప్రచండ వేగంబున విహరించుచుండ నయ్యెడ నగ్నిసంయోగంబునం జేసి దగ్ధంబులైన మణిమయ భవనంబులును యంగారంబులైన తేరులును నేలంగూలిన గోపుర విమాన తోరణ వ్రాతంబులును స్త్రీ బాల వృద్ధనిశాట సంఘం

బులరోదనధ్వనులునుంగ్గియప్పురంబాహాకారంబుగానుండియుం
డె సాంజనేయుండును త్రిపురదహనంబు జేసి నరుద్రుండునుం బో
లె వెలుంగు చున్నం గనుం గొని రక్కసులెల్ల భయంబు నందమ
లో సాక్షాద్వైష్ణవ తేజంబు రాక్షసనాశంబు గావించుకొఱకీరీ
తిజనుదెంచె ననిదలంచిరంతట హనుమంతుడు దేవగంధర్వ మహా
ఋషిగణంబు లిచ్చమెచ్చ సముద్ర జలంబుల వాలంబుల చల్లాచుఁ
కొని తనమనంబునంజానకిందలంచి॥

రేగుప్తిరాగము-ఆదితాళము.

తల్లినిగాన్నైతిని।పురిగాల్చు వేళతల్లి నిగాననైతిని॥తల్లి దిక్కుగా
నక దారుణకోపమున।నెల్ల రాక్షసగృహములెల్ల దహించినాడ॥
౧॥కోపముసుఖమొసఁగునా।ఏవ్వారికైకోపమిష్టముదీచునా।
కోపమత్యంతఘోరపాపములకుపుత్తు। కోపిష్ఠికేలగల్గుకువలయ
మునకీర్తి॥౨॥యేమిశేయుదుచాలను। ద్రోహినైతినిస్వామినే
భంగిజూతును। ప్రేమతోడుతరంగధాముడై నట్టిరఘు। రాముని
బంటననుచుస్వామికప్రియుడనైతి॥తల్లి॥౩॥క॥సీతా ప్రభావవశ
మున। సీతేశునికరుణనగ్ని శీతలుడగుచుఁ। ఖ్యాతిగనను బ్రోచియు
యా।సీతకుకీడెట్లుసేయుచెనటితనమునఁ॥వ॥ఇవ్విధంబునందలం
చి గగనమార్గంబునం జనుచారణుల వాక్యంబులవలనం।సీతకు
శలవృత్తాంతంబుదెలసి ముదంబునుంజెంది చయ్యన శింశుపావృ
క్షంబుకడకుంజని జానకింగాంచి మ్రొక్కి తల్లీ దైవయోగంబున
నిన్నుంగంటిననిపల్కిన యద్దేవికరుణారసంబు వెలయ నప్పవన
తనయున నేకవిధంబులం బొగడి దీవించి కన్నీరునించిన రామచం
ద్రుండుశీఘ్రంబున రాగలండనియూరడించి యనుజ్ఞగొని వెడ
లినానాశృంగారసహితంబగు పర్వతంబెక్కి సముద్రంబు దాట
గోరి యుప్పరంబునకెగసి పోయిపోయి యవ్వలితీరంబుననున్నక
పివర్యులు వినునట్లుగాసింహనాదం బొనర్చినా॥గీ॥ ఆరవంబువ
లనచరావళుల్వినిచాల।సంతసింప జాంబవంతు। డప్పుడుగాలిప
ట్టిసీతగనివచ్చుచును జేసె।నట్టినాదమనుచు నమర జెప్పె ॥
సీ॥ హనుమంతుడంతటనాకసంబుననుండియామహేంద్రాద్రి

పైకరుదుగాఁగ। దూకంగకనికపులొకలెత్తుకచెట్లకెగరియాచుఁ
చుత్తన్నుబొగడుచుండ । జాంబవంతునకింద్రసంభవాత్మజునకు
మ్రొక్కిపూజలుజెంది। మోదమలర । కనుగొంటిలోకపావనినై
నవైదేహినమరారిపురిలోననశ్రుధార । కన్నుదోయిని వెడలంగ
కాంతుదలచి । హారఘూద్వహాహారామహాయటంచు॥ యున్నదు
పవాసములడస్సియుగ్రదైత్య । సతులలోనన్నవారొంది రతిమ
దంబూ ॥ వ ॥ అంతట హనుమంతుండు సమస్తవానరమధ్యంబు
నంగూర్చుండి జాంబవంతుండుగోరిన తాబోయివచ్చినవృత్తాం
తంబు క్రమంబున సాకల్యంబుగానెరింగించిన పరమానందంబు
నందినిహనుమంతుని ధైర్యపరాక్రమంబులకు విస్మయంబునంజెంది
యనేక విధంబుల నుతియించిరయ్యెడ వాలి నందనుండంద రంగని
సీతందోడ్కొనక రాము పాలికేగుటు చితంబుగాదు మన మంద
రము లంకాపురముసొచ్చి రక్కసులంజంప వలయు యేనురావ
ణేంద్రజిత్ప్రముఖుల శిలంద్రుంచివైచెదనని పలికిన జాంబవం
తుండంగీకారంబుసేయక ప్రతికూలవాక్యంబులుపల్కనట్టియెడ
నంగదప్రముఖులాంజనేయుంబురస్కరించుకొనిగమనోన్ముఖులై
రామస్మరణగావింపుచు గంతులువైచుచుమహోత్సాహంబునం
గదలి మధువనంబుజొచ్చి యావనంబునఫలంబులెల్ల గోసితిని మ
ధుపానంబుగావించివిహరించుచూ॥

శంకరాభరణము- అటతాళము.

మిక్కిలిపూబండ్లనక్కజమగుచున్నచక్కనితరులు సొంపెక్క
చివురుక్కనసెక్కుదామ । ఫలములుగోసిమెక్కుదామా । తేనెలు
ద్రావిసొక్కుదామా । మించిపుష్పించిఫలించినవనముల । సంచి
తమతినివసించిరాఘువునికీర్తించుదామా॥ రావణుతెల్లలుద్రుంచు
దామా । దైత్యులనద్దుముంచుదామా॥౨॥ మల్లెలుమొల్లలుత్పల్లాబ్జ
ములుగోసి । ఝుల్లుఝుల్లునరఘువల్లభుతిరుమేనజల్లుదామా । కా
యులుగోళ్లగిల్లుదామా । కొమ్మలతీగెలల్లుదామా॥౩॥ సారసోత్ప
లచక్రసారసరమ్యకాసారజలమ్ములకూరిమినీదగగోరుదామా ।
చల్లనిచోట్లజేరుదామా । దిన్నెలకెక్కిజారుదామా॥౪॥ సూటి

గమేటివాగ్ధాటిగ సీతావధూటికి దీటగుబోటులు లేరని చాటుదామా । కొండలనెగమీటుదామా । శత్రులనుర్వినాటుదామా ॥౫॥ బాయక శ్రీరంగనాయకుడగురఘునాయకుడవనిజ బాయకుండతపము సేయుదామా । పికములరీతిగూయుదామా । స్వామినివేగ డాయుదామా ॥౬॥ వ॥ ఇవ్విధంబున నం బరమానందవివశులై విహరింప ॥ ద్వి॥ అంతటదధిముఖుండత్యుగ్రుడగుచు । వింతగాకపికోట్ల వెసనదలింప । కనియంగదాదులుకడువడివాని । గొనకొనిమదిఁ జంపకూతలుబెట్టి । చనిచనిసుగ్రీవుసన్నిధిజేరి । మునుకొనివివరింప మోదంబుజెంది । పలికెలక్ష్మణుతోడ పవనజప్రముఖు । లలరుచు కృతకార్యులై సంతసమున । వచ్చుచున్నట్లుగావలనొప్పదోఁచె । నచ్చుగాదధిముఖునమరవదిఁలంచు । టరుదారవినుటచే నాత్మలోనెన్న । గురుతుగావిజయంబుగొన్నదినిజము ॥ క ॥ హనుమంతుడొక్కడవనిజ । గనికపులనుగూడివచ్చెకై వడిదోఁచెన్ । వినుమతడుదక్కనన్యులు । జననుతయవ్వారుసేయజాలరుదలపన్ ॥

గీ॥ అనుచుబలుకంగలక్ష్మణుండన్నగూడి । సంతసముజెందెసుగ్రీవుడంతలోన । దధిముఖునిజూచిదుఃఖింపదగదుకపులు । విజయమొందినకతమునవినుమువేగ ॥ వ॥ నీవుశీఘ్రంబున నేమరుగాబోయి హనుమదాదివానరులం దోడ్కొని రమ్మనిపనిచిన వాడతిరయంబునంజని పవనజాంగదప్రముఖులంబోగడి దోడ్కొనివచ్చినంగంతులువైచుచు మహోత్సాహంబున రామలక్ష్మణసుగ్రీవాదులకుప్రణామంబులు జేసి నిలుచుండిరట్టియెడ సకల వనచరానుమతంబున నాంజనేయుండు వినయవిధేయుండై కేలు మొగిడ్చి సీతాసుందరీవల్లభుండగు రామచంద్రునకిట్లనియె ॥

క ॥ కనుగొంటినివైదేహిని । కనుగొంటిననింద్యనఖిలకలుషవిదారిం । కనుగొంటిచారుశీలను । కనుగొంటినిజనకసుతను కన్నులనిండన్ ॥ ఉ॥ చూచితినీవధూమణిని చూచితినుత్పలపత్రలోచనిం । జూచితినీపదాబ్జములుజూడగగోరితపించుభామినిం । జూచితినార్యసన్నుతశుద్ధచరిత్రనుసువ్రతాన్వితం । జూచితికన్నులారగవసుంధరలోసరిలేనిసుందరిన్ ॥

ఆనందభైరవిరాగము-ఆదితాళము.

కనుగొంటిని క్షేమంబునయున్నది। మనజనకాత్మజ శ్రీరామా। వనధినడుమ రావణపురమునగల । వనమునగంటిని॥ శ్రీరామా॥ తడయకరక్క-సపడతులౌనచేటితర్జనలనువిని శ్రీరామ । వడవడవడకుచు కన్నులజలములు బొడమగనున్నది శ్రీరామ॥౧॥ సరగునను పవాసములకృశించుచు। ధరణిజవెలసెను శ్రీరామ । సరతమునినను దలచుచు దుఃఖింపుచుగరితవసించెను శ్రీరామ॥౨॥ వనితామణిచెక్కటకేలమరగ ఘనమతినున్నది శ్రీరామ । మనుకొనిరంగపురీశుడవగునినుమనమునబాయదు॥ శ్రీరామకనుగొంటిని॥౩॥

పున్నాగరాగము-అటతాళము-

తృణమైనమీనామస్మరణబాయదుజనకాత్మజా। భరతాగ్రజా । కనుదమ్ములనునీరుకడువడిజారించుశశిముఖి పావకసఖి । ఘనవేగమునరావణునిజంపరమ్మనెగుణవతి । రఘుకులపతి । హారామరామారామాయనివిలపించుసుందరి। కంబుకంధరి ॥ వేడినిట్టూర్పులవెసననమోవికందిచ్చునూ। హాయంచునూ। శరణుజొచ్చితిరంగపురవాపగొనిపొమ్మటంచునూ। వినుతించునూ ॥ ద్వి ॥ అనియిట్లుదుఃఖించునమితమోహామున। నిమమరుల్గొనియుండు నీరజనేత్రి।పాలతులనిలలోనపొడగంటిగాని। కలనైననిటువంటిగరితనుగాన।నీరజదళనేత్ర నీరామతోటి। యేరామలీడుగాదినకులతిలక । జగదీశ శ్రీరామజగములకెల్ల। తగతల్లికానెన్నదగియున్నదకట । వినవయ్యాయాసాధ్విమలతపంబు । ఘనతరశీలంబుకల్యాణగుణము । లెన్నంగవశముగాదిలబ్రహ్మకైన। మున్నెరుంగనెమీరుమనుకొనిమదిని। నిరమొప్పనటువంటికల్యాణిబాసి।ధరనెట్లు దేహంబుదాల్చియున్నారొ ॥ గీ ॥ తరలకుండలరత్నవిస్ఫురితమగుచు । ఘనసుధామండితాధరకలితమైన । రామచంద్రునినెమ్మొముప్రేమజూపి। బ్రోవుమనిపలికెనాతోడపువ్వుబోణి ॥

వ ॥ ఇట్లురావణాంతఃపురంబునం జెన్నొందుప్రమదావనంబునకొక్క-శింశుపావృక్షమూలతలంబునం గూర్చుండి రామరామేతివాక్యంబులుబలుకుచు దుఃఖించుచున్న యగ్గేవినూరాచేఁ భవ

దియ్యావృత్తాంతంబెల్ల సాకల్యంబుగా నెరుంగించి ముద్రికెయొ
సంగినంగన్నులనద్దుకొని పరమాహ్లాదంబుననక్కునంజేర్చి కన్నీ
రునించి శీఘ్రంబున సౌమిత్రిసమేతుండగు మత్ప్రాణవల్లభుం దో
డి తెచ్చి ప్రాణంబులు రక్షింపుమని బల్కినతల్లి మీ రానతిచ్చినవిధం
బునం గావించెద నాకానవాలు గృపసేయుండని వేడిన యద్దేవి కొం
గునం గట్టియున్నశిరోమాణిక్యంబు నా చేతికొసంగి। చిత్రకూటం
బునం గాకాసురుండు గావించిన దురితంబు విన్నవించి గండస్థలలి
ఖితంబగు మనస్సిలాతిలకంబు మీచాతం బ్రకల్పితంబగు వృత్తాంతం
బు జెప్పెనని చెప్ప మణిశ్రేష్ఠంబొసంగినం గైకొని తమ్ముండునుం
దానును రోదనంబు గావించి గట్టిమెడ రామచంద్రుం డమ్మణివ
రంబుగనుంగొని ॥

పున్నాగరాగము - ఆదితాళము.

మానజనకజను బాసి జనుదెంచుట దియేమి మణివరమ దెల్పవె చా
లా। కనికరంబున నన్ను గనిరమ్మనుచు నిన్ను బనిచెనో సీతయీ వేళ ॥
౧ ॥ లలనతల దాల్చుపువ్వులలో సథళధళను। చెలువుమీరక నీవ దేలా।
చెలిమినరుదెంచితివి చెవులకమృతము రీతివలనొప్ప దెలుపవె లీలా ॥
౨ ॥ క్రందుసను సర్వాంగసుందరియ నందగిసకలికిపై దేహిచిత్తం
బు। పొందుగను శ్రీరంగపురనేతనగునన్ను జెందియుండునె సంతతం
బూ ॥ ౩ ॥ వ ॥ ఇట్లు బలికి ॥ గీ ॥ వినుము సుగ్రీవ యీమణి జనక
నృపతి। వరముతినొసంగనస్మద్వివాహవేళ। నింద్రుడాతనికిచ్చెము
న్నిష్టమెసగ। మెరయు నిది చాల జానకి శిరమునందు ॥ క ॥ అన్నాలక్ష్మ
ణ సీతను। కన్నులపొడగన్నయట్లు గ్రక్కున దోచెన్। వన్నెదనరా
రు నిమ్మని। గన్నప్పటినుంచి మదికి కరమరుదారన్ ॥

తోడిరాగము - అటతాళము.

హనుమంత వినుమూ। సీతనుడాయనను గొనిచనుమూ। తనువు
న ప్రాణములనువాం దనిలువవు। వనజాక్షినెమ్మోమువలసి చూడ
కగాని ॥౧॥ యేమిసేయుదునూ। భామను జూడకెట్లుతాళుదునూ।
యేమి మఃఖించునో భీమరాక్షసవధూస్తోమములను జూచి వేమరుభీతి
ల్లి ॥ హ ॥ ౨ ॥ అంగననన్నూ। యెడబాసి యెరుంగదుమున్నూ। శ్రం

గారమైన శ్రీరంగస్థలమున నాచెంగటవసియించి సేవించుచుండు నూ॥హనుమంతవినుమూ॥౩॥

పున్నాగరాగము ఆదితాళము-

ఇంకాయేమనెనూ। జనకజకొంకకసీతోనూ। లంకేశుడునను చెరనిడెలంకను।పంకజలోచన పరుగిడిరమ్మనె॥ఇంకా॥ హారమణాయనునూ। కన్నులనీరిడి ననయమునూ। కూరిమిమరు లెదారినిబాయనా। శ్రీరఘువరనను చేరవ జేమనె॥ఇంకా॥౧॥నిరుపమఘనశీలా। నే నీచెరనుండుగజాలా। సరగున నొకమాసముజీవించెద। నరుదుగ నవ్వలనవని బ్రతుకననె॥ఇంకా॥౩॥ యెన్నడునినుగాంతు। యీశ్రమనేనిసివివరింతు। వెన్నాళ్లకు రంగేశ్వరసనుగొని। చెన్నగమనపురిచేరెదవనియను॥యింకాయెమనెనూ॥౪॥గీ॥ వనిత తానిట్లుబలుకంగవినుతిజేసి। జననివినవమ్మశ్రీరామచంద్రమూర్తి। వేగ నరుదెంచిరావణువెసవధించి। నిన్నయోధ్యకు గొనిపోవు నెమ్మితోడ॥వ॥అని యిట్లు వేకహితవాక్యంబులధైర్యచిత్తంగా వించితినని పల్కి తాబోయివచ్చినవృత్తాంతంబు సర్వంబును వివరంబుగా నెరుంగించి సరఘువరుండాంజనేయునివిక్రమప్రతాపధైర్యంబులకచ్చెరువంది సంతసిల్లెనట్టియెడ॥౫॥అ॥ సౌభద్ర కుమారున। కనఘుండగుశుకుడు బల్కెనని సూతుండా। మునివరులకు వినిపింపగ। విని పరమానందమునను వెలసిరి చాలన్॥మాలిని॥ జలజసదృశనేత్రా చారుజీమూతగాత్రా ఖలజనపరిశోషా కౌస్తుభోద్యద్విభూషా నలినభవభవేశా నమ్రదాసార్తినాశా కలితవసథవాసా గానవిద్యావిలాసా ॥౯౨॥ ఇతి శ్రీమదుభయకావేర్యోర్మధ్య ప్రదేశ ప్రదీప్తసప్తప్రాకారమహామందిరాంతర్విరాజమాన శ్రీరంగనాధచరణసేవక వనగంటి శేషగిరిదాసప్రణీతంబగు శ్రీమద్రామకథాసంగ్రహయక్షగానవిలాసంబున సుందరకాండసర్వంబునుయేకాశ్వాసము॥

సంపూర్ణము.





శ్రీ రస్తు.

## యుద్ధకాండ

శ్రీరమణీకరలాలిత । చారుపదాంభోజయోగిజనసన్నుతకావే
రిమధ్యనికేతన। సూరివితానప్రపోషసురరిపుశోషా ॥

గీ ॥ అవధరింపుముశౌనకాద్యఖిలమునుల। నింపుతోడుతగనిసూ
తుడిట్టులనియె । వినుడుమునులారశుకుడుభూవిభునిజూచి। పరమ
కారుణ్యమలరంగబలికెనపుడు॥గీ॥ వాయునందనుడవలీలవనధిదా
టి । సీతగనివచ్చికుశలంబుచెప్పటయును । హర్షఖేదంబులాత్మ
లోనమరుచుండ। నిట్టులనిపలికెరఘువరుండిష్టమెసగ ॥

క ॥ గరుడుఁడుపవమానుండును। శరమొప్పనితండుదక్క ఘనత
రలిలం। శరనిధిదాటగగలరే।ధరనితరులువిక్రమమునతగచర్చిం
పన్ ॥ద్వి॥ అనిపల్కి శ్రీరాముడంజనిపుత్రు। గనితమ్ముడవునీవుకర
మొప్పనాకు। నీకృతమ్మునగాదెనేనుతమ్ముఁడ । శ్రీకరమతులమైదీవిం
చుటెల్ల । వలనొప్పశ్రీరఘువంశమియ్యెలను। వెలయగాచితివీవు
వినుతగుణుండ। వత్యుపకారుండవటుగాననీకు। ప్రత్యుపకారం
బుచాటించిసేయ। గరిమసామ్యంబద్దిగాననుగాన । నేరకౌగిలిం
తునేనిన్ననిదిగిచి। కరుణతోకౌగిటఁగదియించెనపుడు।మురియుచు
మారుతిమోదంబుజెంద। నంతటరఘురాముడబ్ధిదాటుటకు।నంత
రంగంబుననట్టెచింతిల్ల । కనిరవిపుత్రుండుకాకుస్థుతోడ।ననియెమ
హాధైర్యమతిశయిల్లంగ ॥ ఉ ॥ ధీరులుదగ్రవిక్రములుదీప్తమహు
తాశనకల్పులీకపుల్। మీరలొనర్పనున్నపనిమీరకొనచేఁదరుత్స
వక్రియల్ । నీరధిగట్టజేసిరజనీచరనాధుపురంబుజొచ్చి పంకేరు
హపత్రనేత్రరణకేళివధింతెమురావణాదులన్ ॥

గీ ॥ విల్లుగొనినీవునిలువనెవ్వరుడైన। కదనమొనరింపగలడెకట్టె
దురనిలచి। శ్రీరఘూత్తమమదిలోనచింతవలదు । లంకసాధింతమ

సురులబింకేమణఁగ ॥ వ ॥ అనియివ్విధంబునంబలికిన యనంతరం
బున రఘునందనుండాంజనేయుంగనుంగొని ॥ క ॥ దనుజేంద్రపుర
మును సొంపున ౹ దనుజానీకములరీవిదంతిరథాదుల్ ౹ మొనసి వెలుఁగొం
దు తెరఁగును ౹ ఘనమతివివరింపుమనిన గ్రక్కున బలికెన్ ॥

ఆనందభైరవిరాగము-అటతాళము-

ధరణిరావణపురము ౹ భేదింపనిర్జరులకు దుర్లభము ౹ గురు
తుంగమణిమయగోపురవితతులు ౹ పరిఘతోరణసాట్ల ప్రాకారములు
గల్గు ॥ కాంచనకుడ్యములు వజ్రములు శోభించు కవాటములు ౹ చం
చదతుల రత్న స్తంభమంటపపంక్తు ౹ లంచితరమ్యహర్మ్యావళు
లొప్పారు ॥ ధర ॥ ౧ ॥ వలనొప్పుహయశాలలు ౹ రథశాలలు ౹ జ్వల
తరగజశాలలు ౹ చెలువొందుపురవీధులలను నిండిన దైత్యబలములు
ద్యానములెలమిరాజిల్లుచుండు ॥ ౨ ॥ పురికినల్గడలందును ౹ రాజ
ద్వారభూములపురమధ్యను ౹ గరిమదీప్తాయుధధరులౌ రాక్షస
కోటు ౹ లరుదారకాపుందురతులరంగశ్రీశ ॥ ౩ ॥ ధర ॥

ఇట్లుబలికి ॥ గీ ॥ అప్పురంబననదియెంతనరఘునీకు ౹ వేగమనయంగ
దాములువిక్రమమున ౹ జొచ్చిసాధింపరే సర్వసురవినుతుల ౹ రామ
రఘువర్యగిరిధైర్య స్వవశ్యచర్య ॥

రేగుప్తిరాగము-ఆదితాళము-

లెండిపోదాములంకకు ౹ శ్రీరఘువీర ॥ లెండి ప్రయాణమై ప్రచం
డకోదండదివ్య ౹ పాండిత్యమునసత్యద్దండ రాక్షసులజంప ॥ లెం ॥
౧ ॥ మనమురావణునిగూల్పగా ౹ తాళదగదు ౹ జనవంద్యసుజనకల్ప
కా ౹ తనువుదాచకయుద్ధమునగూల్తుదనుజకోట్ల ౹ వనజదళాక్షరం
రంగవాసశ్రీరామచంద్ర ॥ ౨ ॥ లెండిపోదా ॥ వ ॥ అనియివ్విధంబునం
బలికినరఘువరుండు సుగ్రీవుంగనుంగొని ॥ క ॥ ఇదియొకమంచిము
హూర్తము ౹ కదనమునకుదలఁపవలయు ౹ కపికోట్లనుసొంపారవం
గనేపఱింపుము ౹ వదపడిమనముందువెనక ౹ పక్షములందున్ ॥

వ ॥ ఇట్లుబలికి ॥

మధ్యమావతిరాగము - ఆదితాళము.

దండూగొనివెడలెరఘువరుండూ॥ లంకమీదికి ॥దం॥ దండిగ
కపులుద్దండతదెబ్బదిరెండువెల్లువలనిండనఖండప్రచండదీప్తమా
ర్తాండుండోయనమండతశరకోదండధరుండై ॥ దం॥ హనుమ
ద్వాహనుడై సొంపూమీరా। వాలిపుత్రునిపైఘనుడౌ సౌమిత్రివె
లసిచేరా । వననిధిగట్టిమహోగ్రతదనుజులదునిమిధరాసుతసను
పుగదోట్కొనివినయముననురాముని జేరుదుమనివేట్కచిప్రక్కున
నెగరుచుధూకెటి ॥దం॥ ౧ ॥ గండుమీరినసుగ్రీవుండూ । పనసు
డుజాంబవంతుండునీలుండాదిగనుండూ । చండబలులుపెనుగొం
డలకై వడిసందనుండనమరులుదివిభేరి। డాండడాండధ్వనులొన
రుపబ్రహ్మాండకటాహముమెండుగనిండగ ॥దం॥ సురులుగురియిం
చిరపుడువిరులు। హర్షమొందిరికిన్నరులుగంధర్వులువిద్యాధరు
లు। గురుతుగమభ్రరశరవిసతులశ్రీకరరంగప్రభుడగురఘుపతిదు
ష్కరుడగురావణుబారిగొనునిజమనివరమునినివహముపరితోషిం
పగ ॥దండూగొనివెడలె ॥ ౨ ॥ వ॥ ఇవ్విధంబున ననంతకల్యా
ణగుణాభిరాముండగు సీతావల్లభుండుసుగ్రీవజాంబవద్గజ గవ
య గవాక్ష గంధమాదనమైందద్వివిధ సుషేణశరభకుముద నల
నీలశతవలిప్రముఖ వనచరసైన్యంబులతోడం బ్రయాణంబై చని
చని కుందకురువక జంబుజంబీర వకుళవంజుళరసాలహింతాల వ
టకుటజాశ్వత్థకపిత్థలవంగలుంగ కోవిదార కురంటక ఖర్జూర
నారికేళ శింశుపాశోకపున్నాగ చందనప్రముఖసమస్తవృక్షషం
డసమన్వితంబులగు రమ్యకాననంబులును ప్రఫుల్లపద్మోత్పలప్రపూ
ర్ణంబులగు సరోవరంబులును విమలసలిలరమణీయంబులగునదు
లునుంగలిగి ॥ గీ ॥ ఇట్లుచెలువొందుపంపాగిరీంద్రమలయ।పర్వ
తంబులువడిదాటిభవ్యమగు।మహేంద్రశైలంబుజూచిసీతేశ్వరుం
డు। కడిమిపైకెక్కెకన్నులగాంచిడిగ్గి ॥ వ॥ అంతటంగరుణాస
ముద్రుండగు రఘూద్వహుండు సముద్రతీరంబున కపిసైన్యంబుల
నుండనియమించి రంగనభంగసంఘాతసంకీర్ణంబగు సముద్రం

బుకన్నులంజూచి జానకిందలంచిశోకమోహంబులుమనంబునం పె
నుంగొనవిరహవ్యాకులితచిత్తుండై లక్ష్మణునకిట్లనియె॥

కాపిరాగము-అటతాళము-

సీతయెతంభీతిజెందెనో। యీజలధిజూచి ॥సీ॥ సీతసుగుణసమే
తదుస్సహపాతకాత్మకుడై నరావణుచేతజిక్కి- సదాతపించుచు।
యిందుబోవుచూ ॥ ౧ ॥ ఘోరమకరమత్స్యయము లెల్లనూ । చూ
డుమల్లవిగోకోరితిరుగుచునున్నవిచ్ఛనూ । ఘూరిఘోషముతోడ
వెలసియపారమహిమచేమీరెనంబుధి । హారఘూత్తమకావవేయ
ని। దీనికన్గొని ॥ ౨ ॥ కన్నులనేనెట్లుగాంతునో। శ్రీరంగపురకాం
తనెపుడుకౌగిలింతునో। వన్నెదనరగకంఠమెన్నడువారిజాసనకౌ
గిలించియు। కన్నులందుజనింపసేయును। యానందశ్రులనూ॥సీత
యెంతభీతిజెందెనో ॥ ౩ ॥ మ ॥ సమరోర్వీందశకంఠుకంఠములు।
చంచచ్చాపనిర్ముక్తబాణములంబల్విడిద్రుంచిజానకినసూనప్రీతిచే
డాసి। మోహముచెల్వొందగకౌగిలించిహితనర్మాలాపపియ్యూ
ష। సారముచేనెన్నడుతాపమార్చిమిగులంరావక్ప్రబోషింతు
నో ॥ గీ ॥ ముదితనెమ్మోముపైవెట్టి-మోముజేర్చి।చారుబింబో
ష్ఠమధురసుధారసంబు। తనివిదీరకగ్రోలంగధరణిమెన్న। టబ్బు
నోనాకుఘనభాగ్యమబ్బినట్లూ ॥ ద్వి ॥ అనియిట్లుశ్రీరాముడమర
చింతింప। కనియూరడించెచక్క-గతమ్ముడంత । నంతటరావణుం
డాలంకలోన। పంతమెలపఱంగపవనాత్మజుండు। గావించిచనిసవి
క్రమకార్యములను। భావించిలజ్జించిపడపడిమంత్రి । వరులకన్గొని
యొక్క-వానరుండిచటి। కరుదెంచివైదేహిసలరుచుగాంచి । ప్ర
మదావనంబెల్లభంజించిదైత్య। సముదయంబులధరాస్థలిగూలజే
సి। గరిమెతోనీలంకగాల్చితానేగె। నింకేమిసేయుదమినకులాధిపు
ని। శంకలేకజయించుసదుపాయమొకటి। తగజెప్పుడనినదశకం
ఠుజూచి। మిగులనుగ్రాత్మలౌమేటిమగండ్లు। ధగద్ధగద్ధగితాయుధ
ములతోనింగి। కెగసిపల్కిరిఘాతుసేంద్రునితోడ ॥

సావేరిరాగము- అటతాళము.

ఎక్కడినరులువానరులు|వారలెబ్భంగి గెల్వగగలరు| నిక్కముగ సర్వదిక్పాలావళులనీవక్కజముగ గెల్చితాహావశూరుడ| వెక్కడి నరులు॥ నిను గెల్వనెవరితరంబు| నీప్రత్తిని గెల్వ నెవరివశంబు| ఘన కుంభకర్ణాతికాయకుంభని కుంభదనుజవీరుల డాయధాతకుశ క్యమే ॥ ఎ ॥ రాముని బట్టిచంపెదము| రణభీముసౌమిత్రిగూల్చె దము| యేమర కేగిసుగ్రీవాదివనచరస్తోమమడంతుము నామరహి తముగ ॥నెక్కడి॥ వరరంగపురనాథుడైన| రఘువరులభక్షించిశీ ఘ్రమున | తరుచరావళిరక్తధారలాస్వాదించిధరనుతిజెందుదుమ రుముగబంపుము ॥ ఎక్కడినరులు ॥ వ ॥ఇవ్విధంబునంబ్రతాపవా క్యంబులు బలుకుచున్నని వారించివిభీషణుండిట్లనియె ॥

రేగుప్తిరాగము-అటతాళము.

దనుజులారవినుడీ| మీరింకెములనువ్వగనికనిల్పుడీ | మనపంతము లరుచయ్యెసభిలిబొందరు | ఘనులయినరాఘలక్ష్మణసూర్యపుత్రు లు॥ వినరాయిముందుగను| మనరాజువంచనజేసిజనకజను| గొని తెచ్చెనరుదుగకసలిదాసికెకాదా | హనుమంతుడవలీలమనలంక గాల్చెట ॥ ౨ ॥ అసమానవిక్రముడు | రంగపురీశుడాహవభీకరు డు| వెసఖరదూషణాద్యసురవీరులరౌద్ర; మెసగద్రుంచెనుధరన సహాయశూరుడై ॥ ౩ ॥ దను ॥ ద్వి ॥ అనిపలికెదశకంఠునమరంగ జూచి| వినుమురాఘవుడతివీర్యవంతుండు | ధరణిదివ్యాస్త్రవిద్యా పండితుండు| సురమునివినుతుండుసుగుణాకరుండు | ఘనుడుధర్మ జ్ఞుండుకల్యాణతేజు| డనుపమచారిత్రుడరిభీకరుండు|వలువనివైరం బువాంఛింపనేల| జలజాక్షిసీతసచ్చప్రభక్తితోడ | గొనిచనికమ లాప్తకులునకొసంగి| నినునీకులంబెల్ల నెరిగాచుకొనుము ॥

గీ ॥ అనినదిగ్గనలేచిదశాననుండు| నిజనివాసంబునకుబోయెనె మ్మితోడ | మరుదినంబుననువివేకమహితుడైన | యవ్విభీషణుడ చ్చటికరిగిబలికె ॥

బిలాహరిరాగము-ఆదితాళము.

జనకపుత్రినవిడంపుమి| రామనిద్వేషమునన్నుకీడనిదలంపుమి|జ

నకజనిచటికిగొనకొని తెచ్చిన। దినమదిమొదలుగ గనుపడుచున్నవి। కనలినదగనిమహోమశ్శకునము। లినకులతిలకునకిష్టంబలరగ ॥ జన కాపు॥ మనవిచేకొని బ్రోవుమి। వైదేహీలోకమునకు జననిగాదల చుము। ఘనవిలయాగ్నిస్ఫురితములనదగి। పెనుపొందిన రఘువరచా పచ్యుత। సునిశితశరతతులను వుగమసపుర్త। ములనల్గడలను మొనయ కమునను పె ॥జన ॥ ౨ ॥ వలదువలదన్న వైరము మంత్రులు నీకు। క లరూ పెరుగింప రనయము। సలలితరంగస్థలనిలయమునను । వెల యుమహోత్సుండు రాఘవుడిలనలిగి కరాంబుజమున సశరకార్ముక । ములుగొనమున్ జగముల నెదురున్నదె ॥ జనకపుత్రి ॥ ౩ ॥

వ ॥ అని యివ్విధంబున బల్కిన నిచ్చ మెచ్చక రావణుం డిట్లని యె ॥ క ॥ సురనాథాదులలో । రఘువరుడెంతటివాడు బొగడవ లదిక నెదుటన్। సురగణముల గొని రాఘవు । డరుదెంచిన గెలుతు సీతవతని కొసంగన్ ॥ వ ॥ అనియివ్విధంబున బల్కి మహావైభ వంబున సభాస్థలంబున కరిగి కొలువుకూటంబున పసిండిగద్దియం గూర్చుండి యాదినంబు నిద్ర లేచివచ్చి యున్నకుంభకర్ణునకు సకలవృత్తాంతం బెరుంగించిన యక్కుంభకర్ణుండు సంతసింపక సన్నంగనుంగొని నీవు కార్యాకార్యం బెరుంగక నీతిదప్పి పాపచి త్తంబున దుష్కార్యంబు గావించి రాము ద్వేషంబు సంపాదించుకొం టివి మహాత్మునివలన నీకపాయంబు సంభవించునని పలికి యప్పు లుకులింకేల మదీయభుజావీర్యంబున రామలక్ష్మణసుగ్రీవాదుల నవలీలజంపి వైచెదనిక్కం బని నమహాపార్శ్వుండు రావణుంగనుం గొని ॥ గీ ॥ జున్నతేయసమకూర్చుకున్నవాడు। క్రోలకున్న ట్లుసీతను గూడకున్న। వాడవని పల్కుమతిలేనివని తగదియ। తగదు విధిశాపమది నాకు ధరణిమెండు ॥ గీ ॥ తరుచరవ్రాతముల ధరాస్థ లినిగూల్చి। దాశరథుల మహోద్దండదర్పమలగ। చండతరబాణ ములననిసంహరించి। సీతనేలుదు లోకవిఖ్యాతిదనర ॥ సీ ॥ అనిప ల్కిని నిరోషమున విభీషణుడన్న గని రజ్జులాడంగ జను నెరిపుల। మన పంతములకు భీతిని జెంది కేరఘుప్రవరుని దివ్యాస్త్రనివహమహిమా। గని యుధీశని మెన్న విని బ్రహ్మస్తుదు శత్రువితతుల్ల బొగడంగ విహిత

ముగునే। కడిమిమై రామలక్ష్మణుల ద్రుంతునటన్న హనుమంతుడవ
లీలవనము చెరిచి। పురము గాల్పంగని పెంపుబోలికసిన। నింద్రజిత్తుం
డువిని కోపమెసగ కపిన్న। తండ్రి గనీసీపుప్పిరికి నైతగనిపలుక। లాడ
దగదిట్లుపగ వారినమరబోగడి ॥ క ॥ అనిసవిభీషణుడాతని। గని
కార్యాకార్యామెరుగగా జాలవు। ధ త్రునిరీతిబుట్టి పిలసిన। ఘన
శత్రుడవసురపతికికరమొప్పంగన్ ॥ వ ॥ అనిపల్క రావణుంగ
నుంగొని ॥ ద్వి ॥ వలదయ్య రావణ వలదయ్య మనకు। బలవద్విరో
ధంబు బాగుగాదిలను। పరసతి దెచ్చుట పాపంబటంచు। ధరణిపెద్ద
లుసీకుతగజెప్ప రేమొ। అతులవిక్రముడైనయా రామచంద్రు। ప
తిసిన్ను రణకేళి జావంగనేల। కపికోట్లుమనప్రతిగడియకమున్నె। త
పనకులేంద్రుండు దారుణబాణ। వితమెలంకకునైనడకమున్నె।
నుతబలుండగులక్ష్మణునకు ప్రగోష। ముదయమొందకమున్నె యు
ద్వృత్తి కైను। సదమలమతిరామచంద్రునకేన్ము। కాకున్న రఘువ
రు కార్ముకముక్త। భీకరశరవిసిఖిణన్నకంపింప। పయ్యాదవనియు
న్నానాగ్రహామలర। చయ్యనయావిభీషణునట్టె చూచి। వినరోరి
దుష్టాత్మనుముదాయాడు। లసలతుల్యముగోత్రులాడుచుచాల। చే
టుగోరుదురాత్మ సిద్ధమున్నాట। మాటలాడకు మింకమదిషియూ
హింప। కులపాంసనుండవకోకేదీరంగ। చెలగినిన్నుదహింప
జేసినమేలు। మరలశ్రేణిసనిన్నుసహాసిలేకుండ। నరుదారగావిం
తునన్న గ్రక్కునను। తలకకదివికేనుసతితోడనెగసి। సలువురుమం
త్రులునయమొప్పగొల్వ। తనయగ్రజుండైనదశకంఠుజూచి। ఘన
బుద్ధితోడచక్కగనిట్టులనియె ॥

ముఖారిరాగము- ఆదితాళము.

చల్లగావర్ధిల్లుచుండుము। దుశ్శీలనీసం। సగణచాలునిదుగో
దండము॥ చల్లగానుండుము రఘువల్లభు సేవించబోదు। నెల్లమం
త్రివరులతోడనిష్టవాక్యములాడుచు ॥ ౧ ॥ రోగికిభక్ష్యభోజ్యము
లను। మదాంతమైన। రోగముహెచ్చినక్రియను। వేగమెవైదే
హినిచ్చివెసజీవింపుమనినమాట। బాగుగనీచెవిచూరదాయెపాప
హృదయనేనిండుండ ॥ ౨ ॥ ఋణముదీరెనీకునాకును। వంచించి

రాఘవుని దేవి దెచ్చుట చేతను। ఘనతర శ్రీరంగనాథుడనమించుకో
పల్యాసుతుని।సునిశితచండకోదండములస్ఫక్కిచిత్తమున దెలసేవు॥
గీ ॥ అవనినీకంటెనతులశస్త్రాస్త్రవిదులు।ఘనభుజాబలమదర
ముల్ కట్టకడన। కాలవశతను జెందినకధ। పురాణవితతుల నేరుంగ
వెవిత్రవిగనేలా ॥ వ ॥ ఇట్లు తెంపునంబలికి వీట్కొనిజగన్మోహ
నకల్యాణలావణ్యుండగు రాఘవేంద్రునిముఖారవింద సందర్శ
నంబు సేయంగోర గగనమార్గంబునంజనిచని వానరసేనాసము
ద్రంబుజూచుచుం గదియవచ్చునెడ సుగ్రీవుండుకపులకెరుంగించి
న యక్కపిగణంబులు తరుపాషాణంబులుగొని యురువడింబో
వుసమయంబున నెలుంగెత్తివిభీషణుండిట్లనియె॥

భైరవిరాగము-అటతాళము-

సదయులగుచు బ్రోవరయ్య స్వామివారికి । పదపడిలంకేశ్వరుని
భ్రాతనువిభీషణుడ । సదమలమతివచ్చితి। స్వామినీశరణుగోరి ॥
జనకపుత్రికనురామ। చంద్రునకపీరంపుమన్న । దనుజనాధుడవ
మానింప। తడయకేనిందువచ్చితి ॥ ౨ ॥ శ్రీకరరంగపురీశ। సేవ
కకల్పకవీని। చేకొని బ్రోవుమనుచు చిత్తమువీడుగాడని ॥ సదయుల
గుచు ॥ ౩ ॥ క ॥ అనియివ్విధమునబలుకగ। వినిసుగ్రీవుండురా
మవిభునకు ప్రీతిం। వినుపింపుమరలబలికెను । వినయమెలపఁగ
రామవిమతవిరామ ॥ శా ॥ యీతండెన్నగశత్రుసోదరుడుసుమ్మీ
రీతి ప్రచ్ఛన్నుడై । ఖ్యాతిస్వంచన సేయవచ్చెనితనింగైకొన్నమే
ల్గాదు। నిర్భీతిక్ వచ్చినవీనిద్రుంపవలయుం పేరుండనక్తంచరవ్రా
తంబుల్। మదితల్లడిల్లగమహారాజేంద్ర వంశోత్తమా॥వ॥అంత॥
గీ ॥ అంగదాదులు శ్రీరామునవరగాంచి। చెలగిసుగ్రీవుకైవ
డి జెప్పుటయును।రామచంద్రుని నెమ్మోము ప్రేమగాంచి । బలికె
హనుమంతుడతిదయాభావమలర ॥

మధ్యమావతి-రాగము- ఆదితాళము-

కలుషచిత్తుడుగాడుకరుణింపవయ్యా । నలినాప్తకుల జమన్నన
బ్రోవవయ్యా ॥ వలనొప్పనంగదాదులవాక్య సరణి। తలపనిక్క
ముగాదునిలుపకుమదిని ॥ ౧ ॥ తనయన్ననడతచి త్తములోసరోసి

నినుఁగొల్వనిటకువచ్చినవాఁడు-డాసి ॥ ౨ ॥అతిసద్గుణములీసువ్రతు
నీకుఁగలవు। యితనందువెదుకదురితములుకరువు ॥ ౩ ॥ ధరనీకుదె
లియనర్థములేదధీశా। వరరంగపురవాసపరవర్గనాశ ॥కలుష
చిత్తుఁడుగాఁడు ॥ ౪ ॥ క ॥ మునుమీరువాలిదునిమియు। ఘనమతిసు
గ్రీవునకునుకపిరాజ్యమొసంగినజెరిగి । రాజ్యాగాంక్షను। జనుదే
రగఁబోలునితఁడుసదమలతేజ ॥ వ ॥ అనినరఘువరుండిట్లనియె॥

గీ ॥ పవననందననీవునాభావమమరు। తెరఁగునవచించితివిగాన
పరమహర్ష। కలితమైయొప్పచిత్తంబుగరిమఁసతని। కరుణరప్పిం
తురక్షింతుకౌఁగిలింతు ॥ గీ ॥ దోషశూన్యుఁడై నదోషాన్వితుండై
న। శరణుఁబొందువానికరుణఁబ్రోతు। హితుఁడననుచునాత్మనతిదో
షముంచిన। చెడునతండుకీడుసేయలేఁడు ॥ వ ॥ ఇట్లుబలికినసుగ్రీ
వుండు రఘుపుంగవుఁగనుంగొని ॥ క ॥ పగవానితమ్ముఁడితఁడు। ప
గతుండగుగాకవిహితనాప్తుండగునా। మిగులదుఃఖింపఁబంపక।త
గునేకరుణింపఘోరదైత్యవిదూర ॥ వ ॥ ఇవ్విధంబునసుగ్రీవుం
డాడినవచనంబులువిని ప్రపన్నసంరక్షణవ్రతంబుతోఁటి సౌమ్యుం
డెద్దియులేఁడనిపల్కఁదలఁచిట్లనియె ॥

శంకరాభరణము-ఆదితాళము-

చనవోయిగర్వమవోయి॥తనకరముననిన్నుగాచితినని చెప్ప॥చన॥
వనమూనను। దనరుచును। మునుకపోతముశత్రుఁడనువొందశరణ
న్న। తనమేనిమాంసమిచ్చినకథగలదిల ॥ చనవో ॥ వినదగునువన
రుగను। వినయునియాతురనివిడనాడదగదని। మొనసికండదుబల్కి
నవచనముగద్ద ॥ చనవో ॥ ఘనుఁడితఁడుగుణయుతుడు। జనసుతశ్రీ
రంగస్థలభర్తనగునాపై। మనసీతనికీగలదనుమానమేటికి ॥ చన
వోయి ॥

శంకరాభరణము-అటతాళము-

అన్నదన్నదేనుబ్రోచెదనని। యన్నదన్నదేను ॥ అన్నదన్నదేశ
రణన్నవారిబ్రోతునన్నవాక్యముదప్పనెన్నటికిలలోన ॥ యన్న ॥
కావుకావుమనుచు। యొకపర్యాయమైన। నీవాడననియనుచు। భావింప
నెటువంటిపాతకాత్ముఁడన్న। బ్రోవగోరుదునుగ్రీవసత్యముస

త్త్యయన్నదన్న దేను ॥ ౧ ॥ కరుణించు శరణన్నను। రావణుడైన గాని తప్పుకొల్లను। కరమొప్ప నంగుళ్యగ్రమున ద్రుంచెద మప్ప। వరిషండికోట్ల శ్రీకరరంగనిలయుడ ॥ అన్నదన్న దేను ॥ ౨ ॥

ఉ ॥ అనవినిభానుసూనుడు రయంబున బోయి దశాస్యసోదరుం। బూనసచివాన్వితంబుగను గ్రక్కున దోట్కొని తేరసంతటం। వినయ మెలర్ప భక్తి సరవిందదళాక్షు రఘుప్రవీరునిం। గని ప్రణమిల్లి బల్కె రిపుఖండన దీనుజ నన్ను గావవే ॥ వ ॥ ఇట్లు బల్కి శరణాగత రక్షాపరుండు త్రైలోక్యసుందరుండును గు రఘూద్వహుని దివ్యమంగళస్వరూపంబు మాటిమాటికి కన్నులార సేవింపుచు పరమానందంబున నిట్లనిట్లనియె ॥

మారువరాగము-అటతాళము-

ఘంటచక్కని వాడవయ్య। రాఘవేంద్ర నిన్నసకన్నులివిజాల వయ్య॥ కన్నులార గంటినయ్య। ఆపన్నరక్షక నన్ను పాలింపవయ్య॥ ౧ ॥ శరణాగత త్రాణనిపుణ। నిన్ను శరణంటి బ్రోవుము శత్రుసంహరణ ॥ ౨ ॥ యె ॥ ధరణి రావణుసోదరుడను। శ్రీకరరూప నే విభీషణుడ దాసుడను ॥ ౩ ॥ రమణీయ్య రంగపురీశ। కావుము నన్ను సీతేశ కలుషవినాశ ॥ యెం ॥ ౪ ॥ వ ॥ ఇట్లు పరిమితభక్తిరసంబు వెలయం బొగడిన నతనిం గరుణించి సకలభూతశరణ్యుండగు రఘువరుండభయప్రదానంబు గావించి లంకాపురంబు నంగల రాక్షసయోధముఖ్యుల పరాక్రమవిశేషంబు లెట్టివని యడిగిన నవ్విభీషణుండు రావణకుంభకర్ణప్రహస్తేంద్రజిత్ప్రముఖ రాక్షసవీరవర్యుల బాహుబలవృత్తాంతంబు క్రమంబున నెరుంగించిన రామచంద్రుండవ్విభీషణున కిట్లనియె ॥ సీ ॥ కడిమి రావణకుంభకర్ణాదివీరుల నరగునమద్ఘోరసాయకముల। దునుమాడియాలంకకనువుగా నిన్నభిషేకంబు గావింతు శ్రీదసర్వ। నని బల్క సంతోషమతిశయిలి నచిత్తమున కేలు మోడ్చి యోఘనగుణాఢ్య। దేవ నీ వెనువెంట దేజరిల్లుచు ఘోరయామినీచరుల నేననివధింతు। పద్మదళనేత్ర నీపాదభక్తునిరీతి। గావుమని బల్క ముదమంది కౌగిలించి। శ్రీకరంబైన లంకాభిషేకమిపుడె। సత్యముగ నీకు జేయింతు జగతి మెరసి ॥

ద్వి ॥ అనపల్కి రాఘవుండనుజునిజూచి । మొనసియంబుధిజల మ్ములుగొనివచ్చి । సరగునసవ్విభీషణుకభిషేక । మరుదారగావింపుమాలంకకనగ । వినియబ్ధిజలములువేట్కతోదెచ్చి । వనచరతతులలోవలనొప్పసతని । కతివైభవంబుననభిషేకమచట । నతులదయాపూర్ణుడగులక్ష్మణుండు । చేసినవానరుల్ చెలగియాచుచును । వాసిగాజయజయధ్వానముల్ దనర । శ్రీరాఘవునినుతించిరిసొంపుతోడ । ధారుణినిట్టిభూధవులులేరనుచు । సంతతసుగ్రీవుడాంజనేయుండు । సంతసంబునవిభీషణుమోముజూచి । జలధిదాటుటకిద్దిసమపాయమన్న । జలజాస్త్రపంశుండుసదమలనిష్ఠ । దొలగకనీసముద్రునిసముపాస్తి । వలనొప్పజేసినవాంఛలీడేరు । ననిపల్కవిని వారలారామునకును । చనివివరింపంగసమ్మోదుడగుచు । తరుచుగాదర్భలుధరబరపించి । తరణికులేశుండుతానసియించె ॥

వ ॥ అంత ॥ గీ ॥ గరిమశార్దూలుడనెడిరాక్షసుడొకండు । దశరథాత్మజులీరీతిదండుతోడ । నుదధికవ్వలనివసించియున్న వారలన్నియునుజెప్పెనారావణాసురునకు ॥ గీ ॥ ఇట్లుచెప్పిన వినిరాక్షసేశ్వరుండు । శుకుసగనుగొనినీవేగిసూర్యసుతుని । గాంచిపలుకుమునేనన్నకరణిగాగ । పరగనించుకమదిలోన భయము మాని ॥

సౌరాష్ట్రరాగము-అటతాళము.

శ్రీరామచంద్రునిస్నేహముపదలి । శీఘ్రమెపొమ్మికిష్కింధకు కదలి ॥ ధీరతమించుతారేయసమీరకుమారజాంబవదాది మహీతాగచరులతో ॥ శ్రీ ॥ మనముతోబుట్టువులనియెంచుకొమ్మా । మనకువైరముగల్లదనినమ్ముకొమ్మా । అనఘుడవీవుమహారాజకులజుడవనుపమశీలుడవత్యంతసఖుడవు ॥ శ్రీ ॥ వరరంగనాథుమైత్రిని మానకున్నా । బొరిగొందునిన్నుచెచ్చెరవీరులెన్నా । సురబృందములనెల్లసోరిదిగెల్చితినినాకరయగనరవానరులెంతవారలు ॥ శ్రీ ॥

చ ॥ అనవినిపక్షిరూపముననంబరవీధిమహాజవంబుచే । జనికపిసైన్యసాగరముచయ్యనగాంచిభయంబుదక్కితా । నినసుతుజూచిరాక్షసపతివాక్యములెల్లజెప్పినం । వనచరులంతటంగది

సీతారక్షబట్టుకతన్నిగృద్ధగను ॥ గీ ॥ వాడుకదున్నొచ్చిరఘుకులాబ్ధిచంద్ర। నన్నుగావుము వేగననాథనాథ। యన్నదయతోడఁబిలిపింపనార్తిఁబాసిదైత్యనాథునికడకేగితగవచించె॥

దేశాక్షిరాగము - జంపెతాళము -

శయనించెనంతటనుశరధితీరమున। భయరహితుఁడగురఘుప్రభుఁడుదర్భలమీఁద ॥ లలనజానకికపోలములపాలింట్లనై వెలసిమునులకునభయవితరణవహించి। వలనొప్పగోకోట్లనిలపిప్రొక్కుని చ్చులలితహస్తాబ్జంబుతలక్రిందఁబెట్టుకొని ॥శయ॥ ౧ ॥ గరిమరావణకుంభకర్ణాదివీరులనుశరధిదాటివధింపనరుదుగాఁగదలంచి। వరరంగపురనాథుఁడగురఘుప్రవరుండు నెరిసముద్రునిఁగోరిసుస్థిరగరిష్ఠుఁడై ॥ శయనించెనంతటనుశరధితీరమున ॥ ౨॥

వ ॥ ఇట్లుకౌసల్యానందనుండు మూఁడుదినంబులబ్ధితీరంబునందర్భశయనంబు గావించియున్నయెడ సముద్రుండు ప్రసన్నుండు గాకుండిన నత్యంతరౌద్రరసోల్లసితవిగ్రహుండై ప్రళయాగ్నియుంబోలె వెలుంగుచులక్ష్మణుంగనుంగొని॥

నాటరాగము - అటతాళము -

ధనువుదెమ్ము వేగ। సౌమిత్రి ॥ ధను॥ ధనువిమ్ముమద్ఘోరశరచండకాండములనుశీఘ్రమునసముద్రునిత్రుళ్లడంచెద ॥ ధను ॥ శరములేతుచాల। ఝషాదులసంహరింతులీల। శరవహ్నిజలధిచచ్చుటచటుసుడికించి। కెరలిపొంగింతుసింకింతుబంధింతున ॥ధను ॥ ౧ ॥ మదమణంపనేతుఁ। పదములతోడఁగదలిపోనొనతుఁ। మదయుక్తుఁడగు వ్యక్తింపదనుసిపారుగు వాడడయతవిని గర్వాంధుక్రొవ్వణగింతు ॥ ౨ ॥ సతినిబాసిశోక। మునవేడప్రసన్నుడౌచురాక। జతలేకనడెయుద్ధగతిమింటికెగరుచునతరతుకుసిరంగతిపనన్నెగుంగడు ॥ ౩ ॥ ధనువుదెమ్ము ॥ వ ॥ ఇట్లుబలికి మహోగ్రుండై తేజరిల్లుచున్నం గనుంగొని సుమిత్రాపుత్రుండు కేలు మొగిడ్చివినయవిధేయుండై మహాప్రభో కోపంబుసైరింపవలయుననిసముచితవాక్యంబులాడుచుండనంగీకారంబు సేయక ॥

గీ ॥ విల్లుగొనిసింధుపతిమీదవిశిఖవితతు। లమరగురిపించిబ్రం

హ్నోత్రమప్పుడేయ। మదిదలంచినబ్రంహ్మాండమదిరె। సలకభూతవితతులుభీతిల్లెభూపవర్యా ॥ వ ॥ అంత ॥ ద్వి ॥ ఆరాముబాణాగ్నులబ్ధిలోజొచ్చి। ఘోరంబుగానీటగుబుగుభుల్మనుచు। నుడికింపుచునుపొగలుప్పరంబెగయ। కడిమిమంటలుగ్రమ్మగాజేయనపుడు। మకరకచ్ఛపములమదములణంగె। సకలాంబుచరములుజచ్చిసట్లయ్యె। కమనీయ్యాశుక్తిశంఖద్యుతులణగె। తిమితిమింగిలములుదీనత్వమొందె। నంతటభీతిచేనయ్యబ్ధిలోన। వింతగావెలువడివెషరక్తమాల్య। చందనాంబరములుచాలశోభిల్ల। పొందుగానదులెల్లపొలతులైకొలువ। నతులవిఖ్యాతనయ్యబ్ధిరాజు। పతియైనశ్రీరామభద్రునిజేరి। నతజనమందారనగవలధీర। సతతదయాపూర్ణశరణుసన్నొలు। మనుచుసాగిలిమ్రొక్కియారాఘవేంద్రు। వినుతిసేయగజొచ్చెవిమలాత్ముడగుచు ॥

శంకరాభరణరాగము-అటతాళము-

శ్రీకరరఘుకులసింధుసుధాకరపాకశాసననుతరామా ॥ చేకొనిబ్రోవుముభీకరదనుజానీకవిఖండనరామా॥ మునిగణములనెల్లపఱపుజెందగజేయుమోహనమూర్తివిచాల॥జనవంద్యపురుషభూషణుడవయ్యయుడవు । చక్కగానేలుమీవేళ ॥ ౨ ॥ నాతప్పులెల్లక్షమింపుసత్కరుణననాథనాథజానకీశా । వాతాత్మజాధిపశ్రీరంగపురవాసఖ్యాతిగగావుమధీశ ॥ శ్రీకర ॥ ౩ ॥

వ ॥ ఇట్లువొగడిన సింధువల్లభునకురఘువల్లభుండిట్లనియె॥

గీ ॥ యొక్కటెట్టినబాణంబునేమిసేతు । ననితనవైరులున్నతావమరజెప్పి। జంపుమనిపల్కనాదివ్యశరమువలన । వారిజకాడెశ్రీరఘువర్యుడపుడు ॥ గీ ॥ నలుడుసేతుబంధనముసేయసదుపాయ। మప్పుడుదెలిపిరాఘవాజ్ఞవలన। నబ్ధిపతియదృశ్యుడగుచునాత్మస్థాన। మునకుజనియెవేగమనుజనాథ॥వ॥అంత॥

నీలాంబరిరాగము-ఆదితాళము-

శరధిబంధించిరెల్లకపులు। రాఘవాజ్ఞచే। శరధి॥ కరమరుదుగశ్రీరఘువరపదసరసిజయుగళస్మరణయొనర్చుచు.॥ శ ॥ గరిమదోర్బలమువలననమించి। కొండలపెకలించి। సొరిదిశిరములనమ

రించి। కరువలిజవమున బిరబిరనురుకుచు నరుదెంచుచు క్రమ్మరగా
నిపోవుచు ॥శ॥ ౧ ॥ సరళామ్ర నింబ కర్ణికార। బిల్వ వకుళ। సు
రుచిరాశోక ఘన మందార। కురువక ముఖ బహుతరువులు ఫెళఫెళ
విరుచుచు గొని క్రచ్చర నాచుచు జని ॥శర॥ ౨ ॥ చెలగి పంతము
లాడుకొనుచు। పెపెగ దొడ్డశిలలు నలునికి వెసనొసగుచు। చలము స
రంగస్థల నిలయుని సదా। మల దయ తాళ్లను గొలుచుచు సూటిగ ॥ శ
రధీ బంధించి రెల్ల కపులు ॥ ౩ ॥ వ ॥ ఇట్లు దశయోజన విస్తీర్ణంబు
ను శతయోజనాయతంబుగా రామచంద్రుండు నలుని వలన సము
ద్ర బంధనంబు గావింపం జేసి ప్రయాణోన్ముఖుండయ్యె విభీషణుం
డు గదాపాణియై సచివ సమేతంబుగా సంగరికై నందోలుతం జని
యవ్వలితీరంబు చేరి యుండె నంత సమస్త వానర సైన్యంబులతోడ
సుగ్రీవుండును యంగదారూఢుండగుచు సుమిత్రాపుత్రుండును
దోడనడువ సీతావల్లభుండు హనుమద్వాహనుండై సకల సురము
ని నివహంబులు జయజయ ధ్వానంబులొసగ సేతుమార్గంబు
న సముద్రంబు గడచి సువేలాచలంబు ప్రవేశించె నట్టియెడ॥

క ॥ శ్రీరామచంద్రుడీక్రియ। వారిధి బంధించి తరలి వచ్చి సువే
లం। చేరుట విని దశకంఠుండౌ రాడగ్గెరటంచు హాశ్చర్యము సల్ప॥

గీ ॥ చెలగి శుక సారణుల గాంచి శీఘ్రముగను। రాఘవుల విక్ర
మంబు మార్తాండ సుతుని। శౌర్యము మహిమంబు కపికోట్ల సమర్థనైపు
ణాది మర్మంబులరసి మీరరుగుడెండి ॥ ద్వి ॥ అనవిని వారు చయ్యన లే
చిపోయి। వనచర కోట్లలో వరుసగ్రుమ్మరగ। గని విభీషణుడంతక
పితతిపలస। సనువుగా గట్టించియా రాముకడకు। గొనిచని తెలుపం
గా గబ్బునడనుజు। ఇనకులాధీశ మమ్మేలు మీవేళ। శరణు బొందితిమి
దశాస్యదూతలము। కరుణింపమన్న సత్కరుణతో వారి। పొమ్మని
బలుకంగ పోయి రావణుని। నెమ్మది పొడగాంచి నిఖిలంబు జెప్ప। త
డయక నాక్కసౌధంబెక్కి కపుల। పొడగాంచి సారణు పోలుపొంద
జూచి। వీరిలో వీరుల వివరింపుమన్న। సారణుడంత వేసారక బలికె॥

శంకరాభరణ రాగము-అట తాళము-

చూడవయ్య। రాక్షసవర్య ॥ చూడవయ్యా మనవిదు ముట్టడి వేయ

కూడియున్నకపికోట్లువగఁంబులు ॥చూడవయ్య॥ చాలగతీక్ష్ణదృ
ష్టాలముమనమీఁద, బ్రాలింపుచున్నట్టినాఁడునీలుఁడులెస్స॥చూ॥౧॥
మెండైనమకరటతండములందు। ప్రచండుడై వాలిపుత్రుండుండి
యున్నాఁడు ॥౨॥ జలధిబంధనము ప్రాంచభక్తిగావించి। వెలసి
కాలాగ్నిగవెలుగునలుండడుగో ॥౩॥ విమతులమోములువెలవె
లనొందించు। కుముదుఁడల్లడుగోవిక్రమమెుప్పనున్నాఁడు ॥౪॥
పరగుసమనలంకచాయకన్గనబెట్టి। శరభుఁడుతోఁకచెచ్చరద్రిప్పుచు
న్నాఁడు ॥౫॥ ఘనతుంగపతిప్రేరేపణనుజాంబవదాది। వనచర
కోట్లునిన్నెకిబీరెడరన్న॥ చూడవయ్య ॥౬॥ వ॥ అనియివ్విధం
బునంబలికినయనంతరంబ శుకుండనువాఁడు రావణుంగనుంగొని
మైందద్వివిధులంజూపివారలమహోగ్రవిక్రమంబెఱిగించి॥

రేగుప్తి రాగము-ఆదితాళము.

అలనాఁడుమనలంకనపట్టెలగాల్చినచపలపాదియుఁడుగో రాక్షసనా
థ। వలనొప్ప రాక్షసులనెల్లనణఁగఁదలచి యున్నాఁడుచిత్తము
లోననిజముగ। నలనాఁడె ॥౧॥ ఫలమునితరుణాకుఁ వశినాఁడుక
బళింపచెలరేగిగముకించెనలవాఁడు। యీజలధిలీలనుదాటెనలవా
ఁడు। జలజాక్షిసీతనచ్చుచభక్తిగనివసమెలమినిర్మాలించెనిలవీరవిజ
యుఁడై ॥౨॥ కపిముప్ప శ్రీరంగపురభర్తయగురఘువరునినమ్మి
నదాసుఁడలవాఁడు। ఘోరాకృతరవిక్రమోదగ్రుఁడలవాఁడు। గురుతు
గనెట్టిభీకరవీరవరులైననరిగానీరఘుకుల స్వామిభటునితోఁడ ॥ న
లనాఁడు ॥౩॥

కందార్థములు.

హరకోదండవిఖండను। డరిగణవనవాయుమిత్రుఁ డాశ్రితపో
షుం। డరుదారనడుగో యతనికి। నరిబోలరుబ్రహ్మరుద్రశక్రా
ద్యమరులు॥ నుతియింపజా। లరుసర్వమునులు॥। శరకార్ముకములు
భీకరగతిచేగొన్న। ధరణినస్వియుఁడగ్గరుటకువెరతురు ॥శక్రాద్య
మరులు ॥౧॥ అడుగో మేఘశ్యాములు। డడుగో పూర్ణేందువద
నుఁడనఘుసుచరిత్రుం। డడుగో మునిగణరక్షకు। డడుగో జగన్మోహ
నయ్యున్నాడుగురఘువరుడునమ్మినవారికడతేచుఁ ఘనుఁడు। తడయక

వాలినుద్ధతిగూల్చికపిరాజ్య। మొడుగకసుగ్రీవుకొసగిన॥ శ్రీరఘు
వరుడు ॥ ౨ ॥ ఖరదూషణాదిబహు। భీకరరాక్షససమితి ద్రుం
చికరుణాకరుడై। వరమునివితతుల బ్రోచిన। పరవీరవిదారుడఖిల
పావనుడతడు। దుర్భరరథసుధరవరుడతడు। స్మరశతకోటిసుం
దరుడాతరరక్షకు। డరుదుగసత్యధర్మాదిసువ్రతుడెన్న॥ పావను
డతడు ॥ ౩ ॥ రామునిదక్షిణభుజమన। గామహిప్రఖ్యాతి జెంది
కార్ముకశరవిద్యామహిమంబునదనుజ। స్తోమములవధింపగోరు
సుభగుడతండు। లక్ష్మణుడనగామించుచుండు। ఆమహాత్ముకుడ
నవరతమురఘు। రామునికైంకర్యమేమారడించక। సుగుడతం
డు ॥ ౪ ॥ వ ॥ ఇవ్విధంబునంబలికి కనుపరచి రాక్షసేంద్రా మన
విభీషణుండు రామచంద్రునియపారకృపామహిమంజేసి లంకా
రాజ్యాభిషిక్తుండై సుమ్మహాత్మునిచరణారవిందంబులాశ్రయించి
మనయెడల క్రౌర్యంబువాటింపుచుయున్నవాడని పలికెయిట్లనియె॥

కందార్థము-

దనుజేంద్ర వినుము పెంపున। వనచరరాజ్యంబు రామవసుధీశుద
యుం। మునికొన్నిబడసినసుగ్రీ। వునిజూడుముల లంకబెరుకనూహిం
చుమదిని। యేవీరులీలెనిబోలరవని। వనజాప్తసుతునితోడసువహ్ని
సాక్షిగ। ఘనసఖ్యమొనరించికడతేరెనిలలోన। నూహించుమదిని॥

ద్వి ॥ అనిపల్కి రాముతోసనువుగాసంధి। యొనరింపమేలన్న నుగ్రు
డై మండి। మునుకొనిశార్దూలముఖ్యచారులను। పనిబడిరప్పిం
చిపటువేగమునను। జనిమీరు రామలక్ష్మణకపిసైన్య। ఘనబలాబల
మమరకమర్మంబులరసి। చనుడెందుడసియన్నచయ్యనబోయి। వ
నచరవీరసంఘాతాంతికమున। గరిమగ్రుమ్మరుచుండగనివిభీషణు
డు। కరమొప్పవారలకాకృతులకడకు। గొనిపోవదీనతకుయ్యోడుచుం
డ। కనికరమ్మునవారిగాచిసౌమ్మన। చనిరాక్షసేంద్రుతోసర్వంబు
జెప్ప। వినితసయింటికివేట్కతోబోయి ॥ సీ ॥ అంత విద్యుజ్జిహ్వు
డనువానిబిలపించిమాయచే శ్రీరాముమస్తకంబు। కార్ముకబాణము
ల్గావించినావెంటగొనిరమ్మనెల్లనకువలయాక్షి। యగుసీతతోమా
టలాడువేళనటంచుబలికిజానకియున్నభవ్యావనము। కనురక్తిజనియం

హా రామ హా రామ యని ప్రలాపించుచు నార్తి జెంది । వేడినిట్టూ ర్పులూనరించు వెలదిగాంచి । యేల దుఃఖించెదిక మాను మిందువద న। రామచంద్రుండు దెగటా రెరణములోన । మెచ్చి నన్నేలుకొను మింకమించు బోణి॥ వ॥ అని యివ్విధంబున సంబలికి వైదేహి నీవల్లభుండగు రఘువల్లభుండు దెగినయనంతరంబ లక్ష్మణుడతిభయంబున వనచరులకొందరింగూడుకొని పలాయసంబయ్యె సుగ్రీవ హనుమజ్జాంబవత్ప్రముఖులు మృతిబొందిరితక్కిన వానర వీరులు నానావిధంబులం బోయిరని పల్కి యటమీద విద్యుజ్జిహ్వు వంచిలిపించిన వాడు నురఘువరుని శిరంబును ధనుర్బాణంబులుం గొనివచ్చి జానకి ముందటం బెట్టిన యాసాధ్వి నిక్కంబుగా నమ్మి మొదలు గొట్టం దెగిన కదళీవృక్షంబునుంబోలె నవనింబడి మూర్ఛిల్లి కొంత సేపటికి దెలివొంది కూచుండి హనుమంతువలన మున్నతాబనిచిన శిరోరత్నంబు నలంకరించియున్న విభుని శిరంబు కేలంగొని యాఘ్రాణించి హా రామ హా రామేతి వాక్యంబులు బలుకుచు కన్నీరు వరదలు గావింపుచు నిట్లనియె ॥

ఆహిరి రాగము-ఆదితాళము-

ఏమంచు జొత్తువల్లభ యేమి సేతు వల్లభ॥ చందురు బోలు నీమోము చందమిట్టులాయగ ॥ ముదమున నుకౌగిలించి ముచ్చటలు జెప్పవు। కదసి మ న్వేణిని విరిసరులు। గట్టనేటి కొప్పవు ॥ ౧ ॥ ధరణి నెడబాయవించుక। తెరచు కూర్మితోడను। ధరణి నాకం టె మోహాన। తన్వియె మోనీకును ॥ ౨ ॥ కనుదమ్ములెత్తి చూడవు గర్వమేలా వల్లభ॥ వెనువెంటవచ్చెదవు న్యాధనవిహీన దుర్లభ ॥ ౩॥ చెలగి సౌమిత్రి దెచ్చి నఫలములారగించవా । విలువిద్య వార్తలు నాతో వెసనింక భాషించవా ॥ ౪ ॥ వనపుష్పవితతులు నాకు వలపున నర్పింపవు । ఘనమతి చెక్కిళ్ల మకరికలు లీలలఖింపవు ॥ ౫ ॥ మోముదమ్మితమినినా సె మ్మోముమీద జేర్పవు। స్వామిమతా కామితము లెల్ల। సత్కృపదీర్పవు॥ ౬ ॥ మునివరులిచ్చినయాదీవెనలు విఫలమాయగ। మనసిజసుందర నిన్ను మహిని బాయనాయగ ॥ ౭॥ జనకుడు నన్నిచ్చు వేళ నిను బాయ నే సని యును। వనజాక్షు ధర్మమెుగ న్నవసుధ బాసిపోవను ॥ ౮ ॥ కొ

మరొప్పవివర్ణమైనగోపుచ్ఛందమలరగా । నమితముఖమునకౌస
ల్యాయునవనిబడితపించుగ ॥ ౯ ॥ శ్రీకరరంగేశనిత్యసీమసీవుచేరగ॥ కై
కకుకో కేకలుదీరికనులుచల్లనౌనుగ ॥ ౧౦ ॥ మం ॥

వ ॥ ఇట్లుజనకనందన మహావ్యసనార్ణవమగ్నయై నానావిధం
బులదుఃఖింపుచుండనొక్కరాక్షసుండరుదెంచి రావణుంగనిద్వా
రంబుకడఁబ్రహస్తుండేమికార్యంబున కోయరుదెంచియున్నవాఁడ
ని పలికిన చయ్యనకోపంబుతోడనచ్చోటువదలి సభాస్థలంబునకరి
గి యతనివలన రామవృత్తాంతంబుదెలసి సమస్తబలంబుల యుద్ధ
సన్నద్ధులంగావింపంజేసి సచివులంగూడిమంత్రాలోచనం బొన
ర్చుచుండె నంతట సీతా సమీపంబుననున్న రామమస్తకధనుర్బా
ణంబులదృశ్యంబయ్యె నాసమయంబునసరమచనుదెంచిదుఃఖపీడి
తయగుసీతతోనిట్లనియె ॥

శుద్ధకాంభోధిరాగము-ఆదితాళము.

కొమ్మగోయీదుఃఖమేలనమ్మసీతమ్మ॥ అమ్మగోరావణమాయా
విధమ్మినీకిక్కన్నుగాదో। యమ్మనీ ప్రాణేశుడుక్షేమమ్మనయున్నా
డుమించి ॥ వలదుతపియింపగరఘు। వర్యుడుతమ్మునితోడ। చెలగి
సుగ్రీవాదివీరబలములుగొలువనున్నాడు ॥ కొ ॥ ౧ ॥ వానిమా
యలకుచింతింపవచ్చునాయమ్మకచెల్ల । పూనినిజమయితేయాశిర
ముపాలతిరోమాయమైపోన ॥ కొ ॥ ౨ ॥ రాముడులంకేశుద్రుంచి
రయమునసర్వలోకాధి। రాముడైనిన్నుదోట్కొని। ప్రేమతోవేం
చేయునమ్మ ॥ కొ ॥ ౩ ॥ తరుచరసింహనాదములు । దైత్యరవిభే
రిస్వనములరుదుగావినుము రంగ। పురపతికిభద్రమమ్మ। కొ ॥ ౪ ॥

ద్వి ॥ జననిగోసీమదిసంశయమున్న। ఘనసుపర్ణనిసువేగము
మీరబోయి। యారావణోద్యోగమారూఢిదెలసి। ధీరతనరుదెంచి
దెలుప్రదుననుచు। వలనొప్పబోయిరావణుఁడుశ్రీరాము। వలనగల్గి
నభీతివశమునమంత్రి। వరులతోగుసగుసవాక్యంబులాడు। బెరిగిచ
య్యనవచ్చియింతికిదెల్ప। నరలేనివిస్మయమాత్మలోగల్గి। కరమొప్ప
కౌగిటగదియించిపల్కె ॥

పంతువరాళిరాగము - అటతాళము.

ఎంతపుణ్యశీలవమ్మ యెమమ్మ సరమ॥ వింతగాఁబోవు ప్రాణము
లింతేయుకూర్మిఁ గాచితి ॥ ఎంత ॥ గరితరో నా ప్రాణసఖివి।
గావుననిన్ను నేమరువ। నిరతమిదమ్మాటనిజము। నిశిచరతన్వి రో చా
ల ॥ యె ॥ నిరుపమసచ్చరితవీవు। నీకుతుల్యలిలనులేరు। వరదు
డౌ శ్రీరంగపుర। వాసునిదివ్యాంఘ్రులాన ॥ యెం ॥

గీ॥ అనుచుబలుకంగసంతోషితాత్మయయ్యె। సంతసక్కడరా
వణుండాప్తమంత్రి। వరులతోఁగూడియారఘువర్యు గెలుచు। మం
తనములాడ విని మాల్యవంతుడనియె ॥ చ ॥ ఘనుడగురామమూ
ర్తి సురకంటకదైత్యవిఖండనుండు। నీవనుపమబుద్ధితోడ జనకాత్మ
జనిచ్చికులంబు బ్రోవు। మయ్యనఘుడువిష్ణుదేవుడనియాత్మ నెరుంగు
ముగాకతక్కెనం। వననిధిగట్టమానవుని వశ్యమె రాక్షసవంశసత్త
మా ॥ క ॥ మనపీటదుర్నిమిత్తము। లనువుగనుదయింపదోణ
గనఖిల స్థలులం। ఘనధర్మజ్ఞుడురఘుపతి। గొనుజయమిదినిజము
సంధిగోరుము చాలన్ ॥ వ ॥ అనిబల్కిన వినిసీతనివ్వననినంయమ్మా
ల్యవంతుండుచయ్యనతానేగె। నిజాలయంబునకుఁ గయ్యంబాస్మలో
గోరి। సొంపునలంకాపురినాల్గుదిక్కులనుకాపుండంగయారావ
ణుం। డనువొందంతగనిర్ణయించె నమితోగ్రానేకయోధావ
ళిన్ ॥ వ ॥ అవ్విధంబెట్లన్న ననేకసైన్యంబులతో తూర్పుదిక్కు
న ప్రహస్తును దక్షిణద్వారంబున మహోదర మహాపార్శ్వలను
పశ్చిమద్వారంబుననింద్రజిత్తును యుత్తరద్వారంబునతానును నిలి
చి రక్షించుచు సల్లేపరించి నిజనివాసంబునకుం జనియెనంత॥

సీ॥ శ్రీరాఘవేంద్రుని జేరివిభీషణుం డాలంకలో గల్గుసట్టిదై
త్య। వీరులసంఖ్యలువిక్రమాదులు దెల్పనంతటరాఘవుండకర్ణపు
త్ర॥ హనుమద్విభీషణాద్యతిబలాధికులెల్ల గొలువంగలక్ష్మణుగూ
డివేగ। నెలమిసువేలాద్రి కెక్కి లంకాపురివీక్షింపనచ్చటవెలయు
చుంన। మణిమయోన్నతగోపురమంటపములు। పటుతరస్తంభతో
రణభర్మసౌధ। వితతులుద్యానపంక్తులు వేట్కగాంచి। విస్మయము
బొందె శ్రీరఘువీరుడపుడు ॥ వ ॥ మరియునప్పురంబునంగల గజ

రథాశ్వబృందంబులును లెక్కకుమిక్కిలియై వెలుంగుమహోద్ధత దైత్యవీరభటతండంబులం గాంచుచున్నయెడ విభీషణుండంజలిబద్ధుండై లంకాపురవిస్తీర్ణవృత్తాంతంబెరింగించుచుమహోగ్రభో రావణుండల్లవాడెవివిధమణిని కరథగద్దగితంబై మహోన్నతంబగు యుత్తరగోపురంబుమీదధవళఛత్రిచామరంబులుమెరయంగూర్చుండియున్నవాడని చెప్పుచుండ సుగ్రీవుండత్యుగ్రక్రోధావేశుండై దివికెగసి మహాజవంబునంబోయి దశకంఠుని వక్షస్థలంబుపిడికిటంబొడిచి భూషణరత్నంబులుడులిచి కిరీటంబులువిరుగందన్ని యమ్మహావీరుతోఁ కొంతదడవుద్వంద్వయుద్ధంబు గావించి క్రమ్మర రాఘవేంద్రునింజేరినమస్కరించినంగౌగిలించిమన్నించిరఘువరుండిట్లనియె ॥

భైరవిరాగము-అటతాళము.

సాహసపుపనులిటుశాయజెల్లున॥ సాహసోద్యోగములుశాయ జనదెన్నటికి। యూహింపకేడుసుమ్మీహరీశ్వర ॥ సా ॥ భావింపనీవునాప్రాణసముడవు।హితభావుడవుగానసుగ్రీవచెప్పెద॥సా॥ ౧ ॥ నీకుకీడడరనాకీదేహమేల । సీతాకాంతయేమిటికినాకుదెల్పుమ ॥ సా ॥ ౨ ॥ పొందుగనునావచనమందుమతినిల్పు । మేనందమగురంగపురమందిరేశుడ ॥ సా ॥ ౩ ॥ వ ॥ ఇట్లుబల్కి రఘువరుండు స్వామి త్రింగనుంగొని లంకాపురంబునదుర్నిమిత్తంబులుగలుచున్నయవి మనకువిజయంబు చేకూరుంగావున సైన్యంబులతోడంబోయి పురంబుకోటలుముట్టడివేయవలయునని పల్కియప్పర్వతంబుడిగ్గి సమరసన్నద్ధుండై కవచంబుదొడిగిస్వర్ణసూత్రనిబద్ధతూణీరుండై ధనుర్బాణంబులుదాల్చి తానుముందటనడుగిడుచు ధరణిపరాగంబు భూనభోంతరాళంబులు గప్పుచుండసైన్యంబులతోడంబోయి యప్పట్టనంబుడగ్గిరినయనంతరంబ॥

చ ॥ నిలిచిరితూర్పుదిక్కుననునీలుడుదక్షిణమంగదుండు । దోర్బలవిభవుండువాయుజుడుపశ్చిమదిక్కునరామలక్ష్మణుల్।చలమునను త్తరంబుననుసర్వవనేచరకోట్లతోడ। విచ్చలవిడిమెప్పుచుండదనుజసంఘములంవిదళింపగోరుచును ॥ ద్వి ॥ కరమొప్పనాలుగుగ

తనులనిట్లు । విరివిగా ముట్టడి వేశినపిదప। చనువుగల్గి నవిభీషణుమ తివడిసి। ఘనరాజధర్మమార్గమునాశ్రయించి। రామచంద్రుం డుతారాపుత్రు బిలచి। భీమవేగంబున పిలుచలంకేశు । కడకేగిట క్కు మకడు వేట్క జలధి। తడయక బంధించితరుచరకోట్లు । గ్లా లువంగజను డెంచికోదండబాణ। కలితుండనై నిన్ను ఖండింపగోరిక మొనసిలంకాద్వారమున నున్నవాడ। ననికిరమ్మిక వేగ నటుగాకయు న్న। నానరలంకారాజ్యమొప్పుగావిడిచి । చనుమునీ వెటకైన చక్క గాలంక। మావిభీషణుడు నెమ్మది నేలవలయు । భావంబుదాని కొప్పకయున్నమున్న । సీతపంబున కాత్మ నెరిమెచ్చినట్టి । ధాతవ చ్చినగానితప్ప కత్రుంతు। ననిపల్కు మనన తండవలీల నెగసి।చని రా వణునిగాంచి చయ్యన బలికె॥

సురటరాగము-అటతాళము-

అంగదుండనిన న్నెరుంగవ । కపిపుంగవుండను దైత్యపుంగవ ॥ రంగుగనిన్నుతోకకు గట్టి గర్వమణంగ నబ్ధులముంచిన ట్టివాలికి పట్టి ॥ సం ॥ ఘనుడైన రామచంద్రునకును । నమ్మిన బంటు బంటనౌం వ లరను। మునిగణకంటకనినుద్రుంప రఘుపతి । జనుడెంచి నీకడకను వగవచ్చితి ॥ సం ॥ ౨ ॥ దురముశాయగరమ్ము వేగను । లేకధర జీవింపగవలసినను। ధరణిజనిచ్చి నీవెటకైన బొమ్మిక।సరగున మా విభీషణుడీపట్టణమేల ॥ నం ॥ ౩ ॥ ఖలుడ నీవిటు శాయకున్నను । నీవు నలినగర్భుని జేరియున్నను।సలలిత శ్రీరంగస్థలభర్తయగు రా ము। డిలగూల్చు నిన్ను ప్రజ్వలితబాణాగ్నుల ॥ నంగదుండనిన న్నె రుంగవ ॥ ౪ ॥ వ ॥ ఇట్లు బలికి దశకంధరా కపటంబు గావించివై దేహిం గొనిపోయిన దురాత్ముండవగు నీవు నీవారలతోడ నస్మది య్యమహోగ్ర క్రూరనారాచశిఖిశిఖాపరంపరలవలన భస్మీభూ తుండవయ్యెదవని రఘువరుం డానతిచ్చిన వాక్యంబులు బలికెన॥

సీ ॥ అంతట రావణుండత్యుగ్రుడై వీనిబట్టి చంపుడటన్న నట్టి తే చి। దనుజవీరులుదగ్ర దర్పంబుచే డాయవారల నవలీల వసుధ గూ ల్చి । ద్వారకవాటముద్ధతి దన్నిశకలముల్ గావించి దివికేగి కనకర త్న। విలసిత ప్రాసాదమెలమితో భంజింపనై తేయులత్యంత భీతి

కెంద। విక్రమముజూపి శ్రీరామవిభునికడకుఁ బవనజవమొప్పఁ బో
యి సద్భక్తి మ్రొక్కి । సర్వమెరుఁగింపవిని రామచంద్రుఁ డప్పుడు। హ
ర్షవిస్మయములఁ జెందెననఘచరిత ॥ ద్వి॥ కపులు కాలాంతకకల్పు
లై లంక। నపరిమితంబుగా నావరింపంగ । యా రావణుండు సేనా
ధ్యక్షులయిన। ఘోరరాక్షసులను గోమరొప్పఁ బిలచి । జవమున చ
తురంగసైన్యంబు లొప్ప । భువిచలింపఁగ తలిఁబోయి యాబీద । న
రులను దునిమి వానరకోట్ల నెల్ల । వరసగా ఖండించి వలనొప్పనిటకు ।
విజయులై రమ్మన్న వేట్కతోనంత । గజరథాశ్వభటప్రకరముల
తోడ। నరుదార దైత్యకోట్లుం దందగదలి। తరుచరవీరుల తడయక
డాకి। పరశుపట్టిసగదాప్రాసబాణముల। వెరువక నొప్పింపవిడు
వక కపులు। తరుశిలావర్షముల్ తగ గురిపించి । దురమొనచిఁరిపు
హోస్కృతముగా నప్పుడు। యిరుదెరంగుల వీరులీరీతి ఘోర । నిరువాం
దనెత్తురు పేరులుబారె। నురువడి యాద్వంద యుద్ధంబునందు । త
రుచరుల్ మించిరి దర్పంబెలర్ప ॥ ఉ॥ అంతటనింద్రజిత్తు నిరయం
బునవాలితనూభవుండు। కాలాంతకుబోలి మాకొని మహాగిరిశృం
గము వైచి సారథిం । పంతమెలర్ప నశ్వముల భండనవీధి వధింపన
ద్యోడం। సంతసమొందిరెల్ల మునిసత్తములుం సురవర్గమింపునను॥
వ॥ అంతటనింద్రజిత్తుండంతర్ధానంబునొంది మాయాబలం
బున విక్రమించి కట్టలుక నొరులకుంగనుపడక నిఘాతతుల్యబా
ణపరంపరలవలనం వానరకోట్లం జీకాకుపరచి రామలక్ష్మణులనా
గాస్త్రబద్ధులంగావించిన యాదాశరథులు భూమండలంబునను
ఖనిద్రితులచందంబున నొప్పుచుండిరంత సుగ్రీవసుషేణహనుమ
ద్ద్వివిదనీలాంగదాదులు తీవ్రంబున నంబర తెంచి దుఃఖింపుచుండ విభీ
షణుండు వారల కత్యంతధైర్యంబొసంగుచుండె నయ్యెడ రావ
ణాత్మజుండు విజయుండనైతిననుతలంపున లంకకుంజని తనగెలు
పువృత్తాంతంబు తండ్రికెరుఁగించిన మహోత్సాహచిత్తుండై త్రి
జటాదిరాక్షసస్త్రీలరప్పించి రామలక్ష్మణుల పేరంగెరింగించి మీ
రు వైదేహినిం బుష్పకంబుసంగూర్చుండబెట్టుకొని రామరామా
నుజులంగనుపరచి మరలంగొనిరండని పల్కె యనంతరంబున॥

గీ ॥ సీతకడకేగి రాక్షసస్త్రీగణంబు । రాఘవుల వార్త దెలుప
హా రామ యనుచు । పణతి మూర్ఛిల్ల కొంత సేపటికి దెలసి । చాలవి
లపింప త్రిజటాదిసఖియలెల్ల ॥ గీ ॥ పుష్పకములోన శ్రీరాముపా
లతి నునిచి । కడుజవంబున గగనమార్గమున బోయి । చారుసుఖని
ద్రితుల భంగి సర్పబాణ । బద్ధులై పవ్వళించిన భవ్యగుణుల ॥

వ ॥ వైదేహి కింగనుపరచిన యాసాధ్వి దురంత శోక వ్యాకు
లితచిత్తయై కన్నీరు మున్నీరుగా రోదనంబు సేయుచు తనవల్లభుని
ముఖారవింద సుందరంబు తనివిసనక మాటిమాటికిం జూచుచు నిట్ల
నియె ॥ చ ॥ పలుకవదేని సొంపెసగ నపారకృపామృతవృష్టి వాప
యిం । జిలుకవదేమి ఘోరవనసీమల డించ్చితె యెంత జేసి సన్నలుమక
నెందు బోయి బహుకష్టములం బెచ్చితం । కొంత సుఖమివ్వవే
మి ... కిల్వ ... ॥

శోకవరాళి రాగము - అటతాళము.

అవనిసెద్దలు పట్టులన్న వ్యథ ... యమ్మచెల్ల । భువినిష్ఫ
లంబుగ బోయెనే మెనాథ ... ॥ ౧ ॥ పదపద్మములగలపద్మరే
ఖలు జూచి బాగు ... । కదపడి పతికి పట్టపుదేవి వన్నద బద్ధమేను ॥ ౨ ॥
గరిమతో నన్నదీర్ఘసుమంగలవియన్న ఘనసముదేల ॥ వరదులైనను
పుత్రవతివయ్యెదవనియన్న వాక్యమేలా ॥ ౩ ॥ కురులు కన్బొమలున
క్షిస్తనదంతాదులను గానను । సరగున గనిలక్షణికులన్నవి యేకసఖ్య
మేను ॥ ౪ ॥ క్రతువులో నచ్చుపలికి పత్నినన్నదిగాని బాయ । పతి
యైన శ్రీరంగపతిదాయ బనుపుము బ్రహ్మతిశాయ ॥ అవనిసెద్దలు ॥ ౫ ॥

వ ॥ అప్పతివ్రత వల్లభును శ్లేశించి యిట్లనియె ॥

పున్నాగ రాగము - అట తాళము.

హా రామరామ । పలుకవేల । శ్రీరామరామా ॥ క్రూరరాక్షసు
లనిగోరి వచ్చువేళ । ధారుణిశయనింపదగునె శూరులునవ్వ ॥ హా
రామ ॥ ఖరదూషణాద్యరుల । జంపవె ఘోర । కాంతారగురుసీ
మలపరదనీవటువంటివాడవై ధరనొక్క । సురవినుతుని చేని త్తెరగా
టమదినమ్మ ॥ హా ॥ ౧ ॥ వరదివ్యాస్త్రవిదుడవు । ధనుర్ధరవరు

డవు శూరుడవు । కరిమనుజగములసరిలేనివాడవై । ధరణిబడితివి ట్లులరుదుగనేజెల్ల ॥ హా ॥ ౨ ॥ శరధిబంధించ్చితివి । వానరకోట్ల నరుదుగదెచ్చితివి । కరమొప్పనీవిట్టిఘనయత్నములుజేశి । సరగు నరావణుజంప్పకెల్లితివి ॥ హారా ॥ ౩ ॥ ననుగొనిచనుమికను । రం గస్థలముననుండునీతోడను । తనువునప్రాణములనునిల్వలేనిక । వన జలోచననన్నుకనులెత్తిచూడుము ॥ హారా ॥ ౪ ॥

సీసాధరణము- నాదనామక్రియరాగము-

కనుదమ్ములెత్తినన్నుసరకుతోజూడవనఘాత్మనీకిదియహణమగు నే । మనసిజసుందరవేషననుకౌగిలింపకేలమన్ననమానినావు । నా నేరమెమొ । మనసునబూనినావు ॥ మున్నెన్నడిట్లుననువిడనాడ బోవు ॥ ౧ ॥ సురమునిస్తుతదివ్యసుందరంబగుమేను । ధరనంటబ వళింపనగునెనీకు । పురిసుండనీకవనభునికిబంపినకైక । ధరసంత సించునింకా । రెంతకుదెచ్చె । కరిమమాయలజింక । యీదురద శకే । స్థిరమాయనాకులంక ॥ ౨ ॥ చెరనుండజేసిదుర్భరదుఃఖ మునవిన్ను । కరిమకౌగిటగృచ్ఛగలుగదయ్యె । పరదనీచూపురూ పువచనవైపుణములెల్ల । మరవునేనెటులగొందున । పకారము లెవ్వరికిసలుపనెంచు । గురుఘోరదుఃఖాగ్నులకెట్లతాళుకొందు ॥

గీ ॥ సీరజాక్షివేడినిట్టూర్పునించుచు । కన్నుగవనుబాష్పకణ ములొలుక । నాగపాశబంధనములతో వెలుగొందు । మరదిజూచిశో కమగ్నయగుచు ॥

మధ్యమావతిరాగము-జంపెతాళము-

యిదినీకుసమయమానిదురబోవగను । కదలిననుజూడచక్రనితం బ్రితగను ॥ నిదురబొందవు వసగశులనియమమునని । నిదురకిక చోటిలనునిశ్చయమయోగ్యగద ॥ ౧ ॥ కనులెత్తియన్నసటు గను గొనవదేమీ । ఘనమతినిశిన్యాషలనుశాయవేమి । వనమునను నేన స్నవచనములువదిగనలి । ననుగసంజనదనుచుకనులుమూశితివేమొ ॥ యిదినీకు ॥ ఫలమూలములుదెచ్చియలశితివాలీ । వనశాలలమ చిబడలితివాచాల । చెలగిజలనిధిగట్టివెలశిదస్సితివేమొ । జెలువు మగ్రజుమీదనలిపవళించితివా ॥ శరకార్ముకములుభీకరగతినిగొను

ము। సురవిమతుల్లను చండశరములనుదునుము ॥ వరదుడగు రంగ పురవరుని జేష్టతములెల్ల। కరుణించి లెమ్మనను గన్నముద్దులయన్న॥ యిది ॥ వ ॥ యిట్లుబలికి మరలం బ్రాణవల్లభుండగు రఘు వల్లభుం జూచి విలపించుసమయంబున త్రిజటయిట్లనియె ॥

ద్వి ॥ వనితరో వినవమ్మ వలనొప్ప వీరి । ఘనముఖాబ్జంబులుగల యజూచినను। గరిమవైవర్ణ్యాణంబుగాసమించుకయు। సిరువొంద శవచింహ్నలేమియులేవు। గావునమరణంబుగాదిదిదివ్య । భావం బుతోడుత భాసిల్లుచున్న । వారువీరల గెల్చువారలు లేరు।వారిజగం ధినావచనంబు సమ్ము । వడి రావణుని జంపి వనజాప్తకులుడు । తడ యక నిన్నయోధ్యకు గొనిపోవు। సతి వెరొ చెప్పెదననువుగా నొకటి పతిలేని సఖియలీపరమవిమాన। మరుదుగానెక్కెనన వ్వలజనదు।ధ రలోననిదినమ్ము ధవళాక్షిమదిని ॥ వ ॥ అనియివ్విధంబునం బలికి వై దేహికిం ధైర్యంబొసంగి పుష్పకయానంబు వలన మరలం జనియ ద్దేవినియథాస్థానంబునం జేర్చె సంతమీద శ్రీరామచంద్రుండం తగణితంబున జెలివొందితమ్ముసింగని యనేకవిధంబులం దుఃఖిం పుచు తన్నుంబరివేష్టించి ఖిన్నులై శోకించు హనుమద్విభీషణ సు గ్రీవాదులం జూచి ॥ గీ ॥ చనుముసుగ్రీవ వానరచయముగూడి । నీవు కిష్కింధకీవేళ నెమ్మితోడ। సచివయుక్తంబుగా విభీషణ జవంబు। దనరలంకాపురికిబొమ్ము తడయనేలా ॥ గీ ॥ అనిన దీనులగుచు వనచ రావళులెల్ల । నమితశోకమగ్నులగుచు వెలసి । రంతరవితనూజు కరుదారతనమామ।యగు సుషేణువదనమట్లజూచి॥

సీ ॥ ఘనులైనరామలక్ష్మణుల నెత్తుకనీవు పొమ్ము కిష్కింధకుభువ నసౌఖ్య । కరముగా రావణఘటకర్ణ శక్రజిత్ప్రముఖుల నిలగూ ల్చిపటుజవమున । జనకజ గొనివత్తునని న సుషేణుండు దివ్యౌషధు లుదెచ్చు తెరగుజెప్ప । నంతటగరుడుడత్యంత వేగముతోడ। నిజప క్షవాతంబునివ్వటిల్ల । తడయకరుదేరభుజగబంధంబులెల్ల।వీడితు త్తములైపోవవీరవర్యులైన। శ్రీరామలక్ష్మణులట్లలేచి।నిలిచియు వైన్వనతేయుని చెలిమిగనిరి ॥ వ ॥ అంతనగ్గరుడుండు తనహస్తం బులరామలక్ష్మణులస్పృశించినబుద్ధివిక్రమధైర్యపౌరుషోత్సాహ

పటుత్వంబులవీరులకుదృశ్యగణీకృతంబులై యొప్పి నయ్యెడ రఘు
వరుండు గరుడునింగని నేవ్వండవు విచ్చటికేమికారణంబునం జను
దెంచి మాకుయుపకారంబుగావించితివనిన నేనుమీకునస
ఖుండ గరుడాభిధానంబుగలవాడ మీరుఘనగశర బద్ధులయ్యుం
డుటందెలసి తీవ్రంబునంజనుదెంచివిమోచనంబుగావించితినన్ను
నిహేతుక కరుణారసంబున నిరంతరంబేల వయ్యనని పలికి రా
మచంద్రునింగౌగిలించుకొని యనుజ్ఞవడసి యథాస్థానంబున క
రిగె నాసమయంబున సుగ్రీవహనుమద్విభీషణనలనీలాంగదజాం
బవత్ప్రముఖులు పరమానందంబునం జెందిరితక్కినవానరానీకం
బులత్యంతసంతోషంబున నుప్పరంబునకెగరుచులంకాద్వారకవా
టప్రముఖంబులు విరుగదన్నుచు కిలకిలా శబ్దంబులు దిశలపూరిం
పంజేసిన ॥ శా ॥ ఆరావంబతివిస్మయంబుగసురేంద్రారాతియా
లించజం। భారింగట్టిననాగపాశములుపెంపారంగభంజించి।దూ
ర్వానోదగ్రతలేచియప్పటివలెం।రాజిల్లగానొప్పుయా।శ్రీరాముం
డునులక్ష్మణుండనిమహాచింతాన్వితస్వాంతుడై ॥

గీ ॥ అట్లుగాకున్ననియ్యాప్తులచటగల్గ వనుచు। సచివానుమతి
గొనిదనుజవరుల।బనిచి శ్రీరామలక్ష్మణభవ్యకుశల।వార్తదెప్పిం
చుకొనిదీప్తమూర్తియగుచు ॥క ॥ తనసన్నిధివెలుగొందెడి ఘను
డగుధూమ్రాక్షుచూచికరితురగస్యం దనభటవిసరముగొనిచని ।
వనచరులనుసరులక్రుంచివడిరమ్మనినన్ ॥

పంతువరాళిరాగము- అటతాళము-

ధూమ్రాక్షుడుదర్లెను। సైన్యములెల్లనమ్రత్వమునగొల్వను॥
ధూమ్రాక్షుడుదర్లెదురమునకైరోష । తామ్రాక్షుడగుచును
ద్దండదర్పంబున ॥ ధూ ॥ వనచరవితతులను । శ్రీరంగేశులనువేగ
దునుముదును। కనుడనిపలుకుచుకనుపడుబహుమశ్శకునముల మతి
లెక్కగొనకజవంబున ॥ ధూ ॥ లయగ్రాహి ॥ చనిమొనలతోడు
తనువనరులనుదాకి బహుసునిశితశరావళులుతనువులనుజొనుపం।
కనలివనచరవితతులనువైనగిరితరులుగొనిసముద్ధతిఘోర దనుజుల
నువైవన్ । గినిశిముద్గరముసలఘనగదాశూలములు ।వెనుతిరియక

సుడాయుచున్వ్రేయనంతరన్ ॥ మొనసిరథకరులహరులను । భట
ప్రకరముల । నని ద్రెళ్లెనెశిరత్యనుపమనుశక్తిన్ ॥

వ ॥ మరియు నద్దనుజబలంబులగ చరులవిక్రమంబునం జేసి ఘోరంబొచ్చిన ధూమ్రాక్షుండు కోపోద్దీపితుండై వానరానీకంబుల నాశంబొనర్చుచున్న నాంజనేయుండవ్వీరుని సైన్యసమేతంబుగా మరణంబునొందించె నట్టియెడ దశకంధరుండావృత్తాంతంబు హతశేషరాక్షసులవలనం దెలసి రణగమనకుతూహలుండగు వజ్రదంష్ట్రునింబనిచిన వాడును చతురంగసైన్యసమేతుండై మహోత్సాహంబున ॥

రేగుప్తిరాగము-ఆదితాళము-

వజ్రదంష్ట్రుడువెడలెను । రణరంగమునకు ॥ వజ్ర ॥ వజ్రధరప్రముఖాదులనైనను । నిర్జించెదననిదుర్జయుడగుచును ॥ ౧ ॥ కరిబృంహితములువెలయను । తురంగకోట్లబురుహేషాస్వనములమరను । వరరథభటతతులురువడిననుపగ। ధరగ్రక్కదలనుదగ్రతమందుచు ॥ ౨ ॥ హనుమద్విభీషణాదుల । సుగ్రీవాంగదుల। ఘునరంగస్థలనివాసుల । ననిమిషనివహములడలగపటుతర । సునిశితశరములదునుముదుననుచును ॥ ౩ ॥ క ॥ యీరీతిబోయివానర । వీరానీకములబొదివివెసకోదండ । జ్యారావంబొనరింపుచు । దారుణబాణములకపులతడయకద్రుంచెన్ ॥ సీ ॥ అంగదుడంతనుగ్రాంగుడై వడిదాకివానిపైతరుశిలల్వై చుటయును । కనలివాడవియెల్లఘనచండకాండముల్బరపిన పంగవాలిపట్టిమించి। విరథుగానొనరించివెసముష్టికయ్యంబువానితోగావించివసుధగూల్ప। హతశేషులయినసర్వాసురుల్రావణుకడకేగిదెలుపంగకదనములను। కంపమొందనిధీరునకంపనాఖ్యు । బనుపవాడంతచతురంగబలముగొల్వ । వానరానీకములదాకివాడితూపు । లచ్చ్యగానేసెకపులెల్లపిచ్చలింప ॥ క ॥ హనుమంతుడసురసేనల । కసలివధింపుచునుయాయకంపనుమీదన్ । ఘనశైలమొకటివైవగ । దునిమెన్వాడలిగివాడితూపులనధిప ॥ గీ ॥ ఆంజనేయుడంతనత్యుగ్రుడై వృక్ష । మొకటిశౌరికివైవనుర్విగూలి । జముని పురముకరిగెచేయ్యనహతశే

పటుత్వంబులవీరులకుద్విగుణీకృతంబులైయొప్పె నయ్యెడ రఘు
వరుండు గరుడునింగని నెవ్వండవిచ్చటికేమికారణంబునం జను
దెంచి మాకుయుపకారంబుగావించి బ్రోచితివనిన నేనుమీసఖు
ఖుండ గరుడాభిధానంబుగలవాడ మీరుభుజగశర బద్ధులయ్యుం
డుటందెలసి తీవ్రంబునంజనుదెంచివిమోచనంబుగావించితిసన్ను
నిర్హేతుక కరుణారసంబున నిరంతరంజేలవయుననిపలికి రా
మచంద్రునింగౌగిలించుకొని యనుజ్ఞవడశి యథాస్థానంబున క
రిగె నాసమయంబున సుగ్రీవహనుమద్విభీషణనలనీలాంగదజాం
బవత్ప్రముఖులు పరమానందంబునం జెందిరితక్కినవానరానీకం
బులత్యంతసంతోషంబున సుప్పరంబునకెగరుచులంకాద్వారకవా
టప్రముఖంబులు విరుగదన్నుచు కిలకిలా శబ్దంబులు దిశలపూరిం
పంజేసిన ॥ శా ॥ ఆరావంబతివిస్మయంబుగసురేంద్రారాతియా
లించజం। భారింగట్టిననాగపాశములుపెంపారంగభంజించి।దూ
ర్వారోదగ్రతలేచియప్పటివలెం।రాజిల్లగానోపుయాశ్రీరాముం
డునులక్ష్మణుండనిమహాచింతాన్వితస్వాంతుడై ॥
గీ ॥ అట్లుగాకున్ననియ్యార్పులచటగల్గవనుచు। సచివానుమతి
గొనిదనుజవరుల।బనిచి శ్రీరామలక్ష్మణభవ్యకుశల।వార్తదెప్పిం
చుకొనిదీప్తమూర్తియగుచు ॥ క ॥ తనసన్నిధివెలుగొందెడి ఘను
డగుధూమ్రాక్షుచూచికరితురగస్యందనభటవిసరముగొనిచని ।
వనచరులనుసరులద్రుంచివడిరమ్మనినన్ ॥
పంతువరాళిరాగము- అటతాళము-
ధూమ్రాక్షుడుదర్లెను। సైన్యములెల్లనద్రుత్వమునగొల్వను॥
ధూమ్రాక్షుడుదర్లెమురమునకైరోష । తామ్రాక్షుడగుచును
ద్దండదర్పంబున ॥ ధూ ॥ వనచరవితతులను । శ్రీరంగేశులనువేగ
దునుముదును। కనుడనిపలుకుచుకనుపడుబహుమశ్శకుసముల మతి
లెక్కగొనకజవంబున॥ ధూ ॥ లయగ్రాహి ॥ చనిమొనలతోడు
తనువనరులనుదాకి బహుసునిశితశరావళులుతనువులనుజొనుపం।
కనలివనచరవితతులనువైనగిరితరులుగొనిసముద్ధతిఘోర దనుజుల
నువైవన్ । గిరిశిముద్గరముసలఘనగదాశూలముల ।నెనుతిరియుక

సుడాయుచుఁద్రె యనంతరఁ ॥ మొనసిరథకరులహరులను । భట
ప్రకరముల । నని ద్రెళ్లెనెశిరత్యనుపమనుశక్తిఁ ॥

వ ॥ మరియు నద్దనుజబలంబులఁ జరులవిక్రమంబునం జేసి ఘోరంబొచ్చిన ధూమ్రాక్షుండు కోపోద్దీపితుండై వానరానీకంబుల నాశంబొనర్చుచున్న నాంజనేయుండవ్వీరుని సైన్యసమేతంబుగా మరణంబునొందించె నట్టియెడ దశకంధరుండావృత్తాంతంబు హతశేషరాక్షసులవలనం దెలసి రణగమనకుతూహలుండగు వజ్రదంష్ట్రినింబనిచిన వాడును చతురంగసైన్య సమేతుండై మహోత్సాహంబున ॥

రేగుప్తి రాగము-ఆదితాళము-

వజ్రదంష్ట్రుఁడు వెడలెను । రణరంగమునకు ॥ వజ్ర ॥ వజ్రధర ప్రముఖాదులనైనను । నిర్జించెదననిదుర్జయుఁడుగుచును ॥ ౧ ॥ కరిబృంహితములు వెలయను । తురంగకోట్ల బురుహేషాస్వనములమరను । వరరథభటతతులురువడిననువఁగ। ధరగ్రక్కదలనుదగ్రతమందుచు ॥ ౨ ॥ హనుమద్విభీషణాదుల । సుగ్రీవాంగదుల। ఘనరంగస్థలనివాసుల । ననిమిషనివహములడలఁగ పటుతర । సునిశితశరములదునుముదుననుచును ॥ ౩ ॥ క ॥ యీరీతిబోయివానర । వీరానీకములబొదివివెసకోదండ । జ్యారావంబొనరింపుచు । దారుణబాణములకపులతడయకద్రుంచెన్ ॥ సీ ॥ అంగదుడంతను గ్రాంకుడై వడిదాకివానిపైతరుశిలల్ వైచుటయును । కనలివాడవియెల్ల ఘనచండకాండముల్ బరపిన పంగవాలిపట్టిమించి। విరథుగానొనరించి వెసముష్టికయ్యంబువానితోగావించివసుధగూల్చ। హతశేషులయినసర్వాసురుల్ రావణుకడకేగిదెలుపంగకదనములను। కంపమొందనిధీరునకంపనాఖ్యు । బనుపవాడంతచతురంగబలముగొల్వ । వానరానీకములదాకివాడితూపు । లచ్చ్ఛగానేసెకపులెల్లబిచ్చలింపా ॥ క ॥ హనుమంతుడసురసేనల । కనలివధింపుచును యాయకంపనుమీదన్ । ఘనశైలమొకటివైవఁగ । దునిమెన్ వాడలిగివాడితూపులనధిప ॥ గీ ॥ ఆంజనేయుడంతనత్యుగ్రుడై వృక్ష । మొకటి భారికివైవనుర్విగూలి । జముని పురముకరిగెచేయ్యనహతశే

షు। లైనదైత్యులెల్ల నతిరయమున ॥ వ ॥ రావణు పాలికిం జని యకంపనుండు జగినవృత్తాంతంబెఱింగించిన ఖిన్నుండై మహా కాయుంగనుంగొని ॥ సీ ॥ ఘనవిక్రమునిమహాకాయుగన్గొనినీవు రామరామానుజరవితనూజ। హనుమదాదులజంపిజనుదెమ్మనగ దివ్యశరచాపములుగ్రాలనరదమెక్కి। చతురంగబలసమన్వితుడై వడింబోయివనచరావళిదాకినునిశితాస్త్ర। తతులనబ్బలమెల్ల ధరణిగూల్చుచునుండ శతవలిప్రముఖులుద్ధతిదలిర్ప। నతనిమంత్రులైనశతమాయముఖరుల। ననివధింపనాతడక్కొనలి। తారకోడు కుతోడదలపడినముదగ్ర। సమరమమర జేసిజచ్చుటయును॥

వ ॥ రావణుండా వృత్తాంతంబుహతశేష రాక్షసుల వలన తెలసి చింతాక్రాంతమానసుండై ప్రహస్తుంగనుంగొని॥

ఉ ॥ నీవునుమేఘనాధుడును నేనునికుంభుడు కుంభకర్ణుడుం। వావిరిదక్కనన్యులరిపగణముకేళియబోలెడాకి। సంభావితవిక్రమ స్ఫురణభగ్నరిపునధివధింపశక్తులే।భూవరపుత్రలంకపులబోయివ ల్భంఘుముదగ్రమూర్తివై ॥

మధ్యమావతిరాగము- ఆదితాళము-

ప్రహస్తుడంతటబహువిధసేనాప్రకరముగొనివెడలెక। మహా హారరత్నకిరీటుండగుచును మహోగ్రతనుచాపధ్వని సేయుచు ॥ ప్ర ॥ తురంగహేషారవములుదుర్భర తరకరిబృంహితముల్। గిరీంద్రసమరథనేమిస్వనములు। ధరాగగనములుతేడయకనింక ॥ ప్రహ॥ వరేణ్యులగుశ్రీకరరంగస్థలవాసులగిరిచరులం। దు రంబుననునవలీలధరంబడశరాచుర్లు లురువడిబరి పెదనుచును ॥ ప్రహస్తుడంతటవె ॥ ద్వి ॥ తనబలంబులతోడతగనిట్లువచ్చు। ద నుజవీరునిగాంచిదశరథాత్మజుడు। వినుమువిభీషణ వీడెవ్వడనిన। ననఘవీడుప్రహస్తుడసురేంద్రసచివు। డసురసేనాధ్యక్షుడతివిక్ర ముండు। వెసరావణుడుబంపవేట్కతోబోర। వచ్చెరాక్షసిపల్కె వలనొప్పనంత। నచ్చుగానేసతోనాప్రహస్తుండు। వనచరసేనల వచ్చితాకుటయు। ఘనవృక్షములుశిలల్కపివరుల్గురియ। ముసలి ముద్గరగదాముసలబాణాదు। లరుదారబరపిచయ్యనద్రుంచిరసు

రు। లరులుభీతిల్లంగనయ్యెడ। జాంబవంతాదులాతనివరమంత్రివరుల। నంతంబునొందింపనాప్రహస్తుండు। కనలిచాపంబుఢంకారంబుచేసి। సునిశితబాణముల్ జొనపివానరుల। మెండుగాద్రుంపుచుమేటియైదీప్త। చండాంశుకరణిప్రచండుడై మెరయ। కనినీలుడుగ్రుడై కడువడిదాక। ననిఁజెల్లెనిద్దరకద్భుతంబుగను॥

క ॥ గిరితరులునీలుడేయగ। నరుడుగనవిద్రుంచియాప్రహస్తుడునీలుం। గురుతరమగుముసలంబున। నురువడినురమేసెరుధిరముదయింపంగను ॥ గీ ॥ కనలివృక్షమొకటిగైకొనినీలుండు। పరగమస్తకంబుబగులనేయ। నెలయబడియెనతడుమూలముల్ దెగిపడి। భూరుహంబుబోలి పుణ్యచరిత ॥ వ ॥ ఇట్లుప్రహస్తుండు బడినంజూచి వానరులత్యంతహర్షంబున నీలునింబొగడిరయ్యెడ నిశిచరులవలన రావణుండు ప్రహస్తునివృత్తాంతంబెరింగించినచింతాకలితస్వాంతుండై మరలధైర్యంబుగొని యెల్లవారలంజూచిసైన్యంబులతోడనేనియ్యెడంజని రామలక్ష్మణసుగ్రీవప్రముఖులంబరిమార్చివత్తుననియుద్ధసన్నద్ధుండై కదలిపోవందలంచుసమయంబున మండోదరితనయంతఃపురంబువెలువడి రాక్షసాంగనలు వేత్రపాణులైబరాబరులొసర్ప మాల్యవంతునిహస్తంబుకేలంబట్టుకొని చయ్యనంజనుదెంచిరాక్షసేంద్రునకిట్లనియె॥

యెదుకలకాంభోదిరాగము- అటతాళము-

వలదుప్రాణనాథ। వారిజాప్తకులునితోటి। చలమునన కెన్నటికిలలోన। నాబుద్ధిపల్కుల। లరుచునమ్ముమునీలోన॥ జనకాజ్ఞ దండకారణ్య। మునకువచ్చియున్నఘనుని। వనితనువంచించితేనేల ॥ యూరకేమనకు। యినకులునితోవైరమేల॥ ఖరదూషణాద్యసురవీర। వరులనెక్కండ్రనొక్కడు। గురుతరాస్త్రములను జంపడ। మారీచునొక్కశరమునభూమినణంపడే ॥ ౨ ॥ అట్టిరాఘవేంద్రునినీవాత్మలోమనుష్యుడని। నెట్టునదలంపదగదోయి। లోకములెల్ల। పట్టిశిక్షింపగాగలడోయి ॥ ౩ ॥ ఘనులైనధూమ్రాక్షముఖ్యాదనుజవీరులెల్లబడిరి। ఘనమతియుద్ధమునిలుపుము। శుభములేదు। వినుతిజేతుకులముమనుపుము ॥ ౪ ॥ ధనమణివస్తు

వాహనతతులతోడుత వై దేహీ। ననువుగారాముసకవిణంక్షమీ ॥ ౫ ॥ మనమేలుచిత్తముసగోరుమాల్యవంతాదులబనిచి। చనుపునారంగేశుతోడను। సంధిశేయింపుమనయముసీకేను మ్రొక్కెడను ॥

ద్వి ॥ యీరీతిబలుకంగనిల్లాలిజూచి। కారుణ్యచిత్తుడై కౌగిటజేచిఁ। దీనత్వమేలనేదేవిరోసీకు। మానితంబగువిక్రమంబుసనర్వ। సురసురాధీశులసారిదిజయించి । ధరణిమహోద్దండదర్పంబువడసి। నరులపాలికిబహునమ్రుండనగుచు । వెరచిసంధికిబోవవీరత్వమగునె। తరుణిరోననుగన్నతరుచరుల్నరులు। దురమునభీతిల్లితొలగకుండరు రే। చెలగినీసుతుడింద్రజిత్తుండుకోప। కలితుడై శత్రులఖండింపకున్నె। పొమ్మునీవికసంతిపురముకటన్న। కొన్నాతాజనెనంతగొబ్బునవెడలి ॥ పంచచామర ॥ దివ్యహేమరత్నభూషదీప్తులెల్లనల్దిశల్। భవ్యమై వెలుంగచాపబాణతూణయుక్తుడై। నవ్యఘంటికాఘణంఘణాయమానమౌరథం। బవ్యయోగ్రశక్తినెక్కెనాశ్రితోత్సవంబుగన్ ॥ గీ॥ సకలవీరులతోడనిశాచరేంద్రు। డలుకచేనాహవక్రీడకరుగుచెంచు।సమయమునజూచి శ్రీరఘుస్వామిసర్వ। సన్నుతసుశీలుడగువిభీషణునితోడ ॥

వ ॥ వీరెవ్వరెరుంగంబలుకుమని సరావణానుజుండు రఘువర్యునకిట్లనియె॥

మధ్యమావతిరాగము- ఆదితాళము-

వనజసుందరలోచన। వినుమురఘువర్యపాపవిమోచన॥ ఘనగజమెక్కివచ్చెటివాడకంపను। డినతుల్యరథమెక్కిధనువుచేకొనిమిక్కి । లనువుగఝంకృతినొసరసేయుచువచ్చు । దనుజునిమేఘనాథునిగా నెరుంగుము ॥ ౧ ॥ అతికాయుడనువీరుడు । వింధ్యాద్రితుల్యాంగుడదుగాధీరుడు। జతలేకమత్తగజముపైమహోదరు । డతులోత్సవంబుననమరుచునున్నాడు। వితతోక్కలత్షులవెసనుద్భవిల్ల । నుద్ధతివచ్చువాడుసీతానాధత్రిశరుడు ॥ ౨ ॥ గరిమకుండలకాంతులు। గండములందు నెరయకిరీటములు । తరుచుకాంతులధగద్ధగమెరయగదివ్య । తరరథమెక్కిభాస్కరమూర్తియనమించు। వరధనుధరుడురావణుడురంగపురీశ। సురకంటకుడుసీతరు

ణిదెచ్చినవాఁడు ॥ వనజసుందర ॥ వ ॥ ఇట్లుపల్కిన రామచం
ద్రుండు రావణునిరూపతేజోవిశేషంబులకచ్చెరువొంది విభీష
ణా యిప్పాపాత్మునిమీఁద సీతాహరణసంభవంబైనకోపంబునే
ఁడు గనుపఱచెద ననిఘనశరాసనంబుధరియించియుద్ధసన్నద్ధుం
డై యుండెనంతట రావణుండు దైత్యవీరులనందరంబోవం బని
చి వానరబలంబులం దాఁకి నిష్ఠురతతుల్యబాణప్రకాండంబుల
నేలంబడవైచుచుండ సుగ్రీవుండొకగిరిశృంగంబు పెకలించి తె
చ్చి రావణుమీఁదంవైచిన నవ్వీరుండు కాంచనపుంఖంబులైనబా
ణంబుల ద్రుంచివైచి మహాశనితుల్యంబగు యొక్కబాణంబున న
తనిమూర్ఛనొందించి సైన్యంబులజంపఁబూనినయాసైన్యంబులు
దీనత్వంబునంబరుగిడి శరణ్యుండగురఘువరేణ్యునిమఱుఁగుఁజొచ్చిన
యవ్వీరుండు ధైర్యంబొసంగి సన్నద్ధుండైన సమయంబున సౌ
మిత్రియడ్డంబువచ్చి పాపాత్ముండగురావణుమదగర్వంబుల డిం
చెద నాకనుజ్ఞకృపసేయుండని పలికిన సంతసిల్లి రణపండితుండ
గు యుద్ధశకంఠుతోడ నత్యంతయత్నంబునకయ్యంబుసేయు మని
యానతిచ్చినం దరిఁజనచ్చుచుండెనంత ॥ తోటకవృత్తము ॥ దాన
వనాథుఁడుదర్పమెలర్పఁ । వానరసేనావళులవధింపం । పూని
ప్రభంజనపుత్రకుఁడల్కం । వానింగదిసెజవంబుననంతన్ ॥

వ ॥ హనుమంతుండివ్విధంబునరావణురథంబుమీఁదికింగదిసి ॥

ద్వి ॥ తనహస్తతలమెత్తి దైత్యేంద్రునిన్ను । ఘనలీల ధరఁజంప
గానెత్తినట్టి । కాలదండముబోలుకరమిదెచూడు । చాలనన్నొరుగ
వేసముదగ్రబలుఁడ । ననిపల్కినన్నొయుమవ్వానిన్ను । దునుము
దునినియన్నతోరంపుఁబలుక । వినరోరిదుర్మదపెట్కతోనతఁడు । డను
నీకుమారుమున్నాలంబులోన । మనుమటగానవాద్దుష్టాత్ముయన్న ।
కనలివక్షముప్రేయగామూర్ఛనొంది । మరలచయ్యనలేచి మసల
కదనుజ । వరునివక్షంబుజవంబునబొడువ । నంతటమూర్ఛిల్లి
యారావణుండు । వింతగాలేచితావెసనిట్టులనియె ॥

గీ ॥ వనచరోత్తమనీప్రేటువలనజముని । పురముగనివచ్చినట్లయ్యె
పౌసగనీదు । బలముమెచ్చితినన్నా బలము ధరణిగాల్పనె । రావ

ణాసిగ్గుగల్గెమదికి ॥ వ ॥ అటమెట్లన్న నాచేతివ్రేటుదాకిన మేటిమగండొక్కండైనజీవింపండు నీవుజీవించియున్నాఁడవు కటంజేసి నీవెమహావిక్రముండని సత్కృనంగోపించి రావణుండాంజనేయుని యురంబుబొడిచిన నవ్వీరుండు మూర్ఛిల్లె నంతట దశగ్రీవుండు నీలునింగదిశి సమరంబుగావించి పావకాస్త్రంబున మూర్ఛనొందించితనతోడకయ్యంబుగావింప జనుదెంచు సౌమిత్రింగదిసిన ॥

కళ్యాణిరాగము-అటతాళము-

శరకార్ముకధారులై । దశకంఠ । లక్ష్మణులుపోరిరిధీరులై ॥ నిరుపమశౌర్యవిస్ఫురితులై లోకభీకరులై చిత్తముల నొండురుల గెల్వగగోరి ॥ శ ॥ ౧ ॥ పరలాఘవము తోడను । దుర్భర రతీక్ష్ణ । శరములుజిమ్ముచును । కరికరిహరిహరిగిరిగిరిదాకిన తెరగున దాకిమచ్చరములచ్చుగ హెచ్చ ॥ శ ॥ ౨ ॥ ఘనమృత్యుముఖసీమను । చేరితివిలక్ష్మణయన్న నినుగూల్పను । జనుదెంచితిని రావణరక్షనుచరంగేశునితమ్ముఁడనేనిట్టులనుఘ్నగనిరువ్వరు॥ శ ॥ ౩ ॥

క ॥ దనుజేంద్రుఁడేఁడుతూపులు । ఘనజవమలరంగనేయఖండించియురా । మునితమ్ముఁడటనేతనువున । జొనిపెంరుధిరంబు వెడలనునిసితవరముల్ ॥ వ ॥ అంతట రావణుండు బ్రహ్మదత్తంబైన బాణంబు సౌమిత్రిమీఁదం బ్రయోగించి మూర్ఛిల్లి చయ్యనం దెలసి లక్ష్మణుండతనికార్ముకంబుఖండించి కాలాగ్నితుల్య శిఖంబులమూర్ఛనొందించిన రావణుండువిసంజ్ఞుండై పడి కొంత సేపటికితెలసి॥గీ॥ బ్రహ్మదత్తమైనపటుశక్తిలక్ష్మణు । మీఁదనేయరామసోదరుండు । మూర్ఛనొందపంక్తిముఖుఁడమ్మహాత్ముఁడు । గదిసియెత్తవశముగాకయున్న ॥ వ ॥ మేరుమందరంబులైన నెత్తందగుహస్తంబులిర్వీరుంగదలింపజాలకున్నవని యచ్చెరువొందుచుండ నాంజనేయుం డతిరయంబునం బరతెంచి బిడికిటిపోటున రాక్షసేంద్రుని పెన్నురంబు బొడిచి మూర్ఛవొందించి సుహృద్భావంబునంజేసి తనహస్తంబుల నవలీలలక్ష్మణునెత్తుకొని రఘువరు

షమీపంబునకుంజనియె నప్పటులశక్తి సౌమిత్రింభాసిచనియె సం
తేరావణుండు తెలివొంది రఘువరు సమీపంబునకు వచ్చుచున్నస
మయంబున హనుమంతుండు రాఘవేంద్రుంగనుంగొని॥

సావేరిరాగము-అటతాళము.

వాహనమయ్యెదనీకు మోహనవేష ॥ వాహనమయ్యెదజగన్మో
హనశ్రీరామచంద్ర ॥ వా ॥ దనుజవరుడున్నతమైన। ఘనరథం
బుమీదనుండ। మొనసినీవుధరణినుండజను నేసీ తేశా।మనుజవరనా
మనసోచఁ నేమనవిచేకొనవయ్య। మనసిజసుందరరంగ మందిర
వాస ॥చ॥ అనవినిరాఘవుండుహృదయంబున సంతసమంది వేడ్క
తో। సనిలతనూజు నెక్కి ధనువచ్ఛలీలసుశంకృతస్వనంబొనరగ
సేయుచుం। వనచరోత్తములుబ్బుచునుండ।రావణుంగనుగొని దా
సిపకెక్కునగజఁనము స్వసబోలుపల్కలన॥

మధ్యమావతిరాగము-అటతాళము.

ఇదిమంచివేళసీవిందురార। నిన్ను। కదనభూమినిజంపక మాన
ర ॥ తడయకనేధనుర్ధరుడనౌచు నేడు। వడిజేరితినినిన్నెవ్వాడు
బ్రోచు ॥ ౧ ॥ వినరోరినీవుగావించినట్టి। పంచసమరువను రా
రాధనువుబట్టి॥ ౨ ॥శివవిధిప్రముఖులజేరియున్న। నిన్నువలీలద్రుం
తునెందణగియున్న ॥ ౩ ॥ బరభామామణులతాపనులచాలనీవు।
పరగబాధించుచుబ్రతుకనేల ॥౪॥ పరరంగపతినిరావణుడనమ్ము।
నాశరముల బెట్టిదమెరిగికొమ్ము ॥ ౫ ॥ సీ ॥ అనవినిరావణుం
డినవంశజునిమీదహనుమంతుమీదనత్యుగ్రమౌగ్ర। బాణముల్వ
డి నేయుపటుకోపమునరామభద్రుండువజ్రకల్పంబులైన। శర
తతుల్బరగించిచాపధ్వజఛత్రసూతాశ్వములద్రుంచి పొంపుమీ
ర।కనకకిరీటముల్కరినాస్త్రములలీలఖండించిదశకంఠుగాంచిసక
ల।వీరవరులతోడవెసయుద్ధమొనరించి।బడలితీవ్రకొంతదడవువిశ్ర।
మించిరమ్మటన్నచంచజ్జవంబున। విరిగిపారియాత్మపురముసొచ్చె।
వ ॥ ఇట్లులంకాపురంబుజొచ్చి రఘువరేణ్యునికరుణకుమ్మలచు
రుకుకచ్చెరువొందుచు మనంబున దురంత చింతాక్రాంతుండై
కొంతసేపటికి ధైర్యంబుదెచ్చుకొని రాక్షస వీరులం జూచి

కుంభకర్ణునినిద్ర మేల్కొల్పుండని నియోగించి పంచిన భేరిప్ర
ముఖవాద్యంబులతోడనవ్వీరుండు శయనించి యున్న నిలయంబున
కుంబోయి॥

తోడిరాగము-ఆదితాళము-

కుంభకర్ణ లేలెమ్మని। యార్పులతో।విజృంభించిరవుడుహుమ్మ
ని। జంభాంతకపవిసదృశములగు। దోస్తంభముత్తజవంబుసగ్ర
ద్దుచు ॥ కుం ॥ భేరిధ్వనులు జేసిరి। ప్రసముద్గరభూరిశూలముల
గ్రమ్మరి। సారెకుతరుపాషాణములేయుచు। వారణవితతులవడి
ద్రొక్కించుచు ॥ ౨ ॥ నీటికుంభములుదెచ్చిరి। చెవులలోనీరు।
పూటిగబోయ్యసాగిరి। పాటిగరంగ ప్రభుసిశరంబుల। దాటికి
దెగుటకుధరచేకొండగ ॥ కుంభకర్ణ లేలెమ్మని ॥ ౩ ॥

గీ ॥ ఇవ్విధంబున మేల్కొల్ప నెమ్మిలేచి। మాంసమద్యాన్నము
లుదినిమత్తుడగుచు।నన్నుమీరెలలేపి తిరన్ననతని। జూచియూప
క్షుడును రాక్షసుండు బలికె ॥ ద్వి ॥ మనరాక్షసేంద్రుండుమత్త
చిత్తమున। వనమునశ్రీరామువచించింసీత। గొనితెచ్చిమపురి
కొమగొప్పదాచ। హనుమంతుడవలీలనంబుధిదాటి। వనితసీతను
జూచివనమెల్లబెరికి। ఘనుడై నయక్షునిఖండించిపురము। చలము
తోడుతగాల్చిచయ్యనబోయి। జలజాప్తకులునకుసర్వంబుదెలు
వనచరకోట్లతోవడినేగుదెంచి। వననిధిబంధించివలనొప్ప ఘోర।ద
నుజులద్రుంపంగతత్తర పడుచు। నినునిద్ర లేపింప నెమ్మిబంచుట
యు। వచ్చిలేపితిమనివచియింపనప్పు। డచ్చుగావినికోపమాత్మలో
వెలయ ॥ వ ॥ అంతనవ్వీరుండు కవచకుండలప్రముఖంబులుదా
ల్చి సకలరాక్షసగణంబు సేవింపతనయన్నపాలికరుదెంచుచున్న
సమయంబున కపిసైన్యంబులమ్మహావీరునిశరీరంబుగాంచిభయకం
పితులై సర్వలోకరక్షణాహుండగు రఘువల్లభునిమరుగుజొచ్చి
నమ్మహానుభావుండు కుంభకర్ణునిభీమరూపంబు జూచి విస్మితాంత
రంగుండై వీడెవ్వండని విభీషణునడిగిన నతండతని వృత్తాంతంబు
సాకల్యంబుగానెరిగించె నశ్రీరామచంద్రుండు ధనుర్ధరుండై నిలు
వంబడియె నట్టియెడకుంభకర్ణుండు రావణుకడకరుగుదెంచి న

మస్కరించినసతిని గాగిలించుకొని రాఘవవృత్తాంతం బెరుంగించినయనంతరంబున కుంభకర్ణుండన్నకిట్లనియె॥

నవరోజురాగము - ఆదితాళము -

మును నే జెప్పినబుద్ధి వినవైతివయయో। మనసు మప్పదమున జననిచ్చితయయో ॥ సుమహిత చతురోపాయములొనర్పకను । క్రమమెసివంత్యోపాయము ముందుగొనను ॥ ౧ ॥ చీరకొంగునదాచి చిచ్చుతీరుననను। ఆరామసతి దాచితారామమనను ॥ ౨ ॥ నారదముని జెప్పినాడు తెల్లముగ । శ్రీరాఘవుడు శ్రీమన్నారాయణుడుగ ॥ ౩ ॥ మనము మ్రొక్కిన బ్రహ్మకును దేవుడైన। ఘనరంగపతికి మ్రొక్కినదోసమగున ॥ ౪ ॥ వ ॥ ఇవ్విధంబున ననేకనీతివిజ్ఞానవాక్యంబులు బల్కిన నతండు కోపింప సవినయుండై నరవానరులమీద మదీయపరాక్రమంబు జూపెదనని యుద్ధసన్నద్ధుండై సైన్యంబులతోడ వెలువడి ॥ సీ ॥ ఘనశౌర్యుడగు కుంభకర్ణుడిత్తెరగున మించి కయ్యము కరుడెంచుచుండ। కని భీతి వానరుల్ కదువడి బారంగ నంగదుండంతట నట్లు జూచి। వారికి ధైర్యంబు వాటిల్ల జెప్పిన వినితరుల్ కొండలు వేగగొనుచు । బరతెంచి రాక్షసుపై నేయ సవ్వీరుడధికకోపంబున నఖిలకపుల। శతసహస్రసంఖ్యానత్తుల శూలంబున। ద్రుంపుచుండ జూచి తెంపుతోడ। నంజనీతనూజు డత్యుగ్రుడై శైల। శృంగమెత్తివై చెసురులు బొగడ ॥ ద్వి ॥ కనలియంతట కుంభకర్ణుండు శూల। మునవేసి మారుతి మూర్ఛనొందించి । వనచరప్రతతుల వలనొప్ప డాసి। దునుమచు విహరింప దోర్దర్పమలర । సుగ్రీవుడొక గిరిశృంగంబు బెరికి। నిగ్రహబుద్ధితో నిజరారాతి । నురువడి నేయంగ నుగ్రుడై మండి। ఖరశూలమున మహోగ్రతేజైశనపుడు। హనుమంతుడా శూలమవలీల బట్టి। వనచరుల్ బొగడగ్గననడిగ్రుంచివైచె। దనుజేంద్రు తమ్ముడంతట కోపమునను। ఘనగశృంగంబు కరమున బెరికి। రవిపుత్రుపై నేయ రఘుముఖ్యుడదు। భువిగూలె మూర్ఛిల్లి పాలుపెల్లడొలగి ॥

గీ ॥ అవనిమూర్ఛిల్లి పడిన యారవితనూజు। గాంచి [illegible] భాసురాగ్రముసగమతి। [illegible]

మ్మనజనుచుండెనరవరేణ్యా ॥ గీ ॥ అంజనీతనూజుఁడాసూర్యపు
త్రుని। తెరఁగుగాంచివేగదేవవైరి। క్రొవ్వడంచిరవిజుఁగొంపోవ
గానెతుఁ। మిగులనట్లొనర్పఁదగునొతగదొ ॥

వ ॥ అనివితర్కించుచు సుగ్రీవునిచందంబు కొంతదడవుగనిపె
ట్టెదనని తోడంబోవుచుండెలంకాపురస్త్రీగణంబులకుంభకర్ణుం
డు విజయుండై వచ్చుచున్నవాడని ప్రసూనంబులు లాజలతసమీ
దంజల్లుచుండ నాసమయంబున సుగ్రీవుండుదెలసి దంతంబులవ
లన కుంభకర్ణుని నాశికంబును నఖంబుల వలన కర్ణం బులు
నుం దెంచుకొని రామచంద్రుని సమీపంబునకుం జనిన యనంత
రంబున ॥

రేగుప్తిరాగము.- అటతాళము.-

ఘనరోషమునను వచ్చెను। కుంభకర్ణుడు గ్రతను। తనముక్కు
చెవులుబోయినతత్తరముజెంది। తనజింహాచేరక్తధారలు గ్రోలు
చు ॥ ౧ ॥ తనసైన్యములను। శ్రీరామచంద్రుని సైన్యములను। మొ
నసియొక్కమ్మడిగను మ్రింగజొచ్చెను । కనలికాలాంతకుక్రైవడి
మత్తుడై ॥ ౨ ॥ గరిమడాశియును। లక్ష్మణుడు గ్ర। శరములేయగ
ను। సురవైరివడికపివీరుల ద్రుంచుచు । రంగపురధాముమీదికిపో
వనగదిసెను ॥ ౩ ॥ ద్వి ॥ అంతవిభీషణుండాతనితోడ। వింతగాన
నికాయవేట్కతోగదియ। సరగునగని విభీషణ నన్నలెస్స । వెరువ
కమదిరింపువెసగదతోడ । మది భ్రాతృవిహితంబుమానుమిచ్చో
టు। సదమలధర్మంబుజయముచేకూడదు। రాముడిజ్జగతిధర్మజ్ఞుడ
వ్వీరు। కామించిదయగొనికడతేరితనుచు । బలుకంగకన్నులభా
ష్పంబులొలుక। నిలిచెనేకాంతుడై నెమ్మిచింతిలుచు। దనుజేంద్రు
తమ్ముడంతటను గ్రుడగుచు। వనచరావళినెల్లవడిమ్రింగుచుండ।
శరచాపములుదాల్చిజానకీనాథు । డరుమగావెంచెసియవ్వీరుతో
డ। కదనంబుగావించికరములుదునిమి । పదిలంబుగావైంద్రబా
ణంబువలన। కుండలకోటీరగురురత్ననిచయ । మండితంబగుతల
మహిబడచేసె। నాసమయంబుననసురులుబోయి । వాసవారికిదె
ల్పసుధకూర్భిల్లి । కుంభకర్ణుమొందరిగిలినన్నచు। వీరతో

కించెనవ్వీరుదలంచి ॥ వ ॥ ఇట్లుదుఃఖించుచున్నరాక్షసేంద్రుం
జూచి త్రిశిరుండనేకవిధంబులనతని విక్రమప్రతాపంబులుగ్గడిం
చి ధైర్యంబుదెలపి యుద్ధసన్నద్ధుండయ్యె నతికాయ నరాంతక
దేవాంతకులారీతిం దాముసుతండ్రినూరడించి రణంబునకు బో
వంగోరి కట్టెయెద రావణుండుతనపుత్రచతుష్టయంబునకు సా
హాయ్యంబుగా మహోదర మహాపార్శ్వులంబనిచిననయ్యార్వు
రు నభోవీథింబ్రకాశించు క్రూరగ్రహంబులతీరునం దేజరిల్లుచు
నరాంతకుడశ్వంబుమీదం మహోదరుండుగజంబుమీదం దక్కిన
నలువురుదేరులమీదం గూర్చుండి కిరీటకుండలంబులుమెరయ ధ
వళఛత్రంబులఛాయంవెలయుచు చతురంగబలసమేతులై వానర
సేనాసముద్రంబుచేరంబోయి ॥ సరసిజయనువృత్తం ॥ వారత్యు
గ్రాకారముల్ప్పక । వడిజనివనచరవరనికరములం । జ్యారావం
జేపారగనం... । శరవిసరములముసలములగదలం । ధీరత్వంబింపా
రగ వ్రేయక । నివిజతతులుతమదెసబొగడ । కపుల్క్రూరంబారం
దారుణలీలం । గొనకొనిబరపిరిగురుగిరితతులం ॥

క ॥ అంతనరాంతకుండుతనయశ్వమునుగ్రమదాతిరేకుడై ।
పంతమెలర్ప వానరులపైకిచివుక్కనదూకనిచ్చుచుం । వింతగజం
పుచుండ । గని వేగమెయంగదుతోడవీనిక్రొవ్వంతయుదీర్చరమ్మను
చునకాలనూజుడు బల్కెనుద్ధతిని ॥

ముఖారిరాగము- ఆదితాళము-

వాలిపుత్రుడంతటదువారుడగుచును । వానిలీలదాకెనమరగ
ణముచాలబొగడను ॥ ప్రాసమెత్తివైచెనసురుడాసతోడను । వా
నిడాశినిజీర్ణపుజేసెనుదర్పమొప్పను ॥ ౧ ॥ అంగదుండున్నతవృ
క్షమమరదాల్చియు । మదినుప్పొంగిదేవాంతకునివైచెపొలువుమీరి
యు ॥ ౨ ॥ త్రిశిరుడావృక్షముద్భంచెవిశిఖములను । కోపమెసగ
వాలిపట్టిశిలలువిసిరివ్రేసెను ॥ ౩ ॥ వాటద్రుంచిత్రిశిరుడతని
వాడితూపులమించి । సూటిగానంగదునివైచెసురవరులడల ॥ ౪ ॥
హనుమంతుడాకశైలమూదేవాంతకువైవ । దానిదునిమె త్రిశిరుడ

ఘనకర్ణులుశిరలఘుబోవ ॥ ౫ ॥ తలకకసూరుతిదేవాంతకునిజంపె
ను। రంగనిలయునిసత్కారుణవలననెత్తుగోలుకను ॥

వ ॥ ఇట్లుదేవాంతకుండు గూలినయనంతరంబునమహాదరుం
డునీలునింగదిసి మూర్ఛనొందింపంజేసిన జలిపొందినీలుండత్యు
గ్రుండై యొక్కనగంబుపెరికివైచినశిరంబుబగిలినేలంబడియె త్రి
శిరుండు తీవ్రబాణంబుల నాంజనేయునొప్పించిన నతండలిగి ప
ర్వతంబులొక్కమ్మడి యతనిపై బరగించిన త్రిశిరుండవియెల్లం
ద్రుంచివైచి యతనిమీద నిశితవిశిఖంబులుగ్రుచ్చె నంతం బవన
జుండుగోపించి యారాక్షసునిగుర్రంబుల సారథింజంపివైచినవా
డుదగ్రక్రోధంబునహనుమంతునిబిడికిటంబొడువమూర్ఛాక్రాం
తుండై క్రమ్మరందెలిసి కోపోద్దీపితముఖుండై దేవేంద్రుండు వి
శ్వరూపునిమస్తకంబులు ద్రుంచుచందంబున కుండలాలంకృతంబు
లైన వానితలలుద్రుంచివైచి యమనిలయంబునకుబంచిన॥

సీ ॥ త్రిశిరుడిట్లుబడినదెలసిమహాపార్శ్వ। డద్రిచరులగదసి
యవనిగూల్ప। నతనిదాకిఋషభుడాహవంబొనరించి। మరణ
మొందజేసెనరవరేణ్య ॥ ద్వి ॥ అంతటనతికాయుడత్యుగ్రుడగు
చు। వింతగావానరవితతులమీది। కరుదారతనసహస్రాశ్వరథం
బు। బరపించిదుర్భరబాణాగ్నివలన। వనచరావళులనువసుధ
గూల్చుచును। జనుదేరకపులెల్లచయ్యనబ్రతికి। వడికుంభకర్ణుం
డువచ్చెనోయనుచు। తడబడిభీతిసీతానాథుమరుగు। జేరినరఘు
కులశ్రేష్ఠుడయ్యసుర! వీరవర్యునిగాంచివిస్మయమొంది॥

శంకరాభరణరాగము-అటతాళము-

యెవడోయివీడు। విభీషణ। యెవడోయి ॥ యెవడోయిమనక
పినివహముభీతిల్ల। గవియుచులోకభీకరుడై వచ్చుచునున్న ॥ యెవ
డో। శరవితతులను। మనసైన్యమిద్ధరణిగూల్చుచును। శరచాపఖ
డ్గముద్గరముఖ్యసాధనోత్కరములొప్పారగమెరయుచువచ్చువా ॥
యెవడో। శ్రీరంగపురిని। చెన్నలరునన్నరుమగమడిని। గురుతెరుం
గకవిష్ణుబర్హింలించుచున్నాడు। సరిలేనివిక్రమసంపదపెంపున। యె
వడో ॥ స్సీ ॥ అనవిభీషణుడారఘురాముగని విభూషణాల‌సన

యిదుర్వి । నతికాయుడింద్రు వీడతుల పరాక్రముం డార్యసేవా
సక్తుడస్త్రవిదుడు । పరమేష్ఠికరుణ చే శరశరాసనఖడ్గకవచతూ
ణీరముల్ గలిగి చాల । వెలయుచుండును వీని విక్రమంబున జేసి లంక
యొప్పను నిరాతంకమగుచు । కదనమునకు వీడు కదలివచ్చిన సురా
సురులు తల్లడించి వెరచుచుండు । రట్లుగాన వీని నధికయత్నంబున । సం
హరింపవలయు జానకీశ ॥ గీ ॥ ఇట్లు బలుకుచుండ నెలమితో నతి
కాయు । డద్రిచరుల నెల్ల నంపకముల । నృక్క జేసి లోకసుందరుం
డగు । రామచంద్రు జేరి పలికె సంతసమున ॥

కాంభోధిరాగము_అటతాళము.

శరచాపములు ధరించి । వచ్చితి । సమరము సేయ దలంచి । వెరు
వక నిచటికి బిరబిర నరుదెమ్మ రమరవలదిక నని యొనరింపుము । మా
నుకొని యెటు బోగలవు । నన్ను నిమోహనము గనీ తనువు । సునిశిత
బాణములనువుగ ద్రోనిపియు । నిను నెత్తురు వెల్లిని ముణిగింపగ । శ
ర ॥ ఖరు పైబరపిన శరము । లివ్వేడ గురుజవములర బరువు ము । వర
రంగస్థలవాసుడవగు నిను । దురమున నే నత్యుగ్రత గెలువగ । శర
చాపములు ధరించి ॥ ద్వి ॥ అనవిని లక్ష్మణుడత్యుగ్రుడగుచు । తన
యన్న కడ్డమై దనుజుని జూచి । కోదండటంకృతి గానకొని సేయు । నా
దైత్యుడది విని హాశ్చర్యమొంది । చిన్నవాడవు నీవు పెక్కుకయ్యంబు ।
లెన్నడో నచిరనీ వెరుగ వించుకయు । విలునమ్ములీల బెట్టి వెరిగి పో
మ్మికను । నిలిచిన నిను దృంతు నిశితబాణముల । నని యన్న విని విల్లు న
మ్ములు బట్టి । చను దెంచియుండంగ సమరంబు సేయ । కేల బ్రేలె
దవింక నిల గూల్తు నిన్ను । బాలుండననుచు నన్ను భావింపవలదు । బా
లవృత్యవటంచు చరింపుమన్న । కాలానలాభమౌ కాండంబు
లింట । చయ్యన సంధించి సౌమిత్రి నేయ । నయ్యేడ నది దృంచె నా
రాము తమ్ము । డంతట నతికాయు డాగ్రహమలర । వంతంబుతో
నైదు బాణంబులేయ । దునిమి ఫాలంబున దోర్వీర్యమమర । ఘనశ
రంబేయంగ కడు నెత్తురమరె ॥ గీ ॥ అంత దివ్యాస్త్రయుద్ధమయ్యె
సురరాజ । తనయుతో డనుగావించి దానవమలకు । వాడితూపులు ఉ
రగింపవాగాయురము । దాళిముసెల్ల దునిసి వ్యథలంబులయ్యె ॥

వ ॥ వెండియు లక్ష్మణుం డనేకబాణంబు లేసి వాని కంఠకటంబు
ఛేదింపంజాలక విస్మయంబొందుచున్న యెడ వాయుదేవుం డరు
దెంచి బ్రహ్మాస్త్రంబునం గాని వీడన్యబాణంబులం జావండని ప
లికి యంతర్హితుండై నయనంతరంబున సౌమిత్రి సమంత్రకంబు
గా బ్రహ్మాస్త్రంబు ప్రయోగించిన నయ్యతికాయుని కుండలాలం
కృతంబగు శిరంబు ధరం బడియె నట్టియెడ కపిగణంబులును దేవ
గంధర్వ విద్యాధర మహర్షి సంఘంబులును రామానుజుని గొ
నియాడి రంత ॥ క ॥ హతశేషులయిన రాక్షసు। లతిరయమున లం
కకరిగి యసురేంద్రునితో। నతికాయాదుల తెరగంచితమతి బలు
కంగ తప్తచిత్తంబ మరగ ॥ వ ॥ దురంతచింతాక్రాంతుండై దాశ
రథుల విక్రమంబున కచ్చెరువొందుచున్న యెడ నింద్రజిత్తుండు తం
డ్రికిట్లనియె ॥

కేసుప్తిరాగము - అటతాళము -

యేలా చింతించేవు తండ్రి। యేగల్గి యుండ ॥ కాలాగ్ని తుల్య
బాణముల। కపికోట్ల రామలక్ష్మణుల। నేలగూల్చి జయముగొందు
శీలధర నమ్ము మికను ॥ ౧ ॥ రంగవాసులైన రఘు। పుంగవుల గెలి
చి చాల। మంగళవాద్యముల చే।నుప్పొంగుచు వచ్చి మ్రొక్కెద ॥ ౨ ॥
సీ ॥ తనతండ్రితో నిట్లు తగబల్కి వీట్కొని వలనొప్ప చతురంగ బ
లము గొలువ। నతుల హోమమున బ్రహ్మాస్త్రంబు గొని దివ్యమర
దము దగిలి నెక్కి సురలు బెదర। పొడగాన రాకుండ బోయి మింట వసిం
చె కపిసైన్యములతోడ గదసి దనుజ। బలములు పోరాడ పటుదర్ప
మున నింద్రజిత్తుడవ్వేడ దీప్త సిత శరముల। కపులద్రుంచుచు నుద్దండగ
తి నిమింట। మెరసి యాచుచు శ్రీరఘువరుల నఖిల। వనచరుల లీల
బడవైచి వసుధ గదల। నతిజవంబున తనలంక కప్పుడరిగె ॥
వ ॥ అంతట విభీషణుం డధికయత్నంబున నాంజనేయుం గన్గొం
గొని చింతాక్రాంతుండై జాంబవంతుం డెచ్చట బడి యున్నవా
డో యామహాత్ముని గాంచితిమేని యాపన్నివారణకారణంబగు
సౌపాయం బెఱింగింప గలవాడని పల్కి యులతనిం గూడి చని చని జాం
బవంతుం గన్గొని ప్రాణంబులతో నున్నవాడవె యని యడిగిన

నలుండతనిముఖంబవలోకించి హనుమంతుండెచ్చటనున్నవాఁడతఁడు జీవించియుండునే యనియడిగిన విభీషణుండతని జూచి రామలక్ష్మణసుగ్రీవాదులనందర వర్జించి హనుమంతు నడుగనేల యనిన హనుమంతుండొక్కండు జీవించియున్న నందరం బ్రతికినవారలండని పల్కిన యనంతరంబున హనుమంతుండరుదెంచి తన గోత్ర నామంబులు చెప్పి నమస్కరించిన నతనితో జాంబవంతుండిట్లనియె ॥

కాంభోటిరాగము-ఆదితాళము-

హనుమంత నీవు బోవోయి । దివ్యౌషధములు । ఘనవేగమున నుదేవోయి ॥ మన రామలక్ష్మణులిమ్మహీమూర్ఛనొందియున్నారనసంభవాంగదాదివనచరకోట్లతోడ ॥ ౧ ॥ నినునమ్మియున్నవారము । నాలంద్రిసీపీపనిచేసికీర్తిఁ వడయుము । నినుబోలువీరులీభువనములలేరునీ । వత్యనుపమోదగ్రబలుఁడపసహాయశూరుడవు ॥ హ ॥ ౨ ॥ ధరణిపైకళింపనేతుఁడవు । దుర్ధరకనక । గిరినితలక్రిందొనర్తువు । గరిమెనీవెద్దియైనకడగియొనగూర్పగల । వరదుఁగరంగ పురవరులమేలాత్మగోరి ॥ హనుమంత ॥ ౩ ॥ వ ॥ ఇట్లు బలికి దివ్యౌషధులకుం బోవు మార్గంబును యాయౌషధుల లక్షణంబులును దెలియనెరింగించిన ॥ క ॥ హనుమంతుఁడంబరంబున । చనిచనిదివ్యౌషధాద్రిఁ జయ్యనగనిపావనమగునయ్యౌషధులను । గనజాలక పర్వతంబు కదువడిబెరికె ॥ ద్వి ॥ అంతటగంధర్వులాచుఁచుదాక । పంతంబుతో వారిభంగంబొనర్చి । గిరిమోసుకొనివచ్చి కేవలలీల । సరగున కపిసైన్యసన్నిధినిలుప । ఘనమైనయౌషధగంధంబుసోకి । వనజాప్తకులజులు వనచరవరులు । మరుదుగాలేచిరయ్యెడనిద్రఁబొంది । గరిమలేచినవారికై వడిదోప ॥

సౌరాష్ట్రరాగము-ఆదితాళము-

కపివరులయ్యెడగదసిమహోగ్రతగాల్చిరిలంకపురము । సురగణదానవదుర్ధరము । యపరిమితములగుహయరధమత్తద్విపశాలలుబహువీథులమండగ ॥ ౧ ॥ మణిమయసౌధసమంచితగోపురములటపనగరములెల్లా । యనలునిమంటలమ్రగ్గుచుడొల్లా । కన

వ ॥ అంత రావణుండు దురంతచింతాక్రాంతుండై ఖరపుత్రుండగు మకరాక్షుం గనుంగొని ॥ చ ॥ వనచరులం రఘూద్వహులవాడి శరాగ్నులజంపిరమ్మనం । వినిప్రణమిల్లి రావణుని వీడ్కొని హేమరథాధిరూఢుడై । దనుజవితానముల్ గొలువ తద్దయసంగరకేళిగోరుచుఞ్ । చనిచని కాంచి తాకె సురసంఘము భీతిల రాముసైన్యముఞ్ ॥ గీ ॥ యిట్లుదాకికపుల నెలమిభంజింపంగ । బారజొచ్చిరతులభయమువలన। ఖరసుతుండు రాము గదసి గర్జిల్లుచు। బలికెనపుడు రామభద్రవినుము ॥

యదుకులకాంభోదిరాగము- జంపెతాళము,

చిక్కితివి శ్రీరామ। చిక్కితివి రఘురామ । చిక్కితివినా ముందు సీతాభిరామ। గరిమ మజ్జనకుడగు। ఖరుని జంపిననిన్ను । పరగదునుమాడి యాపగదీర్చెదనుందుఞ్ ॥ ౧ ॥ ఘనబాణములను। నీతను వురక్తమొనచిమ్మ। జనకజకు కన్నీరు స్రవియింపజేతుఞ్ ॥ ౨ ॥ శరములను గొని । ప్రాసగదాదులను గొని । నేరిగోరుమనిశాయనీకెయ్యదనువో ॥ ౩ ॥ రామ శ్రీకరరంగధామనినువధియింతు । భీమాస్త్రవర్షమిక పెలుచగురిపించి ॥ ౪ ॥

క ॥ అనవిని శ్రీరఘునాధుడు।వినరోరిదురాత్మ చాలపెనప్రేలకు। నిన్నని సంహరింతు నివ్వేడ। ఘనతరకార్ముకవిముక్తకఠినాస్త్రములఞ్ ॥ వ ॥ ఇట్లుబల్కిన మకరాక్షుండత్యుగ్రుడై రఘువల్లభుమీదబాణవర్షంబు గురిపించె నయ్యిరువురు దేవగంధర్వాదులంబరంబునం జూచుచుండ చిత్రంబుగా పోరుగావించిరత్తరి కౌసల్యానందనుండనలాస్త్రంబున నద్దనుజవీరునిం జెగటార్చె సంతహతశేషులయిన రాక్షసులు రక్షోవల్లభునకెరుంగించినం గోపంబున దంతంబులు పటపటం గొరికి సమరోత్సాహసంపన్నుండగుయింద్రజిత్తుం గనుంగొని నీవీక్షణంబునం జని రామలక్ష్మణ సుగ్రీవప్రభృతులం గూల్చి రమ్మనిన వాడును యుద్ధసన్నద్ధుండై సైన్యంబులం గొని ॥

మధ్యమావతిరాగము- ఆదితాళము-

సాక్షాద్వ్యముడన వెడలెను రావణిసమరక్షోణికిని । అక్షీణోగ్ర

బలంబునగెలుచుటకగ్గలపెంపొంబమరనూనదీక్షాయు । తెరుచు
గధవళఛత్రముమెరయరధస్థలివెలయుచును । గరిమరంగపురవరునిబ
లంబులువెరపునబరువగనరుమగనాచరించు । సాక్షాద్యముడన ॥
గీ ॥ రథముతోడనదృశ్యుడై రఘువరులను । కపిబలంబులనుద్దం
డగతినితీవ్ర । నిశితబాణపరంపరల్ నిగుడఁజేసి । చాలస్రుక్కించె
రాక్షససైన్యముబ్బ ॥ క ॥ పిడుగులబోలెడిశరముల । కడువడిస్రు
క్కింపయన్నగనిలక్ష్మణుడి । ర్వ్యాడబ్రహ్మాస్త్రముచేఁజ । క్కడచె
దనికవీని । దనుజగణములనెల్లన్ ॥ గీ ॥ అనిననాకనికష్వసందరవ
ధియింప । జనునెడాగియున్నశరణటన్న । పరుచుచున్నగదిసిప్రా
ణముల్ బాపుట । కిలనుశూరులొప్పరిప్పనికిని ॥

వ ॥ ఇట్లుపలికిన యనంతరంబున నింద్రజిత్తుండవార్యశౌర్యుం
డై పిడుగులంబోలుబెడిదంపు తూపులనందరం బడలుపరచి సమ
రంబుచాలించి లంకకుంబోయి క్రమ్మరరణంబునంగూలిన కుంభ
కర్ణ ప్రముఖరక్షోవీరుల నాశనంబు మనంబునం దలంచి మా
యానైపుణ్యంబున సీతాస్వరూపంబునిర్మించి యాసీతందనరథం
బుమీదనిడుకొని రణరంగంబునకుబోయి హనుమత్ప్రముఖ కపి
బలంబులెల్ల కోపంబునమూకొనిగదసిచూచుచుండ యుద్ధవిశిరో
రుహంబులుబట్టుకొని జంపంగమకించుసమయంబున యాసాధ్వీక
న్నీరునించుచునిట్లనియె ॥

పున్నాగరాగము-అటతాళము.

హారఘువీరా । కావుమురక్షోవీరవిదారా । హారామరామనన్నీ
రాక్షసుండసి । ధారనుదెగ వ్రేయదపించుచున్నాడు ॥ నను బ్రో
వవేమి । హావల్లభనానేరమేమి । నినుజూచిప్రాణములనువుగవిడి
చెద । ఘనరంగపురవాసగనుపించుమొకసారి ॥

గీ ॥ పులిసమీపమందువెలయుచున్నకురంగి । చందమొందియు
న్నసకియజూచి । పవనజుండుశోకబాష్పసమేతుడై । బలికెనిట్టుల
నుచుపగతుతోడ ॥

శ్రీరాగము-అటతాళము.

విసర । బుద్ధివిసర । అపురావారి ॥ విసర ॥ హారాక్షస ॥ విస ॥

విసరానీవవసిసత్యనుపమ బ్రహ్మ। పావనవంశమునబుట్టివనితజం
పగనేల ॥వి॥ యీకార్యముకీడుదెచ్చునులంక। వీకశేయుదుసుపా
డు। నీకేమియపరాధమికాంత్తయొనరించె। నాకుజెప్పరదుమహా
దాశరదుశ్శీల ॥వి ॥ ౧ ॥ వలదుచంప్పవలదు। నిందలనొందవల
దు। తెంప్పవలదు। వలనొప్పనడవులవసియించిపతిబాశి । నలకు
వజెందియున్నదిగదుఃఖముతోడ॥వి ॥ ౨ ॥ యేరదువిక్షకార।యీ
విధమతిఘోరపాపమహార। యీరామనకటవిదారింబూనితి । వా
రక్షిజన్మఘోరాన్నదగ్ధముగాను ॥వి ॥ ౩ ॥తగునధర్మమగున।న్యా
యముదప్ప । పగునహింసదగున।సుగతిగోరకరంగేశుచెలిజంపిన।
నగణితలీలనిన్నపనిగూల్పకమాన ॥విసర ॥ ౪ ॥ ద్వి ॥ అనియిట్లు
బలుకంగనయ్యింద్రజిత్తు।వినిహనుమంతుని వేట్కతోజూచి। యొ
కాంతకై మీరలేతెంచినారొ।యీకాంతనిప్పుడేననిద్రుంతుననుచు ॥
కరమనను గ్రుడై ఖడ్గంబుదాల్చి । గరితనుదెగనేశెకతినాత్ముడగు
చు। సంతటకపులుయాహాకారమెసగ। చింతించుచునుభారచెలగి
యకపులు। వురికొల్పుకొనివాయుపుత్రుడయ్యెడను। కరమొప్ప
నసురులకడువడిద్రుంచి। శైలమొక్కటదెచ్చిశక్రారిమీద। కా
లాగ్నివలెమండికట్టలుకనేయ । సదిదప్పిపోవుటకరదంబుద్రిప్పి ।
వదిలుడై కపులదోర్బలమునవొంచె। హనుమంతుడంతటనతిశోక
మమర। గసిపల్కెకపికోట్లకన్నీరువెడల॥

ముఖారిరాగము-ఆదితాళము-

కదలిపోదామికనురండుకదనమేల। లోకకళ్యాణిగొల్పోతిమిక
విక్రమములేల ॥ తడబడుచున్నదినాపాదద్వయంబు । మనము
జలధిగడచివచ్చుటనిష్ఫలకరంబు ॥ ౧ ॥ ధరణినయయొనాశాత
లువ్యర్థంబులాయస్వామి । కరుదుగదువార్తదెలుప నహా
మాయ ॥ ౨ ॥ వలనొప్పశ్రీరంగపురనిలయుతోడ।దెలుపవలయు
సీతకైనవిధిజవంబుతోడ ॥ ౩ ॥ వ ॥ యిట్లుబలికి హనుమంతుం
డారాముపాలికరుదెంచుచుండె నింద్రజిత్తుండితైరంగుననందరం
దనమాయవలన మోహంబునొందించి నికుంభిలా హోమంబు
గావింపుచుండె రామచంద్రుండు పశ్చిమభాగంబునంగలిగిన మ

హారవంబాలకించి వెరగుపడి జాంబవంతుంగనుంగొనిహనువం
తుండు కయ్యంబుగావించుచోట రోదలువినంబడనయ్యెంగావున
నామనంబుగలంకుచున్నయది నీవరసిరమ్మనిబనిచిననతండుతీవ్రం
బునంబోయి మార్గంబునవచ్చుచున్న మారుతింగాంచి సీతావృ
త్తాంతంబువిని దుఃఖితుండయ్యె వవసజుండాసమయంబునంగన్నీ
రునించుచు రామచంద్రునింజేరవచ్చి రావణిగావించిన మహాకృ
త్యంబువిన్నవించిన ప్రచండమారుతంబునం బడినవృక్షంబు చం
దంబున నవనింబడి మూర్ఛిల్లినంజూచి కపిగణంబులాహాకారం
బున పద్మోత్పలసుగంధకలితంబగు సలిలంబు దెచ్చి మేఘశ్యామ
సుందరంబగు రామచంద్రునిశరీరంబు శైత్యోపచారంబుగాం విం
చిరంత ॥ గీ ॥ అన్నగనితమ్ముఁడత్యంతఖిన్నుఁడగుచు। బాహువులు
సాచికౌగిటబట్టినిల్పి।హరిరఘూత్తమ-నీకిట్టియార్తికల్గె।నేమిశేయు
దునైచ్చంగ్గిసిల్లక్ష్మీసింతు॥

ముఖారిరాగము-అటతాళము-

అకటధర్మముగావజాలదా। వోయన్నసీకాపదలాయ। ప్రకటధ
ర్మవ్రతపరుడవై జగతి। సత్యకంకసత్యశీలాదులగలసిన్న।కట॥
ఘనధర్మవర్తనటంచు। జగకున్నహాటదితూర్ణనటంచు। వసమున
కరుదేరవనితగోల్పడనాయ॥ మసిశొందినరాజ్యము మానితయ
యోని। న్నకట ॥ ౨ ॥ కరగతమౌట్టునదృశ్యంబు। వోదరమినగల
దెసుఖంబు। వరరంగనాధరావణుడుధర్మముదప్పి।నేరిసౌఖ్యమొం
దెనిన్నారశేదుఃఖములెల్ల ॥ నకట ॥ ౩ ॥ క ॥ ధర్మముసౌఖ్యమ
టంచున। ధర్మముదుఃఖంబటంచుధరజెప్పుదురా । ధర్మంబునసం
తాపము। ధర్మంబుననుఖములగుచుధరనిపుడొప్పెన్॥

క ॥ ధనవంతుడుత్తముడుభువి।ధనవంతుండతులబలుడుధర్మజ్ఞుం
డున్। ధనవంతుడవనిపూజ్యుడు । ధనవంతునకలరుహితులుతగు
బంధువులన్ ॥ వ ॥ అన్నా రావణివలనంగాబడినపాపకార్యం
బునకు ప్రతివిధానంబన్నదియ్యె కార్ముకవిముక్తచండ కాండం
బుల సకలరాక్షస సమేతంబుగా లంకాపురంబు భస్మంబుగావిం
చెదంగావున నీప్రభావంబునీవెరుంగి కూచుండి ధైర్యంబుగొ.

నుమని పలుకు మన్నావె డసిభీషణుండరు దెంచి సర్వవృత్తాంతం బె
రింగించి యింద్రజిత్తుండుతనమాయవలసంగావించినమిధ్యాకా
ర్యంబని తెలసిరఘువరుసకీట్లనిరె ॥

మారువరాగము-ఆదితాళము-

యేమయ్యారఘువర్యదుఃఖమేలనయ్య । సీత । భామాకుమంగళ
మయ్యాభక్తసేవ్య ॥ యెన్నగనబద్ధుమిక్కించ్చెనన్నమాట। నమ్ముకు
న్నరీతిగాదెనమ్ముకున్నమాట ॥ ౧ ॥ క్షేమమయ్యక్షేమమయ్యారా
మరామ। నీక్షేమమాత్మగోరుసీతరామరామ ॥ ౨॥ రావణిమా
యలునమ్మరాదుజగతి। వానిభావింపముజ్జగములందు ప్రకటమర్మ
తి ॥ ౩ ॥ వలదువలదులేనిదుఃఖమలఘుశౌర్య । రంగస్థలవిహారశే
షమేరుశైలధైర్య ॥ ౪ ॥ వ ॥ అనియువ్విభీషణంబునంబలికి మహా
ప్రభో రావణాత్మజుండిప్పుడు నిష్ఠాగరిష్ఠుండై నికుంభిలా హో
మంబుగావించుచున్నవాడా హోమంబునిర్విఘ్నంబుగా పరిపూ
ర్ణంబైన నజేయుండై వెలయుంగాన హనుమత్ప్రముఖకపిబ
లంబులతోడ సౌమిత్రినినావెంటబంపుడేను హోమంబు విఘ్నం
బుగావించి చంపించెదనని పల్కిన యవ్వాతెఱ కర్ణామృతంబు
గావిని రామ లక్ష్మణసుగ్రీవహనుమత్ప్రముఖుల పరిమి తానం
దంబునం జనుదెంచి విభీషణుంగౌగిలించ సంభావించిరట్టియెడ॥

సీ ॥ అంతటశ్రీరాఘవాజ్ఞచేలక్ష్మణుడింద్రజిత్తువధింప నెలమి
దలచి। ఘనబాణకార్ముకకవచఖడ్గంబులుకడువేడ్కతోదాల్చికడి
మిమెరసి । తనయన్నపదములు ప్రదక్షిణంబొనరించిమ్రొక్కి దీవన
లొందిముదము నెంది। శౌర్యబలాటోపశక్తిసంయుక్తుడై హనుమ
దాదిబలంబులాశ్రయింప । సచివయుక్తంబుగావిభీషణుడు వెల
య । బలములొప్పంగభల్లూకపతిచెలంగ । నంగదాదులుతనజ
యంబాత్మగోర। ననికివేంచెశేరఘుకులేంద్రానుజుండు॥

క ॥ చనిచనిరాక్షసస్సైన్యం । బనుగహోమముదోచ్చెనప్పుడసురు
లగచరుల్। ఘనకదనముసలిపిరిసురు। లనువుగనాశ్చర్యమొందనతి
దర్పితులై ॥ వ ॥ అంతటలక్ష్మణుండు విభీషణానుమతంబున పి
డుగులంబోలుభల్లంభులింద్రజిత్తుమీదవైచి రాక్షససైన్యంబు బలం

గలంచిన నింద్రజిత్తుండు గ్రుండై హోమంబుచాలించిరథారూ
ఢుండై చనుదెంచి విభీషణునకిట్లనియె ॥ గీ ॥ అన్ననైదబాసి నీచ
నరాధములను । చేరికులమెల్లరోయఁగ నసిగ్గువిడిచి । భృత్యభావం
బుగొంటివిపూజ్యమనుచు । నీచచారిత్ర గెలసెబోసి దుసడత ॥

గీ ॥ గరిమపినతండ్రివయ్యుండికరుణలేక । నరులగొనివచ్చితెక
టనీవవనినింద । జెందమదిగొంపాపాత్మచెనటివగుచు । కపులనిమ
రాఘవులద్రుంతుకడిమిమెఱసి ॥ వ ॥ ఇట్లుబల్కి నవిభీషణుండిం
ద్రజిత్తుంగనుంగొని ॥ క ॥ మునులవధింపుచుయన్యాయం । గనలను
చేరనిడెడియన్నకడనుండను నా । మనసోచుఁ నైదుష్టాత్మక । నిసుల
క్ష్మణుడిలవధించునిమిషములోనన్ ॥

కళ్యాణిరాగము-ఆదితాళము.

చెలగిలక్ష్మణేంద్రజిత్తులయ్యెడ । చేసిరనినగధైర్యులై ॥ తులగి
తులు । సింహములు గ్రహములు । ఘోరముగదలపడిన తెరగునలం
పడికరములను । కార్ముకములుకడుమెరయగను । తంక్రృతులలరగ
సేయుచును । శరములుచలమునబరపుచును । జలదతతులితరవము
లహుమ్మనుచును । బలిమిగజీఁలుచుపటునారాచము । లలుకనేసి
తనువులనోన్యోన్యము వెలయరక్తధారలందొరగింపుచు ॥ చె ॥ ౧ ॥ గ
రిమతోడనొకరిసినొకరలంపగ కాంతుగలిగిగడసి । సరగునవిశిఖ
ములురువడిగొనుటలు । చాపములనుసంధించుటవేయుట । లెరుగ
నలవిగాకన్ । సురగణమరుదుగగనవీకన్ । తూపులుచరుకుననాగి
దాకన్ । మూర్ఛలబొరయుచు । పొలిబోకన్ । వరమడగుచుదన
రినరంగస్థల । వాసునిసోదరుడసురేశునిసుతు । డిరువురుదుర్భరశ
రకాండములంబరమిలనిండగ గురుతుగనేయుచు ॥ చెలగి ॥ ౨ ॥

వ ॥ మరియు నవ్వీరవర్యులత్యంత మాత్సర్యంబున దివ్యాస్త్ర
ప్రయోగంబులుగావించిలోకంబులఘూర్ణిల్లఁజేయుచుశతసహ
స్రసంఖ్యాగు బాణంబులొక్కుమ్మడిబరగించుచుబోరునెడలక్ష్మ
ణుండైంద్రబాణంబుచాపంబునసంధించి రాఘవేంద్రునిపదకమ
లంబులు మనంబునందలంచి రామచంద్రుండుసత్యధర్మపరాయ
ణుండేనియు యిమ్మహాబాణంబింద్రజిత్తుని నిర్జీవుం గావించు న

ఖియేసెన ॥ క ॥ పెనుమంటలెగయశక్రా । శనితుల్యంబగుచువే గజనిరావణిశో। ఘనరత్నకుండలాంచిత । ఘనమస్తకమపుడుదు నుమశదువడిబడివెను ॥ గీ ॥ సురులుగురియించిరవ్వేడవిరులవా న। గరిమనాడిరిదేవతాకాంతలెల్ల । మునులుహర్షించిపొగిడిరి మొనసిసర్వ । వనచరానీకమత్యుత్సవమునవెలసె॥

వ ॥ ఆసమయంబున ॥ ద్వి ॥ హనుమద్విభీషణులత్యుత్సవమున । వినుతింపనారఘువీరునితమ్ము । డనువొందకపికోట్లనందరగూడి । చనితనయన్నకుసాగిలిమ్రొక్క । నంతవిభీషణుడారామచంద్ర సంతసంబునగాంచిజయమయ్యెమనకు। సమసెరావణినేడుసౌమి త్రిపలన। సమరస్థలినటంచుసమ్మతిజెప్ప । గరిమెతోతమ్మునికౌగిట జేర్చి। శిరమమూర్కొనికేలచెక్కిళ్లుదువ్వి।ఘనరుధిరార్ద్ర మౌకాయంబుజూచి। కనుదమ్ములనుసీరుగారంగహస్త । మునసంటుకొనుచుతమ్మునిపిలోకించి । నెనరుచిత్తములోననివ్వటిల్లంగ । నాయన్ననీవిట్లునావెంటవచ్చి । బాయకకష్టముల్బడితివిద్ధరణి । చెలగిదుర్జయునింద్రజిత్తునిజంపి। తలఘుశౌర్యంబుననానందమ య్యె । నేసింకవధియింతునిష్టురాస్త్రముల। పూనిదశగ్రీవుపాలు పెల్లదూల। ననిపల్కెనయ్యెడనాలంకలోన । తనయుండుజచ్చు టదైత్యులవలన।వినిదశగ్రీవుండువెసమూర్ఛనొంది।మరలచయ్యా నలేచిమానసమందు। వరపుత్రునయ్యింద్రవైరిదలంచి॥

పున్నాగరాగము-ఆటతాళము-

హావీరభూషణహావైరిహరణా। హాపుత్ర ఘోరతరాహవనిపు ణ॥ సరగుననసుబాసిచనన్యాయమగున । వరపుత్రనినుబాయవశ మునాకగున ॥ ౧ ॥ అహహానీవిక్రమమణగిపోయనుగ। యహహా నీశౌర్యమియ్యవనిగలసెగ ॥ ౨ ॥ మాయలన్నియునెచ్చోపమాయ నైచనెను । బాయరానినిన్నుబాసితిధరను ॥ ౩ ॥ వరరంగపతిపో దరుడుతూపులను। బోరిగొనెగదనిన్నుభువనభీషణుడు॥౪॥

ఇవ్విధంబునందుఃఖించి మహోగ్రక్రోధావేశంబున రాక్షసు లంగనుంగొని మత్పుత్రుండువనచరుల వంచించుకొరకులనమా

యువలన సీతాస్వరూపంబుగావించి తెగ టాచేఁ నేనియ్యోడస
త్యంబుగాసీతందెగవ్రేసెఖడ్గంబుగొని ప్రమదా వనంబున కరిగి
జానకింగాంచిరయంబునంజనుదెంచునెడయుద్ధవిహానిం గనుంగొ
నిదుఃఖింపుచు॥

సావేరిరాగము- అటతాళము-

ఏమిసేతునేమిసేతుహా మోహానాంగ । రామరామననువధిం
పరావణుడుగ్రుడ్డై వచ్చె ॥ నేమి ॥ యేలబొమ్మంటినిన్నలనా । దే
నుమాయామృగము వెంట ॥ యే ॥ యిట్టికష్టములకే కాదొ వెనుమ
రదినట్లాడుట ॥ ౧ ॥ నాథనీదానవై రక్షో । నాథుచేజావగనా
యు ॥ యే ॥ పావనివీపెక్కి పోక । ప్రతికూలములాడితి ॥ ౩ ॥
నిన్నుబాసియున్నవేళ । నన్నుబాములొందకున్నె ॥ శ్రీకరరంగ
పురీశ । కైకకోకేఁదీరెనేమో ॥ ౪ ॥ సీ ॥ వెలదిజానకియిట్లువి
లపింపరావణుఁడవనిజవధియింపనరుగుడేర । కనిసుపార్శ్వుఁడు
దశకంఠునకడ్డమైదనుజేంద్ర వనితనుధరవధింప । తగునయ్య ఘో
రపాతకకార్యమిదిమానుపగగల్గి ననురఘుప్రవరులైన । రామల
క్ష్మణులనిక్రేఁ మొప్పనిద్రుంపుమననిజాలయమునకరిగిసభ
కు । మరలజనుదెంచిరాక్షసవరులఁబిలచి । తురగసామజరథభట
స్తోమమలర । వేగమునబోయిశ్రీరఘువీర। వానరాదులనుజంపిరం
డుమీరాహవమున॥ ద్వి ॥అనియిట్లుబలుకనద్యసురులుబోయి ।
వనచరావళిదాకివరబాణఖడ్గ । ముసలముద్గరగదాముఖ్యముల్ప్ర
రపి । వెసజంపగనిరఘువీరుండుచాప । నినదంబుగావించినిర్జర
రిపుల । వెనుకొనిబహుబాణవితతులుగురిసి । కరులరథంబులకా
ల్బలంబులను । వరఘోటకంబులపడిదెగటార్చిఁ । ధరణిమహో
ద్దండదర్పంబెలర్పఁ । గరిమశోభిల్లంగగనిహతశేష । లరుదుగా
జనిచెప్పిరసురేంద్రుతోడ । కరమొప్పనంతరక్కసులవెలందు ।
లింటింటహాయనియేడ్చుచుపతుల । జంటబాసుటనువ్యాఘ్రులజెం
దువారు । తనయులనన్నలతండ్రులగూర్చిఁ । మొనసిదుఃఖాంబు
ధిమునింగెడివారు । వంచనగావించిపైజేహిదెచ్చి । ముంచెబో
యీలంకమాఖుఁడటంచు।నిందించినిట్టూర్పుఁనిగుడించువారు ।

క్రమమనమరణంబు కాంక్షించువారలగుచు మహాఖేదమతిశయిల్లం గ। మగువలెల్లనుగూడిమాటలమించి॥

మఖారిరాగము-ఆదితాళము.

యెంతచేటుగల్గెనమ్మ। వోయమ్మరాక్షసేంద్రుడెంతమూఖుడమ్మ । యింతిగోర్కె కకువరములేలయొసగెనమ్మ భర్త । కాంతతో శ్రీరాముడేలకానలకు వెంచేసెనమ్మ ॥ యెంత ॥ తప్పులెల్ల మనవేనమ్మ । పర్ణశాలకుచుప్పనాతిబోనేలనమ్మ । తప్పిపోయె బోరఘువరులతవిలికదియనేలకనుల। గప్పినదీనికామాంధకారమగ్నిపాలుగాను ॥ ౧ ॥ యేమినేరములులేకను । వనవాసుడౌ శ్రీరాముభార్యతాచేనేలను । యేమమ్మదానికే కాదసామీరిజలనిధిదాటి। భామతోభాషించియక్షునామమణచిలంకకాల్చె ॥ యెంత ॥ ౨ ॥ వినడాయెవిభీషణోక్తులు। మేఘనాధాదులని ద్రెళ్లిరద్భుతశూరులు। వనితరో రాముని రంగవాసుడనుచు దెలియడాయె। వినవమ్మ వీని క్రొవ్వెల్ల వెసధాత్రిదగ్ధమైపోను ॥ ౩ ॥

క ॥ యీరీతితనపురంబున। భూరివ్యసనమునబల్కుపాలతులపలుకుల్। యారావణుడాలింపుచు । ధీరతరణరంగమునకు తెంపునవెడలెన్ ॥ చ. ॥ కరులురధంబులశ్వములు కాల్బలముల్ తనవెంటనొప్పభీ । కరశరచాపఖడ్గపరిఘప్రకరంబులుదాల్చి । హేమసుందరరధమందుతావెలసిదర్ణమెలర్ణగవానరావళిన్ । సరసిజమిత్రవంశజులచంపుదునంచునుదగ్రమూర్తియై ॥

వ ॥ మహోదరమహాపార్శ్వ విరూపాక్ష ప్రభృతులతోడం జని యవ్వానరానీకంబులందాకి నిసితబాణపరంపరల వలన నాశంబునొందింపుచు దేదీప్యమానంబుగా వెలుంగుచున్నయెడసుగ్రీవుండరుదెంచి శిలావృక్షవర్షణంబున రాక్షససేనాక్షయంబుగావింపుచు విరూపాక్షుతో డందలపడి ఘోరసంగ్రామంబుగావించి ప్రాణంబులుబాపె నంతరావణానుమతంబున మహోదరుండురువడించి కపిసైన్యంబులంజీకాకుపరచినభానునందనుండత్యంతయత్నంబునంబోరిపోరి యవ్వీరునినిగతప్రాణుంగావించె నట్టియెడ ॥ సీ ॥ కోపంబుతోడమహాపార్శ్వుడయ్యెడవనచరావ

శిఖాకీవసుధఁగూల్చ। కనివాలిసుతుఁడుదగ్రతనివామాకొర్కఁగని స
మరంబుగావించిసంహరింప। రావణుఁడతులదుర్వారశౌర్యంబున
కాలాగ్నితుల్యుఁడై కపిగణములఁ। సమయింపుచునుఁడాయజానకీనా
థుండుతమ్మునిఁగూడిదోర్దర్పమమర। శరశరాసనములుఁబూనిస
మరమునకు। నిలిచియుండవిలోకించినిర్జరారి। విశిఖవర్షంబు
గురియింపవేడ్కఁగాంచి।బరపెసౌమిత్రి పటుబాణసంక్తులప్రుడు॥
ద్వి॥ రావణుండంతదుర్వారుఁడైమించి। పావకతుల్యమౌబా
ణముల్బరపి। రామసోదరుబాణరాజినుగ్గాడి। రామచంద్రుని
డాసిదాయమునను। సితసాయకముపెంజీకటిసేయ। నతికోప
మునరాముడసురేంద్రుతోడ। నతులవిక్రమమొప్పనిసేయఁజూ
చి। జతలేనిదీప్తితోసౌమిత్రిఘోర। శరములదైత్యేంద్రుసారథి
దునిమి। గురుతరధ్వజమిలఁగూలంగనేసి విలుద్రుంచెనసిమిషవీరు
లుమెచ్చ। వలనొప్పసవ్యాపసవ్యహస్తు। డగుచువిభీషణుడ
శ్వసత్రములఁ। దగఁగూల్పనాతఁడుస్పందమైశక్తి వెసఁదాల్చితమ్ము
నిప్రియంగనవ్వ। డనదృశకరుణార్ద్రయగురామతమ్ము। డరి
ప్రేంపనమరారియాగ్రహంబలర। పదిలంబుగానొక్కపటుశక్తి
బూని। యావిభీషణుఁజంపనాత్మఁదలంప।పావనుండగురామభద్రు
నితమ్ము। డాతనికడ్డమయ్యసురేంద్రుమీఁద।శాతమార్గణములు
చయ్యనఁగురియు। కనలిసౌమిత్రినుగ్రంబునఁగాంచి। నిసుధరాస్థలి
గూల్చనిక్కమీశక్తి।గనుగొనుమని త్రేయఁగనిరాఘవేంద్రు। డనె
తమ్మునికిస్వస్థియగునని ప్రీతి। సంతటశక్తిమహాధ్వనుల్దనర। విం
తగాదీనులై వేల్పులుచూడ। మంటలుగ్రక్కుచుమహిమసప్త। ఘుం
టికాయుక్తమైకడువడివచ్చి। రామానుజునిపెన్నురమునఁగాడ।
నామహామహుఁడంతనవనిపైబడియె॥ గీ॥ అవనిఁబడియున్నలక్ష్మ
ణునఁట్టెఁజూచి। జానకీనాథుఁడతిశోకజలధిమునిఁగి। సోదరియాతని
యురమునటుఁజొచ్చియున్న। శక్తిపెకలించిభంజించెజనవరేణ్య॥
వ॥ అంతటఁదశగ్రీవుండుదగ్రమనస్కుండై విశిఖపరంపరలవ
లన రాఘవేంద్రుగప్పందొణంగిన సైరింపుచుదుఃఖావేశంబునం
దమ్మునింగౌఁగిలించుకొనియువ్విరునిభక్తివిక్రమపౌరుషంబులుదలం

చి సంతప్తచిత్తుండై ధైర్యంబు గొని హనుమత్సుగ్రీవప్రముఖు
లంజూచి మీరెల్ల వారలు లక్ష్మణుంగాచి యుండవలయు నివ్వేడ
పరాక్రమంబు చూపుటకు కాలంబుగాని చింతింపనర్హంబుగా
దేను రావణుంగదసి మదీయవిక్రమప్రతాపంబులు జగంబులం
గీర్తింపుచుండ నారామత్వంబు గనుపరచెదనింక నీలోకంబు సరా
మరావణులమగు మాయిరువురలోన నొక్కరుండై యుండవలయు
నని బల్కి మహోగ్రక్రోధాతిశయంబున ధనుష్టంకారంబు గా
వించి చండకాండంబుల వ్వీరుని దేహంబు గాడనేయ నారాక్షసే
శ్వరుండు కొంతదడవు రామచంద్రునితోడ నద్భుతసంగ్రామంబు
జేసి రణరంగంబున నిలువంజాలక లంకాపురంబు సొచ్చెనట్టియె
డ ॥ గీ ॥ అంతసీతేశుడతిశోకమావహిల్ల । ధరణిబడియున్న తన
సహోదరునిజూచి। కన్నుగవనశ్రుకణములు గ్రమ్ముచుండ। చా
లవిలపించె వనచరుల్ జాలిబొంద ॥ ద్వి ॥ హా రఘుకులవీర హా మ
హాశౌర్య। హా రాక్షసాంతక హా సహజన్మ। నీకెట్టి యీ యవస్థ నేడు లక
లై। నాకు రాదాయ గా నాతండ్రి నీకు। కలగుణంబుల నెల్ల క్రచ్చె
రబోగడ। నలవియేముక్కంటినలులలకైన। గరిమతో నను బ్రోవ
కాంక్షింపవేమి। సరగుణ తేలెమ్మ శక్రారిహరణ ॥

వ ॥ ఇట్లు బల్కి సుషేణుంగనుంగొని ॥

సురటరాగము. ఆదితాళము.

ఏమి సేయుదు సుషేణ। నాదుఃఖమెట్లు దీరును సుషేణ। సౌమి
త్రి నా బహిశ్చరప్రాణమన నొప్పి। తా మహీస్థలి ప్రాలిపెల్లడను
గలిగించె ॥ ఏమి సేయు ॥ నేనెంత దురితుండనో। పూర్వమందెట్టి
చరితుండనో। నేనెంత దుర్దశాన్వితుడనో। లేకున్న దానవేంద్రు
నివలన తమ్ముడిల గూలునా ॥ ఏ ॥ ౨ ॥ సమరమిక నాకేలను। దై
త్యేంద్రు సాధించుటదియేలను। కమలాక్షి సీతనికనైకొన్న ఫలమే
మి। విమలరంగస్థలిని వెలయు తమ్ముని బాసి ॥ ఏ ॥ ౩ ॥

వ ॥ ఇవ్విధంబున విలపించు రఘువరేణ్యునకు సవినయంబుగా
సుషేణుండిట్లనియె ॥

శుద్ధకాంభోదిరాగము - త్రిపుటతాళము.

సకలజ్ఞుడగునీకుజనునయ్యోయీచింతజనకజారమణరామ ॥ ప్ర
కటుడగుసౌమిత్రికకటశవచిహ్నా లేదికమానుదుఃఖమేలచాల ॥స
క॥ శరదిందుసమముఖస్థలినొప్పెనదెసు ప్రసన్నాదిలక్షణములు ।
కరపద్మములరక్తకాంతులొప్పచునున్నవరుదార భయములేదు లే
దు ॥సక ॥ ౧ ॥ కనుదమ్ములత్యంత కరుణా ప్రసన్నశోభనములై
పొలుపొందెను। ఘనమైనహృదయముశ్వసనయుక్తంబగుచుదనరె
నిదెరిపువిరామ॥రామ ॥ ౨ ॥ మృతుడుగాడితనికతిమోహానాక్ర
మించెనితడుదీర్ఘాయువమరి । నుతికెందుశ్రీరంగపతిసోదరుం
డనగనతజనగణార్తిదూర॥ధీర॥సకలజ్ఞ ॥ ౩ ॥

క॥అనిభాషించియునంతట। హనుమంతునిజూచిరఘుకులాధ్యక్షుని
త। మ్మునిప్రోపుమౌషధంబులు। ఘనకరుణామతినిదెచ్చికళ్యాణ
ముగాన॥

కందార్థము.

మునునీకుజాంబవంతుడు। పనిబడివివరించె ద్రోణపర్వతమున ।
సొంపునవెలుగుయౌషధంబుల । కనువుగజనితెచ్చ తెరవులగవరధీ
ర। నీవచటికిజనుముపెంపార। మాకోర్కెలింపుననుచేకూర। ఘ
నతరశ్రీరామకార్యధురంధరు। డననౌషధములుచయ్యనదెమ్ము॥
అగవరధిర ॥ ద్వి ॥ కరమొప్పసంజీవకరణిసావర్ణ । కరణియు
సంధానకరణివిశల్య । కరణియనందగుఘనతరౌషధులు । పరగ
ద్రోణాద్రి పైభాసిల్లుచుండ । పర్ణములెల్లసఫలములుపచ్చ ।
వర్ణింపనెన్నవరపుష్పవితతు। లరుదారరాత్రులసగుపడుచుం
డు। గురుజవంబునబోయిగొనిరమ్ము లీల। భానూదయంబైనబాగు
గాదెన్న । పూనియంతకుమున్నెపొసగనేతెంచి। కావుముమమ్మె
ల్లకడుదూరమిటకు। పోవయ్యపోవయ్యభువనంబులందు। చారువి
క్రమధైర్యశౌర్యపూర్ణుండ।వారయనినుబోలరవనియందువీరు । ల
నిసన్నుతింపంగనంతసీతేశు।డనువుగాబల్కెహనుమంతుతోడ॥

భైరవిరాగము-అటతాళము.

హనుమంతనిన్ను ప్రార్థనసేతునోయి। కనికరములరనన్గావగ
దోయి। వరమతిద్రోణపర్వతముదేవోయి।సరగునభ్రాతృభిక్షము

బెట్టవోయి ॥ ౧ ॥ నీవీకార్యముసేయ నేతురావృళీల। నీవిక్రమము
బల్కనేరనుచాల ॥ ౨ ॥ పదపడినేడీయాపదదీచరావోయి । పద
లకనీమేలువచియుంతునోయి ॥ ౩ ॥ తన్నులలోనొక్కతమ్ముడవీ
వు। రమ్మువేగమెకౌగిలిమ్మికనీవు ॥ ౪ ॥ వరరంగపురమునవసియిం
చియున్న । పరమునినన్నికపాలింపుమన్న ॥ ౫ ॥

గీ ॥ యిట్లుబల్కినహనుమంతుడెగసియార్వ । లంకగంపించె
దిక్కులల్లాడెమిన్న । బగిలెజలధులుకలుషించెపర్వతములు। ధర
ణియనుచంచలమునొందెతత్క్షణమున ॥ ౬ ॥ ఆసమయంబున దే
వతలుపుష్పవృష్టికురియించి రంబరంబున దుందుభి స్వనంబులు
మ్రోసెనంతటనాంజనేయుండాపన్నావారణుండగు రామచంద్రు
నింజూచిసవినయంబునంగృతాంజలియైయిట్లనియె ॥

నవరోజురాగము. అటతాళము.

యింతచింతయేల। దేవరవారి। కింతచింతయేల ॥ చింతసేయ
కుముదారాంతవిక్రముడన। సంతశౌర్యుహనుమంతుడనేగల్గ ॥
యింత॥ దీనభావమేల । ద్రోణాద్రినిదెత్తువేగలీల। ప్రాణిశైలా
ర్ణవభూతసమేతమై। గానబడెడుభూమినైననేపెకళింతు॥ యిం
తచింత ॥ ౧ ॥ కరుణబ్రోవవయ్య । నీబంటువిక్రమముజూడవ
య్య । కరమొప్పునీనామస్మరణబలంబున। పరిపంథిహరణమేపని
మైనమొనరింతు ॥ యింతచింత ॥ ౨ ॥ తనువుసీదిసుమ్మినీచరణాబ్జ
దాస్యయోగమిమ్ము। అనఘరంగేశనాకనుమతిమొనగుము। జనితెత్తు
నావద్రాద్రినినిమేషములోన ॥ ౩ ॥

భైరవిరాగము. ఆదితాళము.

ఇదిగోనెగరితిని। దేవరపదములదలచితిని। పదములకనదమలహృ
దయంబుననిను। ముదమునదలపగనెదురున్నదెభువి॥ దండిమగం
డనుచు। వేల్పులతండములనకొనుచు। నుండగనేనుద్దండబలము
న। నజాండంబైననుచెండాడంగల ॥ యిదిగో ॥ ౧ ॥ కడువడిజని
కాంచి। పర్వతముడుగకపెకళించి। తడబడకనుతలనిడుకొనివిమ
తులు। వదవదవదకుచునదలగవెదలెద ॥ ౨ ॥ సురవరనుతచరణ।

దుర్భరతరరాక్షసహరణ। హరవిధిముఖరులునరిబోలరు నీను।వ
రరంగస్థలవాసుడవరయగ ॥నిదిగో నాగరీతిని ॥ ౩ ॥

వ॥ ఇట్లుబల్కి రఘుపతేణ్యానకు ప్రదక్షిణనమస్కారంబులు
గావించి దీవనలొంది యుద్దేవుండు జగన్మోహన దివ్యమంగళస్వరూ
పంబునిజహృదయాబ్జంబున నిల్పుకొని వానరకోటులచ్చెరువొం
దిచూచుచుండ దేవతలాకసంబున జయజయధ్వానంబులుగావిం
వింపయొప్పారప్పక ఉప్పొంగి యుప్పరంబునకెగసి పోవుచుండెన
ట్టియెడ ॥ సీ ॥ హనుమంతుడేగుటవినిదశగ్రీవుండుకార్యవిఘ్న
మొనర్ప నగరిమెదలచి। కాలనేమినిబంపకఘువడిజనివాడుమార్గ
మధ్యంబునమానియగుచు। మాయామయాశ్రమమధ్యభాగంబు
నతాపసోత్తమురీతితపముసేయ। నచటికేపవనజుండరుదెంచియా
దైత్యు। కపటకృత్యంబెల్ల నపుడెరింగి। మకరిభంజించియచ్చరమ
గువ బ్రోచి। పటుపరాక్రమమలరనప్పవనజుం। సుగ్రగతిడా
సిపోరాడియుర్విగూల్చి। శీఘ్రముననేగెవానరసింహుడంత॥

వ॥ ఇవ్విధంబునంబోయిపోయి కుశద్వీపంబుదాటి క్షీరసము
ద్రంబుగడచియుత్తరభాగంబుననొప్పారుచంద్రద్రోణగిరులం
గాంచి ద్రోణశైలంబుమీదికింజని మహౌషధాన్వేషణంబు
సేయందోణంగినసద్దివ్యౌషధులదృశ్యంబునొంది.కనుపడకున్నన
ప్పర్వతేంద్రుతోనిట్లనియె॥

కందార్థము.

గిరివరరఘువరుడనుపగ। గుణుజవమునవచ్చినాడగురుతుగనా
కుం। నిరుపమదివ్యౌషధులిక। కరుణనుగనుపరచివేగగావుము।రా
మానుజుని బ్రోవుము॥తరుచుగనిసుమదిదలచెదనాకిపు। డరుదుగ
నౌషధులన్నియొసంగి ॥గావుము ॥ వ ॥ అనినయాశైలేంద్రుం
డు దుర్వారగర్వాతిరేకంబున బలుకకుండిన ॥

చ॥అనుపమరౌద్రముప్పొదలనద్రివరుంగనిదుష్టబుద్ధితో । ననుపుగ
బల్కవైతివిరయంబుననిన్నెకళించిలీలతో । ఘనతరపుష్పకందుక
ముకైవడినెత్తుకరాముపాలికిం।జనినిలిపింతునగ్గలువశత్రుడువచ్చి
నగానిదుర్మతీ ॥ గీ ॥ అనుచుతనవాలముననద్రినట్టెజుట్టి। బలిమి

పెకళింపనబ్ధులుకలఁగెధరణి।యొరిగెసురదంతులటుత్రెళ్ళ గ్గిగిరులు
గదలెనహికులేంద్రుఁ డుడువంగెనయ్యవసరమున ‖

వ ‖ అంత సమ్మహోత్కరంబుదాల్చి సింహనాదంబుచేసిన ప్రళ
యాగ్నికల్పులగు చిత్రసేనాదిగంధర్వకోట్లవీరునిదాఁకినొప్పించిన
నుగ్రుండై వాలంబునకొందరింజుట్టి నేలంగొట్టియు కొందరింబి
డికిటఁబోట్లవధించియు కొందరి దరుపాషాణంబుల భంజించియు
నిర్విఘంబునం జీకాకు పరచి పలాయనంబు గావించి గగనమా
ర్గంబునం జనుదెంచుచున్నసమయంబున ‖ ద్వి ‖ హనుమంతు
డీరీతిసరుదెంచుచుండ। మొనసినంది గ్రామమున నొప్పభరతు। డా
రాత్రిమున్వప్నమురుమగాబడసి। శ్రీరఘుపంకజాక్ సీతయు సడవి।
కరుదుగాజసనిండగావచ్చె సింగము । సమయము స్వప్నలచారితంబు
తెలియు। దమలాత్ములగుచు నేందుజవినుగాన్నరో। స్వప్నాకియాపద
సను కూరునాకొ్కౖ। కామినీమణిలోకైక్యమణిసీత । యేమాయ
నోరాఘవేంద్రునితమ్ము । డేమికష్టముతోడ నెందున్నవాడొ। తె
లియదాయనటంచు దీనత్వమొంది । వలనొప్ప బ్రాహ్మణవర్గం
బులకును। కలదానములు జేసిఘనజపహోమ । శాంతులుగావిం
చిసారెకునదిని। చింతనొందుచునుండ శ్రీహనుమంతు । డాసమ
యంబుననంబరవీధి। ఘాసిల్లుచునువచ్చిభరతునిజూచి। రాముబో
లినయట్టిరాజర్షియనుచు। వేమరుమదిలోనవిస్మయంబొందె। భ
రతుడవ్వీరునిపదపడిజూచి । వరభూతమిదిదీనివధియింతుననుచు ।
శరముకార్ముకమునసంధింపగాంచి । వరమతినశరీరవాణి యిట్లని
యె ‖ క ‖ వినుమీతడాత్మబంధుడు। ఘనశరమేయంగదగదు కా
వుమనగ। సయ్యనకులుడు కోపముడిగెను। చనెవాయుతనూజుడం
తజవములరంగన్ ‖ గీ ‖ రావణుండుబనురయమునమాల్యవత్ప్ర
ముఖయాతుధానబలములెల్ల । నాంజనేయుతోడనగ్ధిపైపోరాడి ।
విఫలులైరియతనివిక్రమమున ‖ వ ‖ అంతరఘువరుండు దివ్యౌ
షధపర్వతధరుండగు। హనుమంతుని ప్రభాపుంజంబరుణోదయం
బనితలంచి। శోకంబుప్పతిల్లలక్ష్మణుంగాంచి॥

ఉదయరాగము-ఆదితాళము.

ప్రకటముగ నరుణోదయప్రభ। పరగ తూర్పునానన మెరెనికనె ॥ సకటతమ్ముడ నిన్ను బాసితినవనియందు । సుకరమగు నీముద్దుమొగమిక చూడకరువుగదన్న । నీవింపుక కనుంగవ దెరచి చూచిన సుఖము గొందు ॥ ౧ ॥ చెలగి వనముల నఖిలసేవలు సలుపుచును రెండవభుజంబన। వెలసి యిటు ననుడించి చనుటిది విహితమగునె। పలుకు మొకపరి వెంటవచ్చెద నలుకలేటికి నిలువనిచటను। సలినమిత్రునకొంత పగతుడనై తితండ్రి ॥ ౨ ॥ వనమునకు ననునమ్మి నిను బనిచిన సుమిత్రకు నేమి జెప్పుదు । ఘనమతిని భరతునకు శత్రుఘ్ననకు నేమందున్ ॥ ధనువు శరములు గొని మహోగ్రతర దనుజవరులను గదిసి తునిమిన । నినుధరం గోల్పితి శ్రీరంగనిలయుడనయ్యెన్ ॥ ౩ ॥

గీ ॥ శరణుబొందిన యావిభీషణునకేను । పట్టమరంగ గట్టితి పరగమున్నె । శరణిన దిచ్చెనేనందునై వగతికి। సత్యహీనుడనైతిబో జగతియందు ॥ క ॥ వనచర సేనలతోడను । జనుమిక కిష్కింధకీపు సరగుననాకై । వనరాశిగట్టి దనుజుల। మనిమితిమవశీలనతులదోర్దర్పమునన్ ॥ గీ ॥ అనిన సుగ్రీవుడా రాముననిట్టజూచి । మానవేశ్వర శోకంబు మానుమిపుడు। సరగునను జొచ్చె నాలవరుఘాముపవన। తనయుడికశీఘ్రము నవచ్చు తడయకతడు ॥

వ ॥ యిట్లుబల్కినయనంతరంబున దివ్యౌషధశైలంబుతోడ ధగద్ధగితప్రభా భాసురుండై చనుదెంచు హనుమంతుంగని మార్తాండుండరుదెంచెనని శంకించి ప్రళయసమయ మహోదగ్రవిగ్రహుండు శుభగుణచందంబున రౌద్రరసోల్లసితమూర్తియై సుమిత్రాపుత్రరక్షణార్థంబునకై మహౌషధాద్రికిం జనిన హనుమంతుండరుదేరకమున్నె మార్తాండుండుదయించుచున్నవాడు మదియ్యదివ్యాస్త్రంబునవీనింద్రుంచి లోకంబ రాత్రుసంబుగావింతునని మహోద్దండంబునం భ్రుకుటిస్ఫూర్జితనిటలుండై కోదండంబుగొని రౌద్రాస్త్రంబు సంధించినంజూచి జాంబవత్సుగ్రీవవిభీషణప్రముఖులతిభయంబునం దత్తరపడి వినయంబున హస్తంబులు ముకుళించి మహాప్రభో నీవు రౌద్రాస్త్రంబు సంధిం

చుటవలన నఖిలసురగరుడోరగ గంధర్వ సిద్ధసాధ్య ప్రముఖనివ
హంబులు దిక్కుల కుంచారుచున్నవారు గిరికాననసముద్ర ద్వీప
సహితంబగు ధరామండలంబు గ్రక్కునంగదలుచున్నయది యొ
క్కరికై భువనత్రయసంహారంబు సేయనేలగరుణింపు మతండు
సూర్యుండుగాడు దివ్యౌషధనగధరుండగు హనుమంతుండు సూ
ర్యునిచందంబునవచ్చుచున్నవాడనిపల్కునసమయంబునమహీమం
డలంబునకరుదెంచినభానుండునుంబోలెపవనసందనుండరుదెంచి
పర్వతంబుడించి రఘువరునకిట్లనియె ॥ సీ ॥ శ్రీకరరఘుకులక్షీరా
బ్ధిచంద్రమవలనొప్పనీయాజ్ఞదలధరించి। సుసలకపోవంగమార్గ
మధ్యంబునగలిగెననేకవిఘ్నములునాకు। గరిమెనీనామసంస్మరణ
చేనవియెల్లభంజించి ద్రోణాఖ్యపర్వతంబు। జవమునజేరియాశై
లేంద్రమునవోషధులుగానలేకదో బలముపలన। కొండగొనివే
గగంధర్వకోట్లగెలిచి। వచ్చుచున్ననిశాచరవర్గవార్ధి। మధ్యము
నదాకనవలీలమడియజేసి। గట్టిదెచ్చితినిన్నుగావవలయు ॥

వ ॥ అనినరఘువరుండిట్లనియె ॥

మొదుకులకాంభోదిరాగము- ఆదితాళము-

హనుమంతనీవనుపమపుణ్యాత్ముడవోయి। మానుషసమతిప్రా
ణములిచ్చికాచితివోయి॥ అతులవిక్రమ ప్రతాపాత్వపుడవునీవు।నీ
కుజతలేరుభువనములగుణాభిరామతిజాలువీర ॥౧॥ శ్రీరఘువంశము
ద్ధరణజేసినాడవు। నీవు। శూరరాక్షసులనుజంపినాడవు ॥౨॥
యెలమితోనీయుపకారఫలమునంత్యమును। రంగనిలయముననిన్ను
మదినిదలచుచునుందు ॥ ౩ ॥ వ ॥ యిట్లానతిచ్చిన యనంతరంబు
న సుషేణుండుసుగ్రీవానుమతంబున సత్వరంబుగ పర్వతంబు మీదికిం
బోయి విశల్యకరణింగై కొనివచ్చి దానిరసంబున లక్ష్మణునకు ప
యోగంబుగావించిన నవ్వీరుండు సుఖనిద్రితుండై మేల్కన్నచం
దంబునచయ్యనలేచి రఘువరునకునమస్కరించిన నమ్మహానుభావుం
డతని గాఢాలింగనంబు సలిపి మూర్ధాఘ్రాణంబుజేసి పరమా
నందంబునసుషేణుంగొనియాడెనంతహనుమత్సుగ్రీవవిభీషణజాం
బవత్ప్రముఖులత్యంతసంతోషంబునం గంతులైచిరి తక్కునక

పులుకిలకిలాశబ్దంబులదిశలుపూరింపంజేసిరి గగనంబున దేవతలు పుష్పవృష్టిగురియించిరి దుందుభిధ్వానంబులానచిరంత నాంజ నేయుండురామాజ్ఞవలనద్రోణాచలంబుగొని యథాస్థానంబు నంజేర్చి క్రమ్మరంజనుదెంచి నట్టియెడ ॥

సీ ॥ తమ్మునిజూచిసీతానాథుడనుసుమిత్రాత్మజనీవుఘోరాహవమున । రావణుశక్తిచేరయమునధరవ్రాలియున్న నేనొందితినుగ్రదుఃఖ। మీవులేకున్ననాకేమిటికిదేహమేటికిసౌఖ్యంబులేలసీత। యనిబల్కలక్ష్మణుండారఘుత్రామణిగని నీపదాబ్జముల్ గాంచువారి। కనఘభయమేమినమ్మినయావిభీషణాఖ్యుబ్రోవంగవలదెనీవసురపతిని। జంపుమవలీలయాతండుజచ్చియున్న। తలలుజూడంగవేడుకగలిగెనాకు ॥ ద్వి ॥ అంతటలంకేశుడమరులగెల్చుటకు।చింతించిశుక్రునిసేవించిధైర్య। మునరొక్కహోమంబుమొనసి చేయంగ। మనమునదలచినర్మ్మతితోడఘోర। పాతాళతుల్యమైభాసిల్లుగుహకు। ఖ్యాతిగానసురులకావలిబెట్టి। వలనొప్పలోపల వసియించియంత్ర। పరిధలంచితబిల్వభల్లాతకాది। వరసముచ్చయములువరుసగాగూర్చి। కొమరొప్పదధిమధుఘృతరక్తమద్య। మమితంబుగాపాత్రలందుండజేసి।కాకకుక్కుటగృధ్రకంకసేనముల। వీకతోతెప్పించివిమలమానిష్ట। నసలసన్నిధినుండియవివేల్చుచుండ। హోమాగ్నులనుధూమముద్గతివెడలి। భీమంబుగానింగిపెలుచనుండంగ। కనివిభీషణుడుశ్రీకాకుస్థుగాంచి। వినయమెలర్పంగవెసనిట్టులనియె। నినుగెల్వనేరకనిజరారాతి। పనిబడిభార్గవుప్రార్థించియతని। యనుమతిగొనిహోమనూరూఢిసేయ మొనరనిండెనుధూమమున్ర్వియుడివియ। యిదివిఘ్నమొనరింపనిపుడెకతర్వ్య। మదిపూర్ణమైనచోనతడభేద్యుడు। కావునపవనజాంగదముఖ్యకపుల। వేవేగబనుపుమువిఘ్నంబొనర్ప ॥

చ ॥ అనవినిరాఘవుండుపవనాత్మతనూజునివాలినందనాద్యనుపమ। విక్రమాన్వితులనచ్చటికంపగవారుదగ్రులై। జనిచనిలంకజొచ్చిదనుజప్రకరంబులనుగ్రగూల్చుచుం। కనకకవాటముల్విరుగద్రొక్కనదన్నుచునుబ్బియాచణచును ॥

వ॥ ఇవ్విధంబున హనుమదాంగద మైందద్వివిధశరభపనసగజ గవయ గవాక్షనలనీలశతవలి ప్రముఖ వానరకోట్లుప్పరంబుననల్ల డలందిరుగుచు దవ్వారికులం జంపుచు రథంబులు నేలం ద్రిప్పివై చుచు ఘోటకంబులమదిఁ౯ంపుచు మాతంగంబులను డియంజేయు చు నాయుధంబులువిరిచివైచుచు భాండాగారంబులుసొచ్చి ధనం బులుపారంజల్లుచుగనుపడినదైత్యవీరులంబట్టుకొని రావణుంజూ పుమని కరిసంబులగుబిడికెటిపోట్లం బొడుచుచు నివ్విధంబున విహ రింప విభీషణపత్నియగుసరమచనుదెంచికరసంజ్ఞవలనరావణుం డున్న ప్రదేశంబుకనుపరచిన వానరవీరులచ్చోటికిజొచ్చి పోయి రావణుంగాంచి హోమద్రవ్యాదులగ్నిగుండంబుసంవైచియద్ద శకంతునింగొరువులంగాల్చియు నఖంబులంజీరియు దంతంబులగ రచియు ననేకవిధంబులంబిడయొనచిఁ౯న పర్వతంబునుం బోలె ని శ్చలుండై యున్నసమయంబున యంగదుండంతఃపురంబునకరిగి దురంతచింతాక్రాంతయై కరతలంబు చెక్కిటంబెట్టుకొని రామ లక్ష్మణులవిక్రమవృత్తాంతంబుతోడిచేడి యలకుముచ్చటలొప్పం జెప్పుచున్న మండోదరింగాంచిసింహంబుకరింబొదివిన చందంబు నం గదిసిశిరోరుహంబులు కేలంబట్టుకొని రాక్షసేంద్రునిసమీపం బునకుంగొనిపోయియిట్లనియె॥

శంకరాభరణరాగము- అటతాళము-

ఇదిగోతెచ్చితిచూడర। నీదేవినిం। పొదవచెచ్చెరబోవర॥ యి దిగోతెచ్చితిరదమఁ౯దచిత్తనీముద్దు। సుదతినినిజఁ౯రసుదతులుత్స వమొందర॥నిదు॥ ఘోరతరాటవిని। వంచనజేసిశ్రీరామప్రభుస తిని। చోరవృత్తిహరించితాఁ౯తిగాదునీ। వారెల్లచూడదుర్వారవి క్రమమొప్ప॥ నిదుగొ ॥ ౧ ॥ ధ్యానవనిష్టులుమానర। శ్రీరాము బాణానలమునగూలర । మానులనలయించిమగువలచెరనుంచి। పూనినీవరిగినశోకలనుభవింప ॥నిదుగొ ॥ ౨ ॥ మానసత్వమికచా లుర। నీక్రొవ్వెల్ల మాన్పకపోబోమురా।మానితశ్రీరంగమందిరపతి యగుభానుకులేంద్రునిపదపద్మస్మరణచే॥నిదుగొ ॥ ౩ ॥

కొ(ని)డుటాత్మ నెరుంగ। వతఁడు జగన్మోహనుఁడాదివిష్ణుండు। సతత చిదానందశాశ్వతమూర్తిఁ। గావునవిజయంబుగైకొనునతఁడు। నీ పురణంబున నెరి గూలగాంచి। పావకశిఖలలో బడసాంకుగూడ। దదియెట్టులన్ననాకధిపమాతంగ్రి। ముదిమియు మరణంబు మును కొనిలేక। వెలయుచుండెను నమృతపానంబు నగ। చలమేలమునకింక సౌఖ్యంబులేల। వలనొప్పయింకనైన హితోఁడు। జలజాక్షుఁడగు రామచంద్రునకొసగి। నతనికి మునివృత్తివాసంబు జేసి। ఘనని‌ష్ఠ తపములుగావింతమింక ॥ వ ॥ అనిపల్కిన వింశతిబాహుండు మండోదరితోనిట్లనియె ॥ క ॥ హరిరాఘవేంద్రుఁడనుచును। సిరిజ నకతనూజయనుచు। చిత్తములోనం। గురుతెరిగియురఘుపతిచే। నరుదుగమృతిగోరితెచ్చితవనితనూజఁ ॥

సీ ॥ పరకాంతలనుబట్టిచెరబెట్టివాక్రువ్వరాని దోషంబులు పూని చేసి। గరుడగంధర్వఖచరకోట్లబాధించి పాటగామునులను గీడడంచి। మునినైతినని దొడ్డవసమునకిపుడేగనతివెరోతగునెనదియు గాక। నింద్రజిత్ప్రముఖులనెల్లముందుగజంపి జంపించి జీవింపజను నెఘోర। సమరమొనరించి రాఘవు సంహరింతు। సంహరింపగమడిసిన సరసిజాక్షు। బాసివర్తించు పత్నిని భాతితెరువు। విడిచినిలిచిన లతికైకై వడినిసీవు। శుభవిహీనలేనొప్పుము సుందరాంగి ॥

వ ॥ ఇట్లుబల్కి మండోదరింవిట్కొని మహోగ్ర కారుండై సభాస్థానంబు ప్రవేశించి॥

నాటరాగము-జంపెతాళము.

ప్రస్థానభేరిమ్రోయించెఁ। దేవతలుస్వస్థానములుమానిచంచలమునొందఁ। ఆస్థానమంటపమునందు రావణుడు ధైర్య స్థైర్య మునమించిరణరంగమునకేగ ॥ ప్ర ॥ జలరాసులెల్లఘూర్ణిల్లఁ। వలనొప్పరంగపురసిలయునివర్ధింతునని చలమునమహోగ్ర బలశౌర్యసంపన్నుడై ॥

మధ్యమావతిరాగము-అటతాళము.

అగ్రహారసపూర్ణవిగ్రహుఁడగు దశగ్రీవుడువెడలెఁ ॥ సుగ్రీవప్రముఖులసూర్యవంశజులనత్యుగ్రాహవంబుననిగ్రహింతు న

ఉంచు ॥నాగ్రహ॥ ఘనతరమైకోటిద్వయఘంటికాఘణంఘణర
వప్రకటితమై। మొనసిషోడశచక్రములు సహస్రాశ్వములనువొం
దురథముచయ్యననెక్కియాచుంచు ॥నాగ్రహ॥ ధళధళమెరయు
రత్నకిరీటములుపదితలలందుబెంపారగ। సలలితకుండలాంగదహా
రభూషణావళులొప్ప శ్రీరంగనిలయుమాకొనసువేడ్క॥ నాగ్ర
హ ॥ వ ॥ ఇట్లు దశకంఠుం డకుంఠితవైభవంబున రాహుమస్త
కధ్వజత్రయ శోభితంబగుమహారథంబమితోత్సాహంబుననెక్కి
చంద్రహాసతోమర పరిఘ పట్టిస ప్రాస శూల ముద్గర భిండివా
ల బాణ బాణాసన ప్రముఖంబులుదాల్చి కాలకేతుండనుసూతుం
డు రథంబుగడప ఖడ్గరోమసహరోమ వృశ్చికరోమాగ్నివర్ణు
లను మహావీరులుగ్రమనస్కులై సాహాయ్యంబుగా వెనువెంటజ
నుదేర చతురంగసైన్యసమేతుండై ఘనధరాగ్రక్కదలం జనుదెంచి
యవ్వానరానీకంబులందాకి నయ్యిరుబలంబులకు పోరు ఘోరం
బయ్యె నట్టియెడ ఖడ్గరోముండువిజృంభించివానరుల వధింపం
జూచిన నాంజనేయుండు వానితోడంగొంతదడవు కయ్యంబుగా
వించిగీటడంచె నాసమయంబున వాలిపుత్త్రుండు సహరోముని
కాలు ప్రోలికింబంచె నీలుండుదగ్రుండై వృశ్చికరోముసవనింబడ
వైచెనట్టియెడ ॥ గీ ॥ అగ్నివర్ణుడంతనాగ్రహంబున। విలయా
గ్నిసదృశుడగుచు । నరుగుదెంచిరాముమీదబాణరాసులుబరగిం
ప। వారుణాస్త్రమునను వానిద్రుంచె ॥ క ॥ కనుగొనిరావణుడు
ద్య। ఘనతరవిలయార్కుబోలికాఘస్థకులేంద్రుని । సామీప్యము
నకువడితనయరదముబోవచేసితగనిట్లనియె ॥

ద్వి ॥ వినుమురాఘవదైత్యవితతులనవని। దున్మితివనిచాలత్త్రు
ళ్లైదవీవు। నీనిక్కలణగంగనిన్నశిగాల్చి । పూనినిజహరకోట్లభువి
వణకింతు। నరభోజనుడనేనునరుడవునీవు। సరిలేనివాడరాతుసకు
లేశుండు। సురపతిప్రముఖులన్నిక్కించిగెలిచి। ధరణికైలాసభూ
ధరమెత్తినాడు। పరగమద్భుజశౌర్యపటుదర్పములకు । వెరచిపా
రుదురెట్టివీరులియ్యిలను। నీవరణ్యంబుననివసింపలేక। చావవచ్చి

ఖణిదశవదనువధింపగ । పదపడిదేవప్రభుడనుపగనె ॥నిదిగో॥ ౧ ॥ సురనుతదనుజవిరామ। నీరథచోదకుడను శ్రీరామ । వరకృపనీరథవరమిక నెక్కుము। ధరణినిలువదగదరమశాయకు ॥మిది గో ॥ ౨ ॥ నిరుపమ శ్రీరంగేశ। ననుకరుణింపుము భవనాశ। సుర వినుతునిభీకరమగుశరములు। బోరిగొనదగదుభూరతరశరముల॥ నిదిగో ॥ ౩ ॥ సీ ॥ అనపినిరఘురాముడా తేరునకుచుట్టుదిరిగి మ్రొక్కియుహెూగ్ర తేజసులర । భానుండుపూర్వాద్రిపై వెలుంగెడుమాడ్కినవలీలదివ్యటరదమెక్కి । భాసిల్లెవానర ప్రకరముత్సవమొందనతులవిమానస్థులగుచు సర్వ । సురకిన్నరోరగగరుడగంధర్వాదులమ్మహాయుద్ధంబు సమరజూడ । వచ్చిదివినిల్చిచూడంగవనధిపనధి। కరికరియును ద్రిదాద్రియు హరియుహరియు । గదనిలాకినక్షై పడిగటసిలాకి। పడినబోరు రామరావణులు చెలగి॥

బిలహరిరాగము-అటతాళము-

యిరువురుబోరిరిసమరై । ఘోరతరసింహనాదభీషణులై । కరమొప్పదొనలకుకరములుసాచుట। శరములుగొనుటదుర్భరకార్ముకములను। సరిసంధించుటలుభీకరగతి నేయుట। లరుదుగజరికింపనలవిగానట్లుగ ॥నిరు॥ రామనిన్నికక్రుంతునంచు । వోరావణక్రూరకటంచు। వేమారుబలుక్కుచుపెనగర్జనలమహా । ద్దామగతినిబాణతతులేసినట్లుడ। నేమిగన్పడకుండనేలమిచీకట్లుగ। రామరావణులుసంరంభదృంభంబుమీర ॥నిరు ॥ ౨ ॥ రెండొకరినొకరుహుమ్మటంచు। సరికి । ప్రకరములను విదళించు । ప్రకటాస్త్రములు సమంత్రకప్రాగ్వమగకార్ముకవిద్యామెరయసృక్కికనేయగనుదేవ। నికరము శ్రీరంగనిలయుజయమనుగోర। సకలరాక్షసులురాక్షసపతిమేల్గోర ॥నిరువురు ॥ ౩ ॥ వ ॥ ఆసమయంబునరాక్షసేశ్వరుండు గాంధర్వమైనతాస్త్రంబులు ప్రయోగించి భరాతాగ్రజుండు మరలంగాంధర్వమైనతాస్త్రంబువలనం భగ్నంబుగావించె నింద్రజిజ్జనకుండు నాగాస్త్రంబు ప్రయోగించిన సైధిలినాయకుండు గరుడాస్త్రంబువలనంజక్కడె నంత రావణుండత్యంతక్రోధావేశంబున రామభద్రునిసహస్ర బాణంబుల నొ

మాతలిశరీరంబనేకబాణంబులం గ్రుచ్చి యొక్కవిశిఖంబుననింద్ర ధ్వజంబు బడవైచి బలుతూపుల ఘోటకంబుల మర్దించిన సురగరుడోరగ గంధర్వమహర్షి సంఘంబులాహాకారంబులెసఁగ రావణరాహుగ్రస్తుండై శరసంధానంబు సేయ నలవిగాక యున్న రామచంద్రు నిందర్శించి మహావ్యసనంబునొంది రట్టియెడ ననేకమహోత్పాతంబులుగల్గె రాఘవేంద్రుండత్తఱి కోపోద్రేకంబు నంజూచినంలోకంబులుఘూర్ణిల్లెనంత ॥ శా ॥ శూలంబొక్కటి దానవాగ్రణిమహాశూరత్వమొప్పారగా। కేలందాల్చిరఘుప్రవీరుఁగని నిక్కీదాఁగతిన్వైగ। నియ్యాలంబు౦దుఁ వధింతుచూడుమని గర్వారూఢుడై వ్రేసినం। కాలాగ్ని ప్రభలుప్పతిల్ల దడరం కాకుస్థుఁ డుగ్రాత్ముడై ॥ క ॥ శరతతులేసిన శూలం। బరుదుఁగనవిద్రుంచె రాముడంతట। త్రిదశేశ్వరుడంపినశక్తిన్వడిబరపి మహాశూలము పుడుభగ్నము జేశె ॥ గీ ॥ సమరలరాఘవుండుహరులనుస్రుక్కించి। యురముఫాలముగ్రశరములేసి। రావణాంగమెల్లరయమున బహురక్త। ధారలొలుక సేయఁదైన్యమొందె॥ వ॥ అంత ॥

నాటరాగము- ఆదితాళము-

రామరావణులుపోరిరిఘనసంగ్రామభీములగుచుఁ। భీమనినద ములబిలచుచుబాణస్థానములందందంధుమికింపుచు ॥ ౧ ॥ తొలఁగకకలఁగక బలుపిడుగులవలెసలరుశరంబులు వ్రేసి। నెత్తురులొలుక వ్రణంబులు జేసి। మున్నునిచెలగిరయమ్మునడాసి।మించుచు॥ రా ॥ ౨ ॥ గరిమతోడనిరువురు ప్రళయాకర్ణలగతినిదురంబున మించి ధైర్యస్ఫురణమనంబులనుంచి।సూతులవరతురగంబులనొంచి। మార్కొని ॥ రామ ॥ ౩ ॥ సరగునరంగస్థలవరదశముఖులిరువురుశౌర్యములొప్పఁ। దుర్భరతరరోషములుదలిర్పఁ। విశిఖములురువడిదివిభువిగప్పఁ।మెరయుచు ॥ రామరావణులుపోరిరి॥ ౪॥

వ ॥ అంతట రావణుండు సంవర్తాగ్నియుంబోలె మండుచు మేఘంబుతో యధారల వలనందటూరంబు నిండింపం జేసిన చందంబున రాఘవేంద్రుని మేఘశ్యామసుందరంబగుశరీరంబు బాణవర్షంబున ముంచిన॥

మహాస్రగ్ధర—

చటులోగ్రాకారుఁడై భాస్కరకులుఁడు ధనుర్జ్యారవస్ఫూర్తిఁ మీరఁ । పటుబాణాగ్నిస్ఫులింగప్రకరము దివిఁ గప్పఁ । వడిం బోర । నత్యుత్కటరోషస్వాంతుఁడయ్యుగ్రదశముఖుఁడతిదుర్దాంతదర్పంబుతోనా । భటులొప్పఁ రాఘవేంద్రుఁ బహుశరములఁ దుర్భావుడై గాడనేసెన్ ॥ చ ॥ తనవిలు విర్గనేయఁ గని తద్దయు దేవతలుత్సహింప । చయ్యన రఘువంశనాథుఁడు రయంబున తీవ్రశిలీముఖంబులన్ దనుజకులేంద్రు దేహమున యుదగ్రగతింతగ నాటనేసి । మోమున చిరునవ్వు మొల్వ । రఘుముఖ్యుఁడు రావణుతోడనిట్లనెను ॥

నీలాంబరి రాగము - అటతాళము -

ఖలుఁడ నీయుపకారఫలము దలంచిన । కడు శ్లాఘనీయ్యము రా । పలనొప్పు జనకనందనను నీవడవిని । తలకక వంచించి చెలగి గొంపోయిన ॥ ఖ ॥ ౧ ॥ వనమున నను సౌమిత్రిని వేఱుండగఁ గాంచి । వనితను హరియించియు । ఘనమతి శూరుఁడ ననివిర్ర వీగెదు । మనసున లజ్జింపక నుగావించిన యట్టి ॥ ఖ ॥ ౨ ॥ గరితసన్నిధి నే నుగల వేళ నరుదెంచి హరియింపఁగ దశిసను । వరరంగనగరనివాసదేవుఁడనై తె । ఖరదూషణాదులఁ గలయఁ బంపనే నిన్ను ॥ ఖలు ॥ ౩ ॥ ద్వి ॥ కటకటా మును నీవు గావించినట్టి । పటుపాపవితతు లేవఁడ నెన్నఁదరమె । గరుడకిన్నరదేవగంధర్వనాగ । తరుణులవడిబట్టి తగఁ జెరఁబెట్టి । సురగణంబుల గొట్టి సుమనస్కులైన । వరమునిప్రవరుల వడిఁ డాసి చంపి । పరగ లోకములిట్లు బాధించినావు । ధరణిలో జీవింపదగ దింక నిన్ను ధర గూల్పనుద్దండదర్పంబు వెలయ । శరశరాసనములు చక్కఁగా దాల్చి । కదసీయున్నాఁడని కామాంధకార । మదమచ్చరోగ్రముల్ మహిని దహింప । విన రోరి మచ్చింత వెస ధనుర్ముక్త । ఘనతీవ్రబాణముల్ కడువడి బరపి । వీకతో దుత నల్ల వేల్పులుప్పొంగ । నీకంఠబాహులు నేఁడు ఖండింతు । భువి బడ్డనిను జేరి పాసగగృధ్రాదు । లవలీలభక్షించునమితమాంసంబు ॥ వ ॥ యిట్లు మహోగ్రవిగ్రహుండై చండబాణంబులు రాక్షసేంద్రుమీఁదఁ గుప్పించె నంతట రాఘవేంద్రస్వాధీనంబులగు సమస్తశస్త్రాస్త్రంబులు నిజస్వరూపంబులతో

దృశ్యంబులై రఘువరునిహృదయంబుసంతోషంబుగావించెయగ ణితంబులై నశుభనిమిత్తంబులుగానంబడియె నంతట తాటకాంత కుండు దేదీప్యమానుండై సంరంభించి మహాబాణవర్షంబునంజీ కాకు పరచిన రావణుండుచేయునదిలేక యూరకున్ననయ్యెడసూ తుండెరింగిరథంబుకించద్దూరంబుదొలంగంగొనిపోయినం గోపిం చిరావణుండుసూతునకిట్లనియె॥

నీలాంబరిరాగము. ఆదితాళము.

ఏలతొలగించితివిరథము। నీవిట్లు। డింతనీచముసేయనెటులో చేమనము।చాలగసుహృదయములశాత్రవులుముదమొంద ॥ ఏ ల॥ పరబలంబులుగనిహసింపా । ధరణిలోస్థిరమైనమకీర్తిచె చ్చెరనసింప । పరహితముదలచినిభూరబుద్ధిశౌరివలె । వెరపె రుంగనినేనువెరపుజెందినయట్లు ॥ ఏ ॥ యరదముకదొలగింపు మనుచు । శ్రీరంగపురినెలయుతోడ నేబారలేననుచు । గరిమెనీతో డనక్రూరగర్వియుంటినా । సరసిజాసనుమెల్లనొంపునసురవి చూ డ ॥ ఏ ॥ ర్వ ॥ తనసారథినిగాంచ దశముఖుండట్లు । ఘనతరకఠిన వాక్యములాడనాల। దశవదనరావణుల్గనార్యనిమీరు । పనిబడి కోపించిభాషించుమాకై । ననునొవ్వనాడంగనాస్యమానముచాల। మొగనీకిపచారములుగాడేయలేదు । నేనస్వతంత్రుడనుగానునీకేలనెరుప । పూనియున్నదిలేదుపాలుపారునేత్ర । పితులకెంతోయుపివిహి తుండగాను । పతిమీరుచేసినమహోపకారములు । మునుపటివలెనగలే నిమూఢుండగాను । మనసొప్పనీమేలుపాలించిలేదు। దొలగించి తినిగానిదోషంబులేదు । దొలగబ్రోవుమటన్నచిత్తంబులోన । నతి ముదమొందిహస్తాభరణంబు । పిలచనీకిత్తునైపేట్కనోసంగె॥

గీ ॥ రావణాజ్ఞవలనరయుమునసూతుండు । రథముదగ్రగతిని రఘుకులాబ్ధి । చంద్రుడైనరామచంద్రునిసన్నిధానమునకెలమి దోలెనమరులడల ॥ వ ॥ ఆసమయంబున యుద్ధపరిశ్రాంతుండై యున్న రామచంద్రునికడకుండేవతులతోడ నగస్త్యమునివరుం డరుదెంచి రామచంద్రా సనాతనంబైగుహ్యంబగు శ్రీమదాది త్యహృదయంబుపదేశంబుగావించెద దానివలనం శత్రుసంహార

ప్రముఖంబులు సిద్ధించుననిపల్కి క్రమంబునయుపదేశంబుగావిం
చి దేవతులతోడ యథాస్థానంబునకుంజనియె నంతటరఘువరుం
డు మూఁడుమారులాచమనంబుగావించి జపించి మహోత్సా
హంబున నొప్పుచున్నయెడ సూర్యుండు సీతావల్లభునిందర్శించి
రావణసంక్షయవిధంబెఱింగించి త్వరగాయందగునని పల్కెనంత॥

సీ॥ కదసిదశాస్యుండు ఘనదీప్తబాణముల్ కడిమిరాఘవుమేనఁ గ్రా
డ నేయ । నత్యుగ్రుడై రాముఁడసురేంద్ర సన్నద్ధచాప ముద్ధతి
దాల్చి చటులబాణ। తతులురావణుమీదనతిజవంబున నేయ సరకు
శాయకరాక్షసప్రభుండు । బహుచండకాండముల్ బరగింప రా
వణధ్వజమొక్కశరమునదఱఁ ద్రెవ్వ । ధరణిబడనె రఘునాథు
డరులుబెదర। సంతసుఁడై రి శ్రీరాఘవాశ్వములను చాలనొప్పిం
చ రావణాశ్వములమరల। ముంచినొప్పించె రఘువర్యుఁడంచితముగ॥

వ॥ ఇట్లన్యోన్యరుదగ్రగతింగలఁబడి ప్రళయసమయరుద్రు
లవిధంబున గులశైలంబులలాగునగనుపడియన్యోన్యజయకాంక్షు
లై శతసహస్రసంఖ్యలంగల శరవర్షంబులొక్కుమ్మడిం గురిపిం
చుచు రోషతామ్రనేత్రులై మర్మంబులు నొప్పించుచు సారథుల
నలయించుచు సింహనాదంబు లొనరించుచు రక్తసిక్తాంగులై సం
గ్రామంబుసేయ నెడ గగనంబునకు గగనంబును సముద్రంబునకు
సముద్రంబును తుల్యంబైనతెఱంగున రామరావణయుద్ధంబునకు
రామరావణులయుద్ధంబె తుల్యంబుగాని మఱియొండుగానేరదని దే
వగంధర్వప్రముఖులు దలంపుచుండ నమ్మహాయుద్ధంబు సకల లో
కభయంకరంబై యుండెనట్టియెడ ॥ ద్వి ॥ ఆసమయంబుననారా
ఘవేంద్రు । డాశీవిషోపమంబగుబాణతతుల । ఘనరత్నకుండల
కలితంబులైన । దనుజేంద్రతలలెల్ల ధరణిపైనిండ । మతిమీరనూ
టొక్కమారుఖండింప । నతివేగమున నొప్పె నన్నియుమొలచి ।
శ్రీరాముడంతటచిత్తంబులోన । భూరివిస్మయమొందిపొసగ చిం
తించి। మరలధైర్యముఁజెందిమహోగ్రుడగుచు । కరమొప్పసమ
రంబుగావించెనప్పు । డిరువురుద్ధతితోడ నేపుదీపింప । సరిబోరిర
త్యంతసాహసులగుచు। తొలగకసప్తరాత్రులయవిచ్ఛిన్న । సరి

లితాహావమిట్లుసలుపుచో నింద్ర । సారథి శ్రీరాముచయ్యఁజూచి ॥ శ్రీరఘువంశాధీశ శ్రితదోషనాశ । కారుణ్యసాగరకళ్యాణవేష ॥ ధరణి బ్రాకృతుమాడ్కిఁ దగ నెంత సేపు । దురము చేసెదరిట్లు తుల్యమౌనట్లు । ఘనతాయుండైనయీదుష్టాసురునకు । నిర్ణయకాలంబు నేఁడు చేకూరె । బ్రహ్మాస్త్రము మెచ్చి గ్రక్కున సంధించి । బ్రహ్మఘ్నుఁడగువీని భంజింపుము । మునియగస్త్యముని మహాకరుణ దనరనిచ్చిన శత్రుదహనాస్త్రంబు । పరమేష్ఠినిర్మిత భాసురాస్త్రంబు । వరనిష్ఠ సంధించి వానరుల్ బొగడ । వెరచి భూతములెల్ల వెస భారనింద్రుఁ । డురుధారదంభోళి నద్రిపై నేయు । తెరగున తెగదీసి తెగువ మీరంగ । నెరి సమంత్రకముగా నేసె నానేస

క ॥ ఘనకాలాగ్నిజ్వాలలు । దనరఁగ సద్దివ్య శరము దగ్రత జనియా । దనుజేంద్రుని వక్షస్థల । మును వగ భేదించి చొచ్చె నమ్ములపొదిలోన్ ॥ గీ ॥ దనుజనాథుండు ప్రాణముల్ తత్క్షణమున । విడిచెనంతట కాయంబు పుడమిఁ బడియె । తొలఁగి పారిరి నిశిచరుల్ తొట్రుపడుచును । వానరచయంబులుత్సవముఁ జెందె ॥

రాగము-ఆదితాళము.

అప్పుడ వేల్పులత్యంతహర్షమొందిరి । చయ్యన మహాహర్షాలాత్యుత్సవముఁ జెందిరి ॥ పరగున దుందుభులు దివిని చాల మ్రోసెను । పరిమళసద్గంధవహుఁడు పరగ వీచెను ॥ ౧ ॥ గరిమతో శ్రీరామస్తుతులు కలయ వెలసెను । విరులవాన రఘుపతిపై వేడ్కఁ గురిసెను ॥ ౨ ॥ పాడిరి గంధర్వవరులు భక్తితోడను । ఆడిరి దివ్యాప్సరసలందముగను ॥ ౩ ॥ ప్రీతులగుచు ప్రజలు ముక్తభీతులగుచు । ఖ్యాతిగనొప్పిరి రంగనేత దలచుచు ॥ ౪ ॥ సీ ॥ అనిలోన మున్ను వృత్రాసురుఁ దెగటార్చి విజయమొందిన దేవవిభుని మాడ్కి । రణరంగమున నుదగ్రత రావణుని జంపి విలసిల్లు శ్రీరాము వేడ్కఁ గాంచి । గరిమ విభీషణ కమలాప్తపుత్రాదులా రాఘవేశ్వరు నభినుతించి । పూజ యొనర్చి రింపున ననంత వానరుల్ కిలకిలాశబ్దముల్ వెలయ నొప్పి । రట్టె మొడ కొండపోలిక నవని మీద । నొరిగి పడియున్న రాక్షసేశ్వరుని జూచి ॥

చాలదీనత్వమున విభీషణుడు గదిసి। పలికె విలపించుచును । దుఃఖపరవశమున ॥

రాగము-ఆదితాళము-

నిలువక కడువడి బొడమెడు దుఃఖము నిలుప వశముగాదన్న । తలకెక్కమును నేనుడివిన నుడువులు తగవినవైతివి గదన్న । సదమలమణిమయసౌధాంతరముల శయనింపక నీవన్న । కుదురుగ ధరబవళించితివిటు నాహృదయము ఝల్లనసన్న । సురపతిముఖదిక్పతులను దగ్రత స్కరించితివి గదన్న । నిరుపమ పటు విక్రమ శౌర్యంబుల ధర నొప్పితివి గదన్న ॥ ౧ ॥ పరతరుణుల క్రచ్చెర చెరదెచ్చుట పాతకమంటి గదన్న । ధరణిజ నరుదుగ రఘువరు కొసగియు శరణనుమంటి గదన్న ॥ ౨ ॥ హరశైలాసోద్ధరణముల గనీ హస్తంబులు నేడన్న । తరుచుగ గడిసీయు పక్షుల కిసగ్రాసముగా వలసెగదన్న ॥ ౩ ॥ గురుతర రత్నస్ఫురిత కిరీటము లిరుమోడగ నేడన్న । వరరంగేశుని శరముల పాడివై వసుమతి నొరగెగదన్న ॥ నిలువక ॥ ౪ ॥

వ ॥ ఇట్లనేక విధంబుల విలపించుచున్న విభీషణుం జూచి కరుణాసముద్రుండగు రామచంద్రుండు శోకసమన్వితహృదయుండై తగువాక్యంబుల నతని బోధించి యంతరడించె నాసమయంబున నవ్వృత్తాంతంబు విని మందోదరీప్రముఖ రావణసుందరీబృందంబు లంతఃపురంబు వెడలి కుచకుంభభారంబుల నడుమ వసియాడ నధిక దుఃఖావేశంబునం బొదుము బాష్పపూరంబుల వలనం బయ్యెదలం దడుపుచు నీవీబంధంబులు వీడుచుండ చికురంబులు చిక్కుపడ నాభరణంబులు వ్రాల। పదంబులు దొట్రుపడ రక్తసిక్తంబగు రణరంగంబున కరుగుడెంచి రామబాణపుష్పాంకంబున దీర్ఘనిద్ర నొందియున్న రాక్షసేంద్రుం గాంచి యనేకవిధంబులం బ్రలాపించిరట్టియెడ మందోదరి జీవితేశ్వరుం జూచి రత్నకంకణాద్యనేకభూషణస్ఫురితంబులగు హస్తాబ్జంబుల నెత్తి మోదుకొనుచు హానాథ హా ప్రాణవల్లభ నాతోడ నత్యంత వైభవంబునం బరిరంభణాది సౌఖ్యవిశేషంబులం దనొల్లక నెందు బోతివని విలపించుచు నిట్లనియె ॥

శోకవరాళిరాగము-ఆదితాళము-

యేలాదెచ్చితివి సీతనయయొ। నాబుద్ధిపలుకీవేలావినవైతివాత్మ
నయయొ। కాలమెరుంగకశీలమువిడిచి । నృపాలకుమారుని బ్రా
కృతుడనుకొని ॥యే॥ నినుబాసియెట్లుతాళుకొందు । యెన్నాళ్ల
కికనే। నినుగాంతుననుచుదిటవుగొందు । నినువిడనాడుటన్యాయ
ముగాదిది। ఘనలావణ్యముగల నెగలుగగ ॥నేలా॥ ౧ ॥ ననుదా
సికౌగిలింపవేమి। దేవతులగెలుచు। ఘనవార్తలెల్ల చెప్పవేమి।ము
నువిరిబాన్పున। ననయముజేసెగడి। మనసుఖమనలునిమాంటలనొం
దక ॥యేలా ॥ ౨ ॥ సురరాజప్రముఖవిబుధులెల్ల । శ్రీరంగనగ
రీశ్వరుడా శ్రీరాముకరుణవలన। సుగుణనిభఫణయసౌఖ్యములొం
దుచు। గురుటగనిచ్చలదియగకనుండురె॥యేలాదెచ్చి॥౩॥

ద్వి ॥ హరరాక్షసేశ్వరసుత్రాణనాథ । హరణప్రియశూరహా
మహావీర। సలలితమణిభూషణరత్నవక్షోష। హాకవేమియవార్య
పటుబలశౌర్య । చలమునసేనకుజగములుగెలిచి । యిలనొక్కన
రుచేత సిగ్గుగానేల । రమణీయశీలుడౌరాముకనివలన । కొమరొ
ప్ప వేల్పులకోర్కెలీడేరే। శరణుబొందినవిభీషణునకియ్యెడను।కర
మొప్ప రఘువర్యకరుణచేతాల। స్థిరరాజ్యసౌఖ్యంబుచేకూరగల్గె।
గరగంగనతిసులభంబుగానమరి । నెట్టనజలరాశినేస్ర తోకపులు।
గట్టిరెప్పుడె నాకుకడుభయమొదవె।నినుజగత్కంటకునిజరద్వేష ।
దునుమాడమదినెంచిగోర్వ్యసువర । చెలగశ్రీనాథుండుసీతే
శుడయ్యె। వలనొప్ప దేవతల్వనచరులైరి । గానజచ్చివీక్షకాకు
స్థువలన । పూనినిస్సహ్యలుబొరిగొనగలరె। అలజనస్థానంబునందు
శ్రీరాము । డలఘుపరాక్రమలగుఖరాద్యసుర। వీరులనొక్కండు
వివిధోగ్రబాణ। ధారలుగురియించిధరణికూల్చుటయు । వానరు
డొక్కండువనరాశిదాటి। మానుగానసురులమడియంగజేసి । క
డువేగమునలంకగాల్చిపోవుటయు।కడలిగట్టిమహోగ్రగతివిజృం
భించి । కుంభకర్ణాదులగూల్చియద్రోణ । కుంభినిధరమరికోట్ల
భీతిల్ల । దెప్పించుటవియెల్ల తెరగొప్పజూడ । నప్పుణ్యచారిత్రుడగు
రాఘవేంద్రు । దనుపమశ్రీవిష్ణుడటుగానసీత । ననువుగారఘుపతి

కపిఁజంపుమనుచు। చెప్పిననామాటచెవిచోరదాయ। నప్పుడయ్యో
వనిజనతిపతివ్రతను। యవలీలదెచ్చినయాదోషమిప్పు। డవనినీక
నుభవంబాయబోనాథ। ధ్రువముగాశుభచరిత్రుండైనవాడు। శుభ
విశుభంబులబొందుబోనగనత్యంత। పాపశీలుండైనపాపాత్ముడె
వ్వుడు। పాపఫలంబులేపఁడనొందుచుండు। గావునశుభమొందెఘ
నుడయినయట్టి। యావిభీషణుడిట్టులైతివినీవు॥

కందార్ధములు.

నిరుపమమేరుశివాచల।వరహిమగిరిమందరములవాసిగనీతో।గ
రిమవిమానంబెక్కక। నరుదుగవిహరించుసౌఖ్యమణెగిపోయను
గ॥ నాబుద్ధులుగరళమాయనుగ। నాసొగసెల్ల ధరవిఫలముగ।
సరగుననినుబాయజాలనినేనిట్లు। నిరతముజీవింతునికమనవైభవ।
మణగిపాయనుగ॥ ధరదానవపతియగుమయు। దరుదుగతండ్రి
యనిరావణాసురుడెన్న। గురుతుగవల్లభుడనిభీ। కరవిక్రము
డింద్రజిత్తు। ఘనసుతుడనుచు। నేనేమెమొమురిపెముగొనుచు।చి
త్తములోననెరిగర్వపడుచు। వరరత్నభూషణావళులింపుననుదా
ల్చి। సరిలేనిసంతోషశరధినొప్పుచునుందు॥
ధరణిజనిటుదెచ్చుటచె। సరసిజహితకులుడుదివ్యశరములకన
కా। భరణస్ఫురితములఁగనీ। కరములువడిద ాంతులులే
ర॥ నీవిటుతాయధరనిదిమేర। పల్కవదేటియరమణులీర। గరిమ
తోడుతనన్నుకౌగిటగదియించు। కరములియ్యలబడిమెరయనామె
నయయో॥ దురముననీవిల్గటచే। నరుమఁగముదమొందివెలసెన
మరతతులుచె। చ్చెరనిభఁయమునవిస్వుడు। ఖరకరకిరణములులం
కగలయవ్యాపించెఁ॥ మారుతునకుయురువడిమించెఁ। దుఃఖా
బ్ధులితేరిసన్నునుంచెఁ। గరిమతోడుతనేనెవ్వరిదానయ్యెందు।
ధరలేనిసంతాపదహనుడునను జేరి॥ కలయవ్యాపించెఁ॥
వ॥ ఇట్లనేకవిధంబుల మందోదరివిలపించుచున్నయెడ రఘువ
రుండు విభీషణుంగాంచి మీయన్నకు సంస్కారకృత్యంబులునిర్వ
ర్తించి వధూగణంబులనూరడించి యంతఃపురంబులకుం బుచ్చ

మనిన మహాప్రభో ధర్మవ్రతహీనుండును పాపాత్ముండును పర
దారాభిమర్శనుండునుంగావున రావణునకు సంస్కారకృత్యంబు
లు సేయనొల్లననిపల్కిన సంప్రీతుండై విభీషణా మరణాంతంబున
వైరంబు సేయందగదదియునుంగాక నీయగ్రజుండగు దశకంఠుం
డు తేజోవంతుండును శూరుండును బలవంతుండును సకలలోక
విజయుండునుంగావున నావచనంబులు విని శ్రద్ధాభక్తిసమన్వితుం
డవై సంస్కారకృత్యంబులొనర్పుమనిన నయ్యాజ్ఞ శిరంబునందా
ల్చి తత్క్షణంబున విధ్యుక్తప్రకారంబుగా దశగ్రీవునకగ్ని సంస్కా
రాదికృత్యంబులు గావించి మండోదరీప్రముఖనారీవర్గంబుల న
యవాక్యంబుల నూరడించి యంతఃపురంబులకనిచి రామచంద్రు
నిసన్నిధానంబునం జేరియుండె నవ్వేడ నింద్రరథ సమన్వితుండ
గు మాతలి రాఘవాజ్ఞ వడసి యమరేంద్రు పాలికిం జనియె ననంతర రఘు
వరుండు లక్ష్మణుంగనుంగొని ॥ ఉ ॥ శ్రీకరచిహ్నలొప్పనభిషేక
మొనర్పుము యిప్పిభీషణుం। జేకొని లంకకేగి సురసిద్ధగణంబులు
మెచ్చ రాక్షసానీకము కెల్ల నేతగ। వినిర్మలభక్తుడితండటంచు భా
గ్యాకరుడైన రామవిభుడవ్వేడ బల్కెను చాల నమ్రుడై ॥

వ ॥ తత్క్షణంబున [illegible]ండ తక్షణసంతోషంబున విభీషణసమే
తుండై లంకాపురంబు సొచ్చి వనచరులవలన స్వర్ణకుంభంబులతో
సముద్రజలంబులు దెప్పించి యాజలంబులతో మంగళవాద్యాదిమ
హావైభవ సమన్వితంబుగా రాక్షసులమధ్యంబున విధ్యుక్తప్రకా
రంబున లంకారాజ్యంబునకు విభీషణునకభిషేకంబు గావించి స్థిరం
బుగా రాజ్యపాలనంబు సేయుమని దీవించి పూజితుండై విభీషణ
సమేతంబుగా క్రమ్మరయన్నపాలికరుదెంచి నిలిచిన యనంతరం
బున భక్తజనకుముదసుధాకరుండగు రఘువరుండు నిజభక్తుండ
గు వాయునందనునకిట్లనియె ॥ గీ ॥ నీవు లంకకరిగి నెమ్మితో రాక్ష
స। నాథుడైన రావణాలయంబు। జొచ్చి సీతయున్న సుందరారా
మంబు। చేరి జనకసుతను చెలగి గాంచి ॥

శంకరాభరణరాగము-ఆదితాళము-

చెప్పిరా వైదేహి వినను। చెలగి మాకుశలములు ధరను। మెప్పు

శనాబాణములచే । తప్పక రావణుడు జచ్చుట ॥ నిన్నుపర్ణశాల
నొంటి। నున్నదానినొడసియెత్తుక। చన్నవానిబాహులనుసురు।లే
న్నగనుఖండించినానని ॥ చెప్పి ॥ యింతిరోనీహృదయతాప।మం
తయునుబాయంగనేస। త్యంతరౌద్రాకృతినిరక్షో। కాంతునిసం
తతినటుంచుట ॥ చెప్పి ॥ అందమౌశ్రీరంగపుర। మందునినుజేర్పం
దలంచి పొందుగానస్త్రాగ్నిలోన। బ్రుంద జేసితరులననుచు ॥ చె
ప్పిరా ॥ వ ॥ ఇవ్విధంబున నయ్యిందుముఖికి విజయవృత్తాంతం
బెఱింగించి కుశలంబడిగి మరలసీతోదంజెప్పినసందేశంబు శీ
ఘ్రంబునసరుదెంచి నాకుంజెప్పుమనియనుజ్ఞయొసంగిన పరమో
త్సాహసంపన్నుండై వీట్కొని లంకాపురంబుసొచ్చి ప్రమదా
వనంబున నొక్కవృక్షమూలంబున రాక్షసస్త్రీసమావృతయై ని
రానందంబున నుండియున్న మహాపతివ్రతయుననింద్యయునగుసీ
తాభామామణింగాంచి వినయవిధేయంబున సాష్టాంగ వందనం
బాచరించియిట్లనియె ॥

రేగుప్తిరాగము-అటతాళము.

విజయమాయెనమ్మమనకువిశ్వకళ్యాణి । వోసుజనవినుతచరిత
నిలభుజగాభవేణి ॥ విజ ॥ అతికాయయింద్రజిత్కుంభులవనిగూ
లిరి యుద్ధకుంభకర్ణాదులెల్లమృతులై వ్రాలిరి ॥ ౧ ॥ పర
మకళ్యాణిరో రామభద్రుడోయమ్మ । దివ్యశరములరావణునిత
లలుధరగూల్చెనమ్మ ॥ ౨ ॥ విజయమాయెనమ్మమనకువిశ్వకళ్యాణి ॥
వోపుణ్యసాధ్విరో నాకుప్రాణమీవమ్మ । నీకుపాపముదలంచుఖలు
డుబ్రతుకునటమ్మ ॥ ౩ ॥ భామరోనీవిమలమైననోమువలనను। రం
గధాముడరులగెలిచెనమ్మదర్పమెసగను ॥ ౪ ॥ వ ॥ ఇట్లుబలికినసీ
ముద్రబంధనాదివృత్తాంతంబెల్లక్రమంబుననెరుంగించి॥

గీ ॥ తానులక్ష్మణుండుతరణితనూజాదు। లెల్లకుశలమనుచునె
లమితోడ। నీకుజెప్పుమనుచునెమ్మిశ్రీరఘుపతి। బలికినన్నుబనిచె చా
లిమివెలయ ॥ వ ॥ అదియునుంగాకతల్లి లోకకంటకుండగు దశ
కంఠుని పుత్రమిత్రబంధుసోదరప్రముఖ నానాసైన్యసమేతంబు

గా వధియించి విభీషణునకుంపట్టాభిషేకంబుగావించిన వృత్తాం
తంబునీకెరుంగించి మీరానతిచ్చినసందేశంబు శీఘ్రంబునం జను
దెంచి తనకుంజెప్పుమని జగద్వల్లభుండగు నీవల్లభుండానతిచ్చె
ననిపలికిననత్యంతసంతోషపరవశయై యేమియుంబలుకనేరకయూ
రకున్నంగనుంగొనిబద్ధాంజలియై మంజువాక్యంబులనాంజనేయుం
డిట్లనియె ॥

భైరవిరాగము-ఆదితాళము.

పలుకవేమమ్మవైదేహిపలుకవేమమ్మ । కలకంఠితల్లిరో నాతో
నలుకాలేలమ్మ ॥ వలనొప్పనీవిభునివిజయవార్తలాయమ్మ । దెలు
పగసంతోషములరబలుకవేమమ్మ ॥ ౧ ॥ అమ్మరో నేనపచారము
లేమైనాజేసినను। కొమ్మరో శిక్షింపు నేరమ్ముగల్గినను । తనయు
డభృత్యుడనన్నుదయజూడవమ్మ । ఘనతరరంగేశురాణి కావగద
వమ్మ ॥ ౨ ॥ గీ ॥ ఇట్లువచియింపవిని రాఘవేంద్రుభార్య । సం
తసంబునయాహనుమంతుగాంచి । పలికెనత్యంతఘనదయాభావ
మమర। చారుధీమంతబలవంతసత్యవంత॥

నాదనామక్రియరాగము-ఆదితాళము.

పలుకకయుండుదునె। నాతండ్రినీతో। నలుకవహించుదునె ॥
గెలువునివిజయంపుపలుకులువినుటచే। గలిగినసంతోషపవశతబలు
కవేనైతిగాక ॥ పలుక ॥ ౧ ॥ భూరిదయాహృమతివి। నాయన్ననీకు ।
నేరములెక్కడివి। నేరములున్నగానికూరిమిపుత్రునియప । చార
ములంబక్షమించుచందమొందబ్రోతుగాని ॥ పలుక ॥ ౨ ॥ యేమ
నివివరింతు। నీయుపకార। మెంతనిమదినెంతు। ప్రేమతోడుతరం
గస్వామిబంపిననిన్ను । వేమారుజూచియానంద వివశతనొందితి
గాక ॥ పలుకకయుండుదునె ॥ ౩ ॥ ద్వి ॥ క్షేమమాహనుమంత
క్షేమమానీకు । క్షేమమారఘుకులసింధుచంద్రులకు । ధరభద్ర
మెసూర్యతనయునకెల్ల । గిరిచరకోట్లకు కేవలశుభమె। నినుకనుం
గవగంటినెమ్మితోనేను। మునునోచినట్టినోమునజేశితండ్రి । చెలు
వునివిజయంబుచెవికింపుగాగ । బలికితివతిదయాభావంబెలప ।
కరమొప్పప్రత్యుపకారంబునీకు। మరియేమిసేయుదునుదిదోచదా

ణయ। గరిమతోడుతమణుల్ కనకంబుగాని। పరగలోకత్ర యాపర్ణ
ణగానిసేయు। తీరదించుకమైనతివిరినీరుణము। సారెకుమదలోన
సన్నుతిశేతు। హనుమంతనీసహాయంబునగాదె। ఘనుడైనయట్టి
రాఘవుడార్తిబాశి। తమ్మునిప్రాణముల్ దద్దయుబడశె। నెమ్మది
బ్రతికితినేనునీవలన। వరరవికులముగావగబుట్టినట్టి। పరమపావ
నుడవుపవనజనీవు ॥

మారువరాగము-ఆదితాళము-

యేమానేనేమానెయేమానెను ॥ స్వామియే ॥ విభుడుయే ॥ నీ
తో ॥ ప్రేమతోడుతమేఘశ్యామసుందరుడైన। రామభూవిభుడు
చెప్పరానిమోహావశత ॥ నెమానెనెమానెయేమానెనె ॥ యాప
దలెల్లబాశెననియనెన। మనసంతాపముదీరెనికసీతాయనెన। పా
పాత్ముడైనదైత్యపతినియుగ్రాహవమున।వోపద్మగంధినీకైయో
పిద్రుంచితిననెన ॥ యే ॥ నినుజూడకికనేనోర్వననియనెన। నీకైవ
నధిగట్టివచ్చితిననియనెన । వనితనేరావణునివధియించియలసితి
కనికరమలరనన్నుకౌగిలింపుమనెన ॥ యే ॥ ౨ ॥ అతిశోకమునీకై
పొందితిననెన శత్రువితతిజయించితిననియనెన। సతతమవ్యయరం
గస్థలమునతోడ। నతిసౌఖ్యమనుభవింపనతివెరారమ్మనెన॥యే
మా ॥ ౩ ॥ గీ ॥ అనినహనుమంతుడత్యంతహర్షమెసగ। గరిత
కనుగుణ్యమయినవాక్యములుజెప్పి। పణతిరోమున్నునేనన్నపల్కు
రీతి। సౌఖ్యకాలంబుచేకూరెజననినీకు ॥ వ ॥ తల్లి భవదీయపా
దారవిందధ్యానానంద పరిపూర్ణ చిత్తుండనై యుష్మత్కృపా
వీక్షణంబు కాంక్షించుదాసుండనగు నాకు సువర్ణమణిప్రము
ఖంబులివ్వంగోరనేల మదీయహృత్కమలకర్ణికామధ్యంబుననీవు
రాఘవేంద్రసమేతంబుగా నిరంతరంబువసియించిదివ్యసౌందర్య
స్వరూప సందర్శనం బొసంగుచుండ వలయునని మ్రొక్కి యం
జలిబద్ధుండగుచు మరలవైదేహింజూచి నీచుట్టునుబరివేష్టించి త
ర్జనగర్జనంబులుగావించు రాక్షసస్త్రీలనాశనంబుగావించెద
ననుజ్ఞయొసంగుమనిన వీరునిజస్వామియగు రాక్షసేంద్రునియా
జ్ఞంజేసిపల్కినపల్కులుమనీయపురాకృతకర్మఫలానుభవంబుగా

ని యొండుగాదు తొల్లి యొక్క శార్దూలంబువినుచుండ భల్లూకంబుపల్కిన నీతివాక్యంబుచందంబున వీరలహింసించుటనాకిష్టంబుగాదనిపల్కిన హనుమంతుండిట్లనియె ॥ క॥ పొందుగ నేనిక శ్రీరఘు। నందనునకు చెప్పవలయునయముసనత్యా । నందముతో వివరింపుము। సందేశంబొకటి రామచంద్రుడు మెచ్చను॥ వ॥ అనిన వైదేహిహనుమంతుంజూచి ॥

పున్నాగరాగము-అటతాళము-

చెప్పనలవిగానివలపు। నాజీవితేశ్వరునకు దెలుపు। వొప్పుగమదిమను లెప్పుడుగనునిన్ను ।తప్పకభజియింపతరుణిగోరినదని॥ చెప్ప॥ కెందామరలబోలుపదము। లందమొందిననీవక్షస్థలము। మందస్మితముమించుసుందరవదనార । విందముజూడవెలందిగోరినదని ॥ చెప్ప ॥ పతిబల్కుమధురవాక్యములు । నిండురతివినగోరెకర్ణములు। జతలేనివిక్రమశౌర్యసంపదగల। పతియైన శ్రీరంగపతికి నంజలిజేసి ॥ చెప్పనలవిగాని ॥ చ ॥ అనిలతనూజరాఘవ ముఖాంబుజదర్శనమాత్మగోరితిం। జని ప్రణమిల్లి నావలపుచందముడెందములోనిభక్తియుం। కనికరముల్లమందుగలుగంవివరించి । మదీయభర్తతోననువుగగూర్చి। సుగుణాకర ప్రోవుముకీర్తిగల్గగను ॥

గీ ॥ అనుచుబలికినభూపుత్త్రికపుడు మ్రొక్కి । యాజ్ఞగొని పోయిరాఘవునమరగాంచి। పద్మదళనేత్ర శ్రీరామ భవ్యగాత్ర।చూచిభాషించివచ్చితిసుదతితోడ ॥

ఆనందభైరవిరాగము- ఆదితాళము-

నినుజూడగోరుచు। జనకజయున్నది। దినకరాన్వయభూషణ । అనఘనీవిజయవార్తనువివరింపగ। నతిహర్షమెసగగను । మనసువెలయగను ॥ అరవిందసుందరమగునీపదాబ్జము లరుదారమదిగాంచుచు। వరరంగనగరనివాసుడవౌనిన్ను । స్మరణసేయుచుచాలను। మురిపెములరగను ॥ నిను ॥ వ ॥ మహాప్రభో పతివ్రతాతిలకంబగు సీతాభామామణి కల్యాణగుణంబు లేమనివర్ణించువాడ నప్పరమపావనిభవదీయ ముఖారవింద సందర్శనంబుతీవ్రంబునంగలుగంజేసి రక్షింపుమనివిన్నవించె కావున కరుణాసము

ద్రుండవై వై దేహినింబిలుపించి మాకెల్ల వారలకు మానసోత్స
వంబుగా గై కొనవలయుననిపల్కిన భక్తరక్షాతత్పరుండగు రా
మభద్రుండు తనమనంబునజానకిందలంచి కన్నీరునించివిభీషణు
నకిట్లనియె ॥ గీ ॥ సుదతిసీతనుకన్నులజూడవలయు। గానసతిశీఘ్ర
మునబోయికలికిగాంచి। మంగళస్నానమమరించిమహితమాల్య।
భూషణాంబరయుక్తగాబొసగజేసి ॥ వ ॥ ఇట్లలంకారంబుగా
వింపంజేసి యొక్కయందలంబులంబునం గూచుండంబెట్టి నా
పాలికిరయంబునందోడ్తెమ్మని యానతిచ్చిన నయ్యాజ్ఞ శిరంబునం
దాల్చి మహాప్రసాదంబనితత్క్షణంబున లంకాపురంబుసొచ్చి సుం
దరోద్యానంబునవసియించియున్న జగన్మోహనాంగియగుజనకనం
దనంబొడగాంచి మ్రొక్కి యంజలిబద్ధుండై యిట్లనియె ॥

యదుకులకాంభోదిరాగము - ఆదితాళము -

వెలదివేంచేయ వస్మవేగమె। వో వెలది ॥ కరుణ వెలయనిన్న
శ్రీరామ॥ విభుడుజూడగోరె ॥ వె ॥ గంమసుస్నానమాచరింతు
మి। దివ్యాంబరభూషణములుధరియింతుమి । నవ్యతరపుష్పహార
శ్రీచందనములింపుననుదాల్చి ॥ వెలదీ ॥ తల్లి నాకునవి యాలకింపు
మి। నన్నుచల్లనిచూట్కులవీక్షింపుమి। జగద్వల్లభుడై నరఘువల్ల
భుడుల్లసింప ॥ వెలదీ ॥ రంగుమీరినయందలంబున। మరియుప్పొం
గగూచుండిసంతసంబున । శ్రీరంగ నాధునిచరణ రాజీవములు
జూడ ॥ వెలదివేంచే ॥ గీ ॥ అనివిభీషణుడీకీతినతులభక్తి । వినయ
ములరంగబల్కినజనకతనయ। వినిమహానందవివశయైవిభునిపాద
తామరసయుగ్మమాత్మలోదలచిపల్కె ॥

ముఖారిరాగము - అటతాళము -

నేటికిదయవచ్చెన। నా ప్రారబ్ధనిచయమెల్ల నువిచ్చెన ॥ దీటులే
నిదునిశాటావళులదండ। కాటవిబోరిగొన్నతాటకాంతకునకు ॥
నేటికి ॥ మునిగణసన్నుతమై। బ్రహ్మములు మోహింపభువినినహా
మై । దనరినదివ్యసుందరరూపమమరి । నన్నునువుగపెండ్లాడినట్టిభ
ర్తకుచాల ॥ నేటికి ॥ పాపదైత్యువలనను। వంచనసేయబడివచ్చి
దీనతను । హాపద్మదళనేత్ర హారంగవాస । నిష్పాపననింద్యనుచేసి

ట్టుమనివేడ ॥ నేటికి ॥ సీ ॥ పావనస్నానంబుగావింపగా నొల్లచె
లగిశృంగారంబుసేయనొల్ల । నిర్విధంబునరాఘవేంద్రునిపాదా
రవిందముల్వీక్షింపవేట్కవత్తు।.ననివిభీషణుతోడనారామబల్కం
గవినవమ్మనీప్రాణవిభుడుప్రీతి। నానతిచ్చినయట్లుపూనిసేయుట
నీకుకర్తవ్యమనియన్నకలికియొప్పు । నంతసరమాదికాంతలకాజ్ఞ
యొసగ । గరితలెల్లనుసంతోషకలితలగుచు । సలిలస్రక్చందనదు
కూలచారురత్న । భూషణంబులుసమకూర్చిపొలతిజేరి ॥

మధ్యమావతిరాగము- ఆదితాళము-

జలములాడగలెమ్మ । జననీరావమ్మ ॥ జలములాడగలెమ్మనీప్రి
యసఖుడువలపుననిన్నుజూడగ।నెలమిడెందమునందుదలచెను। జ
లజదళనేత్రి । స్వనాథభాగాత్రి ॥ ౧ ॥ తళుకుల మరుపసిండి సొ
మ్ములు । ధగధగనుమెరయంగవాల్చియు । లలితస్రక్చందనదుకూ
లములలరుచునుబూని । వెలయుమవ్వగాని ॥ జ ॥ ౨॥ ఖలుడునినుచె
రదెచ్చినుడికెను । కష్టమెల్లనుదీరెతల్లిరో । చెలువుడగుశ్రీగంగని
లయునిచేరిసుఖములను।పొలుపొందుమికను॥ జలములాడగలెమ్మ॥

ద్వి ॥ అనిపల్కియాసీతనయ్యెడనొక్క । కనక హర్మ్యములో
ననకడువేట్కజేర్చి । తరుణికిచాంపేయతైలంబుతోడ । సిరము
చక్కగనంటిశ్రీకుంకుమాది । పంకిలంబటుబూసిపతితోడభావ
నంకించిపాడుచునతివెలునలుగు । బెట్టిరిమదిలోనప్రీతిరెట్టింప। నె
ట్టనపరిమళనీరంబులున్న । కనకకుంభంబులుకడిమితోదెచ్చి । కన
కాంగికపుడుమంగళమజ్జనంబు । గావించిచందురుకావిమైవెలయ
పావడమీదనేర్పడనొప్పమండ । సరిగంచుమించిహంసచ్ఛాయ
నెంచు । వరదుకూలముగట్టివలనొప్పనల్లె । మొగ్గలరవికెసమ్మో
దుతైతొడిగి।నిగ్గనశాలువనీటుగాగప్పి । పాటించిచెలినేత్రపద్మం
బులంట । కాటుకబెట్టిచక్కనిమోముమీద । నరుదారకుంకుమ న
మరించినదుమ । నెరితళ్కుచేచక్కనిగనిగమెరయ । సవరించి
లత్తుకచరణాబ్జములకు । భువిపుణ్యాచిత్తతైపొలుపొందదీర్చి । చె
క్కుటద్దంబులచెలువొందునట్లు । గ్రక్కునమకరికల్ ఘనలీలవ్రా
సి । గరిమజవ్వాజియుకస్తూరిపునుగు । తరుచుగానత్తరుదగినపన్నీ

రు। శ్రీగంధపంకంబుసిరులుప్పతిల్ల। బాగుగానలరిరవ్వ జతినెన్నే న। బంగరుమెట్టియల్ వరగవిల్లాంద్రు । రంగైనపావడల్.రమణి య్యారత్న। మంజీరములులసన్మణికంకణములు। రంజిల్లుచౌకట్లుర మ్యంబులైన। పచ్చలపతకముల్ భాసిల్లుపసిడి। హెచ్చువడ్డాణంబు హారంబులమరు। తాటంకయుగముముత్యాలహారములు। సాటిలే నట్టినాసాభూషణంబు। చంద్రహారంబులుసరిపెనల్ సూర్య। చం ద్రులుసొబగైనశామంతిపువ్వు। జాళువావంకెలుజడబిళ్ల పంక్తి। ధాళధళ్యంబుగాదనరారునత్తు । తలముడిరత్నంబుతగుకంఠికయు ను। మొలఘంటలందమౌముద్దుటుంగరము। లాదిగాగననేకయాభ రణంబు । లాదేవికర్పించిరవయవంబులను । మల్లియల్ దవనంబు మహితోత్పలములు। మొల్లలుమరువంబుముఖ్యమైనట్టి। సన్నజాజు లుమంచిశామంతివిరులు। పన్నీరుపువ్వులుభవ్యాంబుజములు। చం పకపుష్పముల్ సౌగంధికములు। సొంపైనగేదంగిసుమములుచాల। విరవాదికుసుమముల్ విరివిగాఁడొడ్డ । సురపొన్నలును కల్ప సూన ముల్ పొగడ । తెన్నొంగతోమాలలేపఱడజేసి । పన్నగారాతిస భామినీమణులు। కలికికీల్ జడకలంకారంబొనర్చి।పలికిరికేల్మోడ్చి వరమోత్సవమున ॥

సురటరాగము-అటతాళము-

మొక్కడిసుందరమె। వోతల్లినిన్నేమనిబొగడుదుమె। జక్కవ కవబోల్పజనునమ్మచనుదోయి। చక్కనిదివ్యచరణములుననలంటు వెరచును ॥ ౧ ॥ నవపద్మదళములను । నీవాల్గన్నుకవగెల్చునవలీ లను। భువనమంగళమగుపొలతినీతనుకాంతి। వివరింపక్రొమ్మించు విలసనమునిరసించునెంచగ ॥ నెక్కడి ॥ ౨॥ వెలలేనికలలొప్పచు। రాకేందుమండలసుప్రభలవిప్పుచు । వెలదినీనెమ్మోము వెలయు చున్నదివేట్క। చెలినీబింబోష్ఠముచిలుకగుములకువలపులొసగు ను ॥ ౩ ॥ కొదమతుమ్మెదకోటిని। నీచికురములదరించుబలు ఘాటి ని। సదమలశ్రీరంగస్వామిరాణిరొచాల। కదసిచక్కగనిన్ను । క నులననువుగగనుటకలవియె ॥ నెక్కడి ॥ ౪ ॥ వ ॥ యిట్లనేకవిధం బులంగొనియాడి కనకరత్నసంఘటితంబగు మొక్కయందలంబు

నన ద్దేవిం గూచుండ బెట్టి విభీషణున కెఱింగించిన నతండరుదెంచి
నైదేహికిం బ్రదక్షిణనమస్కారంబు గావించి రాక్షసస్త్రీల వలన
నయ్యాందలంబు మోయించుకొని వేత్రహస్తుండై బరాబరులొన
ర్చుచు నిశిచరగణంబులు గొలువ పురంబువె
లిసమీపంబున నయ్యాందలంబు వసియింపజేసి రాఘవేంద్రుని డా
యంజని మహాప్రభో దేవరయాజ్ఞ శిరంబునం దాల్చి మహాపతివ్ర
తయు ననింద్యయగు సీతాభామామణిం దోడ్కొనివచ్చినవాడ న
ద్దేవికి భవదీయ్య దర్శనంబు కరుణింపవలయు నని పల్కిన రఘువ
రేణ్యుండు ధైర్యసంతోషకోపంబులు మనంబునం బెనంగొన చిం
తాక్రాంతుండై జానకిం బిల్వబుత్తెంచిన ॥ సీ ॥ అంత విభీషణుండ
వనిజ దోడ్కొనివచ్చె రాక్షసుల్ వనచరులును మొడబడ గండ
బల్విడి గుంపులై మించి రఘుకులాధ్యక్షుడౌ రాముభార్య । సుంద
రంబక్షుల జూడ బైపై గ్రమ్మ దనుజనాథుండు వేత్రము సనొవ్వ । జే
యుచు నుండంగ చెలగి మహారవంబుదయించె నప్పుడయ్యుగ్రరవ
ము । రామచంద్రుండు విని చూచి రాక్షసేంద్ర । యేల నందర గొట్టె
దవిందులోన । వింత నారెవ్వరున్నారు పేరలెల్ల । చూచినంత నెయె
గ్గేమి సుదతికిప్పుడు ॥ తే ॥ ప్రాకారంబులు తెరలును । శ్రీకరమగు
చీరలిండ్లు స్త్రీలకు కాసే । వీకసన్మది చెచిఱంపగ । ప్రకటసౌశీల్య
మొకటి బాగుగ దక్క౯ ॥ గీ ॥ వ్యసనములనుత్సవముల వివాహ
ములను । సంగరంబుల ఘనయజ్ఞ సమయములను । మరుగు వలదం
డ్రు జనరాంగ్లకరుదుగాగ । నిదిజయోత్సవమెన్నగ నిద్ధచరిత ॥

వ ॥ విభీషణ నా సమీపంబున దూష్య సీయ్యాంబును ధర్మవిరోధం
బును గలగ నేరదు నైదేహి౯ దోడ్తెమ్మని పల్కిన హనుమత్సుగ్రీ
వలక్ష్మణప్రముఖులా వాక్యంబులు విని భార్యాపేర పేక్షుండై యు
న్న భావంబుగను పడుచున్నదని చింత బొందుచుండి రయ్యెడ విభీ
షణుండనింద్యయు ననంతకళ్యాణసమేతయగు సీతం దోడ్కొని
రామసాన్నిధ్యంబునం జేర్చిన ॥ గీ ॥ వెలది వాల్ తలుకు చూపుల వి
భుని గాంచి । మొనసి నెమ్మోము వలువ చేముసుకు గప్పి । హూరుమ
నియెడ్బి కన్నీరుధారగురియు । నార్యవృత్తాయటంచు నయ్యబ్జగంధి ॥

క॥ పరమమహాగుణాకర । హారాఘవసత్యసంధహానాథ కృ
పా। పారావారదశాస్య। విదారణకుశలం జెసీకుతమ్మునితోడక॥

శంకరాభరణరాగము-అటతాళము-

యెన్నాళ్లకల్ల మున్నెనట్లున్నది దేవ। నిన్నుబాయుటచేవినిర్మలభా
వ । అయోనిన్నెడబాయ నాయనిన్నాళ్లు । భయశోషనన్నె
ట్లుబాసితినిన్నాళ్లు ॥ ౧ ॥ గడుసరియగుదశకంఠునివలన । బడ
రానిబాధలుబడితిభూరమణా ॥ ౨॥ నిన్నెడబాసిననిమిషములో
న। సిలుకనిరై గాలకిలనున్నదాన ॥ ౩ ॥ భవదూర నినునన్నుబా
పినవిధిని। భువినేమనందుసంపూర్ణదుష్కరుని ॥ ౪ ॥ వరరంగ
నాథశ్రీకరచిత్తమంచు । చెరనుండియుననిన్ను స్మరియించు చుం
డు॥ యెన్నాళ్లకల్ల ॥ ౫ ॥

మధ్యమావతిరాగము-ఆదితాళము-

యెంతదుఃఖనునొందినారో। మీరెంత శ్రమముబొందినారో।
వింతగ ఇవిలో వెసనన్ను గానక । సంతాపమునవనస్థలిసనలపట
బొసి వెదకుచు ॥ ౧ ॥ వాలినెబ్బంగ ద్రుంచితిరో। దుర్వార రా
శినెట్లుగట్టితిరో। చాలగరావణశక్తియురముననాటి। ప్రాలిని
సౌమిత్రివదనకమలముగనితపించుచు ॥ ౨ ॥ వలువనికోకెరగో
రితిని। మిమ్ము వంతలనంద జేసితిని। వలనొప్ప శ్రీరంగనిలయ సన్నె
వేళ। దలచుచుకనుదోయిజలములొలుకగవగలబొగలుచు॥ యెం
త ॥ ౩ ॥ వ ॥ దేవా మద్దియ్యపురాకృత పాపవశంబున పరమ
యోగీంద్రమోహనంబైన భవదియ్యముఖారవిందసందర్శనంబు
లేక లంకాపురంబునసత్యంతదుఃఖసాగరని మగ్న నై యున్నన
న్నుంగరుణింపందలంచి సముద్రంబుబంధించి కపిబలంబుల తో
డంజనుదెంచి తమ్ముండునునీవును ధనుర్బాణతూణీరంబులు దా
ల్చి అతికాయకుంభకర్ణేంద్రజి ద్రావణాది రాక్షస కోట్లందు
నుమాడి నన్నుంచెరవిడిపించి రక్షించితిరేనును దేవరవారియాజ్ఞ
శిరంబునందాల్చి మంగళస్నానదివ్యాభరణ స్రక్చందనాద్యలంకా
రంబుగావించితింగాని నీదర్శనంబులేనిసమయంబున నవితమొల్లం
గోరనిదానసని చిత్తంబుననెరింగి యుందురు గావున మరలనిన్నె

వించనేల నిన్నెడనన్నుం జేకొని రక్షింపుమని పల్కిన రఘువరుం
డు కన్నులం గెంపుగదుర తీక్ష్ణదృగ్జాలంబుల నద్దేవినింజూచి కోపం
బుననిట్లనియె ॥ సీ ॥ కాంతరో నినుపంక్తికంఠుండు గొనిపోవ వల
నొప్ప వెదకుచువచ్చివచ్చి । నీనిమిత్తంబున వానరేంద్రు వధించి రవి
పుత్రునకు కపిరాజ్యమిచ్చి । పవనసంభవుని చేపదపడి నీ క్షేమ మఖి
లంబు దెలసి యునద్ధిగట్టి । నినుచెరగొనిచన్న మునికంటకుండగు ద
శకంఠునుద్దండదర్పమొప్ప । సంగరంబున నఖిలరాక్షసులతోడ ।
జంపి నీచెరవిడిపించి జగతినధిక । విమలసత్కీర్తి గైకొంటి వేట్క
తోడ । నేకృతార్థుడనైతి బోనిక్కముగను ॥ ద్వి ॥ సదమలంబై
నయిక్ష్వాకువంశమున । నుదయమొందిన సకలోర్వీశులెల్ల । సము
దగ్రవిక్రముల్ సత్కీర్తిధనులు । విమలధర్మవ్రతుల్ వినుతచారిత్రు
లనఘులు యేనిందలవనిలో జెంద । రనువుగా నేనట్టియన్వయంబం
దు । గరిమనుద్భవమొందికడు నిందబొంద । నరుదుగా నేజాల నది
యెట్టులన్న । చల్లచిత్తుడై సరాక్షసనాథు । డెలమి పెందొడ
మీదనిడు...కొని నిన్న । గొనిపోయి చెరనుంచె కోరి యిందాక । వనిత
నిన్నిప్పుడు వలసి గైకొన్న । జనులు నిందింపరె జగతిలోనన్న । ఘన
శీలుడంచు రెకమలాయతాక్షి ॥

కేదారగౌళ - అటతాళము -

శుకవాణి చాల । మాతో పల్కలికనునీకేల ॥ ప్రకటకాముకుడ
సురనాధుడు । సకియనీవత్యంతసుందరి । వకటనినుగని మదనపుష్పాం
బకములనుకదు నొవ్వకుండునె ॥ ౧ ॥ ననుమానుకొమ్ము । సీమా
న సేభను లీల బొమ్మ । వనములను ఫలమూలశాఖము । లనుభ
వింపుచు మునులవేషము । దనరి తిరిగెడి పేదజనులకు । వనిత సొగస
గుమగువలేటికి ॥ ౨ ॥ జలరుహపాణి నీస్నేహము చాలు పూబో
డి । చెలగి రావణు ద్రుంచి నీచెర । నెలమిదీర్పకయున్న రంగ । స్థ
లని కేతనుడనరుగావున । ఖలుని బారిగొని నిన్ను విడిచితి ॥ శుకవాణి
చాలా ॥ ౩ ॥ వ ॥ మరియునరణ్యంబున నిన్ను చెరగొని పోయిన
దశకంఠుని నిం దెగటార్చి నిన్ను విడిపింపకున్న లోకంబుల శౌర్యవి
క్రమప్రతాపంబులు లేని వాడని బల్కుదురు గావున శత్రుక్షయం

బుగావించి నిన్నుం జెరవిడిపించితినీవింక భరతలక్ష్మణశత్రుఘ్నసు
గ్రీవాంగదవిభీషణ ప్రముఖులలో నొక్కనింగోరివరింపుమని ప
ల్కిన యావాక్యంబులు పిడుగులతెరంగునం జెవులుసొచ్చిన య
ద్దేవియొడలెరుంగక మూర్ఛిల్లి వెండియుం దెలసి విచ్చలవిడికన్ను
దామరలువిచ్చి వెడలెడుబాష్పధారలు కరపద్మంబునం దుడుచు
కొనుచు దీనదశంబొరసి సమ్మెనుగడగడవడంక నిట్టూర్పుసెగ
లవలనంబల్లవాధరంబు తుకతుకనుడుకుచుండ దురంతశోక దహ
నజ్వాలలంబడి పురపురంబొక్కుచు యాకారంబుదాల్చిన శోక
రసాధిదేవతననుకరింపుచు నెడతెగక వెక్కెక్కియేడ్చుచు రఘు
వల్లభుదిక్కుగనుంగొనియక్కోమలియిట్లనియె ॥

నీలాంబరిరాగము-అటతాళము-

యెవరుబోధించిరిరమణ। యీపాపమెవరువహించిరిరమణ ॥
యీద్రోహమెవరు। యీపుణ్యమెవరు॥ హరిహరిరామ శ్రీరామ॥
నన్నిట్లాడవెన్నడుపూర్ణకామ ॥ ౧ ॥ కరుణహృదయమేలరమ
ణ। యింతకఠినవాక్యలకోర్వగలన ॥ ౨ ॥ భీకరకలుషసంహార
ణ। యింతేకదనీదుయాదరణ ॥ ౩ ॥ నాదుఃఖాబ్ధికికడలేదు। నా
నాథనాకికమ్మతిరాదు ॥ ౪ ॥ ప్రాణవల్లభనీమతికిని। యెంతపగ
దాననైతినేటికిని ॥ ౫ ॥ యెమేమొమురియుచునుంటి । నేనెన్నొ
ముచ్చటలనుకొంటి ॥ ౬ ॥ కటకినిందలజెందనాయ । యెన్నటికి
దుఃఖముదీరదాయ ॥ ౭ ॥ శ్రీకరరంగనివేశ। నన్నుజేకొను మిక
రిపునాశ ॥ ౮ ॥

సురటరాగము-అటతాళము-

నాటిదయలెందుబోయను। అలనాటిమరులేలనీదెను । కోటిచం
ద్రులసాటిగలమోము। తోటిముద్దులుమాటికొసగిన ॥ నాటి॥౧॥
చారుతరపర్ణశాలను। పుష్పహారములుసొంపుమీరను । కోరిజడ
కుశ్శృంగారమొనరిచి। సారెకునువలపూరననుజూచు॥ నాటి ॥ ౨ ॥
మంచిఫలములులీలను। యారగించుచోవేట్కతోడను। మించుబో
ణిగ్రహించుమీఫల।మెంచనమృతోపమంచుయొసగిన ॥ నాటి ॥౩ ॥

మేనురంగపురంబున। సీతోన వెలసెదసొంపున। చానవా తెరతేట
లిమ్మ। పూనికౌగిటిలోననిలిపిన॥ నాటిదయలెందు బోయెను॥౮॥

ముఖారిరాగము. ఆదితాళము.

అందురా। మీబోటివారిట్లందుర । సుందరరూపపురందర ర్ధనుత
ప్రియ। సుందరినగునన్నందరువిననిట్లందురా॥ అందురా ॥ క్షితిని।
కటికినిందలజెందితిని। సతతమును రంగస్థలపతినగు । నిన్నతిభక్తినిసు
మ్మతిగొలువగనిట్లందుర ॥ ౧ ॥ అనపల్కి యారామ హారామ
యనుచు। ఘనదుఃఖమున జెంది కాంతుని మోము। గని ప్రాణవల్ల
భ కాకుస్థతిలక। ననువిడనాడుటన్యాయమానీకు। లంకలో నేనున్న
లాగెల్లనీకు। కొంకకచెప్పడాకోతివాయుజుడు। నాచందమెరుగ
కననువడిదారి। నీచాత్ముడగురజనీచరేంద్రుండు। బలమదోపేతు
డై పట్టిగొంపోవ। బలహీనసగుటచే పట్టుకష్టితిని । నవసీరవశ్యా
మ నాబుద్ధితోటి। భువిసన్యపురుషులపాసగసంటుమనే। దేహంబు
దాతుసాధీనమైయున్నె। మోహించిమనసునీ మూర్తియందుం
చు। కామించితాకినకలుషంబుగల్గు। కామింపకున్నచో కలుషమె
ట్లాదవు। ప్రాకృతాంగనమీదపరగకోపించి। ప్రాకృతపురుషుం
డు బల్కినరతి।నను నొవ్వనాడంగన్యాయమా నాథ।నినుబాసియుం
డునే నెమ్మి నాబుద్ధి। నానియమంబును నానిశ్చలంబు। నానోముదృ
ఢభక్తి నాచిత్తవృత్తి। జగతిని వెరుగవా సర్వజ్ఞ నన్ను। పగదానిగా
మదిభావింపనేల। హనుమంతునాపాలికనిపినవేళ। పనిబడినీమనో
భావంబుచాల। తెలియచేసిననాడె దేహంబువిడతు। పలనొప్పను
ద్రికవరమతితోడ । పవనజుచే బంపిపాలింతు ననుచు। ధ్రువము
గా చెప్పినతొల్లిటియాశ। గొనిగడాయుంటి కకోననీపాద: వన
జముల్ దర్శింపవాంఛించియుంటి ॥ సీ॥ అనిపల్కి సౌమిత్రి నయ్యె
డషాడగాంచి నీయన్నమదినన్ను నెమ్మినమ్మ। దీప్తాగ్నులను జొచ్చి
దివ్యమానాశీలమెల్ల లోకంబులకెరుకనేతు। క్షితిజేపురమికనంచు
జెప్పినవిని చాలతనయన్నభావంబుతగ నెరింగి। తత్క్షణంబునకాష్ఠ
తతులెల్ల సమకూర్చిసిద్ధంబుగావింప చెలియలేచి। విమలసద్భ
క్తియారామ విభునిచుట్టు। తిరిగివందన మొనరించినరవరేణ్య।

ఘువినినావల్ల నిందల బొందకుండ । సుఖమతిని నుండు మిక నగ్ని జొత్తునేను ॥

## ముఖారిరాగము. అటతాళము.

రామ నిన్నికనమ్మరాదు। రాక్షసవిరామ నీమతి నెనరులేదు ॥ కోమలేందీవరశ్యామ నిర్మలమైన। నామనంబెరిగియు నన్ను నిడనాడితివి ॥ రా ॥ సెలవిమ్ము నాకు శ్రీరామ । నేనగ్నిశిఖల జొచ్చెద పూర్ణకామ । వలనొప్ప నాబుద్ధి తెలిసి తెలిసియు నన్ను । బలికితివి కఠినంబు పలుకులిందరిలోన ॥ ౧ ॥ ననుమానవతి దలచియున్న । శ్రీరామ ననుడాయ వలపు లేకున్న । వననిధిని గట్టియిటు జనుదెంచి దైత్యుల నుసిమి యీ శ్రమ నొందజనవయ్య నీకేల ॥ ౨ ॥ పురవరము జేరి సొంపు గను । చెలులతో భోగింపు మతిపావనము గను । వరరంగధామము నుపరేణయించు బుస హస్త । సరసిజము బట్టి చెచ్చెర పాడి దప్పితివి ॥ రామ నిన్నికనమ్మరాదు ॥ ౩ ॥ క ॥ అని పల్కి యగ్ని సన్నిధి। కనుపగ జని యంజలొత్తి యాదేవి । మనంబున దేవ బ్రాహ్మణులకు । ఘనభక్తి నమస్కరించి కడువడి బల్కెన్ ॥ చ ॥ నిరతము రాఘవేంద్రు పదనీరజముల్ క్షణమైన బాయకం । గురుతరభక్తి నామనసు కోరి భజింపుచునుండెనేని । సన్నరుడుగ నగ్నిహోత్రుడు దయాకలితాత్ముడౌచు బ్రోచు । దుర్భర దురితాత్మనైన నను భస్మమొనర్చు నుదగ్రమూర్తియై ॥ క ॥ అని పల్కి వల్లభుని పద । వనజాతములాత్మ దలచి వనితామణి । యయ్యనలజ్వాలలు జొచ్చెను । వనచరరాక్షసులు దుఃఖవసధి మునుంగను ॥ గీ ॥ అతివె మంత్రపూతమైన యాజ్యాహుతి। చందమున ననువహ్నియందు జొరగ । నుత్సవమున మంటలొక్కటమిన్నంటి। వెలయ పావకుండు వెలుగుచుండె ॥

వ ॥ అట్టియెడ సౌమిత్రి మహావ్యసన నిమగ్నచిత్తుండై యుండె హనుమత్సుగ్రీవ విభీషణాంగద సుషేణ జాంబవత్ప్రముఖులత్యంత ఖేదంబునం బొందిరి రామచంద్రుండు బాష్పపూరితనేత్రుండై చూచుచుండె వానరగణంబులు హాహాకారంబులెసగ హాతల్లి యని దుఃఖింపుచునిట్లనియె ॥

నాదనామక్రియరాగము. ఆదితాళము.

యిందు కేన । మనసేటి లెల్ల । యిందు కేన । మనకష్టమెల్ల ॥ పొం
దుగ జనకజనందరు జూడగ । చెందించెను రఘునందనుడగ్నుల ॥నిం॥
గిరులు దెచ్చి । జలరాశి గట్టి । గరిమ హెచ్చి । తరుచు గని శిచరతతు
లు నెపుకోనని । తరుశిలలటు గోనిదుర మొనరించుట ॥ లిందు ॥ మ
తిదలచుచు । హా సీతయనుచు । మరులు గొనుచు । సతతము రంగస్థ
లనాధుడు తన । సతిని స్మరించుచు నతిదుఃఖము గొను ॥లిందు ॥

యదుకులకాంభోదిరాగము. ఆదితాళము.

మనతల్లి జొచ్చినదమంటవ సముజొత్తమలేక । వనధిలో ముణింగి
మనజీవములు విడుతామా । కనికరము సుమంత లేక । కాఠిన్యవాక్య
ములాడి । దినకరవంశజుడు సతిని । దీప్తాగ్నులలో జెందజేశె ॥౧॥
యింతకరిను డెట్లు బ్రోచునిలలో నమనల । తుదకుపంతగించి చంపు
నె మోహపటు బాణతతుల ॥ ౨ ॥ వింతగ రంగస్థలమున వెలయు సీతా
కాంతతోడ । నెంతయు భోగింపక । మరంత సంతాపమొందించె ॥
మనతల్లి జొచ్చి ॥ ౩ ॥ వ ॥ అంతట నింద్ర యమ వరుణ కుబేరమ
హేశ్వరపితామహులఖిల దేవగణ సమేతులై సూర్యసన్నిభంబుల
గు విమానంబులం దేజరిల్లుచు లంకాపురంబునకరుదెంచి మేఘశ్యా
మసుందరుండైన రాఘవేంద్రుం దర్శించి మహాప్రభో నీవు సకల
లోకాధీశుండవాద్యంత శూన్యుండవిట్టి నీవు మహాపతివ్రతయు ననిం
ద్యయునగు జానకింకఠినంబులాడియగ్నిజ్వాలలం ప్రవేశింపం జేయ
నేల దేవాదిదేవుండవగు నీ మహత్వంబీవేల యెరుంగక ప్రాకృతుని
చందంబున జానకి నుపేక్షించితివని బల్కిన రఘువరుండు ప్రాంజ
లిబద్ధుండై మహాత్ములారా ! దశరథాత్మజుండనై శ్రీరామాభిధా
నంబుగల్గి మనుష్యమాత్రుండనగు నన్నుం గొనియాడనేలయని ప
ల్కిన చతుర్ముఖుండు సకలజగన్మోహన సౌందర్యనిధియైన రఘువల్ల
భునితో నిట్లనియె ॥

సురటరాగము. ఆదితాళము.

రామ రామ రామ రాఘవ । సుందర మేఘశ్యామ సీతాభామినిధవ ।
నీమహత్వమెన్నగరమె । వోమహాత్మ సకల జగత్స్వామివంతరా

ఖువాశ్రితకామదుడదవుమహామహుండవు॥౧॥నీవుశ్రీనారాయ
ణుడవు। ఆదివరాహ భావముగొన్నదేవుండవు। దేవదేవశ్రీవై
దేహి॥ దేవియాలక్ష్మిలతాంగి పావనచరిత్ర జీవప్రకృతులకీవు।
వరుండ వజుండవు ॥ ౨ ॥ నిన్నునిత్యమాత్మజూచుచు। నీదివ్యచ
ర్యలన్నియునేవేళవినుచు। నిన్నుసేవించుచునమ్మి। యున్నపుణ్య
వ్రతుడుసుజన।సన్నుతుండై పొందుశ్రీమత్సారూప్యముచంచద్దివ్య
భవంబున॥ ౩॥ దారుణపాతకహారుడవు। శంఖచక్రగదాధరుం
డవచ్యుతుడవు। సారసపత్రాక్షరంగస్వామివవ్యయుడవునన్ను।
కూరిమిగన్నతండ్రివి।కుత్సితదైత్యఘనాగ్నిసఖుండవు॥౪॥

వ॥ మరియుగొందరు దురత్యయంబైనభవదీయమాయావ
శంబునం జేసి తుచ్ఛంబులైనవిషయా సౌఖ్యంబులపేక్షించుచు దే
హాత్మభావంబుగల్గి గృహాంధకూపంబునం జిక్కు పడి విజ్ఞానవి
హీనులై నిరయంబునం బొందుచు మరల జన్మనాశంబులొందు
చుందురు ఏకాంతభక్తులగు పరమయోగీంద్రులున్నకీ యహృ
ద యాబ్జకర్ణికా మధ్యంబులు సర్వలోకశరణ్యుండవగునిన్నుం
బొడగని సేవింపుచు పరమానందంబునవతిరింపుచుందురు నీవ
ఖిలభువనంబులకాదికర్తవై స్వయంప్రకాశుండవై సకలదేవ
తాంతర్యామివై సమానాధికరహితుండవై జగదుత్పత్త్యాది కా
ర్యంబులాచరింపుచుగోభూసురబృందంబులందేజరిల్లుచుసకలాం
తరాత్ముండవై జగద్రూపుండవైననిన్నిట్టివాడనియెవ్వరు తెలి
యంజాలరు మత్స్యకూర్మవరాహనృసింహాదిభావంబులనవతరిం
చి లోకోపకారంబుగావింపుచు శ్రీమన్నారాయణపర బ్రహ్మాభి
ధానుండవగుమహానుభావుండవునీవేయనిపల్కి మరియునిట్లనియె॥

గీ॥ అనఘశ్రీరామనీహృదయంబునేను। వాణినీజింహానిజకర
వర్గమెల్ల । రోమతతినేత్రములుసూర్యసోములెన్న। శ్రుతులు
నీపల్కులయ్యండుశుద్ధచరిత ॥ గీ ॥ నీవుశ్రీవిష్ణుమూర్తివి రావ
ణాది। రాక్షసులగూల్పమునికోటిరక్షణంబు। పొందుగాసేతువున
వనిపైబుట్టినావు। శ్రీమహాదేవిసీతయైచేరికొలువ॥

కల్యాణిరాగము-అటతాళము.

ఈరామసౌశీల్యమే రామలకుగల్గు । దోరామకరుణింపవే ॥
ఈరామగుణవతి । ఈరామనిర్దోష । ఈరామసుచరిత్ర ।
ఈరామమునిసుత ॥ ౧ ॥ జనకజనీపాదవనజములనయముగను
చుండుమదిలోనను । నీచెర్యలువినుచుండువీనులను । యిటువంటి
సాధ్వని । నానజగములను । ఘనమతినిధరణిజ గ్రహింపుము । కా
ర్ముకపటఖండనగురుతర । వనదహన శ్రీరంగమందిర । వాసుతపు
సురగణశరణ్యాడ ॥ ఈరామసౌ ॥ ౨ ॥ గీ ॥ వాఙ్మనఃకర్మశోద్ధిగా
వనితనిన్ను । నమ్మియున్నదిరఘువర్యనమ్మవయ్య । మున్నుచెరలో
ననుండియునెన్నదలచు । దైత్యనాథదురోక్తులతల్లడిల్లు ॥

వ ॥ ఇట్లుబలికెననంవిని రఘువరుండు పరమహర్ష సమేతుం
డై బ్రహ్మరుద్రపురందర ప్రముఖులెల్లవారలువినుచుండనయ్యో
ర్మిళసోదరిం జూచియిట్లనియె ॥ ద్వి ॥ ఈసీతసౌశీల్యమీసీతభ
క్తి । ఈసీతసుగుణంబు లీసీతచరిత । మతులపాతివ్రత్యమహిమ
ప్రభావ । మతిధర్మవర్తనసంభావిగానాత్మ । తెలియమతెల్లగా తె
గువతోడన । జలజగంధులడాయ జనకుండవైన । పతికితోల్లిభ
సేకపట్టినపెండ్ల్ర । మతినాసంగినయట్టిమహితశాపంబు । విని
యున్నవాడనప్పినమరింగియును । జనబృందములునమ్మజానకినిట్ల ।
దాసగావించితిబ్రహ్మరుద్రేంద్ర । వాసనాదులుజూడ వరమతి
తోడ । మరియిప్పుడాసంపుహీనవాట్లై । సదమలాత్ముడనై తిన
త్కృతిగలిగె । సకలంకగుణవతియనట్టిసీత । నికవేట్క చేకొందు
నింపుతోడుతను ॥

నవరోజురాగము- అటతాళము-

కరుణించిచేకొనెను । వైదేహిని । కరుణిం ॥ కరుణించిచేకొనె
నరుమగ శ్రీరాము । డరమరమానివానరులుత్సవము జెంద ॥ కరు
ణిం ॥ ౧ ॥ సరసిజభవభగులు । దేవేంద్రుడు । సురగరుడ ప్ర
భృతులు । పరమమునీంద్రులు బ్రస్తుతి శేయుచు । సరిలేనిసంతోష
జలధిమగ్నతనొంద ॥ ౨ ॥ వరరంగపురమునను । శోభిల్లుసుందరి
యైనజనకజను । గరిమ నేనత్యంతకఠినములాడితి । పరమపావనరాం

తపరితపించెనో యుంచు ॥ 3 ॥ ఉ ॥ అంతటపార్వతిరమణుడా శ్రీ
తకల్పకుడైనజానకీకాంతుని మోముగాంచి। భవఖండనభానుకులా
బ్ధిచంద్ర। దైత్యాంతకనీవురావణవధాఘముధారుణిఖట్టినట్టి
దుర్దాంతవిపద్వినిఘ్నుడవు। తామరసాక్షుడవెంచిచూడగను ॥
వ ॥ రాఘవేంద్రా లోకకంటకుండగు దశకంఠునిపుత్రమిత్ర
బంధుసోదరనానాసైన్యసమేతంబుగా నాశంబొనరించి లోకసౌ
ఖ్యంబుగావించితి వింకమీదనయోధ్యాపురంబునకుంజని భవదీయ
సేవాతత్పరుండైన భరతునింగరుణావలోకనంబుల రక్షించి య
తండు గోరినప్రకారంబున రాజ్యభారంబు దాల్చి తల్లులం బ్రీతి
పూర్వకంబున నాదరింపుచు గోబ్రాహ్మణబృందంబులం బ్రోచు
చు మఖంబులుగావించిజగద్విఖ్యాతయశోధనుండవై తదనంతరం
బున శ్రీవైకుంఠంబునకు వేంచేయుమని విన్నవించి మరల నమ్మహా
నుభావుంజూచి నీతండ్రియగుదశరథుండల్లవాడై దేవపూజితుం
డై సూర్యసన్నిభంబైనవిమానంబునంగూర్చుండి తేజరిల్లుచున్న
వాడు నీవుతమ్మునితోడంగూడి మ్రొక్కులిడిదీవనలొందుమనిపల్కి
న తత్క్షణంబునంజనిదశరథునకుం బ్రణమిల్లినసమ్మహాత్ముండత్యా
నందంబున రామునింగౌగిలించుకొనితొడలయందిడుకొని శిరంబు
మూర్కొనిచెక్కిలిముద్దుగొనియట్లనియె ॥
ముఖారిరాగము - ఆదితాళము.
కాకుస్థాన్వయభూష। మంగళాకరమోహనవేష। నీకళ్యాణ
తరాకృతిగాశిలకైకవరముచేకానలకనిచితి ॥ కా ॥ శ్రీరామా
యనియనుచునిన్ను। కూరిమితోడుతబిలుచు। చారుతరంబగు భా
గ్యముధరచే। కూరదాయరఘువీరసురస్తుత ॥ కా ॥ నినురంగస్థల
మునను। పొంపునవెలయగనుటకును। మనసునిరంతర। మమువుగ
తలసును। ఘనతరస్వర్గసుఖమునాకన్నను ॥ కాకుస్థాన్వయభూ
ష ॥ సీ ॥ తనయనీనెమ్మోముతద్దయువీక్షించిగడచితిదుఃఖ సాగ
రము నేడు। వనవాసమతినిష్ఠవరుసగావింపుచుకుట్ర తాసురకోట్ల
గూల్చినావు।మునురనిశ్రితీలకెసుఖమొనగూచిరాతివనుపమచరితుం
డవనిపొందు। పురఖులు చేరంగబాలుపొందనినుగాంచి ధన్యుడౌ

దుర్గ చాతల్లులెల్ల । శ్రీకరంబగు పట్టాభిషేకవేళ । పురజనంబు
లు ప్రజలు నీభువనమోహ । నాకృతిని కన్నులారంగ నమరగాంచి ।
వెలయుచుండురు సంతోష వివశులగుచు ॥ ద్వి ॥ అని పల్కి తన
మ్రోలనంజలి దాల్చి । వినయవిధేయుడై వెసనొప్పుచున్న । సౌ
మిత్రిగాంచి నా చక్కని తండ్రి । రామచంద్రుని మహారణ్యస్థలు
లను । సేవించి ధన్యత జెందితివీవు । భావింపుమాతని పరమాత్ముడను
చు । గరిమ నీకు శుభంబుగల్గు నీధరణి । నరుడుగా నిది నమ్ము మనెనంత
సీత । మ్రొక్కినదీవించి ముదముస మించి । గ్రక్కున బక్క నాక
లకంఠితోడ ॥ గీ ॥ వనిత నీవు మహాపతివ్రతవు సాధ్వి । వలయరుం
ధతిబోలెదవమ్మ నీదు । దివ్యశీలంబు రాముండు దెలసి దెలసి । చాస
చేయించె భువిలోన ప్రజలు నమ్మ ॥ వ ॥ తల్లి నీవల్లభుండగు రఘు
వల్లభునాశ్రయించి శశ్వ్రూషయొనర్పుమని పల్కి రఘువరులవీ
ట్కొని దశరధుండు విమానంబుతోడ నింద్రలోకంబునకుం జనిన యా
నట్టియెడ దేవేంద్రుండు దశగ్రీవవంశగహనవైశ్వానరుండగు
రాఘవేంద్రుని ముఖారవిందంబు కన్నులారం దర్శించి మహాప్ర
భో మానిమిత్తంబున మనుష్యభావంబు దాల్చి సముద్రబంధనాది
పరాక్రమంబులాచరించి లోకకంటకులయిన దశకంఠ ప్రముఖు
లంజక్కడి కరుణాసముద్రుండవై రక్షించితివిట్టి మహానుభావుం
డవగు నీకుం గౌరవలేనైన నను వరంబులిచ్చెదం గోరుమనిన రామ
చంద్రుండింద్రునిం జూచి నానిమిత్తంబునం జనుదెంచి యుద్ధంబు
నం జచ్చిన కపిగణంబులు మరలం జీవించునట్లును కపిగణంబులు నిల్చి
యున్నచోట్ల సర్వకాలంబుల ఫలమూల సలిలసమృద్ధి యుండునట్లు
ప్రసాదింపుమనిన నమరేంద్రుండు అమృతంబు సను నియ్యానతిచ్చి
నంతరణంబునం గూలిన వానర సమూహంబులు నిదురించి లేచిన
చందంబునం లేచి నిర్వీణులై రామచంద్రునాశ్రయించిరి వన
చరానీకంబులకు మానసోత్సవంబుగా సమీప ప్రదేశంబుల ఫల
మూల సలిల ప్రముఖంబులు గలిగియుండె నవ్వేడ బ్రహ్మరుద్రపు
రందరాది బృందారకగణంబుల పరిమితానందంబునం దనివిదీరక
నిందీవరశ్యామసుందరుండైన రఘువరేణ్యుని సేవించి యనుజ్ఞగొ

ని యథాస్థానంబులకుంజనిరంత విభీషణుండంజలిబంధుండై రామచంద్రునకిట్లనియె

ఆనందభైరవిరాగము. ఆదితాళము.

వేంచేయవయ్యామనయింటికి। స్వామి ॥ వేం ॥ నిన్నెంచితభక్తితోసేవించికీర్తించెదను ॥ ౧ ॥ కరుణన్నన్ను బ్రోచినాడవు। హృదయసంతాపమెల్లదీర్చినాడవు। నాకుగరిమలంకారాజ్యాధికారమిచ్చినతండ్రి ॥ వేం ॥ అరవిందపాదములర్చించెద। దివ్యతరరత్నాభరణములర్పించెదనిన్ను। సరిబోలరెవ్వరనిచాటించిమించెదను ॥ ౨ ॥ నినునమ్మినాడయఘముద్రుంపుము। నాతనువునీసొమ్ముగాదలంపుము। వేడిననాథాన్వయభూషదిక్కునీవయ్యానాకు ॥ వేం ॥ వనజాక్షిన్నైనసీతతోడను। తమ్మునితోడవనచరులతోడను। రంగనివాసదేవనీవుకడవైభవమొప్ప ॥ వేంచేయ ॥ ౩ ॥

వ ॥ అనినరఘువరుండిట్లనియె ॥ గీ ॥ ఘనజటావల్కలంబులుగల్గినయతి। భరతుడున్నాడునారాకగరిమగోరి। పురముచేరనాల్లభూషణాంబరములొల్ల। నతనికనుదోయిగనుదాకనార్యవినుత ॥ గీ ॥ సత్కరింపముకఫలభాస్కరతనూజ। నదిమహాప్రియమగునాకునాత్మమెందు। వేగమలరనయోధ్యకునేగవలయు। పర్వతారణ్యములనదుల్ పరగదాటి ॥ ద్వి ॥ అనినవిభీషణుడారాముగాంచి। వినవయ్యమాయన్నవీరత్వమొప్ప। మునుకుబేరు జయించిమునసిచేకొన్న। ఘనపణిస్ఫురితమైకామగంబైన। యొకవిమానమునుగలదున్నతంబగుచు। సకలజ్ఞమీరెక్కచనబోలునన్న। వినిదాసకేశుండు వేట్కదెప్పింపు। మనప్రదాపుష్పకమవలీలనచటికి। కనురక్తిదెప్పింపనదిగాంచిరాము। డనువుగా బెక్కసయ్యాసురేంద్రుతోడ

సీసార్థము.

వనచరుల్నామేలువాంఛించివాంఛించిసుదతికైదేహినివెదకివెదకి।తరుశిలోచ్చయములుద్ధతితోడగొనివచ్చితడయకసేతుబంధనమొనరించి। దనుజదాసురకోట్లత్రెళ్లడంగగఘోరసంగ్రామమొనరించిజయమువడసి। కడుప్రీతిగావించిగానిజేందిరిగాన।బడలికతె

ల్లి దీపుణము। భూషణాంబరములుడుగక నీవపిఱంపుము । పుణమి
లోపలనాకుభూరిమిత్రులువీరు । మిడిమేలంపుదైత్యులమదియింత
చిరాహవమున ॥ బడలి ॥ క ॥ అనిపలుకరవిసుతాదులు । కనువు
గకపులకునుభూషణాంబరశ్రీచం। దనస్రగ్దామములొసగియు ।
ఘనమతిసంతోషమొందగాజేసెతగన్ ॥ వ ॥ ఆసమయంబున ననం
తకళ్యాణగుణాభిరాముండగు రఘూద్వహుండు సీతాలక్ష్మణస
మన్వితుండై పరమానందంబునం బుష్పకారోహణంబు గావించి
పతివ్రతాశిరోమణియు లజ్జమానయునగువైదేహిందన పెందొ
డయందిడుకొని మహావైభవంబునం గూచుండి సుగ్రీవాంగద
హనుమద్విభీషణ జాంబవత్ప్రముఖులనందరంగరుణారసంబునం
జూచియిట్లనియె ॥

నాదనామక్రియ-అటతాళము.

పోయివచ్చెదము। మీకికగల్గె పొసగవిజయము । వోయిసుగ్రీవ
వోహోయి విభీషణ। వోయాంజనేయవోహోసర్వకపులార ॥
వలపుమీరగను। మీమీస్థానములకుబోదగను। చలమునరాక్షసబల
ములనిర్జించి। యలసటజెందితిరన్నలారచాల ॥ ౧ ॥ ననుగూర్చి
మీరు। యెంతోకష్టమును బొందినారు। ఘనసంగపురధాముడనన్నొ
ప్పునాకార్య। మనుష్యగజేసితిరానందమాయెను ॥ పోయివచ్చెద
ము ॥ ౨ ॥ వ ॥ యిట్లుబల్కినంవిని రామచంద్రునితోటివియో
గంబునకోర్వంజాలక నెల్లవారల య్యినకులోత్తముగాంచిహస్తం
బులంముకుళించియిట్లనిరి ॥

ముఖారిరాగము-అటతాళము.

పదపద్మములెసన్నిధారము। రామభద్రనిన్నెడబాయనేరము।
సదమలయోగీంద్రసన్నుతనైభక్త । హృదయాబ్జములనొప్పుచుం
డు దేవరవారి ॥ పద ॥ మీవెంటనరుదెంచిచూతుము । సొంపుమీర
మీపట్టాభిషేకము। రావణాంతకరఘురామదయాకర। మావిన్న
పమునివిమముబ్రోవదగునిక ॥ ౧॥ శ్రీపదయోధ్యవీక్షింతుము। మి
మ్ముసేవించిబహువినుతింతుము । కోమలేందీవరశ్యామ శ్రీకరరం
గ। ధాముని బంట్లముమ్మమరబోకుము ॥ పదపద్మ ॥ ౨ ॥

వ ॥ అనవినిరామచంద్రుఁడుదయాకలితాన్వితమానసంబుతో ।
వనచరకోట్లనందరనవారణపుష్పకమెక్కఁజేసి । చయ్యనహనుమ
ద్విభీషణులనంగద సూర్యకుమారముఖ్యులం । గనిముదమొందు
చుఁ బ్రవాళసుకాంచనదివ్యవిమానవేదికను ॥ గీ ॥ అంతభరతాగ్ర
జునియాజ్ఞనవ్విమాన । మంబరస్థలికవలీలనవురనెగసి । యుత్త
రపుదిక్కునను బోవుచుండెనప్పు । డింతిగనిపల్కె శ్రీరాము డిట్టు
లనుచు ॥

మధ్యమావతిరాగము-అటతాళము-

సొగసుమీరు నెమ్మోమెత్తిచూడవె వైదేహిబాల । మిగులను గ్ర
దుఃఖాన్వితకసొగసులెక్కడివి ॥ నగుమానినట్లున్నది నెలతగొ
చిత్తాబ్జమునను । మనసునస్మ్మలేనియువతినెసరు లేమిటికి ॥ ౧ ॥ త
ప్పుమన్నించి బ్రోవుముదారుణోక్తులంటినప్పుడు । గొప్పవారేమ
న్నగానితప్పులుండును ॥ ౨ ॥ యెన్నోయుగములైనట్లాయ నిన్ను
బాసియానాననుసీ । లెన్నోనిందలాడినప్పుడేమాయ మమత ॥ ౩ ॥
శరితసీసౌశీల్యమెరిగికరుణజూచుచుండుమదిని । గురుతరాగ్నిద్రో
యువారికరుణసమ్మదర ॥ ౪ ॥ వనితనిన్ను ప్రజలుమెచ్చవహ్ని
ముఖమునగైకొంటి । ఘనతరరంగపురీశకపటోక్తులేల ॥ ౫ ॥

క ॥ అనవినిరాఘవుడిట్లను । వనితానీమీదికూర్మి వశమునగాడ ।
వననిధిగట్టిమహోగ్రత । దనుజప్రకరములనెల్ల ధరబోరి గొను
టల్ ॥ గీ ॥ కాంతగొనేసునీవియోగంబువలన । నవనినలిదుఃఖతప్తుం
డనైతినన్న । వినిసరోజాక్షిసంతాపవివశయగుచు । మించిబిగిరా
ఘవునికౌగిలించెనపుడు ॥ వ ॥ ఆసమయంబున రఘుప్రవరుండు
పరమానంద కందళిత హృదయారవిందుండై తనవల్లభితో ని
ట్లనియె ॥

మధ్యమావతిరాగము-ఆదితాళము-

మనకుకష్టముదీరెమగువనేటికిని । మనకుదుఃఖముబాసెమహాని
నేటికిని । ముదితానీచిరినవ్వుమోముగన్గొన్న । హృదయము నిండి
తెనిముదమొందెనన్న ॥ ౧ ॥ సకలసంపదలెల్ల సమకూరెనిపుడు ।
ప్రకటసౌఖ్యములెల్ల ప్రాప్తించెనిపుడు ॥ ౨ ॥ వరరంగపురిదేశ

సియింతమింక। ధరణిభారముదాల్చుతరుణినిశ్శంక॥ గీ॥ వెలదిగోనిన్ను రాక్షసవిభుఁడుడాసి। పట్టిగొంపోవుచో మహాభయమువలన। ప్రాణపతినగుననుగూర్చివలువిధముల। నేమిబల్కితివో చెప్పుమిందువదన॥ ద్వి॥ అనవిని వైదేహియారాఘవేంద్రు। గనియిట్టులనిబల్కె కాకుస్థతిలక। మున్ను ఘోరాటవిమృగముకై మీరు। వెన్నంటిపోవంగ వేట్క మీరాక। చాలవాంఛింపహాజానకియనుచు। హాలక్ష్మణాయనుచునార్తస్వనంబు। వినబడెనాగుండెవెసరుఝల్లనగ। ననఘునేనంతటనత్యుగ్రదుఃఖ। మునబొందిమఱఁదినేమొహటుగాంచి। కనుదమ్ములననీరుకడుపడివెడల। నాయన్నలక్ష్మణ యనుగన్నతండ్రి। నీయన్నజేసిననీస్వనంబొకటి। వీనులవిననాయెవేవేగలెమ్ము। ప్రాణసన్నిభుఁడగుదయభుఁబ్రతికింప। స్వామికేయాపదసమకూరెనొక్కొ। యామినచరులచే నటుగాననీవు। పదపడిపటుధనుర్బాణముల్దాల్చి। కదలిక్రచ్చొగబోయితౌవుమీవేళ। ననియన్నలక్ష్మణుండతిదీనుఁడగుచు। వినయవిధేయుఁడై వెసనంజలొత్తి। వినవమ్మనాతల్లిపీరాగ్రగణ్యు। డనఘొవ్వనాయన్న కబజాయుంబెందు। జెందదించుకయైనశివపరించ్యాది। వంచితుండగునైన్య వనదహానుండు। ఖలులొనర్చినమాయగానెన్నట్లు। బలుకుటమేలౌనె పరగనేబోవ। నినుగొనిపోయెదనిజకరద్వేష। ననియున్నసేయంత నాగ్రహమొంది। యేమనందునుహృదయమేశ్వాగనే। సౌమిత్రినన్నట్లుచండరోగ్రి। పాపపువాక్యములాడిదిమక్రల। నీపొంటిబయలుగనేరననెట్టి। పాపవుగతికేగ బ్రాప్తించునోకా। యాపుణ్యనిధినిసేనాడినవెల్ల। తలపోసితలపోసితగతల్లడింతు। వలనొప్పవయ్యేడవాక్యాస్త్రములకు। సలువజాలకనాకునెమ్మితోమ్రొక్కె। జలజాక్షుసౌమిత్రిజనేనునీకడకు॥ వ॥ ఆసమయంబున॥

ముఖారిరాగము- ఆదితాళము.

సన్న్యాసవేషమువహించి। రాక్షసనాథుడన్యాయమాత్మలోదలంచి। ధన్యచరితసౌజన్యతగనుపడ। నన్యమెరుంగకసతియోగ్యంబగు। స॥ వరదాశ్రీరంగనాథాయనుచు। మదిలోనచాల। గరిమనాయొప్పిదంబుగనుచు। సరగునప్రాసలుజపమునజరుపుచు। బిగబిరననుగన వెరువకవచ్చెను॥ గీ॥ యిట్లువచ్చినసన్న్యాసినెలమిగాంచి। తడయకౌసగితిన

ర్ఘ్యపాద్యంబులధిక। భక్తితోడుత నమల తాపసియటంచు। కపటునె రుగక ప్రాణేశ ఖలవినాశ॥ సీ॥ అంతనావృత్తాంతమంతయు వినగోరి యడుగంగ జెప్పితినార్యవినుత। వాడది యాలించి వనితరో వినుమంచు తనశౌర్యవిక్రమస్థానదర్ప। చరితముల్ వివరించి వరవిభూతిదలిర్ప పడతిరో నాకింక భార్యవగుచు। వెనువెంటనరుదెమ్ము వేడ్కతో భోగింత మనియనేకదురోక్తులాడియాడి। కపటయతివేష మసురేంద్రుడపుడు విడిచి। తనమహోద్దండ రాక్షసేంద్రస్వరూప। మద్భుతంబుగజూపింప నార్తితోడ। మిగులదిగులొందినిట్టూర్పు సెగల బొగిలి॥ వ॥ అట్టియెడ నద్దశకంఠుంగనుంగొని॥ మ॥ యతివేషంబున డాసి దుర్మతి నినన్నత్యంత నీచోక్తులీ। గతినాడందొరకొంటివి వ్యోడ। నుదగ్రక్రూర రూపుండవ య్యతివేగంబున నావిభుండడరి। నిన్నన్యాయశీలుం రణక్షితి నుద్దండ తమించి నీదశశిరచ్ఛేదంబు గావించుబో॥ గీ॥ విమలసౌశీల్య నైభువి వెల యునన్ను। క్రొవ్వననుడాసి దుర్వాంఛ కోమరుమిగుల। త్రుళ్లవలదిం కసిటువలెద్రుళ్లితేని। చటులరామశరాగ్నిలోచ చ్చెదీవు॥ వ॥ ఇట్లు నేక కఠినోక్తులాడిన నప్పాపాత్ముండు దగ్రంబున। భజించుచుంగదిసి బలాత్కారంబున యతికఠోరంబులయిన కరంబులు సాచి నన్ను బట్టుకొనిపోయి రథంబునంగూర్చుండి గగనమార్గంబునం బోవునెడ॥ ఉ॥ హా రఘువీర నేనొకదురాత్మునికై వశమైతినయ్యెడం। ధీరుడవై వడింగదిసి దివ్యతరోగ్రశిలీముఖంబులం। దారుణవీనికంఠములు దగ్రగతిం దెగ నేయుమంటి నీచారుకటాక్షవీక్షణులచల్లగ బ్రోవుమటంచు వల్లభా॥

తోడిరాగము - త్రిపుటతాళము.

ప్రాణవల్లభ చాలనునాదురవస్థ। ప్రాణాంత్యమగు బోలును। ప్రాణనాయక రావణునిచే పట్టుబడి దివిబోవు వేళ॥ ప్రాణ॥ కారుణ్యమతులార। తాపసులార। గంధర్వామరులార। చేరిబ్రోవరె నేను శ్రీరాముభార్యను। క్రూరరాక్షసుడొకడు గొనిపోవుచున్నాడు। ధీరమతి విడిపింపరయ్యా మహారణంబొనరించి చయ్యన। సారెకును మిముమరువ నాత్మశరీరములగలదనుకనంటి॥ ౧॥ పావనచారిత్రుని। రామభద్రుని। పరమమంగళగాత్రుని। పావనాకర శ్రీగోదావరిదేవిరో। నీవుగన్గొని దెలుపవె నాపాలి తల్లి। భూవినుతుడగు రంగపురపతి। పొసగగనీ[illegible]రంపుప్రముఖ

డు। నావిధంబికమాల్యవంతోన్నతగిరీంద్రయటంచుబల్కితి॥ గీ॥ అనిప్ర
లాపింపగృధ్రేశుడాలకించి। దనుజపతిదాకియుద్ధముద్ధతినొనర్చి। విర
థుగావించిచాపంబువిరుగద్రుంచి। పటుశరీరంబునెత్తురు పాలుజేసె॥
ద్వి॥ అంతటననుడించియాపాపకర్ము। డంతకుకైవడినాగ్రహ
మమర। నరుదుగానొకఖడ్గ మంకించిపక్షి। వరునిపక్షంబుల వారణనే
యు। తరుచైనశోణితధారలతోడ। ధరమీదనొరిగె నుద్దండతమాని। క
నుగొనినేనంతకన్నీరునించి। చనికౌగిలించివెచ్చనియూర్పులమర। విల
పించివిలపించివిధినెన్నుచుండ। ఖలుడురావణుడుదగ్రంబుననన్ను।గొ
నిపోవగదియంగగొబ్బుననొక్క। ఘనవృక్షమయ్యెడకౌగిటబట్టి। పోక
నీడ్డిలబడ్డపొసగగజీణించి। వికతోవడిబట్టివెసగొనిపోయె। నప్పుడుజగ
ములాహాకారమొందె। చెప్పితినాకథశ్రీరామనీకు॥

పున్నాగరాగము- ఆదితాళము-

యేమనందునాథ। నేనపుడిలనుబొందుబాధ। రామరామమహా
త్మ నావలె। బాములెందుభామలేరుగరీమహి॥ యేమ॥ నినువరించి
యుంచి। జగతిననింద్యయనటించి। వనజనేత్రరామచంద్రవసుధపై। ద
నుజుచేతబడితినంచుబలికితి॥౧॥దిక్కులేకవగచు। జనులకు। దిక్కునీవె
యనుచు। నక్కజముగసుజనులెంతురనయము। దిక్కుగలిగిదిక్కులేక
నడచితి॥౨॥ రంగమందిరేశ। శ్రితభవభంగరిపువినాశ। రంగుమీరవ్య
గముబట్టితెచ్చి। యొసంగుమనుచుమీదెరుంగకంటిని॥ యేమనందు॥

వ॥ ప్రాణవల్లభ లోకకంటకుండగు దశకంధరుం డివ్విధంబునన
న్నుంగొనిచని లంకాపురంబు సొచ్చి తనయంతఃపురంబుననొక్కసుం
దరోద్యానమధ్యంబుననుండనియమించి వికృతాకారులగు రాక్షసస్త్రీ
లనాచుట్టుంగావుబెట్టిన। యారాక్షసస్త్రీగణంబులుగావించుతర్జన
గర్జనంబులకుదలంకినృక్కిదీనదశంబొరసి రామరామేతి వాక్యంబు
లుబలుకుచునుపవాసంబులంగృశీభూతనై। చిత్తంబుభవదీయపాదా
రవిందంబులయందుహత్తించి కాలంబుబుచ్చుచున్న సమయంబున దే
వరవలనంబ్రేరితుండై నాపాలికరుదెంచినమహాప్రభావసంపన్నుండ
గు యీయాంజనేయుని కరుణాకలితమంజు వాక్యామృతంబునంజేసి
ప్రాణంబుధరియించి యుంటినని కన్నీరునించిన రఘువరుండ దద్దేవిభా

ష్పంబులుకరంబునందుడిచి కౌఁగిలించుకొని నీకపరాధంబు గావించిన రావణుండుపుత్రమిత్రబంధుసోదరసైన్యసమేతంబుగా నాహవంబునందెగటారెనింకచింతింపనర్హంబుగాదు మనకుకర్తవ్యంబై నజగద్రక్షణవ్రతంబుసిద్ధించె నీవింకనాతోడనెడతెగని సౌఖ్యంబులొందుమనియూరడించిన యవ్వైదేహీపరమానందకందళితహృదయారవిందయయ్యెనట్టియెడమరల నప్పతివ్రతాశిరోమణిం గనుంగొని రఘూద్వహుండిట్లనియె॥ క॥ తరుణీలంకాపట్టణ। మరుదుగ గనుగొనుము సమ్యహర్మ్యవితాన స్ఫురితంబై మణిమయ। గోపురతోరణ కలితమగుచు పొలుపొందెదగన్॥ గీ॥ వెలదిరో మున్ను సొంపుగా విశ్వకర్మ। ఘన త్రికూటాద్రిపై మహాగరిమ వెలయ। నెమ్మి సృజియించె నిప్పురి నేర్పు మీర। నింద్రపురి నెంచుచున్నదీ చంద్రవదన॥

సావేరిరాగము- ఆదితాళము.

ఇదెయుద్ధరంగము తరుణి। సొంపొదవఁగనుము సద్గుణమణి। సుదతి రావణుఁడీస్థలంబున। మదమునఁగెనిజేర్వుడై తన। యెదపుడమిసోకంగగూలెను। ముదితసినుగొని చనికతనమున॥ ౧॥ గరితకుంభకర్ణుఁడిచట। దుర్ధరుఁడౌ ప్రహస్తుఁడల్లచట। నరుదుగను ధూమ్రాక్షుఁడిచ్చట। నాహవంబొనరించి చచ్చెరి। గరిమనిచ్చట నింద్రజిత్తుని। కనలిలీల వధించె లక్ష్మణుఁ॥ డిదెయుద్ధ॥ ౨॥ అతికాయుఁడిచ్చట సమసెన్। దేవాంతకుఁడిచ్చటఁ బొలసెన్। సతతము విభీషణుఁ డనరంగ। స్థలమునను వెలయుచును నీకై। ప్రతినబట్టి వధించితి ప్రియ। పఙ్క్తిరాక్షసకోట్లనెల్లను॥ యిదెయుద్ధ॥ గీ॥ గరిత జూడుము భంగభంగములతోడ। నమిత సంతోషమొసగమిన్నంది సింధు। రాజు వెలయుచునున్నాఁడు రమణిమానసము। విజయమొందుటచే వనవిభవమొదవ॥ సీ॥ సేతుబంధనము విఖ్యాతిగా గావించి। నట్టి తావిది చూడుమబ్జగంధి। రావణానుజుఁడు సద్భావంబుతోడాగి। శరణొందె నీప్రదేశంబునందు। అబ్ధిప్రసన్నతకై దర్భశయ్యపై। శయనించితీధరాస్థలమునందు। జలరాశి వీక్షించి లలననిన్నుదలంచి శోకమొందితినించుప్రాకటముగ। సతివె సుగ్రీవపాలితంబైనయట్టి దివ్యతరమగు కిష్కింధ తేజరిల్లు। చున్నదల్లదె కనుమింద్రసుతునిగూల్చి। భానుజునకిచ్చినాడనిప్పట్టణంబు॥ వ॥ యిట్లు చెప్పిన విని జనకనందన రఘునందనుం

గనుంగొని॥ క॥ నరనాయకసుగ్రీవుని । తరుణీరత్నములనితరతరుచర సతులం । బెరిరప్పింపుము నేనా । గరితలఁగొని పురికేవత్తుకడు వేడుక గా॥ చ॥ అనవిని శ్రీరఘుప్రవరుఁడట్లయొనర్చెదనంచు । మిత్రనంద నునకునాజ్ఞయివ్వఁగ । ముదంబున నాతఁడు బోయి కాంతలం । బనిబడి తోడి తెచ్చి కపిభామలతోడుత నెక్కెఁ బుష్పకంబనువుగ । సీతయుం రఘు కులాధిపుఁడుం బరతోషముందగను॥ వ॥ అట్టియెడ దశరథాగ్రజుండు మైథిలిం గనుంగొని యిట్లనియె॥ స్వాగతం॥ కనకాంగి ఋష్యమూక ము చూడుమదిగో । ఘనహేమధాతుసంకలితమైచాల । సొంపమించె నుమున్న సుగ్రీవుతోడ । గరిమ నిచ్చటమైత్రి గావించినాఁడ । శుకవాణి వి నవె యీసుందరాచలము । ప్రకటతాగ్రవృక్షఫలపల్లవప్రసూన । కలితకా ననములకడు రంజిల్లుచు । వెలయుచున్నది చాలవిమలేందువదన । వె లది నేనిచ్చోటరహతాపమున । పలవించినాఁడు నెలలుంటనీము ద్దు । చెలువముదలచి హాసీతా యనుకొంచు॥ విమలేందువదన-

ఆనందభైరవిరాగము. ఆదితాళము.

పంపాతటముఁగనుంగొనుమబల । పంకజితసవకముల॥ యింపునస కలనిలింపులగు మునులు । నుతింపుదురిచ్చోటికేతెంచి పగరు సొంపుగనుంగొని॥ పంపా॥ అతులశోకవివశహృదంబుజుఁడ నే స్థలిని శోకించి చాలగాంచి । జితయగు నీముంగురులకుఁ బోలెడునని । మది దలంచుచు నంచితముగ మున్ను నటించిన॥ ౧॥ గరితచక్రవాకములనొగని నీకుచములని నెంచి । సరసీరుహము లచందముగనను । దరహసనీనేత్రములనుస్మరించెదన ॥ ౨॥ వం॥ రమణిరో శుకపికరవములు నీకోమలగళస్వనగ । భ్రమయుచురం గపురము సవసించిన । కమలగంధి హృత్కమలను । శమించను జేసిన॥ పంపాతటముఁగనుంగొనుమబలా॥ వ॥ యిట్లు బల్కి దేవియిచ్చోటహ నుమత్సంభాషణంబు గావించితినని మరలనిట్లనియె ॥ గీ॥ శబరిగంటిని చటశౌర్యమెలర్పఁ । కబంధుద్రుంచినాఁడఁ పగనిందు । పలతి॥విసుము గృధ్రపతి రావణులు మున్ను । బోరినట్టితావు పొలతిగనుము॥ గీ॥ సరసి రుహనేత్రి యిది జనస్థానమచట । నతులబాణాగ్ని ఖరదూషణాదిదే వ । శాత్రవులలీలబోరిగొంటిసకలతావ । సప్తకాండము విసతింప చంద్రవదన-

### ఆఠాణా రాగము. అటతాళము.

యిదెసీతామనపర్ణశాల। బాలేందుసదృశచారుఫాల। సుదతివి సుకుంభోదకమునను। సారిదిమునుసీవమరజేసిన। మృదులతాన్వితత రులనీడల। మొనసిమృగగణము। వెలసెగనుగొనుము॥ ౧॥ తరుణిచూ డుముగోదావరిని। ఘోరతరకల్మషాపహారిణిని। గురుతుగనువనపుష్ప వితతులు। గరిమగోసితివచటనీకవి। మురియుచును తలలోనముడిచితి। మోహవశమునసల॥ముదితయిచ్చటను॥ ౨॥ కనకాంగిశుకపికస్వనము। చాలవినుముచల్లనిచోట్లుగనుము। వనితనినుదశకంఠుడీస్థలి। ననువుగ నువంచించిగొనిచనె। వినుతరంగపురీశయనుచును। ననుదలంపుచును। కనులనీరిడను॥

### నవరోజు రాగము. అటతాళము.

యిచ్చటశ్రీరామనీతోముచ్చటలాడినదాన। నచ్చటజానకీనేనిన్నా దరించితినె॥ ప్రాణనాథనేనీపాద। పద్మములొత్తితినిచట। ప్రాణవల్ల భనీకేలు బట్టితినచట॥ ౧॥ స్వామినీనెమ్మోముమీద। మోముదమ్మిజేర్చి తిచట। భామరోనేనచటనిన్ను। ప్రాధికాంచినానె॥ ౨॥ పొసగనిచటనా ధవన పుష్పములెల్లగోశితిమె। కుసుమగంధినిన్నచోప్పట గూడ గోరితి నె॥ ౩॥ వరదనీసౌందర్యమెల్లవర్ణనజేసితినిచట। గరితనీచెక్కిళ్లనీడగాం చితినచట॥ ౪॥ పంకజాతునాపెందొడపైపవ్వళించితిచోప్పట। జింకబ ట్టితేరనచటచేరిమ్రొక్కితివి॥ ౫॥ రామపరిహాసోక్తులచే ప్రేమనవ్వం చితివిచట। భామరోపుష్పశయ్యపై భాసిల్లితిమిచట॥ ౬॥ వల్లభ గోదావ రినిటచల్లులాడుకొంటిమిచట। మొల్లలుమల్లెలునీకుముడిచితి నచట॥ ౭॥ చెలగిసౌమిత్రితెచ్చినఫలములందుకొంటినిచట॥ లలనరంగపురివసించి వెలసితిమచట॥ ౮॥ సీ॥ అతివరో యిదియగస్త్యాశ్రమంబల్లదిమగువ సుతీక్ష్ణమహాని కేతంకి। పద్మగంధిరో శరభంగాశ్రమంబిదిసఖిచూడుమం త్రియాశ్రమముపూర్వ। మిచ్చోటననసూయనచ్చగాసేవించిగైకొం టివంగరాగములుప్రీతి। చిత్రకూటంబిదిశీతాంశు బింబాస్య భరతుడి చ్చోటసద్భక్తిదాసి। తపలియాచించిపాదుకద్వయముబడసె। యము నదెచూడు రమణి దూరమునవెలసె। నిదిభరద్వాజవాసంబు సుదతి సంప్ర। పుష్పితారణ్యయగుగంగపొలుపుగనుము॥ ద్విపద॥ రమణియి

దిశృంగిబేరపురంబుగనుము । విమలభక్తిగుహుండు వేసనిందు వెలయు మనవంశజులయజ్ఞమహిమంబుదెల్ప । ననువొందుయూపంబు లందం దగల్గి । మహిరమ్యమైయూపమాలినియనగ । రహిజెందిపుష్పితారణ్యమై వెలయు । చున్నదల్లదెసరయూనదీవరము । కన్నులారగజూడు కనకాంగినేడు । కనకగోపురరమ్యకమనీయహర్మ్య । ఘనవరిఘాట్టాలకధ్వజావళులు । నమరచెన్నొందెనల్లదిగోనయోధ్య । కమలాక్షి క్రమ్మఱవేకంటిమిపురము॥

వ॥ యిట్లురఘువరుండానతిచ్చిన వైదేహివరమానందంబున శ్రీమదయోధ్యాపురంబునకు నమస్కరించెనట్టియెడ రఘూద్వహుండు భరద్వాజాశ్రమంబుగాంచి పుష్పకంబులీలండిగ్గి చని పరమ తపోధనుం డగుయమ్మునీంద్రునకుం బ్రణమిల్లి కుశలంబడిగిన నమ్మునీంద్రుండా హర్షంబునం గౌగిలించుకొని దీవనలొసంగి క్షేమంబెరిగించి చిరునగవలరుమొగంబుతో తాపసబృందమందారుండగు కౌసల్యానందనున కిట్లనియె॥ చ॥ వనజదళాక్షునీవువనవాసముకేగినమీదనైననీ । ఘనచరితంబశేషము । జగన్నుతదివ్యతపోవిభూతిచే । మనముననే నెఱుంగుదు । సమానవిహీనమునీంద్రకోట్ల పెంపు నభుః బ్రోవ గోరివనభూమికిబోతివిగాదె రాఘవ॥ క॥ అనిపలికివరముగోనుమన । తనపురభాగములవృక్షతతులెల్లను । శోభనఫలపుష్పదళంబుల । దనరిమధుస్రవములగుచతద్దయు వెలయును॥ వ॥ యిట్లుధంబునం గృపసేయుమని వేడినభరద్వాజుండవ్వరంబొసంగె నంతదినకరవంశ రత్నాకర సుధాకరుండగు రామచంద్రుండు । సమస్తదాసాగ్రేసరుండగుహనుమంతుం గనుంగొని॥ గీ॥ అతులజవమునశృంగిబేరాఖ్యపురము । జొచ్చియచ్చొటగుహుగాంచిచోద్యములర । నాచరిత్రంబువివరించినయములాడి । భరతుపాలికిజనుముప్రాభవమెలర్ప.

రేగుప్తిరాగము. అటతాళము.

చేరవచ్చితిననుమి । కౌగిటగదియ । మీరగృచ్ఛితినసుమి । నారచీరలుసొంపుమీరనావలెదాల్చి । నారాకమదిలోన గోరుతమ్మునితోడ॥

౧॥ వినుతికెక్కితినసుమి । తాపసులశే । వించివచ్చితినసుమి । వనములపదునాల్గువర్షములటునిండ । జనకాజ్ఞమునివృత్తినసురక్తినివసించి॥

చేర॥ ౫॥ ఖలులద్రుంచితిననుమి। సన్మునికోట్లకరుణబ్రోచితిననుమి।స
లలితశ్రీరంగస్థలపతినగు నన్ను। దలచి నాచారిత్రమెల్లమిదెలియబల్కి॥
చేరవచ్చితి। వ॥ వాయునందనా నీవు భరతునితోడ మదీయాగమనవృ
త్తాంతంబెఱింగించి యనంతరంబున యతనివాక్యంబులవలనను ముఖ
లక్షణంబులవలనను మనోభావంబెఱింగి రమ్మని యానతిచ్చిన న
య్యాజ్ఞమస్తకంబునందాల్చి పిట్టక్కనినమానుషరూపంబుధరించిపవ
నజవంబుననప్పవనతనయుండు చక్యసంజనిశృంగిబేరపురంబుసొచ్చి
గుహునింగాంచి పుడమిముద్దియుయ్యల్లనిరాక యెఱుంగించి యతనిచే
తంబూజితుండై మహాజనంబుసంజనితస్మలోదకరమ్యంబగు సరయూన
దిందాటినందిగ్రామంబుసొచ్చియచ్చట॥ గీ॥ ఘనజటావల్కలంబులు
గలిగి। పద్మతులసికాదివ్యమాలికాకలితుడగుచు।విమలముగనూర్ధ్వ
పుండ్రంబువెసముఖాబ్జ। మందువెలుగొందవెలయుమహాత్మునసఘు॥
చ॥ వరమతిరామచంద్ర। పదవారిజయుగ్మసమర్పితాత్ముడై। పర
మమునీంద్రవేషమున। భాసిలుభాస్కరవంశసత్తమున్।భరతునిగాం
చిమ్రొక్కి। భయభక్తిదలిర్పగనంజలొత్తి। శ్రీకరమతిచెంతనిల్చి। గ
నిగ్రహకృనబలికెసమీరసూనుతోన్.

కళ్యాణిరాగము.- అటతాళము.

యెవరోయినీవుమహాత్మక।నిన్నెవరంపిరిటకుపుణ్యాత్మక। ప్రవి
మలతేజనీభావముగనుగొన్న। ధృవముగనదినేసంతోషముద్భవమొం
దె॥౧॥నామధేయమువివరింపుము। సీ। పేమిగేరిన్ వానభింపుము। కాం
మించిశ్రీరంగధామునకృపనొంది। తేమొతెలియదాయప్రేమగల్గు
చునున్న॥ దెవరోయినీవుమహాత్మక॥ సీ॥ అనవినిముదముతోనద్దాశర
థిమోముపీక్షించిపావనివినయమలర। హనుమంతుడనువాడనధిపవా
యుసుతుండశ్రీరామపాదాబ్జశేవకుండ। పదునాలుగేండ్లుదుభార
ఘోరవనసీమజనకజాలక్ష్మణసహితముగను। నివసించివచ్చుచు నీయ
న్ననుగాంచిమత్ప్రాదుకలయందుమహితభక్తి। కృతధరాభారుడగు
చునన్నుతివహించి। వెలయుచున్నాడు భరతుండువిమలనియతి। నత
నిసేమంబుదెలశిరమనగనిటకు। వచ్చితినుగంటి లోకపావనచరిత్ర॥
మ॥ నినుపుణ్యాత్మకుసత్యసంధుననఘుం। నేత్రాభిరామంబుగా గని

వైధవ్యత జెందినాడ । విమలసత్కల్యాణచారిత్ర పావనశ్రీరామ పదారవిందయుగసేవాచింతనాసక్తిచే । ఘనవిఖ్యాతి వహించినావు జగతిం గాకుత్స్థవంశోద్భవ ॥ వ ॥ మహాత్మా భవదీయాగ్రజుండగు రఘునందనుండులోకవిద్రావణుండగు రావణుం దెగటార్చి । సుగ్రీవప్రముఖమిత్రగణపరివృతుండై వచ్చుచున్నవాడని తాపస వేషధరుండగు భరతునితో నెరింగించినయవ్వాక్యంబులు కర్ణామృతంబులుగా దోచిన బులకీకృతసర్వాంగుండై హర్షబాష్పంబులుప్పతిల్ల యొడలెరుంగక పరమానందవశంబున మూర్ఛిల్లి ముహూర్తమాత్రంబునం దెలసి లేచియా హనుమన్తుని గాఢాలింగనంబు గావించి బహుమానంబులొసంగి యిట్లనియె ॥

అసావేరిరాగము - ఆదితాళము -

నీవంటి విహితుని గాన । వో నిర్మలాత్మక యీజగాన । పావనుండగు రామభద్రుని రాక । కృపావన రాశివై నీవు దెల్పితివహహా ॥ నీవంటి ॥ యంతపుణ్యాత్ముడవని నిన్నెమనిపొగడుదుత్తరని ॥ సంతతమిలరంగస్థలి నొప్పు రఘుభూకాంతుని పదముల చెంత చేరితి వీవు ॥ ము ॥ వరభల్లూకమృగేంద్రఖడ్గశరభవ్యాకీర్ణమై యొప్పు । దుస్తరఘోరాటవుల రఘూద్వహుడు । సీతాలక్ష్మణోపేతుడై । కరము ప్పారుచు నేక్రియనున్నెల గె । నే కార్యంబులెచ్చోట తా । నెరిగాపింపెనో దెల్పుమా సకలముం నిష్టాగరిష్టుండవై ॥ వ ॥ ఇట్లు బల్కి దివ్యాస్తరణంబున హనుమంతుం గూర్చుండబెట్టుకొని రామవృత్తాంతంబు చెప్పుమనియడిగిన నప్పవన తనయుండిట్లనియె ॥ ద్వి ॥ వినవయ్య జానకీవిభుని చారిత్ర । మనుపమసౌఖ్యాహమఘనాశనంబు । మునుజనకాజ్ఞచే మొనసి నీయన్న । తనసహోదరు తోడ తరళాక్షితోడ । వనమునకేగంగ వరభక్తి నీవు । చనిమ్రొక్కి మరలింపసాధ్యంబుగాక । పరగ శ్రీరఘుభర్త పాదుకల్ బడసి । పురమాగక మటుబట్టి పోసగరా వారు । గండక వేదండకంఠీరవప్రసం । కాండసంకీర్ణమయి కడుభీతిముంచు । దండకారణ్యమద్దండత జొచ్చి । దండి విరాధునుద్ధతి బిల్కుమార్చి । శరభంగముని వరాశ్రమము చొరంగ । గురుతుగా నహ్మానికోరి శ్రీరాము । గరిమ ముద్దు మొగంబు కన్నులగాంచి । విరివిగా నగ్నిప్రవేశంబొనర్చి । కములసంభవుని లోకముకీలజొచ్చె । కమలాక్షు

డగురఘుగ్రామణికడకు। పాపాసురులబాధబడలేకసర్వ । తాపసవి
భులుసంతప్తులై వచ్చి। శరణన్ననభయహస్తముకృపచేసి। శరవహ్ని
నసురులసమయింతుననుచు। దీక్షగావించిసుతీక్ష్ణుజేరి । యక్షీణతేజు
డై యచ్చటదీర్ఘుఁ। కాలంబువసియించికణకతోఁతగ్గి।చాలసన్మునియా
శ్రమతతులఁగనుచు। నరుదారగానగస్త్యాశ్రమస్థలము । తరణికులేశుం
డు తాఁజేరిశక్ర। సంమంధమగుఖడ్గచాపతూణంబు। లిమ్ములవడసియా
త్మేచ్ఛనువెడలి। సదమలంబైనపంచవటిసిఁజే । మదయుక్తయగుచుదు
ష్టాఁనినిమైన । దానవాధ్యక్షుసోదరిముక్కుచెవులు । పూనిమహాశి
చేపాఁసగఁగోయింప। జనిశూర్పణఖజనస్థానంబు జొచ్చి। దనుజులకెరు
గింపతడయకవచ్చు। ఖరదూషణాదిరాక్షసవీరవరుల । శరవహ్నిజం
వునాసమయంబునందు। వడిచుప్పనాతిరావణుపాలికేగి । తడబాటు
లేకనంతయువివరింప। నతులితరోషతామ్రాక్షుడై లేచి । జతలేనిమా
యావిశారదుండైన। మారీచుకడకేగి మహితదుర్మంత్ర। మారూఢి
జేయవాడదియాలకింప। కతిబుద్ధిబోధింపనది వినకున్న। నతిమాయచే
కురంగాకృతినొంది। జనకపుత్రికెమ్రోలసంచరింపంగ। కనివిస్మయము
జెందికాంతునిజూచి। నెట్టనప్రాణేశ నీవీమృగంబు । బట్టితెమ్మనిభామ
ప్రార్థింపరామ। చంద్రుండుశరశరాసనయుక్తుడగుచు । సాంద్రా
టవికిమృగేచ్ఛనుపోయిపోయి। కదియజాలకనొక్కకఠినాస్త్రమేయ।న
దిదాకలక్ష్మణహాశీతయనుచు। రక్కసుడేరీతిరయమునగూశి । గ్రక్కు
ననమ్మేడకాయంబువిడిచె। దారుణధ్వనివినిధాత్రీతనూజ । ధారుణి
మూర్ఛిల్లితద్దయుదుఃఖ। సాగరమగ్నయైసౌమిత్రిఁగాంచి । వేగనీవింక
నావిభుపాలికరిగి। బ్రోవుమటన్ననే బోగూడదనుచు। వావిరిభక్తిచే
వాశిగాబల్కు। వినిమహాక్రోధమైవినరానిపల్కు । లనతల్లడిల్లుచున
గ్రజుకడకు। జనెలక్ష్మణుడుఖేదసంయుక్తుడగుచు । మనసురాఘవరూ
పమగ్నతజెంద। నాసమయంబుననసురేశ్వరుండు । భాసుర సన్యాస
భావంబుదాల్చి । సలలితంబగుపర్ణశాలలోనున్న । జలజాక్షినిష్ఠా
గించిచనుచుండగృధ్ర। పతివానిదాకిదుర్భరఘోరయుద్ధ । మతిశక్తిగా
వింపనప్పాపకర్ము। డరువొందగృధ్రేశుసిలమీదగూల్చి । కరమొప్పది

విభావకాంతవై దేవి। గిరిమీదనలువురకీశులగాంచి। తనసొమ్ములొ
కకొన్నితగఁగట్టివైచె। తనజాడదశరధతనయుడెరుంగ। నింద్రజిజ్జనకు
డయ్యింతితోడుతను। సాంద్రమణిప్రభాసంపూర్ణమయినపురవరిం
బునను జేరిపూంబోణికవుడు। వరవైభవముజూపివలపెల్లదెలుప। కనలి
వానితృణంబుగామదినెంచి। వనజాక్షికాఠిన్యవాక్యముల్ బలుక। ప్ర
మదావనంబునపద్మాక్షిఁజేర్చి। విమతుడై కాపుంచె వెలదుల నపుడు।
మృగరూపధరుడై నమూఖుఁడై తేయు। విగతజీవుఁగజేసివిపినంబులో
న। వచ్చుచురఘువంశ వార్ధిశశాంకు। డచ్చుగాలక్ష్మణునత్తరిగాం
చె। తత్తరమ్మునఁదన్నదమ్ములిద్దరును। నెత్తమ్మిపద ముల నెలతవై దే
వి। నుత్తమగుణవతినొప్పుగావెదకి। చిత్తమ్ములత్యంతచింతలనొంద।
కనుఁగొనలేకశోకముజెందివచ్చి। ఘనగృధ్రపతికి సంస్కారంబొనర్చి।
ఘోరరూపుకబంధుకుంభినిగూల్చి।చారుసత్కారముల్శబరిచేపొంది।
పంపాతటముజేరభానుసూనుండు। పెంపైనగట్టుపై ప్రీతితో నుండి।
బాణబాణాసనపాణులైదివ్య। తూణీరములతోడధృతిగల్గివెలయు।
కాకుత్స్థకులులశృంగారరమ్యంబు। తాకన్నులనుగాంచిధైర్యంబుడిం
చి। వాలిపంపునజంపవచ్చిరటంచు। చాలభీతిల్లియాశైలంబుడిగ్గి। వా
రివృత్తాంతంబువరుసగాదెలియ। గోరినన్నంపంగకోమరారుభిక్షు।
రూపంబుతో వారిరూఢిగాజేరి। యాపుణ్యనిధులతోయాదిత్యసుతుని।
తెరగెల్లవివరించితెరగొప్పవారి। తెరగెల్లదెలిసియద్దినకరాన్వయుల।
కొనివచ్చిగవిపుత్రుగూర్చితినప్డు। దినవంశశేఖరుండినజునితోడ। నన
లసాక్షిగసఖ్యమ్ముసురరచించి। తనవిక్రమముజూపితగనమ్మఁజేసి। యొక
బాణమునవాలినుర్విపైగూల్చి। ప్రకటవానరరాజ్యపదవియొసంగె।
సొరిదివానరకోట్లసుగ్రీవుడనుప। ధరణిజవెదకంగదలిదారిదిశల। నంగ
దజాంబవాద్యగచరవర్గ। సాంగత్యముననేనుజనియామ్యదిశను। వె
దకుచునొక్కశైలవివరంబుజొచ్చి। చెదరకనొకపుణ్యశీలయాసాధ్వి।కరు
ణచేవెడలితికపికోట్లతోడ। యువిదగానకనుప్రాయోపవేశంబు। ప్రవి
మలనిష్ఠనేర్పడనొనర్పంగ। వరమతిసంపాతివచనంబు వలన। శరధి
దాటితిరామచంద్రుదలంచి॥

## మారువరాగము- ఆదితాళము-

మునులుభజించేటిరామపదాంబుజములనుభజించితిని । సీతాప
జాస్యనుగనుపరుచుండని దేవతులనుతించితిని॥ మునుల॥ కొంకకగడచి
నలంకారాక్షసిబింకెమణంచితిని । నేనిశ్శంకుడనగుచు దశాస్యునిపుర
ముతలంకకజొచ్చితిని॥ మునులు॥ కాంచనమణిమయసౌధాంతరము
కాంతనువెదకితిని । యారాత్రించరపురిమగువనుగానక దుఃఖించి త
ప్పించితిని॥ ౨ ॥ ముదితనుభాస్వద్వనమునపొడగనిముద్రికయొసగితిని
శ్రీమత్పదమలరామచరిత్రముసీతాసుదతికిదెల్పితిని॥ ౩॥ వనితయొసం
గిఁదివ్యశిరోమణివరముగ్రహించితిని । ప్రమదావనవిధ్వంసమొనరిం
మహోద్ధతిదనజులగూల్చితిని॥ ౪॥ పదపడిమించితిబాహునితోసంభా
షణజేసితిని । అంతటబెదరకరాక్షసపురమత్యద్భుతమొదవదహించితి
ని॥ ౫॥ కడువడిజడనిధిగడచికపీంద్రులగనిముదమొందితిని। వడిచనితడ
యుకరంగస్థలపతిగనివృత్తాంతముచెప్పితిని॥ ౬॥ మునులు భజించేరా
ముపదాంబుజములను ॥ ౭ ॥ శ్రీరఘువర్యుడద్రిచరసేనలతోడమదస్వి
తంబుగా । నీరధిపొంతజేరిరజనీచరనాథునితమ్ముడాతుడై చేరినకూ
ర్మినేలుకొనిసింధుపతింసముపాస్తిసల్పగా । చేరకయున్నను గ్రమానిశీ
ఘ్రమునంవిలుదాల్చిధీరతను॥ గీ॥ అతులబాణాగ్నిబరపనయ్యబ్ధిఁభయ
డు । తల్లడముజెందిచనుదెంచితరణివంశ । జలధిచంద్రునకయ్యెడజల
ధిగట్టు । చందమెఱిగించిజనెనుప్రసన్నమతిని ॥ క ॥ వనచరవితతులుదె
చ్చిన । ఘనగిరివృక్షములవలనగట్టెను । నలుడవ్వననిధిని సేతువయ్యెడ।
మనుజేంద్రతనూజరాముమహిమేమందును॥ వ॥ అట్టియెడ రఘువరుం
డుసమస్తవానరసైన్యసమేతుండై సముద్రంబుగడచిలంకాపురంబుచు
ట్టుముట్టడివేళ ధూమ్రాక్షుమహాకాయ ప్రహస్తకుంభకర్ణాతికా
యత్రిమస్తకకుంభనికుంభ మకరాక్షేంద్రజిద్రావణప్రముఖదుష్టరా
క్షసక్షయంబుగావించి విభీషణునకుం బట్టంబుగట్టి తనసన్నిధానంబు
నకువైదేహినింబిలుపించి కాఠిన్యంబులాడిన నద్దేవియు ననింద్యయగు
టం జేసిలోకంబులిచ్చమెచ్చ నగ్నిప్రవేశంబొనరించినంతట నపాయం
బులేకనగ్నిమధ్యంబునంబ్రకాశింపుచున్న సీతంగైకొమ్మనిబ్రహ్మాదు
లత్యంతభక్తియుక్తంబుగాస్తోత్రంబుగావించిన నద్దేవింగైకొనిదశరథ

దర్శనంబుగావించి పరమేష్ఠిప్రముఖులవలన ననుజ్ఞగొని పుష్పకారూఢుండై సుగ్రీవప్రముఖులతోడ భరద్వాజాశ్రమంబునకరుదెంచి యున్నవాడెల్లి నిక్కంబుగా నిచటికి వేంచేయునని సాకల్యంబుగా నెరిగించిన రామచరిత్రంబువిని విస్మయానందంబులు డెందంబునం బెనంగొన శత్రుఘ్నునింబిలిచి నీవయోధ్యాపురంబునకుంబోయి పురంబు సకలవిధశృంగారంబుగావింపనియమించి పౌరజనచకోరబృందంబులకు హృదయోత్సవంబుగా రామచంద్రాగమనవృత్తాంతంబు చాటింపంజేసి హితమంత్రిపురోహిత సూతగాయకవందిమాగధబృందంబులను తల్లులందోడ్కొని మంగళతూర్యరవంబులతోడ జనుదెమ్మని పల్కిన నతండతిజవంబున నయోధ్యకుంబోయి రఘువరాగమనంబు చాటించి పురంబు శృంగారంబుగావింపనియమించిన-

నాదరామక్రియ రాగము- ఆది తాళము-

రమణీయమైన శృంగారములు జేశిరి పురము। విమలాత్ముడైన సీతారమణుడు వేంచేయు వేళ॥ రమణి॥ వీధులు విశదముగ గావించి నల్లడల చాల శోధించి చందనమిళిత శుభజలధారలు జల్లి॥ ౧ ॥ ఫలభారనమ్రములగు రంభాస్తంభప్రకాండముల। సలలితాఖిలప్రాంగణస్థలముల నమర్చి యిట్లు॥ రమణి॥ ౨॥ అనుపమకాంచనరమ్యహర్మ్యవాతాయనముల। ననురక్తి నగరుధూపవాసనలు నిగుడించ సలిపి॥ రమణి॥ ౩॥ ఘనతరకస్తూరిపంకమున మణివేదికల లికి। ఘనరంగనాథుడు మెచ్చ గారంగవల్లిక వీచి॥ వ ॥ మరియు సుంబ్రసూనగుచ్ఛకలితంబులై నవ్యాశ్వత్థరసాలపల్లవభాసురంబులగు తోరణంబులు గట్టువారును దినమణిద్యుతిపుంజంబులూరయనురుకు రత్నభూషణాలంకృతంబులగు పతాకంబులెత్తువారును రాఘవేంద్రుండు గావించిన సముద్రబంధనాదిపరాక్రమంబులు రఘువరాస్థానప్రదేశంబుల శిల్పవిద్యానైపుణంబు మెరయ లిఖించువారును సాకేత నందిగ్రామమధ్యంబున సమ విషమస్థలంబులు చక్కగా గావించి నానాశృంగారంబులు రచించువారును దేవతామందిరంబులత్యంతభక్తియుక్తంబుగా నలంకరించువారును సీతావల్లభుండరుదెంచుచున్న వృత్తాంతంబువిని పరమానందంబునం జూడం బోవ సొగసులను చేకొనువారును కొందరు రామకథా సుధారసంబు

శ్రోత్రాంజలులం గ్రోలి కౌతూహలాతిశయంబునం బరవశంబునొంది మేనులు మఱచువారును కొందఱు చేసినపనులు మఱలం జేయం బూనువారును నై యుండి రట్టియెడ శత్రుఘ్నుండు ధృష్టిజయంతవిజయ సిద్ధార్థయర్థసాధక అశోకమంత్రపాల సుమంత్రసహితంబుగా నాష్టమంత్రులం గూడి చతురంగబలసమేతుండై కౌసల్యాదిదశరథవధూజనంబులాం దోళికలం గూర్చుండి చనుదేర వసిష్టాది పురోహితులను సూతగాయకవంది మాగధబృందంబులును నవ్యలావణ్యవైభవంబునం దేజరిల్లు వారకాంతావర్గంబులును బిరబిరం బరుగులిడు పౌరజానపదసందోహంబులును తనవెంటం జనుదేర శంఖభేరిమృదంగతూర్యప్రముఖరవంబులవలనం బ్రతిధ్వనులుదయింపం జని నందిగ్రామంబు సొచ్చి భరతునకు నమస్కరించి యనంతరంబున నతండు తమ్మునిం గౌగిలించుకొని మహోత్సాహంబున॥ సీ॥ తనతలమీద సీతానాథు పాదుకల్ కడుభక్తితో దాల్చి కనకదండ। సంయుక్తమగు సితచ్ఛత్రంబు ధళధళ వెలయంగ చామరల్ వేయుచుండ। హితమంత్రిజనపురోహితవంది మాగధుల్ పరమోత్సవంబున బలశి కొలువ। మంగళప్రదవాద్యమృదంగ భేరిశంఖతాళప్రముఖమహాధ్వనులు మ్రోయు। హేలగిరథగజహయభటబలము నడువ। శ్రీరఘుస్వామి చరణరాజీవయుగము। కన్నులారంగగను గాను కాంక్షగలిగి। భరతుడెదురేగె శ్రీరామభద్రునకును॥ వ॥ యిట్లు జనిచని రఘువరేణ్యునింగానక హనుమంతుతో నిట్లనియె.

భైరవిరాగము. అటతాళము.

రాకయున్నవాడు। యెవ్వరుసాటి। లేకయున్నవాడు। శ్రీకరరఘువంశసింధుసంపూర్ణ। సుధాకరుడవనిజా రాకేందుముఖిగూడి॥ కల్లలాడనేల। నీకాపేయమెల్ల దెల్పనేల। యుల్లము వేట్కరంజిల్లగ శ్రీరంగవల్లభుడరుదారవచ్చునటంటివి.

వుదయరాగము. అటతాళము.

అనుపమ రామముఖాబ్జముకన్నులనను వొందగను జూడకున్న। హనుమంత వినుమికతనువున ప్రాణములను నిల్పదులభమెన్న॥ అనుపమ॥ యిక నెన్నినిమిషములకు వేట్కవేంచేయునకట మోహన మూర్తితోడ। సకలజ్ఞుడగు రఘుస్వామిని గనియెవ్వడకుటిలమతి మ్రొక్కువాడ॥ ౧॥ స

లలితశ్రీరంగస్థలమున వెలుగొందుసలినదళాక్షునిచాల। చెలిమిగన్గొని భక్తిసలుపుచునే నెప్పుడెలమినుతించుదులీల॥ ద్వి॥ అనవిని హనుమంతు డవ్వుణ్యశీలు। గనివత్కోసావల్కు గల్గగాదెన్న। వరదయామతిభరద్వాజదేవేంద్రు। లరుదారనొసగినయువ్వరవాక్య। మున జేసిమనపుర మ్మునకరుదెంచు। ఘనమార్గమాదిగాగ చోట్ల నెల్ల। ననువుగావ్రతుంబులందమొప్పారె। వరిమెళిమకరందఫలపుష్పనిచయ। పరిపూర్ణ మగుచునేప్పడియున్నవవిగొ। సరగునవచ్చుచుసర్వాగచరులు। తరుచుగాఫలమరందములింపుతోడ। తగమెక్కిమత్తులై తడయంగ బోలు। నగణితమై భవమతిశయిల్లంగ। వస్తురిచ్ఛటికతిత్వరితంబుతోడ। చిత్తమందునసమ్ముశ్రీలజనతోష। కపికోట్లమ్రోతచక్కగవినవయ్యె। నిపుడు గోమతిదాటుచుందురుదలప। పంగవానరులెల్లభక్తితోగొల్వ। నరుదెంచుశ్రీరాముడవనీశతనయ॥

బిలహరిరాగము. అటతాళము.

అదిగో మణిమయమైనపుష్పకమునదమలాంతరీక్షమున గన్గొనుము। ముదమునదేవనముదయములెల్ల నింపొదవబొగడుచుండ నెదురులేకవచ్చె। నదిగో॥ ఘనతరరత్నధగద్ధగితంబై। కనకసాలభంజికా కలితంబై। జననుతమరకతస్తంభపంక్తులుగల్గి। వినుతికెక్కినభద్రవేదికల మరుచు। మొనసికాంచనకింకిణిధ్వనులినుమడింపుచుమ్రోయగను। సురవనితలరుదుగకుసుమవర్షమవారణనువర్షింపడగ్గరె॥ నదిగో॥ నిరుపమదివ్యాస్త్రగణసంయుతమై। నిమలమౌక్తికనిచయభూషితమై। వరరామలక్ష్మణవనచరపూర్ణమై। గరిమెసీతేందిరాకమనీయ్యమగుచును। గురుతరధ్వజయుక్తమగుచునుసరసమణిభిత్తికలుధళధళ। మెరయగదిశేనురంగపతిసుందరనికేతనమనుకరింపుచు॥ నదిగో॥

భైరవిరాగము. ఆదితాళము.

అడుగో। మోహనమూర్తిక। అడుగో। యెడబడకనుతనపడతినితోడయందిడుకొనిముచ్చటలడుగదొరగువాడడుగో॥ ౧॥ మునిగణములుహృద్వనజమ్ములసిడి। గనుచుండెడిపదవనరుహములవాడడుగో॥ ౨॥ దరదరవిందస్ఫురితములై సుందరతరమగునేత్రంబులుగలవాడడుగో॥ ౩॥ పలుకులమధురసమొలకగ సీతాకలకంఠికితన వలపుదె

లువాడడుగో ॥ ౪॥ సలలితరంగస్థలపతిమైకలుముల చెలివక్షస్థలమునగలవాడడుగో॥ ౫॥

వ॥ యిత్తెరంగున బలికిన విని భరతుండు గగనమార్గంబునం బుష్పకవిమానారూఢుండై వేంచేయుచున్న జగన్మోహనదివ్యమంగళస్వరూపుండగు శ్రీరామచంద్రుని దర్శించి పరమానందకందళితహృదయారవిందుండయ్యె సమస్తజనంబులు రథగజతురగాదివాహనంబులు దిగ్గి పాదచారులై మాల్యమోదకఫలప్రముఖంబులు హస్తంబులం దాల్చి రెప్ప వేయక నయ్యెవ్వెలుకువ్వం దప్పక వీక్షింపుచుండ నయ్యోధ్యాజనబృందమధ్యంబున హర్షసంజనితంబగు మహాధ్వని యుదయించె నంత॥ సీ॥ అంతట భరతుడత్యంతభక్తుడు గాన నంజలి శిరమునందమర దాల్చి । వచ్చుచుండగ ధేను వచ్చు గాతేన కూర్మి వత్సంబు గని వేగ వచ్చినట్లు । మునివేషము మరంగ తన పదాంభోజముల్ గనవచ్చు తమ్ముని గాంచి లీల । రఘుకులాధ్యక్షుండు రయమున మణిగణస్ఫురితపుష్పకము సొంపున ధాత్రి । గదియ జేసిన భరతుండు కన్నుగవను । సరససంతోషజనితబాష్పములు గురియ । ధనము గనుగొన్న పేదచందమున వెలసి । ఖలజనవిరాము శ్రీరాము గాంచె నపుడు॥ క॥ అనుపమఘనవనవాసిపా । వనచరితుని సకలయోగివందితు ననఘున్ । గనుగొనెనంతట భరతుడు । తనకన్నుల కరువుదీరత దద్దయు భక్తిన్॥ క॥ కరుణాకటాక్షవీక్షణ । పరిపాలితనతవితానుభవభయదూరుం । సురరాడ్వైరివిదారణు । నరుదారగ గాంచె భరతుడధికప్రీతిని॥ మ॥ మునియాగంబవలీల బ్రోచిన జగన్మోహుం । కృపాంభోనిధిం జనకక్ష్మావరకన్యకాముఖసరోజప్రాంచితాదిత్యు । పావనమూర్తిం భవచాపఖండను మహావక్షుం దశగ్రీవ । కాననవైశ్వానరు గాంచె । నయ్యెడ మహానందాన్వితస్వాంతుడై॥ క॥ వితరణశీలు నిజగతిం । జత లేని మహానుభావు చారుగుణాఢ్యుం । ధృతకోదండుని సీతా । పతినిం భరతుండు చూచె పరమోత్సుకుడై॥ వ॥ యిట్లు ఖండదివ్యతేజోనిధియగు రఘూద్వహుని దర్శించి సాష్టాంగవందనం బాచరించి నిరవధికభక్తియోగంబునన౦జలి గావించి సమాహితచిత్తుండై శ్రీమదిక్ష్వాకునిర్మలవంశపయఃపారావారసంపూర్ణచంద్రోదయ జ్ఞానబలైశ్వర్యవీర్య వాత్సల్యసౌ

శీల్యశోభాభ్యాద్యనంతకల్యాణగుణాకర! నీవుసీతాలక్ష్మణసహాయుం
డవై జనకవచనవ్యాజంబున వనవాసంబు సేయంజని దేవగంధర్వగ
రుడోరగసిద్ధసాధ్యమహర్షిసంఘంబులకుపరమసుఖలాభంబుగాజగ
త్కంటకులగురావణ ప్రముఖరాక్షసకోట్లందునుమాడి శరణాగతదీ
నసంత్రాణవ్రతంబుదిక్కులమిక్కిలిం బ్రఖ్యాతి నొంద విభీషణునకు
లంకారాజ్యంబొసంగి తావకీయ పాదారవిందసేవానంద కందళిత
హృదయారవిందుండనగునన్నుంగరుణావలోకంబుల బ్రోవందలంచి
కృపాకారూఢుండవై వేంచేసి మీజగన్మోహనసౌందర్యస్వరూపంబు
కన్నులారదర్శింపంజేసితిరని తనశిరఃప్రణామంబు గావించి కుశలంబడి
గినరఘువరుండత్యంతవాత్సల్యంబున జటావల్కల మండితుండగుభర
తునింగరారవిందంబులుసాచి గాఢాలింగనంబుచేసి తొడలయందిడు
కొనిశిరంబుమూర్కొని హర్షబాష్పంబులుప్పతిల్లబహుకాలంబు
నకుచూడంబడినభరతునితోనిట్లనియె॥

ఆనందభైరవిరాగము - ఆదితాళము.

కనుగొంటినికను దమ్ములతమ్ముడ। కరువుదీరనిన్ను। దినదినమును నినుగనగోరుదుమది। వనమునకేగినదినమదిమొదలుగ॥ ౧॥ గరిమతో డన్నినుబోలినతమ్ములుధరణిలోనగలరా। సరగునమునివేషముగొనిపాదుక। లరుదుగగొలిచితివనఘుడనేటికి ॥ ౨॥ అనుజవినుముమనవారల కందరకవనికుశలమగునె। ఘనరంగేశ్వరుడనిననుబొగడగ జనకవచన పాలనమొనరించియు॥ క॥ అనిపలుకగవినిభరతుడు। జనవరకుశలంబు సకలజనులకటంచున్। ఘనమతినిజెప్పిలక్ష్మణు। గనిచయ్యనబోయిప్రమొక్కె గౌరవమొప్పన్॥ వ॥ అంత॥ గీ॥ అతులకరుణామతిని సుమిత్రాత్మజుండు। భరతుకౌగిటగదియించి పరమసాద। రోక్తులాడంగనీవుపుణ్యోన్నతుడవు। రఘువరునిగొల్చినాడవరణ్యములను॥ ద్వి॥ అనిపల్కి జనకరాజాత్మజనపుడు। గనిభక్తిప్రణమిల్లికరములుమోడ్చి। తల్లిరోనినుబోలుతరుణులీవిశ్వ। మెల్లశోధించిననెందుండరెన్న। ఘనపతివ్రతవువిఖ్యాతసౌశీల్య। వసుమతిమనుచరిత్రపవనినిన్బొగడ। వనజగర్భున కైనవశముగాదన్న। వినిసరోజాక్షియవ్విమలాత్మజూచి। కరుణారస స్ఫూర్తికన్నులందమర। వరమతిబలికెనీవలెనన్నమీద। కనికరంబును

భక్తిగలిగినతమ్ము। లినకులోద్భవవినుతమిద్ధరలేరు। రామభక్తిధ్యానర మణియ్యమతివి। ధీమంతుఁడనఁటన్న తెప్పినవనవుడు। సరసిజహితపుత్ర జాంబవంతులను। గరిమనంగదనీలగంధమాధనుల। నలనీలపనసాఖ్య వనచరవరుల। భళనొప్పుఋషభగవాక్షసుషేణు। లాదిగాఁగలిగినయ గచరోత్తముల। సాదరంబునడాయఁజనికౌఁగిలింప। తరుచరవ్రాతమూ తనికుశలంబు। దరుచుగానడిగిరత్యంతమోదమున॥ గీ॥ కరుణరంజిల్లను గ్రీవుకౌఁగిలించి। మరలభరతుండుపల్కె నిమ్మహినినలువు। రన్నదమ్ము లమేన్న ఖేమవనిమమ్ము। గూడినీవైతివైదవవాడవనఘ॥ వ॥ ఇట్లుపలికి॥ మ॥ ఘనమతిన్మైచిభీషణుని। గాంచిముదంబునకౌఁగిలించినీ। వనుపమపు ణ్యవర్తనుఁడ। వర్కకులేంద్రునికార్యమింపునం। బనివడి చేసినావురఁ ఘుభర్తనునమ్మినవాఁడవీవనన్। వినివినుతించెనాతని। వివేకగుణంబుల కాత్మమెచ్చుచున్॥ వ॥ ఆసమయంబున శత్రుఘ్నుండు సత్యధర్మపరా రాయణుండగురామభద్రునకుంబ్రణమిల్లిసౌమిత్రికివందనంబు గావిం చివైదేహికిసాష్టాంగనమస్కృతియొనర్చి నయ్యెడ సీతామనోహ రుండులక్ష్మణసమేతంబుగా చయ్యనంబోయి ముప్వురు తల్లులంగని మ్రొక్కులిడినయక్కుమారుల నక్కులంజేర్చి కుచక్షీరంబులువర్షిం పుచుశిరంబులు మూర్కొని వాత్సల్యంబునంగారవించి మితిలేని ము దంబునంబొందిరంతటబ్రహ్మప్రార్థితజన్ముండగు రఘువరుంజూచి కౌసల్యనెయ్యంబువాటిల్లనిట్లనియె॥

భైరవిరాగము. ఆదితాళము.

నిన్నుగనుగొంటిని నేటికినిజగ్నరేంద్రవినుత। చిన్నగనడవికిజన్నది మొదలుగ। ఖిన్నతపడిహా। కన్నకొడుకయని। నిన్నుదలఁచుచును। కడు గాపన్నతనొందుచును। కన్నుగవనుజలకణములుదొరుగగ। కన్నతం డ్రిననుకరుణించుమువి। ద్వన్నుతపదరఘువరముఖచంద్రుని। విన్నసదో లగగవెసజూపుమనుచు॥ నిన్ను॥ ౧॥ అతులితఘోర తరాటవులను। మే గతిఫలమూలములతినమ్మితిదిని। బ్రతికెదరోయనుచు। నేభువి। బ్రతికివి ఫలమనుచు। సతతమునినువనగతునిస్మరింపుచు। నతులశోకదహనార్చు లకాగుచు। క్షితలమునసుమూర్ఛిలిపడిలేచుచు। వెతలబొందుచునుక్షి తినట్టుదూరుచు॥ నిన్ను॥ ౨॥ ధారుణిలోన కుమారులతల్లులు। జీరుచు

ముక్కునతోరంజిల్లగ। సారెకుఁగనుఁగొనుచు। మదిలోకూరిమినిను గనుచు। శ్రీరంగస్థలశుభగనికేతన। దారుణవనసంచార నియమమెట్లు। దీరిసుఖించెదవారయరఘుకులు। వీరయటంచునువిలపించుచుధర। నిన్ను॥

గీ॥ అనుచుబలుకంగనయ్యంబనాదరించి। ముదముగలిగెడిభాషలఁ బదిలపరచె। నంతజనకజయుత్తలకతులభక్తి। దనరమ్రొక్కంగ వారుసంతసముతోడ॥ వ॥ సాదరంబునంగోడలింగౌఁగిలించుకొనిదీవనలొసంగి హర్షబాష్పంబులుప్పతిల్లమూర్ధ్నిఘ్రాణంబుగావించి రట్టిమేధ జగత్పావనచారిత్రయగువైదేహితోకౌసల్యయిట్లనియె-

పున్నాగరాగము- అటతాళము-

యెంతపుణ్యశీలవైతివె। నాతల్లినీవు యెంత ధన్యురాలవైతివె। కాంతునిపాదాబ్జములుగాంచుచునడవికేగి। చింతలొబన్నములనుభవించిపతివెంటవచ్చితివి॥ ౧॥ దనుజుడుగొంపోవువేళను। నీవెంతదుఃఖము। ననుపతిబేకొంటివోచాలను। దనుజపట్టణమునదైత్యవనితలగర్జనలసృక్కి। కనుగవబాష్పములుజారమనసుహృదయేశుని జేరఁతివి॥ ౨॥ వనితనీసౌశీల్యమెల్లను। దెలసితుములోక। జనులునిన్నునమ్మిమెచ్చను। ఘనమతిశ్రీరంగవిభుడుకరినములాడగనగ్ని। ననువుగాజొచ్చివచ్చితివనిమిషబృందములుమెచ్చ॥ యెంత పుణ్యశీలవైతివె ॥ ౩॥

వ॥ యివ్విధంబునకౌసల్యవైదేహింబల్కినయనంతరంబునంపౌరజనంబులురఘువరుంగనుంగొని-

ఆనందభైరవిరాగము- జంపెతాళము-

యేమితపముచేసినారమో। సద్వ్రతంబులెన్నిమునుచేసినారమో। నీముఖాంబుజాతమిచట। నేడుగంటిమాతిరిబాయ। కామకోటివేష దోషగహనదహనఖరవిరాఘ। ఘనినిన్నుగననిదినములు। మాకుదుఃఖపూర్ణమయినదుర్దినంబులు। భువనవినుతనీవరణ్యభువివసించువేళకన్ను। గవలనశ్రుధారలొలుకకాలమవనిగడపికంటి॥ యే॥ ౧॥ యేసుఖంబుమదినిగోరము। నిన్నుగనని। వాసరములలోననిశము। దాసవరదసౌఖ్యమాత్మనాసగొనకఘోరవన। నివాసమెట్లుచేసినావోహాసహింపలేముదలచి ॥ ౨ ॥ తరుచువైనరుద్దనరబ్రోవుము। రామనిన్ను। గరిమమరులుకొన్నవారము। శరధిబంధనప్రవీణధరణిజాహృదీశరంగ। పురనివాసరఘువరేణ్యపాసగగంటిమయ్యని

చిప్పిలు నమ్ముల నగుదు గనుఁగొనుచును। నిలిచి రముంగళ వాద్యధ్వనులకు। విరివియై వినవచ్చెడు నిదే౹౹ ౩౹౹ ధనమణిసంపదలను భూగనమునకు। దినదినవర్ధనమొందును। జనసుతమగు పావనరంగస్థలమున। ననిశము వెలుగొందుము। ధరణి౹౹

## తోడిరాగము- ఆదితాళము-

నిరుపమానవేషా। హృతదోషా। నిజరేంద్రరిపుసంశోషా। ధరణిబ్రోవుమికను। సురభూసురనిచయమలరను। మంగళకరచరిత్రసుర వరతరళవద। పంకరుహాయుగళనన్నరమరసేయక ౹ ని ౹ ఘనవిభవము దనరా। సీతావనజగంధిమదిముదముమరా। వినుతిగొనుచుజనపా। లనమికవేడ్కసేయుమధిపా। దుర్భరవనధిగర్వపడలనమును। గణసుత నినుభజింతునన్ననిలుమేలుకోను౹౹ ౨౹౹ రంగదతులకరుణా। న్నీతభవ భంగవైరిమదసంహారణా। నింగియందమరులు। కడుబాగడంగనెల్ల సిరులూ। చాలవెలుంగరంగమంగళాలయమున చెలంగిమంగళాభిషేకమొందుము౹ నిరు ౹ వ౹ ఇట్లుపలికి౹౹ క౹ రంగురగభరతుడుపలికిన। మంగళతరవాక్యములకుమానసమునను। పొంగుదయతోడరాఘవు। డంగీకారంబుచేసెనతిహర్షమునన్౹ సీ౹౹ అత్రిశతృఘ్నుడాజ్ఞ మొసంగ క్రచ్చరకొందరరుదెంచి చారు భక్తిదశరథాగ్రజునకుతగజటాశోధనప్రముఖముల్ సలిపిరివరమనియతి। భరతలక్ష్మణభానుభవ విభీషణుల వృద్ధదారగను రాఘవాజ్ఞవలన। శుభమజ్జనంబులు సొంపుగాగా వించిసత్రగ్వస్త్రభూషణచందనములు। లీలదాల్పిగిజానకీలోలుడంత। తప్పుసారభకలితనీరములవలన। మంగళస్నానమొనరించి మహాముదముంచి। కనకవస్త్రంబుశోభించగసుధరించి౹

వ౹ ఇట్లుధరియించినయనంతరంబున౹ ద్విపద౹ అతిభక్తులగుజనులకులోత్సవమున। జతగూడిశ్రీరామచంద్రునకపుడు.। చెలువొందమగమదశ్రీతిలకంబు। వెలయఫాలంబున వేడ్కతోదిద్ది। సలలితేందిరవర శ్యామాభనగుచు। విలసిల్లుతనువున వేడ్కశ్రీగంధ।మలదిరఘుమఘుమ నతిగంధమడర। వలనొప్పతాపసాన్వయులు దలంచు। చరణపంకజములఝుళ ఝుళమ్రోయ। ఘనరనూపురంబులువలసియమర్చి। కనకరత్న కిరీటకంకణహార। ఘనమణికుండలాంగదకటిసూత్ర। చారుకేయూరా

దివ్యాభరణము। లారూఢినమరించిరాస్వామిమెచ్చ। మల్లియలకమ
న్నంబుమహితోత్పలములు। మొల్లలుమరువంబుముఖ్యమైనట్టి। సన్నజా
జులుమంచిశామంతివిరులు। పన్నీరుపుష్పాలుభవ్యాంబుజములు। తు
లసీయుతంబుగాతోమాలలమర। నలరుచురచియించి యర్పణసేయ।
శతకోటిమన్మధసౌందర్యుడగుచు। నతహితాంబుజనవ్య నలినాప్తుడ
గుచు। దేదీప్య మానుడై తేజరిల్లంగ। మోదంబుతో దుతముద్దియల్గాం
చి। యెక్కుడిలావణ్యమెక్కుడితేజ। మెక్కుడిరూపమిద్దేమమ్మయిట్టి। చ
క్కనిరఘుకులస్వామియ్యారాము। దక్కించుకొన్నసీతాభామభాగ్య।
మక్కరో వర్ణింపనలవిగాదనుచు। నొక్కొక్కరీరీతి నూహించి పలికి।
రంతటభరతాదులారాఘవేంద్రు। చెంతవసించిరి సేవగోరుచును॥

నవరోజురాగము. ఆదితాళము.

దశరధసతులందరు నెనరమరం। శశిముఖిసీతకుసంతసమలరం। ప
రిమళయుతచంపకతైలమునం। సిరసంటిరితమకరముల వలనం॥౧॥ పొ
లుపుగకుంకుమపూతలచాలం। నలుగిడిరతివెలునయమునలీలం॥౨॥ మ
గువకుమంగళమజ్జనమంతట। మగువలొనర్చిరిముదిసిచ్చింతట॥౩॥ ధ
ళిదకురులుతడియొత్తిరిపొసగన్। సువిమలరంగేశుని కింపెసగన్॥౪॥
దశరధ॥ వ॥ ఆసమయంబున॥ సీ॥ ఘనమైనచందురుకావి పావడమీద
సరిగంచుమించువస్త్రముధరించి। రాణించుమెఱుగ్గుల రవికచే చనుకట్టు
గట్టితమ్ములనేలుకన్నులందు। కాటుకబెట్టిశ్రీకరగంధసద్వస్తుకలితచం
దనపంకమెలమినలది। మంజీరములులసన్మణికంకణంబులుపచ్చలపత
కముల్ హెచ్చుకాంతి। వెలయుమణిరశనంబునువివిధరత్న। భూషిత
ములగుబహుదివ్యభూషణంబు। లతిధగద్ధగ మెరయంగనమరదాల్చి।
నవనిపుత్రికరఘునాధుడాత్మ మెచ్చ॥ సీ॥ సన్నజాజులుమంచిసౌగంధి
కంబులుపన్నీరుపుష్పాలుత్పలములతుల। పరిమళోపేత చంపకములు
మల్లియల్ శామంతికలుపారిజాతములును। మొల్ల లాదిగగల్గుముఖ్యప్ర
సూనంబులెల్లగూర్చినదండలిందుముఖులు। కడువేడ్కతో నలంకరణ
మొనర్పంగఘుమఘుమవాసనల్ కొమరుమిగుల। మొనసిమేల్ తళుకొ
లుపముమకుదాల్చి। తొలుకరిమెరుంగుపోలికగలిగినిత్య। దివ్యమంగళ
సౌందర్యభవ్యయగుచు। సీతయొప్పెనుపురజనుల్ చేరిపొగడ॥ భ॥ ఘన

వానరాంగనలు। క్రచ్చరమంగళమజ్జనంబు సొంపుననొనరింపఁజేసి। మణిభూషణదివ్యదుకూల మాల్యచందన కలితాంగలై మెరయు। తద్దయు వేడ్కఁ గొనర్చి రాఘవేంద్రుని। జనయిత్రిసంతసముతో వెలసెఁ జతి దుఃఖహీనలైరి॥ గీ॥ మారుతసుతుండు మంగళమజ్జనర్థంబు। పూనిగావించి వస్త్రవిభూషణంబు। లాదిగానింపుతోఁ దాల్చి మోదమలర। శ్రీరఘుస్వామిసన్నిధిఁ జేరియుండె॥ వ॥ అసమయంబున ఘణంఘణాయమానకాంచనఘంటికాదామకలితంబై మార్తాండమండలసదృశంబై తేజరిల్లు మణిమయస్యందనంబు శత్రుఘ్నుండాయత్తంబు చేసి తెప్పించిన ముదంబునంగనుంగొని సీతాసనాథుండకుంఠితవైభవంబున భరతుని హస్తంబాకకేలంబట్టుకొని దేవేంద్రుండు దివ్యరథారోహణంబు సేయు చందంబున నమ్మహనీయరథారోహణంబు గావించె నట్టియెడ॥

సీ॥ భరతుండు నొగలపై వరిధవిల్లుచుభక్తి। వెలయ సారథ్యంబు సలుపుచుండ। శత్రుఘ్నుఁడురుతర చారుమౌక్తికయుక్తధవళాతపత్ర మందముగఁ దాల్ప। మహితోత్సవమున లక్ష్మణవిభీషణులర్థిఁ నిరుపార్శ్వములను చామరములు వైవ। శత్రుంజయాఖ్యగజశ్రేష్ఠమాదిత్యసుతుఁడెక్కి తనతోడ సొంపుమిగుల। విభవమెసఁగంగ దేవదుందుభులు నింగి। మ్రోయ తనదివ్యతరజగన్మోహనాంగి। మమరవర్గంబు గాంచి మోహమునఁ జెంద। శ్రీరఘుస్వామి వెడలె నాశ్రితులు పొగడ॥ గీ॥ జనకనందనమణిమయస్యందనంబు। సొంపుతో నెక్కి వానరసుదతులెల్ల। నందలంబుల వెలయుచు నాశ్రయింప। విభుని వెనువెంట వెంచేసె వేడ్కతోడ॥ మ॥ యొకముత్తద్విపమెక్కి వాయుతనయుండుల్లాసముప్పొంగరా। జనులగ్రామణియైన రాఘవుని చంచద్రూపసౌందర్యమత్యకలంకాత్మను గాంచుచుండెడలెనుద్యద్భూషణోపేతులై। ప్రకటానందమెలర్ప దగ్గిరికపుల్ భద్రేభసద్వాహులై॥ క॥ తనయులు కోడలు దారుణి। వనసీమలవంతలొందివచ్చిరటంచుం। ఘనకుతుకంబున దశరథ। వనితలు వెలువడిరియానవరగతులగుచు॥ వ॥ మఱియును ధృష్టి జయంత సుమంత్ర ప్రముఖులయిన యష్టమంత్రులును వసిష్ఠాదిపురోహితులును దగువాహనంబులెక్కి తనవెంటంజనుదేరసూత గాయక వందిమాగధబృందంబులత్యంతభక్తి వైభవంబున నాశ్రయించి కొలుచుచుండ సంభ్రమంబున దేవకాంతలం

దుందుభిగానాధ్వనులుం బాద్యంబుం బ్రసూనవర్షణంబు లెడతెగక వర్షింప
భేరీ ఝాంకారంబులును మంగళతూర్యంబులును రథనేమిస్వనంబు
లును గజేంద్రబృందబృంహితంబులును తురగావళీహేషాఘోషంబు
లును పదాతివర్గపరితోషస్వనంబులును దేవగంధర్వప్రముఖస్తోత్ర
నినదంబులును నొక్కుమ్మడింగిముట్టనయ్యఖండదివ్యతేజోనిధియగు
రఘూద్వహునందు పరమయోగీంద్రసేవితంబులై జానకీకరసరోరుహ
లాలితంబులై మంజుమంజీరరంజితంబులగు శ్రీపాదపద్మంబులును కాం
చనమణిమేఖలాసంకీర్ణంబగు జఘనంబును ధగద్ధగితకాంతిచ్ఛటాకలి
తంబులగు మణిహారంబులతోడం బ్రకాశమానంబగు విశాలవక్షస్థలం
బును రత్నకంకణకేయూరాంగదాలంకృతంబులై సురేంద్రహస్తిహ
స్తతులితంబులగు బాహుదండంబులును కంబుసుందరంబైన కందరంబు
ను రత్నకుండలకిరీటాలంకృతంబై కరుణాకటాక్షస్ఫురితనేత్రద్వయసు
శోభితంబై సంపూర్ణశరచ్చంద్రమండల సుందరంబుగ నలువగ జాలిన
ముఖమండలంబునుం గలిగి దేదీప్యమానంబగుచున్న తనయ ప్రాకృత
దివ్యమంగళస్వరూపంబు శేషజనకదంబంబులు గనుంగొని మోహావ
శంబునందని ఫదీరకర్కక్కెరిసికన్నులారం జూచుచుండ శత్రుంజయాఖ్య
గజారూఢుండై ముందుమిగిలి సుగ్రీవుండును దిగ్గజప్రతిమానంబులగు
నాగేంద్రంబులమీద శోభిల్లుచు వాయునందన వాలిసంభవు లిరుపా
ర్శ్వంబుల నడుచుచుండ దివ్యరథంబుమీద నాయ్యాకంబునంగూర్చుండి
జయజయధ్వానంబులు చెలంగ లంకాదహన సేతుబంధన రావణప్రము
ఖ రాక్షసవధాదిసర్వవృత్తాంతంబు మంత్రిప్రముఖుల కెరిఁగించుచు.

మధ్యమావతి రాగము. ఆది తాళము.

నంది గ్రామము వెడలెననంత పురందర విభవమున॥ ముందుమిగిలి శ్రే
ణులు దంధంధణ మ్రోయుచుండ నందము గల వేశ్యా। సుందరు లెదురై
దుర్రై ధిక్కిటతక। దిందిత్తకధింధిం యనియాడగ॥ నంది॥ నగుమొగం
బుని గనిగళళేలూరగ నక్షత్రచయముతో। తగవెలుంగు శశిగతి జనతతి
తో। తా వెలుంగ కొందరు పుష్పాక్షతల గణిత గోకన్యా ధనములతో।
మంగళ నెదుర్కొని మొల్ల ననదువగ॥ నంది॥ సలలితకిసలయకలితకనకక
లశంబులు గొని యువతుల్। చెలువంబమరగ మంగళగానములు పాడుచు

జనకపురలలనావళికడు । వలచున లాజలు జల్లగ రఘుకులు । జలధిశశాంకుండగుసీతేశుడు॥ నంది॥ తనముఖకమలముగనుగొనఁగదిసినజనములు గనికృపను । వినయమలరజూఁపుల కనుసన్నల వేట్కా వారిలాలించుచు। మునిగణమనురక్తినిదివి వినుతింపగనది। వినుచు మహోత్సవమునరంగెతుడు॥ నందిగ్రామము వెడలెనునంత॥

ఉ॥ వందిగణంబులెల్లరఘువర్యునిగాంచిపరాకుసీకుపూ । ర్ణేందునిభాస్య రాక్షస కులేంద్రవినాశపరాకు దివ్యశస్త్రాక్స్యందన శోభితాంగ ఖరసైన్యవిదారపరాకు జానకీసుందరనేత్ర తామరససూర్యపరాకనివిన్నవింపఁగన్॥ వ॥ ఇవ్విధంబునంబొగడొందుచుంజనిచని మహోన్నత హేమగోపురప్రాకారపరిఘాట్టాలకధ్వజతోరణ సమాకీర్ణంబై మణిమయస్తంభపరిశోభిత రమ్యహర్మ్యవితాన సముల్లసితంబై నానాశృంగారకలితంబై। వెలుంగుచున్న శ్రీమదయోధ్యా నగరంబు ప్రవేశించి రాజమార్గంబున వెంచేయుచున్న సమయంబున సాక్షాద్వైకుంఠవాసుండగు రాఘవేంద్రుని జగన్మోహనదివ్యసౌందర్యంబు పురసుందరీజనంబులు మార్గంబులదెసం దర్శించి మోహపరవశస్వాంతలై కరారవిందంబులసాచితమలోన॥ మ॥ తరుణీ చూడగదమ్మ రాఘవునిసౌందర్యంబునేజెల్ల యీ। పురుష శ్రేష్ఠునిబోలు వారలుధరన్ పూబోణి వేరమ్మ ని। భూరపుణ్యాన్విత యోగిసంఘములకుం బ్రత్యక్షదైవంబుగా। నెరిశోభిల్లుచునుండునమ్మ విలసన్నీరేజపత్రేక్షణా॥ క॥ వనితా వినగదవమ్మా ఘనమతి శ్రీరాము మోము కాయము గలదా। కనునిత్యముకనుదోయిని। కనుగొనుజనతతులఫలముగణుతికివశమే॥ శా॥ ఈ కళ్యాణగుణాఢ్యుపద్మహితవంశేంద్రుం దయాంభోనిధిన్। రాకాచంద్రసమానవక్త్రుం విభు నే రామామణుల్ గాంచినన్ । వీకన్ కౌగిటఁగృచ్చి ముచ్చికలుగా వింపన్మదిందోచదా। శ్రీకళ్యాణమెలర్పనీఘనభుజున్ సేవింపనెట్లబ్బునే॥ ఉ॥ ఈమహితాత్మబాసికమలేక్షణ జానకి లంకలోనహా। రామమహోగ్రకల్మషవిరామ జగద్ధితనామ రమ్యశ్రీ। రామగుణాభిరామయని రాక్షసకాంతలలోననెంతయున్ । బాములబొందిదీనతరభావమునొంది కృశింపకుండునే॥ చ ॥ వినగదవమ్మ యీవిభునివీరవరేణ్యువరించిమించికాం। చనమణిహర్మ్యసీమల లసత్కనకాం

చితభవ్యశయ్యలఁ। ఘనసుఖలీలఁ గ్రాలుచునుఁ కాపురమింపున సేయుచు
ట్టియా। జనకతనూజపుణ్యఫలసంచయమెంచ విరించి యోపునే॥

నీలాంబరి రాగము. ఆది తాళము.

వేంచేసెనమ్మ చూడరే। సుందరులార॥ వేం॥ వేంచేసెనమ్మ మనవీధికి రాఘవేంద్రుఁ। డంచితదివ్యమంగళాంగము సొంపుమీర॥ వేం॥ హారతులియ్యరారమ్మ। శ్రీరంగపుర॥విహారుని చూడరారమ్మ। ఘోరతరాటవులు గోరి గ్రుమ్మరి సర్వ। దారుణదైత్యగణవిదారణమొనరించి॥ వేం॥

అసావేరి రాగము. అట తాళము.

ఇటువంటి కొమరుని యెటుల బంపెనో తండ్రి। కటకటా యడవులకు। అటులన బోకు ముత్కటనిదర్శయలు బుట్టుటాలి బోధల కాదటె। శోభామ॥ ఇటువంటి॥ చెప్పి చెప్పకమున్నె శ్రీరఘుకులజుఁడు ఒప్పి పోదగునటవే। ఒప్పి పోరటె యెంత దెప్పర మొదవిన తప్పదుర ఘుధర్మము। సర్వజ్ఞులు॥ ౧॥ అడవుల రఘువరుఁడిడుముల బడు టెల్లన తెవ్వల నగాదటె। పడతి పోవే యీ బిడసురమ్మ నిపతి ప్రార్థించినాడటవె॥ కారడవికి॥ ఇటు॥ ౨॥ ప్రవిమలమతి పతి నిలువుమనగ నింటవణతి నిలువరాదటె। ఈవిద నిల్చిన పతి నెవరమ్మ వనములనుద్ధరించెడివారలు॥ ఓభామ॥ ౩॥ దిగులేమి లేక దుష్మృగమునకై సీతమగని బంపవలెనా। మగువ చెప్పిన నేమెమంచి చెల్లించక మగవారు బోదురటె॥ మారాడక॥ ౪॥ తనతమ్ముఁడి వివలదని యన్న రఘుపతి తా పెద్దయైవినెనా। వినియున్న నటమీద వెలది పోరాటముల ననుభవింప శక్యమా। వల్లభునకు॥ ౫॥ తోబుట్టువని నమ్మి తొయ్యలి కాపుంచి। తాబోవుటది ధర్మమా। పూఁబోణి వేసాలబాయ్యేవ్వుకరి నో క్తులా బిడాడదగునా। మరదిగూర్చి॥ ౬॥ తరుణిరో శ్రీరంగధాముని కాంతను దైత్యుఁడపహరించెనా। సరగున రాక్షస త్రయమిందుకేగా దాసమకూరెనవలీలను। కయ్యములోన॥ ౭॥

ద్వి॥ వినవమ్మ జలరాశి వేట్కతో దాటి। ఘనమైన యట్టి లంకాపురి జొచ్చి। ముదితనచ్చటగాంచి ముద్రికయొసగి। సుదతిచే సెలవొందిసొంపున వెడలి। వనమెల్ల భంజించి వారకనుగ్ర। దనుజకోట్లవధించి దనుజేంద్రపురము। కలయదహించినఘను డెవ్వడమ్మ। అలివేణి హనుమంతుఁడల్ల డుగోవె। కన్నులారఁగజూడుకర మొప్పలోక। సన్నుతశీలుఁ డీసచ్చరితుం

ఘు। గరిమదివ్యౌషధాగముమున్న దెచ్చి। వరమతిబ్రతికించె వసుధసౌమిత్రి। ననియిట్లుపలుకంగనయ్యింతిజూచి। కనకాంగివారాశి కడిమిబంధించి। పావనుండగురామభద్రుడుద్ధతిని। రావణాద్యసురుల రణమునగూల్చి। వెలదితోడుతనిందు వెంచేసెగదవె। జలజాక్షి శ్రీరామచంద్రునివంటి। బలశౌర్యరూపసంపన్నులీధరణి। గలరటే వెదకిన ఘననీలవేణి॥ వ॥ ఇట్లుపురసుందరీజనంబులాడుకొను మధురాలాపంబులు సంశ్రవణంబుసేయుచు మందహాససుందర వదనారవిందంబు రంజిల్లం జనిచని సీతావల్లభుండత్యానందంబుననిక్ష్వాకుసంబంధంబగు తనతండ్రినగరుపొంతనరదంబుడిగ్గి మహావైభవంబున లోపలికింబోయి తల్లులకుంబ్రణమిల్లి భరతుంగాంచి సుగ్రీవవిభీషణాంగద హనుమత్ప్రముఖులందగినవిడుదులనివసింపంజేయుమని యానతిచ్చిననయ్యాజ్ఞను స్తకంబునందాల్చియెల్లవారలందగినవిడుదుల వసియింపంజేసె నట్టిరాండ॥ గీ॥ భరతుడంతటసుగ్రీవుపాలికరిగి। పద్మహితపుత్ర శ్రీరామభద్రునకును। శ్రీకరంబుగపట్టాభిషేకమతుల। వైభవంబునసేయంగవలయుగాన॥ క॥ జలనిధులపుణ్యనదులను। సలలితతీర్థములుదేరజవబలయుతులై। వెలయుకపివరులబనుపుము।జలజాప్తతనూజసర్వజనముప్పొంగన్॥ క॥ అనిపలుకగసుగ్రీవుడు। వినిహనుమత్ప్రముఖకపులవెసబంపగచ। య్యనసింగికెగరియాంచుచు। జనివారలు దెచ్చిరంతసర్వోదకముల్॥ క॥ అప్పుగముసంభ్రమంబులు। వచ్చిశిఖరత్రాజ్ఞసకలవసుధాధిపులున్। విచ్చేసిరిరఘువీరుని। సచ్చరితముచెప్పుకొనుచుసంతసమలరన్॥ వ॥ ఇట్లువసిష్ఠవామదేవ జాబాలికశ్యపకాత్యాయన గౌతమ అగస్త్యకణ్వభరద్వాజప్రముఖమునిప్రసంఘంబులును చతురంగబలంబులతోడసకలదేశాధిపులగున రేంద్రవర్గంబులునాబ్రజలునుం జనుదెంచిరామాభిషేకమహోత్సవంబు కన్నులార దర్శింపంగోరి తగినచోట్లనివసించిరట్టియెడ శంఖభేరీమృదంగతాళపణవపటహకాహళవేణువీణానాదంబులుమంగళప్రదంబుగా మ్రోయుచుండెనంత పురస్త్రీసముదయంబులు పట్టాభిషేకోత్సవంబువీక్షింపజనంగోరి-

ఉదయరాగము- ఆదితాళము-

రారమ్మచూడగనురామాభిషేకమును। జననసాఫల్యముగ। జనిచూతామికపొసగ॥౧॥మనముచ్చటలుదీరా। మనపుణ్యమీడేరా॥ రా॥

౨॥ కాగేలరారమ్మ। స్వామిఁజేరుదమమ్మ॥ ౩॥ ఘనరంగపతిగసీ। కన్నులేలనేధరణి॥ ౪॥

శ్రీరాగము- అటతాళము-

రామాభిషేకముకన్నులజూతాము రామలారరారే। జన్మముసెత్తఁబోమునమ్మకోరే। నేటికిమన నోముపండెవేరే ॥ ౧ ॥ విరివిగదివ్యాంబరభూషణంబులు పెట్టుకొఁదాల్చరేమె। కొప్పులమల్లెసరములుంచరేమె। ఘల్ఘల్లునగరిమదలరేమె॥ ౨॥ తరుచుగభేరీ దంధణధణరవములుసారిదిమ్రోసెనమ్మ। వీనులకెంతో సొంపుమీరెనమ్మ। ఇత్తరిమనమరుగఁబోలునమ్మ॥ ౩॥ చెలులారశ్రీరంగనిలయుని పదములచెంతఁజేరుదమా। సీతేశునిసేవగోరుదమా॥ హారతులెత్తిచెలిమి పాడుదమా॥ మ॥ అనిరుబ్బంగిసరోజగంధులుమహాహర్షంబుతోగుంపులైచనిరై దేహిని భాస్కరాన్వయవిభుంసద్భక్తిదర్శించిపావనదివ్యోత్సవవైభవంబుగనుచుఁబవర్తించిరగ్వేళఁచ। య్యానమ్రోసెఁశుభవాద్యవేదరవమత్యానందమింపొందఁగ॥ గీ॥ బ్రహ్మరుద్రేంద్రముఖ్యసుపర్వనికర। మతిముదంబునఁజూడంగ నరుగుదెంచి। దివివసించిరినతులతోదీప్తులలర। దాశరథిదివ్యమహిమలుదలఁచుకొనుచు॥ వ॥ అంతటభరతుండుపట్టాభిషేకంబునకువలయుసంభారంబు లాయత్తంబుగావించిపరమానంద హృదయుండయ్యెనాసమయంబున రత్నస్తంభవినిర్మితంబును పరిపక్వఫలభారనమ్రకాంచనకదళికాభూరుహకీలితంబును తరుణాశ్వత్థసాలపల్లవతోరణ విభ్రాజితంబును మణిమయభిత్తికాసముల్లసితంబును మహాహజాంబూనదసాలభంజికా రమణీయ్యంబునుముక్తాదామనిచయాలంకృతంబును వజ్రవైడూర్య గోమేధికపుష్యరాగబలభిదుపలమరకత ప్రముఖమణివిస్ఫురిత హేమద్వారకవాటాద్యభిరామంబునుమౌక్తికవినిర్మితనాగబంధ బృందావనాద్యనంతమంగళప్రదరంగవల్లికాసంవృతంబును కపివీరసమానీత చతుస్సాగరపంచశతనదీతీర్థపరిపూర్ణ కనకకుంభావళీసమన్వితంబును ఘుమంఘుమాయమానలసదుత్ఫుల్లసౌగంధికపారిజాతమల్లికాద్యపరిమితపుష్పమాలికాగంధ కలితంబును యమనియమాసన ప్రాణాయామప్రత్యాహారధ్యానధారణాద్యష్టాంగయోగనిష్ఠాగరిష్ఠమహాయోగీంద్ర

ష్టుందనిషేవితంబును సుగ్రీవాంగదవిభీషణ హనుమద్గజగవయ గవా
క్షసుషేణనలనీలజాంబవదాద్యశేషబుధవానర ప్రపూర్ణంబును మం
గళగీతప్రవీణవిప్రసుందరీ వితానరంజితంబును సామ్రాజ్యపట్టాభిషే
కమహోత్సవార్హ సమస్తవస్తుజాతసంయుక్తంబును నైధగద్ధగా
యమానంబుగా వెలుంగుచున్న కళ్యాణమంటప మధ్యంబున నౌక్య
రత్నపీఠంబుమీద నరుంధతీవల్లభుండు సీతారఘువల్లభులం గూర్చుం
డబెట్టివరమోత్సవంబునం జెలంగెనట్టియెడ। గీ॥ మెరుగుచెంగటవిలసి
ల్లుమేఘుమనగ। సీతసన్నిధి సొంపుగా నున్నమీరు। రాఘవేంద్రునిము
ఖసుందరంబుసకల। జనులుగనిమోదమొందిరా సమయమునను॥

బిలహరిరాగము- అటతాళము-

అభిషేకమపుడుగావించిరి। దుందుభులు దేవతలు మ్రోయించిరి॥
విభవము వెలయ వసిష్ఠాది తాపసవిభులు శ్రీకర గంధ శుభతీర్థ జలము
లు॥ నభిషేక॥ ఘనమానసోత్సవమమరను। స్వర్ణకలశములెత్తి పెం
పలరగను। వినుతి సేయుచు రఘువీరు వజ్రకూటాసి। జనులు మెచ్చగ ఋత్వి
గనుమతిభక్తితో॥నభిషే॥ మందహాసములు రాజిల్లను। రాకేందుముఖ
ములు శోభిల్లను। అందముగలకన్యలందరు నృత్యసల్ప। మొందుచు నవదివ్య
సుందరమూర్తిపై॥ నభిషే॥ గరిమతో దుతమంత్రులెల్లను। యోధవరు
లు నమించువారెల్లను। తరచుగ మంగళ పరిమళోదకముల। గురుతుగ
భాస్కరకులు శిరంబున॥ నభిషే॥ సరగున వేల్పులుచాలను। దివ్యౌష
ధరసములతో డలీలను। వరమయోగీంద్రహృత్పద్మకర్ణికలందు। మెర
యుచుండెడి రంగపురవల్లభునిమీద॥ నభిషేకమపుడు॥ గీ॥ అతులమంత్ర
పూతమగు హేమపట్టిక। జలజనేత్రుడైన జానకీశు। ఫాలమునసమర్పి
పరగ నరుంధతీ। వల్లభుండు జనములుల్లసింప॥

కేదారిగౌళరాగము- ఆదితాళము-

జగదానందంబగుచును। రామోత్సవమమించెనపుడు। సొగస
గుమగువల శుభమగు గానమునిగమపఠన విప్రగణములొనరుప॥ జగ॥
ప్రకటిత భేరిధంధణరవములు బ్రహ్మాండము నెరయ। తకిటతక్కధిం
ధిమియని వేశ్యాతుక వాణులు మెరయ వెలయ ॥ ౧॥ తరుచుగ మద్దె
తాళశంఖనినదంబులు కొమరార। సరగున పురవనితల వదనాబ్జరఘు

ఝళిలరుదార। మీర॥ ౨॥ ధరణిజసుందరతరమగుతనువునధాళధళ్య మమర। వరరంగస్థలవాసలసితలావణ్యస్తుతులలర। యొనర॥ ౩॥ జగ దానందంబగుచును। వ। అంత॥ గీ॥ మణిగణాంచితరుచిజాలమహిత మైన। ఘనకిరీటంబుతలదాల్చికమలబంధు। వంశభూషణుఁడొప్పారె వారిజాప్తు। డుదయమయ్యున్ననీలాద్రియొప్పమిగిలి॥

శంకరాభరణరాగము. అటతాళము.

శ్రీమదఖండసామ్రాజ్యాభిషేకముచిత్రమైదనరారెను। భూమిజ నులుసీతాభామనుశ్రీరఘురాముఁజూచిరిచాలను॥ శ్రీమద॥ పదపడిధవ ళాతపత్రముశ్రీరామభద్రునకయ్యెడను। సదమలభక్తిశత్రుఘ్నుడుబ ట్టెనుముదమునవెలయుచును॥ ౧॥ వరభక్తితోడచామరలఁబీవదొనం గిరిరుపార్శ్వములవేట్కను।గరిమఁభీషణకమలాప్తపుత్రులుకదుసొం పుమీరగను॥ ౨॥ శ్రీరంగపతియభిషేకమహోత్సవచిత్రముగాంచుచు ను। సారెకుతల్లులువెలసిరానందాశ్రుధారలుజారగను॥ ౩॥

నాదరామక్రియరాగము. ఆదితాళము.

పాడిరిగంధర్వోత్తములయ్యెడనాడిరిసురచంద్రాస్యలు। పీడిరి యమునిభయంబులుశ్రీరఘుపీరునిజూచుజనంబులు॥ పాడిరి॥ గురుతుగ నిజకరవరులుముదంబునగురియించిరిపరివాసలు। కరమనురక్తినసీతా విభుగుణగణములుపొగడిరిమానులు। సరగునబహువిధసస్యంబుల తోనరుదుగవెలసెనుధారుణి। శిరులలరగపతిచెంగటమెరసెనుసిగ్గున సీతాభామిని॥ ౨॥ పరిమళఫలదళపుష్పాన్వితమైభాసిల్లెనువృక్షంబు లు। సురుచిరసంపదలమరినిరోగతశోభిల్లెనుదేశంబులు॥ ౩॥ ప్రవిమ ళరమ్యోదకపూర్ణములై ప్రవహించెనుభువియేరులు। సవనావను డగురంగపురీశునిశరణొందిరిహరిదాసులు॥ ౪॥ పాడిరిగంధర్వోత్తము॥ గీ। దేవపతిపంపువనువాయుదేవుఁడపుడు। కనకదివ్యాబ్జహారంబుకరు ణదెచ్చి। కమలమిత్రాన్వయునకిచ్చిగరిమమరల। రత్నభూషితచారు హారంబొసంగె। ద్వి॥ అయ్యెడహారంబులారామమూర్తి। చయ్యన ధరియించిసంతోషమలర। వేదశాస్త్రజ్ఞులౌవిప్రోత్తములకు। సొద రంబునలక్షసమధాశ్వములను। కరులనుసద్వత్సకలితంబులైన। వరధే నుగణములవాసిగానొసగి। దాసదాసీజనతతులనర్పించి। భాసురగ్రా

ముమల్ బాగై నయిట్టి । కనకంబువస్త్రములఁ ఘనవిభూషణము । లను
వమోదారతనఁగణితమిచ్చె॥ సీ॥ రవిపుత్రునకు హేమరమణీయ్యమగు
పుష్పదామంబు మైత్రితోఁ దగ నొసంగి। గరిమమణిప్రభాకలితంబులై మించు
చుకనకాంగదములంగదునకొసంగి। హరినీలరత్నవిస్ఫురితమైయొప్పా
రుహారంబు నీలునకమర నొసగి । మరకతహారంబు మహితాంబరంబులు
జానకీముఖసరోజంబుఁగనుచు । వాయుజునకిచ్చి సంతోషవశమనస్క ।
డై సుషేణునకపుడు మహాహాఘపద్మరాగ హారంబు దయచేసి రమ్య
వస్త్రభూషణంబులు కపులకు పొసగనొసగె। వ॥ ఆసమయంబున॥
ద్వి॥ శారదసంపూర్ణచంద్రసత్కళల । మీరుచు ధళధళ మెరయు ము
త్యాల । హారంబు సీతకయ్యెడ రామమూర్తి । భూరిదయారససూ్ఫ
ర్తితో నిచ్చె। నిచ్చినహారమయ్యిందీవరాక్షి । క్రచ్చరఁగొని తన కాంతుని
దయకు । మెచ్చుచు వేడ్కతో మెడలోన దాల్చి । చెచ్చెరమరికొంత సే
పూరకుండి । మరల క్రమ్మర దీసి మగువ చేదాల్చి । కరువలిపట్టికి కరుణ
తో నివ్వ । దలచి రామాజ్ఞచిత్తంబునఁగోరి । చెలియయూరక యున్న
చెలువుం డెఱింగి । తరళాక్షిదివ్య సుందరమైన మోము । గరిమెఁగన్గొని
వల్కెఁ గడు మోహమమర-

సురటరాగము- అటతాళము-

ఇవ్వవేలలన । మౌక్తికహార । మిభరాజగమన । యివ్వవే నీకెవ్వ
లెవ్వడు జేసెనో । జవ్వనియీహారమవ్విమలాత్మున॥ కివ్వవే॥ చెలి నీతలం
పు నా పలియని । చెలిమిదలంపు । కలకంఠి మెచ్చవనివలన సంతుష్టవై । విల
సిల్లితివానిపవ్వరునకీహార॥ మివ్వ॥ తరుణి మెచ్చితి నే। నీదివ్యతాత్పర్య
స్థితికి నే । వరరంగపట్టణవాసుడనగుటచే । గరిమనీసౌశీల్య మెరుగుదు
సర్వము॥ యివ్వవేలలన॥ గీ॥ అనుచు విభుడు పలుకనయ్యబ్జలోచన । కరు
ణనిలుపవశము గాక చేత । హారమంజనీకుమారు కంఠంబున । నతివేయ
మర జేసె నతుణమున॥ వ॥ ఇట్లు జనకనందన పరమానందంబున పవమా
ననందనునకు హారంబొసంగి రఘునందనునకిట్లనియె-

నాద నామక్రియరాగము- ఆదితాళము-

ప్రాణముల్ ఇచ్చెనితడు । వల్లభమనకు । ప్రాణసమానుడితడు । ప్రా
ణేచ్ఛలేకనిన్ను బాసి దుఃఖించు వేళ । ప్రాణేశనీకుశలభావమెల్ల నుడి

లపి॥ ప్రా॥ ౧॥ దనుజేంద్రశక్తివలనను । మూర్ఛిల్లినసౌమిత్రిని బ్రో
వకరుణతోడను । వినువీధికెగసిపోయి వీరగంధర్వవరులు । మొనసి నిజేచ్ఛం
చిసంజీవనిగల్గునగము దెచ్చి॥ ప్రా॥ ౨॥ పరమపావనుఁడితఁడు । నన్ను
బోలినప్రాణబంధువుఁడితఁడు । ధరణినుద్దండబలదర్పసాహసుఁడీత । డ
రుదుగ రంగపురవరవాసరఘువరేణ్య॥ ప్రాణములిచ్చెనితఁడు॥
వ॥ అవ్విధంబున జనకరాట్కన్యకాలలామంబు పల్కినవచనంబుల
కు రఘువరుండు పరమానందహృదయుండయ్యె నట్టియెడ సర్వాభర
ణాలంకృతలగు సువాసినీబృందంబులందంబుగా రఘునందనజనకనంద
నుల నామాంకితంబులుగ్గడించి మంగళగానంబు సేయుచు-

నాదరామక్రియరాగము- ఆదితాళము-

చల్లరమ్మ । రామునిమీఁద । చల్లరమ్మ సిరిమల్లెలు మొల్లలు కొల్లగ రఘు
కులవల్లభుమేన॥ చల్లరె॥ యింతులార । గమననిర్జిత । దంతులార । సం
తతమింతులచెంతలజవని । ఖరాంతకుమీఁద వసంతములెత్తి॥ చల్ల॥ పడ
తులార । మీ రెల్లవతి వైభవము మీర । కడువడి ఘుమఘుమగంధము । ఉడు
గక బాడమెడు పుప్పొడి పిచికిళ్లం గొని॥ చల్ల॥ రామలార । లావణ్యరససీమ
లార । రామరామ రఘురామ రంగపురధామ యటంచు మహామోద
మొదవగ॥ చల్లరమ్మ-

భైరవిరాగము- [illegible]

...కమలాక్షునకు నవ్యకమలాయతాక్షికిని । విమలాంతరంగునకు విమ
లాత్మకు । సుమబాణవేషునకు సుందరాకారకును । కమనీయచరితున
కు కళ్యాణికి॥ జయమంగళం నిత్యశుభమంగళం॥ శ్రీరాఘవేంద్రునకు । సీ
తావధూటికిని । కారుణ్యనిధికి శృంగారయుతకు । వీరాగ్రగణ్యునకు
వీరపాతివ్రత్య । చారుసౌశీల్యాదిసౌభాగ్యకు॥ జయ॥ ౧॥ చంద్రాస్య
నకు పూర్ణచంద్రబింబాననకు । నింద్రాదినుతునకు మిథిలేంద్రసుతకు ।
చంద్రశేఖరమహాచాపఖండనునకు । సాంద్రదోషవితానసంఛేదకు॥
జయ॥ ౨॥ కనకబంధురరత్నకలితకోటీరునకు । కనకరత్నాభరణకలి
తాంగకు । మునిగణావనునకును మునివధూసేవ్యకును । జనవంద్యున
కు సర్వజనజననికి॥ జయ॥ ౩॥ క్రూరాసురఘ్నునకు దారిద్ర్యహారిణికి । సూ
రిమందారునకు శుభవతికిని । శ్రీరంగనిలయసంచారునకు రంగపతి । నా
రీమణికి హారికినతఫలదకు॥ జయమంగళం నిత్యశుభమంగళం-

క॥ అనియిట్లువనితలెల్లను। ఘనమంగళగానమమరగావింపుచుసొం। పు
ఘమ్ము త్తియమంగళహారతు । లనువుగనె త్తిరినితాంతహావక ఫౌలర్పక్॥

వ॥ ఇట్లువేడుకలెల్లంగడచిన యనంతరంబున సుగ్రీవాంగద హనుమ
జ్జాంబవత్ప్రముఖులునుం దక్కినకపిబృందంబులును రఘుస్వామివల
లన ననుజ్ఞాతులై నిజస్థానంబులకుంజనిరి విభీషణుండును వట్టభద్రుండై
గురఘుగ్రామణివలననిత్యారుకులధనంబగుశ్రీరంగనాథాభిధానదివ్య
మంగళవిగ్రహంబుబడసి యనుజ్ఞగొనినిజేచ్ఛంజనియెనంతరఘువరుం
డులక్ష్మణానుమతంబున భరతునకు యావ రాజ్యాధికారంబొసంగి
మహీమండలంబుధర్మవత్తనంబునంబాలింపుచు వసిష్ఠాదిమునిగణం
బులుత్సహింపనశ్వమేధపౌండరీకాదిసకలమఖంబుల్గానచుచు భూ
సురబృందంబుల కిష్టార్థంబులిచ్చుచు శతక్రోటినురేంద్రవై భవంబు
నందేజరిల్లుచునెల్లవేళలసర్వాంగసుందరియగుసీతాభామామణింబా
యకనిష్టాలాపంబులాడుచుశృంగారవనంబులంగ్రీడాశైలంబులలీలా
వినోదంబునవిహరింపుచు భక్తజనబృందంబుల కెందంబు లలరననవ
రతంబుబ్రోచుచు దుర్జననివహంబులనిర్మూలింపుచు సప్తద్వీపవవ
సుంధరాధీశ్వరుండై ప్రజలనను రంజింపంజేయుచు మునివితానంబు
లంబూజించివారివలననభినుతులొందుచు సమాహితభక్తియోగవిశే
షంబునసేవించినజనంబుల దురిత సంఘంబులడంచి నిత్యానందపదం
బుగృపసేయుచు మహోన్నతంబులై మణిమయంబులగు కేళిసౌధం
బులపట్టంపురాణియగుజనకనందనననేకవిధంబు లంగామోపభోగం
బులనానందింపంజేయుచు బ్రకాశించుచుండెననివల్కి మరియునిట్లని
యె॥సీ॥ జగతిశ్రీమద్రామచరితమెవ్వారైన నతిభక్తివ్రాసిననమరవిన్న।
సదమలనిష్ఠచేచదివినదుర్దాంతదోషవ్రతానమ్ముల్దొలగిచనును।పు
త్రార్థులకువరపుత్రసంప్రాప్తియునర్థార్థులకునధికార్థసౌఖ్య।
మాయురర్థులకుదీర్ఘాయువ్యమక్షీణయోగార్థులకులసద్యోగసి
ద్ధి । కలిగివెల్లయుదురానందకలితులగుచు । రామచంద్రపదధ్యానర
మ్యచిత్త। వృత్తినేకూరుచెడునుదుర్వృత్తులెల్ల। సకలసౌభాగ్యము
లుగల్గు జగతిఁదుందు॥ క॥ అనిసౌభద్రకుమారున । కనఘుడుశుకయో

గిచెప్పెనని సూతుఁడు చెప్పెం। పునవల్కా శౌనకాదులు వినిసంతోషించిరవు డు వేఱ్కొదలిర్పఁ॥ చ॥ దరదరవింద నేత్ర శివధర్మవిఖండన భూమి శాఖరో। ధరధరణీధరాంబుదవిదారితదుష్టమదాసురేంద్ర। దుర్భ రభవసింధుతారణ సుపర్వగణార్చితపాదపద్మనుం। దరజిత పుష్ప సాయకనితాంతకృపాకర తాటకాంతకా॥ మాలిని॥ శరధిమదవిఫాలా సాధులోకానుపాలా। ఖరకరకులభూషా గర్వితారాతిశోషా। వ రిజనసురభూజా భవ్యమార్తాండతేజా। కరధృతశరచాపా కా మినీకామభూపా.

గద్య॥ ఇదిశ్రీమదుభయకావేరీమధ్యప్రదేశ ప్రదీప్తశ్రీరంగ
నాధచరణసేవక వరగంటి శేషగిరిదాసప్రణీతంబగు
శ్రీమద్రామ కథా సంగ్రహ యక్షగానంబున
యుద్ధ కాండము సర్వంబును ఏకాశ్వాసము.
సంపూర్ణము.

